# అఖిలభారత కవయిత్రులు

అఖిలభారత మహిళా మహనీయ సారస్వతము

( ప్రాచీన, మధ్యయుగవాఙ్మయములు )

సంకలనము :

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ప్రచురణ :

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి,

తిలక్ రోడ్ :: హైదరాబాదు.

# విషయానుక్రమణిక

ఓం

# నివేదన

భగవతి భారతి సకల విజ్ఞాన సాహిత్యాలంకార శోభిత,

ఏ యుర్వీస్థలి, ఆ చదువుల తల్లి పదముల యందెల రవళిచే ఘల్లుఘల్లు మని మారుమ్రోసినదో,

ఏ విశాల వసుంధర ఆ విద్యామహాదేవి ముంజేతిచిలుకయై పలుకు పలుకున నొయ్యారము లొలికించినదో,

ఏ ధరణీభాగము ఆ సరస్వతీ రుచిర కరపల్లవాంగుళుల బంగారు వీణయై, రంగారు వేణువై రాగరసముల నానంద తాండవ మొనర్చి పారవశ్యమున జగతిని పులకింపజేసినదో,

ఏ నేల ఆ శారదా మాతృ కరుణాకటాక్షముల మాలయై పరమేశ్వరుని సంకల్పమునకే ఆభరణమైనదో,

విజ్ఞానానంద ఘనిష్ఠమైన ఆ జగతియే చరిత్రయందు మాన్యత గడించు కొని, నిరవధికమగు కాలగతికే సమ్మాన్యమైనది.

అట్టి భూభాగములయందు మహనీయాత్మజ్ఞాన సాహిత్యముచే మూర్ధన్య మైనది భరతఖండము.

ఊహాలుచొరని ఆదిమకాలమున సకలోర్వీతలమునందలి మానవలోకము నకు వైతాళిక గీతము పాడి, విజ్ఞానభిక్షనిడి ప్రపంచవాఙ్మయమునకు తలమానిక మైన భారతీయుల అర్ష వాఙ్మయము వేదభారతిగ మనమ్రోల సాక్షాత్కరించినది. ఈ సాక్షాత్కార భాగ్యమును బడసి వైదిక మంత్రరవమును శ్రుతిపుటముల గ్రోలి ధన్యమైన ఋషిమండలమున మహిళామంత్రదర్శిను లుండిరను నంశము ప్రాచీన భారతీయ విజ్ఞాన నాగరిక తౌన్నత్యములకు సమీచీనమగు సాక్ష్యము.

అలనాటి ఆ యారంభ యుగమునుండి నేటి భౌతిక వైజ్ఞానిక యుగము వఱకు ప్రవర్తిల్లిన విశ్వసాహిత్యమునందు మహిళామణుల సారస్వతసేవ మహ నీయముగ పరిఢవిల్లినది.

ఆ యా యుగ సమయధర్మావసరముల నుపలక్షించి విస్తరిల్లిన మహిళల శారదా సమర్చనమున ఆత్మవివేక ప్రబుద్ధమై, విశిష్ట కర్తవ్యమును నిర్వహించిన భారతీయ బహుముఖ ప్రముఖ సాహిత్యముల యందలి విశేషాంశములను స్మరించి ఆంధ్ర మహాజనుల సన్నిధిని నివేదన మొనర్చుకొనుటయే నా యీ పూనికకు ప్రధానకారణము.

ప్రాచీనయుగముగా ఇప్పుడు మనము పేర్కొనుచున్న పందొమ్మిదవ శతాబ్ద్యంతము వఱకు గల భారతీయ సాహిత్య చరిత్రాధారములనుబట్టి సేకరింపగల్గిన కవయిత్రుల సాహిత్య వ్యవసాయమే ఈ సంకలన రూపమున నవతరించినది.

కాలగమనమున గల్గిన మార్పులకు లోనగుచునే సాహిత్యగతియు వివిధ మార్గముల ననుసరించినది. అయినను ఏ దృష్టికోణమున బరిశోధించినను పురా భారతీయ కవిలక్ష్యము భగవద్భావనను వీడిపోలేదు. తరువాత తరువాత భారత దేశమున రాజకీయముగ జరిగిన విప్లవములచే సుకుమార భారతీయ కవితాత్మ లుప్తమై సాహిత్యరంగము శుష్కాంధమై పోయినది. మఱల ఆంగ్లేయ పరిపాల నతో బాటుగ భారతీయ సాహిత్యములు వృద్ధిపొందుటయు, సాహిత్య రంగమున వైవిధ్యము పొడసూపుటయు, ఆంగ్లేయ భావుకతా ప్రభావముద్ర భారతీయ సాహిత్యములపై క్రమక్రమముగ బలపడుటయు కాననగును. దీని యందలి మేలు కీళ్లను భావికాలమే నిర్ణయింపగలదు. ఈ పరిణామము ఇంచుమించు అన్ని సాహిత్యములయందును కాన్పించు సామాన్య ధర్మమే.

ఇక వైదిక సాహిత్యము మొదలుగ ఒక్కొక్క సాహిత్యమునందలి విశేషములను సంభావించుకొందము.

ఆర్ష సంస్కృతితో సంపూర్ణ వికాసము గాంచిన వేదయుగమునాటి ఆర్యనాగరికతయందు మహిళల అధ్యవసాయము సంపూర్ణముగ నున్నది. మహోన్నతముగ జగతీ రంగమున కెగబ్రాకి వెల్లగొడుగులు పట్టిన ఆనాటి భారతీయుల నిత్యజీవన పద్ధతి, వ్యవహారజ్ఞానము, పరిపాలనా దక్షత, యజ్ఞ యాగాది క్రతుకలాప నిర్వహణము, రాజకీయ నైపుణి, వీరధర్మౌచిత్యము, యుద్ధ వైశారద్యము ఒక్కటననేల సర్వ కార్యకళా కలాపములును, తుదకు భారతీయుల విశిష్టతకు మూలకందమైన ఉత్తమాధ్యాత్మిక జ్ఞానమును మహిళల రచనా వ్యాసంగములచే మాన్యములైనవి. ఋగ్వేదమును పరిశీలింపగా తేలిన

సుమారు రెండువేల సంఖ్యకల మంత్రద్రష్టలగు మహాఋషులలో సుమారు ఇరువదినల్గురు, మహిళా మంత్రదర్శినులై యున్నారు. ఆత్మజ్ఞానమున సముత్తీర్ణ లైన గార్గి, మైత్రేయి మున్నగువారి వాఙ్మయమును భద్రపఱచుట యందు చూపిన శ్రద్ధాసక్తులనే వేదవాఙ్మయ చరిత్రకారులు, విశ్వవార, అపాల, లోపాముద్ర మున్నగు గృహిణులు తమ తమ అమాయిక చిత్తప్రవృత్తులను, అలౌకికముగ చిత్రించినయెడ వారి ముగ్ధసుందర భావ పరంపరనుకూడ భద్ర పఱచుటయందు చూపిరి. వారి యీ సమభావము మెచ్చదగినదే కాక, నేటి నాగరికుల కాదర్శము కాజాలినదికూడ.

దేవీ సూక్తదర్శినియగు వాగంభృణియొక్క ఆత్మసత్తా వైదిక వాఙ్మయ మున కొక పతాకశీర్షిక. ఉషఃకాలముననే మేల్కాంచి అగ్ని కభిముఖముగ సాగి తన వైవాహిక జీవనోదయారంభముననే వీతిహోత్రునకు సమర్పించిన కృతజ్ఞతాంజలి సూక్తమున విశ్వవార "ఓ అగ్నీ మాకు శాశ్వత శోభనము, సుస్థిర భాగధేయము కల్గుటకై మా శత్రువులను అణచివేయుము" అని అభ్యర్థించిన స్వార్థోపభోగ ప్రార్థనతో బాటుగ "మా యీ వైవాహిక జీవితమును పూర్తిగ నియమబద్ధమును గావింపుము" అని ప్రార్థించుటయందే ధర్మబద్ధమగు భారతీయ సంస్కృతి శోభ వ్యక్తమగుచున్నది.

నిష్ఠుర యమ నియమ పరవశులగు నిజవల్లభుల కఠోర తపోనియతికి భంగము వాటిలకుండుటకై వివాహ జీవిత మధుర సౌఖ్యానంద విభూతులను మీరు కట్టుచునే చిరకాలము గార్హస్థ్య జీవితము గడపిన కొందఱు గృహిణుల ప్రార్థనలలో ఆ యా చిర విరహిణుల మనసులలో గూడుకట్టుకొని యున్న మధురవాంఛలు కిటికీలు తెఱచుకొన్నవి. ఉన్ముక్త వాతాయనముల వెంట ఱెక్కలు గట్టుకొని ఎగిరినవి. అందును ధర్మ సౌందర్యములు వాసియైన వాసి చెడలేదు. ఇట్టి ప్రార్థనలలో లోపాముద్ర ప్రార్థన మిక్కిలి ముచ్చటగా నున్నది. శ్రుత్యుపచార రమణీయమైన ఈ శ్రుతిసూక్తము చిరతరానంద వాసితమై సాహిత్యమున కేనాటికిని సరిక్రొత్తతొడవులు తొడుగుచునే యున్నది.

జగత్ప్రసిద్ధిగాంచిన గార్గి, మైత్రేయి మున్నగు వారి ఆత్మ తత్త్వోన్మేష మును గూర్చి యిచ్చట వేరుగా వ్రాయ నుద్యమించుటలేదు. "వైదిక వాఙ్మ యము, మహిళా మంత్రదర్శినులు" అను వ్యాసమున నా యా సందర్భములలో ఋఙ్మంత్రములనే యథాతథముగ ఉద్ధరింప వలెనని తలంచితిని. కాని అనవకాశ ముచే సంపాదింప లేకపోయితిని.

సంస్కృత ప్రాకృత వాఙ్మయమునందలి స్త్రీల పరిశ్రమము తెలియవలసినంతగా లోకమునకు తెలియరాలేదు. ఆ వాఙ్మయ పరిరక్షణ జరుగవలసినంతగా జరుగకపోవుటయే దీనికి కారణము. దొరకినంత వఱకు పెచ్చుగా చాటు వాఙ్మయముగా నున్నది. మహావిద్వాంసులైన శ్రీ డాక్టరు రాఘవన్‌గారు ఈ సంస్కృత కవయిత్రులను గూర్చి వ్రాయుచు "ఈ కవయిత్రులు, రచయిత్రుల ప్రశస్తి మన చరిత్ర కొక విశిష్టాలంకారము" అని పేర్కొనియుండుట గమనింప దగినది. ఉపలబ్ధమైనంతవఱకు ఆ రచనలయందు రచయిత్రులగు స్త్రీల సహజ సౌకుమార్య భావసంపద కొట్టవచ్చినట్లుగా కానగును. అందును రత్నఖేట దీక్షితుని భార్య (సాహిత్య చరిత్రలో రత్నఖేట దీక్షితుని భార్యగా మాత్రమే ప్రసిద్ధి. పేరు తెలియదు) యొక్క రచనలు చాలా మహనీయములుగా నున్నవి. విశ్రుత నామధేయలగు విజ్జిక, శీల, మోరిల, అవంతి సుందరి మున్నగువారి రచనలు ఉజ్జ్వలమణి ప్రదీపములు. సహృదయశేఖరుడైన రాజశేఖరు డింతమాత్ర మైన వీరి వాఙ్మయమును భద్రపఱుపక పోయినచో ఇదియైనను మనకు లభించెడిది కాదు.

సంస్కృతమున మహాకావ్యములు రచించిన గంగాదేవి, తిరుమలాంబ, మధురవాణి, త్రివేణి మున్నగు వారందఱును ఆంధ్రమహిళలే యను విషయము ఆంధ్రులకు మిక్కిలి గర్వకారణము! ఇది మన భాగ్యము!

ప్రాకృత కవితా క్షేత్రమున గాథా సప్తశతి యందలి కవయిత్రుల అలౌకిక ప్రణయగాథలయందలి, నిసర్గ సౌందర్యశోభ ఎవ్వరును వెలకట్టజాలనిది. ఆ యా ఘట్టములను చదివి స్వయముగ ఆనందింపుడని సహృదయులగు పఠితలను కోరుచుంటిని.

అసామీ భాషయందు రచనారంభము క్రైస్తవ మత ప్రచారోద్దేశముతో మొదలిడుటయు, జానపద వాఙ్మయమున సాంఘికసమస్యల ప్రస్తావన పెచ్చుగా నుండుటయు, 1829 - 59 ప్రాంతమునందలి "పద్మావతీఫుకనానీ" రచించిన "సుధర్మార్ ఉపాఖ్యాన్" నవలయే అసామీభాషలో ప్రథమనవల యగుటయు (అనగా అసామీ సాహిత్యమునందలి ప్రథమనవల స్త్రీ విరచితము) గమనింప దగిన విశేషము. ధర్మేశ్వరీ, నళినీబాలల సాహిత్యసేవ ఆ భాష కలంకార ప్రాయముగ గుర్తింపబడుట ముదావహమైన అంశము.

ఆంధ్ర కవయిత్రీ చరిత్రమున కొక ప్రత్యేకత కలదని సవినయముగా మీముందు విన్నవించుకొన సాహసించుచున్నాను. 15 వ శతాబ్దమునందలి

తాళ్ళపాక తిమ్మక్క ప్రతిపద రసోదంచితమైన సుభద్రాకళ్యాణ ద్విపద కావ్య రచనతో ఆంధ్ర సరస్వతికి భద్రోపచారములు చెల్లించినది. అంతకుక్రితమే 13 వ శతాబ్దియందె చానమప్రోలమలు వీరరసావిర్భావోపపన్నముగ శౌర్య సాహసములు గ్రక్కదలునట్లుగ ఆంధ్రభారతిని ఆంధ్ర విషయమున అవతరింప జేసిరి. తిమ్మక్క రచనయందలి తీరు తీయములుకాని, చానమ ప్రోలమల చాటు రచనయందలి సౌమనస్యముకాని చవి చక్కనకల ఆంధ్రకవయిత్రీ రచనా విజ్ఞానమునకు బరువైన సాక్ష్యములు. ఇట్లనిదంపూర్వరామణీయకములు కుప్పలువోసిన ఈ సీమంతినులకంటె ముందె ఎవరైన ఆంధ్రపురంధ్రులు కావ్యరచన కావించిన పుణ్యమునకు నోచుకొనిరా? ఏమో! సీతమ్మశోకము, కుచేలకథ, లంకాయాగములయందు అందములు చిందించిన కాంతహస్తము లేకాంతలవి? భారత ఘోరరణమ్మునందు నారాయణునివలె నన్నయ భట్టారకునకు తోడుపడిన నారాయణభట్టు కుమార్తె కుప్పమ్మ అనల్ప మనోజ్ఞ రచనా నైపుణ్యముల నంధ్రసాహితీ జగతిని నిక్షిప్త మొనరించినదను నొక ప్రథకలదు. ఆ నిక్షేప మేనాటికి మన యనుభవమున కందివచ్చునో.

తక్కిన సాహిత్యముల యందుకంటె ఆంధ్రకవయిత్రులు సంఖ్యయందు చాలా హెచ్చుగా నున్నారు. కవయిత్రులకు ముంగొంగు పసిండియగు నాయక రాజాస్థానమున, తంజపురమున నాలుగువేలమంది స్త్రీ ఉద్యోగినులు కాంతిచ్ఛటలుగా తారాడువారట. సంఖ్యయందును, భావౌన్నత్యమునందును ఆంధ్ర కవయిత్రులు సమున్నతస్థానమునే పొందియున్నారు. అంతేకాక సంస్కృతమున మహాకావ్యములను వ్రాసిన ఖ్యాతి ఆంధ్ర మహిళలదే. తఱికుండ వేంగమాంబ, దార్ల సుందరీమణి, అవధూత జ్ఞానమాంబ మున్నగు మహాయోగినుల రచనలు; తిమ్మక్క, మొల్ల, ముద్దుపళని, రంగాజీ కొటికలపూడి సీతమ్మ, సీరము సుభద్రయాంబ, లక్ష్మీనరసమాంబ, తులశమ్మ, పొణకా కనకమ్మ, ఇందుమతీదేవి, కనకాంబ, లక్ష్మీబాయమ్మ, సీతాంబ, సరస్వతీదేవి, విశ్వ సుందరమ్మ మున్నగు మహాకవయిత్రులతో పోల్చిచూచినను 19 వ శతాబ్ది చివఱ భాగమువరకుగల తక్కిన సాహిత్యములలో ఒక్క కాశ్మీర సాహిత్యము దప్ప ఇంకే సాహిత్యమును ఆంధ్ర రమణీ రమణీయ సాహిత్యప్రతిభకు సరి పోల్ప దగునట్టిదిగా లేదేమోనను విషయము పాఠకులకు దోచక మానదు. వీరుకాక యక్షగాన రచయిత్రులును ఆంధ్రసాహితి కలంకారమునే కూర్చిరి. ఆధుని కాంధ్రమహిళా సాహిత్యమున తొలి నవలా రచయిత్రి సీరము సుభద్ర

యాంబ. "మఱి విద్దికూచి రామాయణ మారు కాండములు అచ్యుత జాగరవేళ పాడెనా. రాయవితంతు రత్నమను రాగముతోడ" అని క్రీడాభిరామమున పేర్కొనబడిన ఈ విద్దికూచి ఎవరు? మహిళయనుట కెక్కువ అవకాశములు కనబడుచున్నవని కొందఱు చారిత్రకుల యుల్లేఖనము. ఇట్లింకెందఱనామము లజ్ఞాతముగ నున్నవో?

కాశ్మీర సాహిత్యమును దడవుటతో మహాయోగి నీమతల్లియైన లాల్‌దీది రచనలు స్మృతిని మెఱయుచున్నవి. ఒక్కొక్క సారస్వతమున ఒక్కొక్క మహాయోగినీ బోధామృతము ఒక్కొక్క సౌందర్య కావ్యకమలముగా రూపొందియుండుట ఈ మహిళా సారస్వతమునకుగల విశిష్ట సామాన్యధర్మము.

కాశ్మీర సాహిత్యమున లాల్‌దీది, కన్నడ సాహిత్యమున అక్కమహాదేవి, మహారాష్ట్రసాహిత్యమున ముక్తాబాయి, జనాబాయి, కానోపాత్రలు, తమిళ సాహిత్యమున అవ్వైయారు, ఆండాళ్లు మున్నగువారు, హిందీసాహిత్యమున మీరాబాయి, ఆంధ్ర సాహిత్యమున వెంకమాంబ, సుందరీమణి, జ్ఞానమాంబలు ఈ ఉత్తమశ్రేణికి చెందినవారే. వీరితాత్విక, భక్తిరచనలు విశ్వసాహిత్య చరిత్రపుటలకే అలంకార ప్రాయములై యుండుటయు మహిళా సారస్వత మునకు ప్రకర్షదాయకము.

సంపుష్టమగు మహినీయాంధ్ర మహిళా సారస్వత పరామర్శ వెనుక ఉర్దూ సాహిత్యమునుగూర్చి చర్చింపవలసి యున్నది. (అక్షర క్రమమునుబట్టి) ఉర్దూ సాహిత్యమొక వింతసృష్టి. ఫారసీ, అరబ్బీ భాషాభావ సాంప్రదాయములును, భారతీయ సాంప్రదాయములును కలబోసిన విశిష్టసృష్టి ఉర్దూ సాహిత్య మన వచ్చును. 544 వ్యావహారిక భాషలును, 174 ప్రాంతీయ భాషలునుగల భారతీయ దేశభాషా సాహిత్యములలో అంతస్స్రోతస్వినిగా ప్రవహించిన భారతీయాత్మ ఉర్దూ సాహిత్యమునగూడ ప్రతిబింబించియుండుట ప్రస్తుతి పాత్రము. దివాను, మస్నవీ, గజల్ మున్నగు ఉర్దూ సాహిత్య ప్రక్రియలలో కావ్యరచన చేసిన స్త్రీలీ సాహిత్యమున నగపడుచున్నారు. లఖాబాయి చందాను బోలిన ప్రతిభావంతురాలిని గన్న భాగ్యము ఉర్దూ సాహిత్య సరస్వతికి దక్కినది.

ఒడియా సాహిత్యమునందలి మాధుర్యమును శ్రీ పురిపండావారు మనకు పుడిసిళ్ళనుండి ద్రావనిచ్చినారు. 15, 16 ప్రాంతపు కవయిత్రి దీనసుందరి రచనలతో మొదలిడి, మాధవీదాసి, బృందావతీదాసి, నిశ్శంకరాయరాణి వఱకు

గల మధుమధురమగు కృష్ణభక్తి భావనిర్భర పారవశ్యమును మనకును గల్గించి నారు. మధుర కృష్ణభక్తి ఔత్తరాహ సాహిత్యమున వెలుగుదారులు వెల యించిన మణిప్రదీపము. మాధవదాసి; రచనమునందే కాక, గొప్ప లేఖకు రాలుగాకూడ ప్రఖ్యాతి నొందినది. ముప్పది ఎనిమిది ఛందస్సులతో కావ్య మల్లిన నిశ్శంకరాయరాణి కవితా సామర్ధ్యము నిశ్శంకముగా అనల్పమైనది. ఇక కడపటి కుంతలకుమారి రచనలు అనన్య సామాన్యములైనవి. ఆంగ్లేయ పాలన, నాగరికతాముద్రలు భారతీయ సాహిత్యములపై నెంత ప్రసరించినను, ఉద్దీప్త భావుకతకల్గిన నారీమణుల నాపరదాస్య మెంత ఉద్రిక్తులను చేసినదో దాస్యముతో క్రాగి క్రాగి, వేగిన భారతీయ కవయిత్రీ హృదయమునందు దాగిన స్వాతంత్ర్యవాంఛ లావావలె ఎట్లు విరుచుకొని పడినదో, ఆభావ మెంత బలీయమైనదో కుంతలకుమారి సాబితా నిరూపించినారు. ఒడియా సాహిత్య మొక మధురశరంగిణి.

మహాయోగినియైన అక్కమహాదేవి రచనలతో పవిత్రమైన సాహిత్యము కన్నడ సాహిత్యము. కన్నడసాహిత్య ముఖ్యలక్షణమైన శైవార్చనాపర్యుత్సు కతయే ఈ శివశరణురాంద్ర రచనలయందు వెల్లివిరిసి పొరలియున్నది కన్నడ కవయిత్రులుకూడ సంఖ్యయం దధికముగనే యున్నారు. ఈ కన్నడ కవయిత్రీ వ్యాసమునందలి "పురుషులు తమకు కవిత్వమునందుగల సామర్థ్యమునుగూర్చి డంబములు చాటుకొనుచుండ, స్త్రీలుమాత్రము తమ కావ్యరచనయందు నమ్రతను, సంకోచభావమును ప్రదర్శించుట గమనార్హము". అను వాక్యము నిజముగా గమనార్హము. కన్నడ సాహిత్య చరిత్రనుబట్టి ఆచార్య పీఠము నధివసించిన మహాతల్లులున్నట్లు కానవగును. కాంతి, హొన్నమ్మ మున్నగు వారి రచనలు కన్నడ సాహిత్యమునకు వెలుగు రేఖలు.

మహాదేవి అక్క:-ఈ మహాయోగిని రచనలు అంకెకు మిక్కిలిగా కలవు. అందు 250 మాత్రమే అచ్చుపడుట నేటి నాగరక లోకమునకు ప్రతిష్ఠాదాయ కము కాని యంశము. ఇట్లే ప్రతిసాహిత్యమునందును వెలుగుచూడని అమూల్య మహిళాసాహిత్య మెంతయో కలదు. ఈ బాధ్యతను మనమెన్నడు తీర్చు కొందుమో !

అక్క మహాదేవి వచనములను రెండు మూడు సంపాదించి యీ గ్రంథ మున మీ కందీయగల్గితిని.

కన్నడ సాహిత్యమువలెనే కాశ్మీర సాహిత్యమును శక్తిమంత మొనర్చినది; అవ్వాలల్ల! జాతిమత భేదముతో నిమిత్తములేకుండ కాశ్మీరమున సర్వజనులచే "అవ్వ" యని పిలిపించుకొనిన మహాయోగిని; అవ్వాలల్ల! శ్రీ జె. ఎన్. కౌలు గారు తమ కాశ్మీర మహిళా సారస్వత వ్యాసమును కొంత ఆలస్యముగానే పంపినారు. ఒకానొక సందర్భమున ఆ వ్యాసము లేని కొఱతతోడనే ఈగ్రంథమును సంగ్రథింపవలసి వచ్చునేమోయని భీతిచెందితిని. కాని పరమేశ్వరీ కృపచే కాశ్మీర కవయిత్రుల వ్యాసము కొఱపడలేదు. నిజముగా ఈ సాహిత్య ఖండమే ఈ గ్రంథమంతటికిని దీపశిఖయనవచ్చును.

శివానుభవముకొఱకై అక్కమహాదేవి పొందిన వేదనానుభవములు, ఆత్మ తత్త్వానుభవమునకై లల్లేశ్వరి యనుభవించిన దుస్సహ పరితాపబాధయును, కృష్ణానుభవానందమునకై మీరా పొందిన ప్రగాఢ వియోగతాపమును విశ్వ సాహిత్యమునకె మాణిక్య దీపములు.

లల్లేశ్వరి అద్వైత తత్త్వకవిత అత్యున్నతమైనది. కాశ్మీర కవితా దేవాలయమున తత్త్వపద్ధతి కవితకు లాల్‌దీదీయే ప్రథమ ప్రతిష్ఠాపకురాలు. అట్లే 'లోల్ లిరిక్' అనబడు ప్రేమగేయకవితాపద్ధతికి సామ్రాజ్యేశ్వరియైన హాబాఖాటూను కవిత్వమే కాశ్మీర సాహిత్యకేదారముల నారుచల్లినది. మూడవ కవయిత్రి యగు అర్నిమాల్ విప్రయోగినీ హృదయారాట తీవ్రతను తీవ్రముగా వెలిబుచ్చుచు చదువువారి గుండెలపై సమ్మెటలు గొట్టినది. కాశ్మీర సాహిత్య చరిత్రలో ముఖ్య కవయిత్రులైన ఈ ముగ్గురిగూర్చి తెలుపలేకపోయి యుండినచో అది వెలితిగానే యుండెడిది. కాని మన భాగ్యవశమున శ్రీ కౌలుగారు కొఱత దీర్చిరి.

ప్రపంచ సారస్వతమున విశిష్టస్థాన మలంకరించిన మీరా మధురభక్తి గేయకవితను గుజరాతీ సాహిత్యపు స్వత్వముగా శ్రీమతి సుస్మిత మేఘీగా రుల్లేఖించిరి. అది విచారణీయము! మీరా రసపుత్రాంగన. ఆమె తన గేయములను పాడిన భాషను గూర్చిన వాదభేదములనుకూడ శ్రీమతి మేఘీగారు తమ వ్యాసమున పేర్కొనియుండిరి. అది యెట్లున్నను, అనుక్షణ ప్రవర్ధమానమగు కృష్ణప్రేమతో తాను ప్రేగి కాగి విశ్వమోహన వంశీనాదసుధగా తన గేయ కవితాహృత స్రవంతితో ప్రమోదులను చిగురింపజేసిన మహావిప్రలబ్ధ! మీరా!! ఆమె తన కృష్ణప్రేమామృతముతో భారతీయులనేకాదు సచరాచర ప్రకృతినే

గల మధుమధురమగు కృష్ణభక్తి భావనిర్భర పారవశ్యమును మనకును గల్గించి నారు. మధుర కృష్ణభక్తి జౌత్తరాహ సాహిత్యమున వెలుగుదారులు వెల యించిన మణిప్రదీపము. మాధవదాసి; రచనమునందేకాక, గొప్ప లేఖకు రాలుగాకూడ ప్రఖ్యాతి నొందినది. ముప్పది ఎనిమిది ఛందస్సులతో కావ్య మల్లిన నిశ్శంకరాయరాణి కవితా సామర్ధ్యము నిశ్శంకముగా అనల్పమైనది. ఇక కడపటి కుంతలకుమారి రచనలు అనన్య సామాన్యములైనవి. ఆంగ్లేయ పాలన, నాగరికతాముద్రలు భారతీయ సాహిత్యములపై నెంత ప్రసరించినను, ఉద్దీప్త భావుకతకల్గిన నారీమణుల నాపరదాస్య మెంత ఉద్రిక్తులను చేసినదో దాస్యముతో క్రాగి క్రాగి, వేగిన భారతీయ కవయిత్రీ హృదయమునందు దాగిన స్వాతంత్ర్యవాంఛ లావావలె ఎట్లు విరుచుకొని పడినదో, ఆభావ మెంత బలీయమైనదో కుంతలకుమారి సాబితా నిరూపించినారు. ఒడియా సాహిత్య మొక మధురశరంగిణి.

మహాయోగినియైన అక్కమహాదేవి రచనలతో పవిత్రమైన సాహిత్యము కన్నడ సాహిత్యము. కన్నడసాహిత్య ముఖ్యలక్షణమైన శైవార్చనాపర్యుత్సు కతయే ఈ శివశరణురాండ్ర రచనలయందు వెల్లివిరిసి పొరలియున్నది కన్నడ కవయిత్రులుకూడ సంఖ్యయం దధికముగనే యున్నారు. ఈ కన్నడ కవయిత్రీ వ్యాసమునందలి "పురుషులు తమకు కవిత్వమునందుగల సామర్థ్యమునుగూర్చి డంబములు చాటుకొనుచుండ, స్త్రీలుమాత్రము తమ కావ్యరచనయందు నమ్రతను, సంకోచభావమును ప్రదర్శించుట గమనార్హము". అను వాక్యము నిజముగా గమనార్హము. కన్నడ సాహిత్య చరిత్రనుబట్టి ఆచార్య పీఠము నధివసించిన మహాతల్లులున్నట్లు కాననగును. కాంతి, హొన్నమ్మ మున్నగు వారి రచనలు కన్నడ సాహిత్యమునకు వెలుగురేఖలు.

మహాదేవి అక్క:-ఈ మహాయోగిని రచనలు అంకెకు మిక్కిలిగా కలవు. అందు 250 మాత్రమే అచ్చుపడుట నేటి నాగరక లోకమునకు ప్రతిష్ఠాదాయ కము కాని యంశము. ఇట్లే ప్రతిసాహిత్యమునందును వెలుగుచూడని అమూల్య మహిళాసాహిత్య మెంతయో కలదు. ఈ బాధ్యతను మనమెన్నడు తీర్చు కొందుమో !

అక్క మహాదేవి వచనములను రెండు మూడు సంపాదించి యీ గ్రంథ మున మీ కందీయగల్గితిని.

ఈ సాహిత్యమున విశేష లక్షణము. అట్లని యితర సాహిత్యములయందు మహా రాజవంశములయందలి మహిళలు కవయిత్రులుగా లేరనికాదు. గంగాదేవి మహా రాజపత్ని. చెన్నబసవేశ్వరుని సతియు కవయిత్రియే. ఇది యిట్లుండ హొన్నమ్మ మహారాజాంతఃపురమున తాంబూల కరండ వాహికయని యొక ప్రథకలదు. కాన్హోపాత్ర వేశ్య - జనాబాయి పనికత్తె - మొల్ల కుంభకారకుల సంజాత రాజ శేఖరు డనినట్లు మంత్రికుమార్తె లేమి; మహారాజ పత్నులేమి, సామాన్య స్త్రీలైన నేమి? కవితా కళకి భేదములతో పనిలేదుకదా! కాని మళయాళ దేశము స్త్రీ విద్యకు పెట్టినది పేరగుటయు, నందును మహారాజవంశముల యందలి పురుషులును, స్త్రీలును కవులుగా నుండుటయు నిందలి విశేషము - కన్నడ సాహిత్యమున సాంగత్య చ్ఛందస్సువలె మళయాళమున అట్టిక్కథ ప్రాచీన సాహిత్యప్రక్రియ. దీనియం దారితేరిన ప్రజ్ఞ కనబఱచిన స్త్రీ లెందరో మళయాళ సాహిత్య చరిత్రయందు కానవత్తురు. వీరికి పురుషుల సహాయసంపత్తి లభించుటయు ఒక విశేషము. 18వ శతాబ్దమునందలి మనోరమా తంపురాట్టి మొదలు నేటి కవయిత్రులగు శ్రీమతి బాలా మణియమ్మ, శ్రీమతి కమలా మాధవదాసుల వఱకు అత్యధిక ప్రతిభావంతురాండ్రైన కవయిత్రులకు మళయాళ దేశము పుట్టినిల్లై విరాజిల్లుచున్నది. మళయాళ సాహిత్యమునందును కవయిత్రుల సంఖ్య విశేషముగానే కన్పించుచున్నది. కుంజిలక్ష్మి కేట్టిలమ్మవంటి సంస్కృత కవయిత్రులు 19వ శతాబ్దమునకూడ కాన్పించుటొక విశేషము. టి. పి. కళ్యాణమ్మ ఆధునిక నవలా సాహిత్యమునకు శ్రీకారము చుట్టినది. క్రైస్తవమత ప్రభావముకల ఆ దేశమున 1901 వఱకు ఒక్క క్రైస్తవ కవయిత్రియు కానరా కుండుట యబ్బురమే. 1901వ సంవత్సరమునందలి శ్రీమతి జాన్‌తోట్టమ్ క్రైస్తవ కవయిత్రి. ఆమె రచన తాత్త్విక సంపన్నమగుట గమనార్హము.

12వ శతాబ్దము నుండియు మహారాష్ట్ర సాహిత్యమున కవయిత్రీమణులు కాన్పించుచున్నారు. ప్రాచీనకాలమున కవితా సాంప్రదాయమును పాదుకొల్పిన మహానుభావ శాఖయందే మహారాష్ట్ర ప్రథమ కవయిత్రి మహదాంబ కనబడు చున్నది. మహారాష్ట్రుల ధావళే, అభంగరచనలలో ఆ కవయిత్రుల రచనలు సుడులుదిరిగి పోయినవి. మహాయోగిని యగు ముక్తాబాయి, జనాబాయి, కులముచే వేశ్యయయ్యును నైతిక సంపదచే కులసతులను తలదన్నిన కాన్హోపాత్రయు ప్రభావపూర్ణమైన భక్తికీర్తనా కవిత్వమును సృజించి మహారాష్ట్ర దేశీయులను పారవశ్యమున నుఱ్ఱూతలూగించిరి. ముక్తాబాయి కవిత నీత్యుద్బోధ

కముగా కూడా సాగినది. కాన్హోపాత్ర శీలసంరక్షణకై పాండురంగ విఠలుని ప్రార్థించి యా రంగనియం దైక్యముచెందినది. ఆ కీర్తన అత్యంత కరుణా జనకమై హృదయమును కదిలించి వేయుచున్నది. వీర ధర్మావేశమున జగతిని కంపింపజేసిన మహారాష్ట్ర దేశమున భక్తిపారవశ్యమున ప్రజల నుత్తేజితుల గావించు కవితారాసిక్య ధర్మమతి వేలముగా నుండుటలో నబ్బురమేమియు లేదేమో ! ఈ చరిత్రయందలి పండిత రామాబాయి ఒక అనన్య సామాన్యవనిత.

కమనీయ భావనావేశమునకు పేరుపడిన వంగసాహిత్యమున నేలకో స్త్రీల రచనోద్యోగము మిక్కిలి ఆలస్యముగా మొదలైనట్లు కానవచ్చుచున్నది: ఇది మిక్కిలి వింతయగు విషయమే. అదియును 1819 నుండి మిషనరీల ప్రోద్బల ముతో క్రైస్తవమత ప్రచారమునకై రచన ప్రారంభమగు టింకొక విశేషము. అసాము సాహిత్యమునందును ఇట్టి సంఘటనమే జరిగినది. కాని 16, 17 శతాబ్ద ములలో చంద్రావతి యనునామె వంగభాషలో సీతాదేవి వనవాసము వఱకు రామాయణమును మంజులమగు గేయముగా రచించినదట. ఇది మన ఆంధ్ర జానపద సాహిత్యమునందలి లంకా యాగము, కుశలాయకము, సీతమ్మ వనవాసము మున్నగు గేయశ్రేణికి చెందినదై యుండవచ్చును.

వంగసాహిత్యరంగమున విశ్వకవి రవీంద్రకవిచంద్రుని కవితాసౌరభములు దిగంతవాసితములైన వెనుకనే - అనగా 19వ శతాబ్దముననే - మహిళా సార స్వత సృష్టియు జరిగినది. రవీంద్ర కవితా ప్రభావముద్ర వీనిపై స్పష్టముగ కనబడుచున్నది. ఇట్టివారిలో కామినీరాయి మున్నగువారు సుప్రసిద్ధురాండ్రు. వంగ మహిళాసాహిత్యమున తొలికావ్యమును వ్రాసిన ఖ్యాతికి కృష్ణకామినీదాసి నోచుకొన్నది.

ఇక జగద్విశ్రుత కవయిత్రీ తిలకమైన సరోజినీనాయుడునుగూర్చి వేరే వ్రాయున దేమియును లేదు. తోరూదత్తుకూడ అట్లే వంగనారియై ఆంగ్లమున కవితా రచన మొనర్చి భారతీయ కీర్తి కౌముదిని దిగంత విశ్రాంత మొనర్చినది.

సింధీ సాహిత్యమున మహిళారచనము కేవల మాధునికము.

భారతీయ రాష్ట్రభాషా భాగ్యము నొందిన హిందీ భాషయందు చాలా వాఙ్మయ సృష్టి జరిగినది. కాని అదియంతయు ప్రాచీనభక్తి సాంప్రదాయ ప్రభావితమే.

కొంచెం మించుమించుగా అన్ని సాహిత్యములలో ప్రాచీనకాలమున ఆధ్యాత్మిక భక్తిభావములే అధికముగా నుండుటయు, పురాణగాథలే కావ్య వస్తువులుగా నుండుటయు సామాన్య ధర్మమై భాసించినది. 19 వ శతాబ్దము నుండి విషయ వైవిధ్యమును, స్వతంత్ర వస్తు భావకల్పనయు ప్రారంభమైనది.

మహారాష్ట్రమున 13 వ శతాబ్దమునందు తొలికవయిత్రీ ప్రాదుర్భావము జరిగినది. మన యాంధ్రమునను తొలికవయిత్రులు 13 వ శతాబ్దమునందలి చానమ ప్రోలమలు. కాని వారి రచన ఒక్కపద్యముతో నాగిపోయినది. తొలి కావ్య కవయిత్రి తాళ్లపాక తిమ్మక్క. కాశ్మీర సాహిత్యమునందలి లల్లేశ్వరి మిక్కిలి ప్రాచీనకాలమునాటిది. ఇట్లే తమిళ కన్నడ కవయిత్రులును. తక్కిన సాహిత్యములయందు కవయిత్రీ సృష్టి కొంకెంత తడవు జరిగినది.

ఏవం విధమున సముజ్జ్వలముగా సాగిన ఈ మహనీయ భారతీయ మహిళా కవితా సామ్రాజ్య చరిత్రమును సంపాదనమొనర్చి సంకలనము సేయుటలో నా యథాశక్తిగ పరిశ్రమించితిని.

సముద్రగుప్తుని ఆస్థానమున విభావతియను కవయిత్రి యుండెడిదట. ప్రఖ్యాత సంస్కృత కావ్య వ్యాఖ్యాతయగు మల్లినాథుని కాంత కమనీయ వచోగుంభన కల కవయిత్రియట, శారదా తంత్రమున కొందఱు కవయిత్రుల పేర్లు ప్రస్తావింపబడి యుండెనట, అనంతపుర మండలమున ఒక బిచ్చకత్తె కూనలమ్మ ఎంతో చక్కని తాత్త్విక పదములనల్లి పాడుచుండెడిదట. పాళీ వాఙ్మయమున బౌద్ధ పరివ్రాజికల కవితా పరిశ్రమములు నిక్షిప్తమైయున్నవట! ఇవి యన్నియు నెప్పుడో వెలుగు చూడగలవు. ఆ శుభదినమొకటి భావియందు నిర్దేశితమై యున్నది. ఇది నా ప్రగాఢ విశ్వాసము.

ఇక ఈ సంకలన గ్రంథోద్యమము విషయమై రెండు మాటలు వ్రాయ వలసి యున్నది.

ఇది యొక బృహదుద్యమము. మహా తపస్సు 1953 వ సంవత్సరమున తెలుగు భాషాసమితి వారి పారితోషక రచనగా నే నాంధ్ర కవయిత్రులను ప్రచు రించిన నాటి నుండి నా యంతరంగమున ఈ సంకల్పము కొట్లాడుచునేయున్నది. కాని ననుబోటి కేవలా శక్తురాలు సాధింపలేని మహత్కార్యమగుట నేను మిన్నకుండవలసివచ్చినది. అయినను ఈ నడుమ సుమారు రెండు మూడు సంవత్స రములకు ముందు– శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు తెలుగుభాషా సమితివారి

విజ్ఞాన సర్వస్వ సంపుటములలో 'విశ్వసాహితి' సంపుట సంకలనమునకై ప్రయత్నములు చేయుచుండగా అందు ప్రచురించుటకై చాలా శ్రమించి, 'అఖిలభారత కవయిత్రులు' అను శీర్షికను, ఒక వ్యాసమును వ్రాసితిని. కాని కాగితము కొఱత యేర్పడి, నా వ్యాసమందు ప్రచురణ భాగ్యము నొందలేదు.

ఈనాటి కిది యింత సర్వాంగసుందరముగా వెలువడుటకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ పెద్దలు- ముఖ్యముగా పూజ్యసోదరులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి యొక్క యాశీర్బలమే కారణము. ఆ కారణముననే నిర్విఘ్నముగా నిది కొనసాగినది. సోదరులు శ్రీయుత దేవులపల్లి రామానుజరావుగారి ప్రోత్సాహము, ఎకాడమీ పెద్దల సద్భావము లేకున్న నిట్టి మహోద్యమమును నిర్వహించు శక్తి నాకు లేదని సవినయముగా విన్నవించుకొనుచున్నాను. ఈ సంకలన సందర్భముగా నాకు ఆదరముతో ఎకాడమీవారు యావద్భారత పర్యటన మొసంగిరి. ఆ యవకాశముచే దేశదేశముల యందలి ప్రసిద్ధ రచయిత్రుల సందర్శన భాగ్యము నాకు లభించినది. "ఏకాక్రియాద్వ్యర్థకరీ" అనునట్లు ఒకే ఉద్యమముతో భాగ్యద్వితయమును నాకు కల్గించిన ఎకాడమీవారికి, ఎకాడమీ అధ్యక్షులు, పూజ్యులు శ్రీ గోపాలరెడ్డిగారికి కృతజ్ఞతాంజలి.

అడిగినదే తడవుగ సోదరీమణులును, సోదరులును ఈ ప్రప్రథమ సంకలన గ్రంథమునకు తమ తమ వ్యాసములను పంపి సాదరముతో తోడ్పాటు చూపిరి. వారికి నేనును, ఎకాడమీయు ఎంతో ఋణపడియుంటిమి.

వైదిక వాఙ్మయ విషయమునకును, సరోజినీ తోరూదత్తుల వ్యాస విషయములకును శ్రీరామకృష్ణ మఠమువారి ప్రచురణ యగు "Great Women of India" అను గ్రంథము నాకు ఆధారమైనది. సంస్కృత ప్రాకృత వాఙ్మయ చరిత్ర విషయములకు డాక్టరు రాఘవన్‌గారి వ్యాస మాధారమైనది. ఆంధ్ర కవయిత్రీ వ్యాసము నందలి యక్షగాన కవయిత్రీ విషయమునకు శ్రీ డాక్టరు యస్వీ. జోగారావుగారి యక్షగాన చరిత్ర ఆధారమైనది. అట్లే శ్రీ నిడుదవోలు వెంకటరావుగారి వ్యాసభాగమును, శ్రీమాన్ శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి గాథా సప్తశతి యందలి వోహా కవిత్వానువాదమును నేను నా రచనకు సాయముగా స్వీకరించితిని. ఈ మహానుభావులందఱకును నా కృతజ్ఞతాంజలి.

మిగిలిన దనువాద విషయాము: భారతదేశము నందలి ఆ యా భాషా ప్రాంతముల నుండి ఆంగ్లమున వచ్చిన వ్యాసములను నేర్చినకొలదిగ నేనును,

చి.సౌ. మా కుమార్తె ఊటుకూరి సుహాసినీదేవి, యం.ఏ. యును అనువదించితిమి. మొత్తముపై గ్రంథరచనమంతయు నా పర్యవేక్షణముననే జరిగినది. అనువాద సందర్భమున ప్రాణమునకు ప్రాణముగా తోడ్పడిన సుహృదయులు నా పతి దేవులు శ్రీ ఊటుకూరి హయగ్రీవ గుప్త Advocate గారికిని, అంత్యమున సుందర రూప సమంచిత రేఖాసముజ్జ్వలాకృతి నిర్మాణమునకై వలసిన విధమున తీర్చి దిద్దుటలో తమ బహుశాంధ్రోక్తిమయ సారస్వతాభిరతిని సాయమిచ్చి తోడ్పడిన పూజ్య సోదరులు డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, M. Sc. P. H. D. (బాపట్ల కళాశాలా ప్రధానాచార్యులు) గారికిని నేనెంతయు ఋణపడియున్నాను. ఇది అంతలింతల తీరు ఋణము కాదని నాకు తెలియును. అయినను చేయదగిన దేమున్నది ! వందనము లర్పించి యూరకుండుట తప్ప ?

ఈ మహా గ్రంథమును, ఈ మహోద్యమమును రసస్రష్టులగు ఆంధ్ర సోదరుల ఉదార హృదయ సన్నిధిని నివేదించుకొన సాహసించిన ఈ సోదరి సాహసమున ఏవేని లోపములు దొరలిన సాదరముతో మన్నింపుడని అంజలించు చున్నాను.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః
'సర్వేజనా స్సుఖినో భవంతు'

క్రోధి, ఫాల్గుణ శుద్ధ త్రయోదశి
సోమవారము - 15-3-65
బాపట్ల.

ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# వైదిక వాఙ్మయము

## మహిళా మంత్రదర్శినులు

రచయిత్రి :
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

పవిత్రమగు ఆర్ష సంస్కృతికి నిలయమై, సర్వోత్కృష్టమగు, ఆధ్యాత్మి కోపదేశ రూపమగు ఉపనిషద్వాణికి విహారభూమియై, సుస్నిగ్ధ ప్రౌఢ, గంభీరతా, మాధుర్యాది సకలగుణ సంశోభితమై, సర్వరస భావ ప్రకర్షా ధికమై, మానవతాదర్శ నిరూపక నిఖిల నిగమాద్యుత్కృష్ట సాహిత్య కేంద్రమై, ధర్మాధర్మ విచక్షణాధికార సమగ్రసంపుష్టమై, భారతీయ భాగ్య సౌభాగ్యరూపమై, సర్వమానవ హృదయపీఠాధిష్ఠాన యోగ్యా చార్య పదవీ నిష్ఠాత్మకమై, విశ్వవిశ్రుత ప్రఖ్యాతిగనిన సంస్కృతభాషయు, తత్సాహిత్యమును విశాల వసుంధరా భాషా సాహిత్యములలో పేరెన్నిక గన్నవి.

అనితరసాధ్యమైన గౌరవపదముచే సకలోర్వీతలమునకే తలమానిక మైన వేదవాఙ్మయ మీ భాష కలంకారప్రాయమేకాదు; గర్వకారణము కూడ. సాక్షాద్భగవదనుభవము కలిగిన మహాఋషుల తపఃఫల మీ వేద వాఙ్మయము ! ఆర్ష ప్రతిభా భాసమానమగు ఈ వేదవాఙ్మయమును మహిళాసూక్తదర్శినులు కూడ సమలంకరించియుండిరను విషయము జగ తికే గర్వకారణమైనది.

అఖిల భారతీయ వాఙ్మయముల యందలి మహిళా కవయిత్రుల మహిత సాహిత్యమును గూర్చి ప్రస్తావించు నీ మహోత్కృష్ట గ్రంథమున భారతీయభాషల కన్నింటికిని నాద్యభాషయైన గీర్వాణభాషయందు, అందును అతి విశిష్టమగు వైదికవాఙ్మయమున తపోమహిమతో మహిత ప్రాభవములతో మంత్రదర్శన మొనర్చిన మహిళాసూక్తదర్శినులను భక్తి

గౌరవములతో సంస్మరించి, గ్రంథారంభపూజా నమస్క్రియా కలాపమును నిర్వర్తించుట మనకు విహితమగు కర్తవ్యము.

మహోత్తమ ప్రాచీన భారతీయ నాగరికతా సంస్కృతులను దెల్పు ఋగ్వేదమును పరిశీలింపగా తేలిన సుమారు రెండువేల సంఖ్యకల మంత్ర ద్రష్టలగు మహాఋషులలో షుమారు ఇరువదినల్గురు; స్త్రీలై యున్నారని సంస్కృత వాఙ్మయ చరిత్రకారులైన కీ. శే. మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు పేర్కొనియుండిరి. వారు భాష్యమున గనవచ్చు నామము లను బట్టి కొలది భేదములు సవరించియిచ్చిన శ్లోకముల నీ క్రింద జూపు చున్నాను :

"ఘోధా ఘోషా విశ్వవారా పా లేపాం మ్మాత్మకర్షి కా
బ్రహ్మజాయా జుహూ ర్నామా అగ స్త్యస్య స్వసాదితిః.
లోపాముద్రా చ నద్యశ్చ యమీ నారీచ శశ్వతీ
శ్రీ ర్లాక్షా సార్పరాజ్ఞీ వాక్ శ్రద్ధా మేధాచ దక్షిణా
రాత్రీ సూర్యా చ సావిత్రీ బహ్మవాదిన్య ఈరితాః."

— "అపాలోపనిషన్నిషత్" అని పాఠము.

భాష్యములలోనున్న కొంద ఱిందులేరు' అని కూడా వారే తెలిపి యుండిరి.

ఋగ్వేదమున దశమ మండలముననే పదునార్గురు బహ్మవాదినులు కలరు. తక్కినవా రితర మండలములయందు కనబడుచున్నారు.

ఇది యిట్లుండగా రామకృష్ణ మఠమువారు ప్రచురించిన 'The Great Women of India' అను గ్రంథమును బట్టి చూడగా ఋగ్వే దము నందలి బ్రహ్మవాదినులనబడు సూక్తదర్శినులు (ఋఙ్మంత్రదర్శినులు) ఇరువదియెనిమిదిమందిగా నున్నారు. ఆ ప్రచురణమున వారు సూచించిన రీతిగా వారిలో 'అదితి, జుహూ, ఇంద్రాణీ, సరమ, ఊర్వశి, రాత్రి, సూర్య' అనువారు సంపూర్ణముగనో, కొలదిగానో దివ్యాంశకల పౌరా ణిక వ్యక్తులుగా కన్పట్టుచున్నారు. వీరుకాక 'శ్రీ, మేధ, దక్షిణ, శ్రద్ధ'

అనువారు భౌతికదృగ్గోచరముకాని అవ్యక్తభావనకు ప్రతిరూపములు. వీరుకాక మానవాంగనలై, బ్రహ్మవాదినులై వారి వారి పేరులతోనున్న సూక్తములకు నిజమైన రచయిత్రులైనవారు ఋగ్వేదమున తొమ్మిది పదిమంది కనబడుచున్నారు. వారు : విశ్వవార, అపాల, ఘోష, గోధ (వాసుక్రుని భార్య, అగస్త్యుని సోదరి), లోపాముద్ర, శశ్వతి, రోమశ మున్నగువారు. వీరితోబాటే 'వాక్' అనునామెను కూడా చేర్పనగును. ఈ సందర్భమున వీరినిగూర్చి వాడబడిన 'బ్రహ్మవాదిని' అను పదమునకు ప్రగాఢమైన ఆధ్యాత్మ నిష్ఠకలవారని మనము భావింపనక్కఱలేదు. ఏల యనగా ఈ మహిళా మంత్రద్రష్టలు పేర్కొనిన ఆ యా మంత్రములలో అత్యున్నతమగు బ్రహ్మజ్ఞానమును వారఖిలషించినట్లు కానవచ్చుటలేదు. అవి కేవలము వారువారు పూజించు ఇష్టదేవతల ప్రార్థనములుగను, తమ తమ జీవితములయందలి కష్టసుఖములను నివేదించుకొనునట్టివిగా మాత్రమే కన్పట్టుచున్నవి. అందువలన నిచట వాడబడిన 'బ్రహ్మ' యను పదమును అతి ప్రాచీనకాలమునాటి వైదికార్థముగా ప్రార్థనాపరముగా గాని, భక్తి పరముగా గాని తీసికొనవలసియున్నది.

## వాక్ :

ఋగ్వేదమున దశమ మండలముననున్న సుప్రసిద్ధమగు దేవీసూక్తమునకు 'వాక్' అను మహిళమంత్రదర్శినియై యున్నది. ఈ దేవీసూక్త కర్తృత్వవిషయమున అనుబంధ వైదిక సాహిత్యమున భిన్నదృక్పథము కలదు. ఈ సాహిత్యములయందు పేర్కొనబడిన విధానములను పరిశీలించినచో ఈ దేవీసూక్తదర్శినియగు వాక్ అంభృణిమహర్షి తనూజాతయగు 'వాగంభృణి' యను మహిళా మంత్రదర్శిని అనియు, ఈమె మానవియే యనియును ఒక వాదము సూచించును. "దేవియే (తానే) విశ్వము" అనెడు దేవీసూక్తగతాద్వైత సిద్ధాంతానుసారముగా "నేనే యీ సమస్త విశ్వమునకును కర్త్రిని, అఖిల జగద్ధాత్రిని, లయసంహారకర్త్రిని" అని యీ సూక్తమున పేర్కొనబడియుండుటచే ఈ 'వాక్' అను నామె మానవి

కాదనియు, వాగధిష్ఠాత్రియగు 'వాక్సరస్వతి' అనియు, లేక శబ్దబ్రహ్మ యనియు, లేక మూలతత్త్వమైన ఆదిశక్తి యనియు నొక వాదము సూచించుచున్నది. ప్రాచీన వైదిక సాహిత్యమునుబట్టి ఈమె మానవియైన సూక్తదర్శినియే యనియును, భారతీయ సంస్కృతి భావనానుసారముగా ఒక మహోత్తమ భావవివేకముకల మహిళా మంత్రదర్శిని యొక్క చైతన్య స్పందనాధిక్యమే యీ దేవీసూక్త మనియు మనకు తెల్లమగును.

ఈ సూక్తమును శక్తిపూజా ధురంధరులైన శాక్తేయులు తమ శక్త్యుపాసనా విధానమునకు ఋగ్వేదమునగల ఆది మూలాధార మనియు, మూలకంద మనియు పేర్కొందురు.

వాగ్దేవి తాను బ్రహ్మవాదినియై యిందు "తానే సర్వజగద్రూపము, సర్వాధిష్ఠాన"మని తన్నే స్తుతించుకొనెను. తాను వసురుద్రాది రూపమున సంచరించుచున్నట్లు వర్ణించుకొనెను.

*దేవీసూక్తమునందలి ప్రథమసూక్తము :*

"అహం రుద్రేభి ర్వసుభిశ్చరామ్యహ
మాదిత్యై రుత విశ్వదేవైః
అహం మిత్రా వరుణోభా బిభర్మ్యహ
మింద్రాగ్నీ అహమశ్వినోభా.

— ఋగ్వేదము దశమ మండలము (10. 125-1.)

సమస్తమగు బ్రహ్మాండముతో తన ఆత్మైక్యమును సంభావన చేయు ఈ సూక్తమున వ్యక్తముచేయబడిన గూఢమగు (సర్వము నేనై యున్నాను) అను ఆధిక్య ప్రకర్ష; బహుదేవతా విశ్వాసముకల ఋగ్వేద కాలమునాటికి కొంత వింతగా కనబడుచున్నది. ఆనాటికి ఇది కేవలము వినూతనమని చెప్పుటకును వీలులేదు. అద్వైత పద్ధతిలోనున్న 'హిరణ్య గర్భ', 'పురుష' మున్నగు కొన్ని ఇతర సూక్తములయందు కూడ ఈ భావమే విభిన్నరీతులలో వ్యక్తము చేయబడినది. అనేకత్వమున ఏకత్వ మును, విభిన్నత్వమున అభిన్నత్వమును అన్వేషించుట మానవులకు సహజ

లక్షణము. కాని యీ సూక్తము ఒక నిర్దిష్ట క్రమపద్ధతితోడి వేదాంత భావనతో వెలువరించబడినది కాక, సర్వాతిశయమైన, అంతఃప్రేరితమైన పూర్ణ భావావేశముతోడి ఆత్మవిశ్వాసముతో వెలువరింపబడిన వాక్కు. ఇందలి అంతఃప్రేరణతోకూడిన ఈ ఆత్మవిశ్వాసమే. శక్తిమంతమైన యీ సూక్తమునకు మహోన్నత విశిష్టతతో కూడిన అభిజ్ఞను చేకూర్చినది.

ఈ సూక్తమును వాగధిదేవతా ప్రోక్తముగా చిత్రించుట మూలముగా ఒక విదేశీయపండితుడు "అనేక మతములచే ఆమోదింపబడిన దివ్య విజ్ఞానము" అని అభివర్ణించుచు ఈ సూక్తమునకు సరియైన ప్రాధాన్యము నిచ్చెను. ఈ దృక్పథముతో పరికించినచో యీ సూక్తమునకు విశాలమైన, విశ్వవ్యాప్తమైన సత్తా నొసంగుటలో అసంభవమును, అసంగతమును ఏమియు లేదు. కావున ఇట్టి యీ సూక్తము శాక్తేయ సిద్ధాంతమున శక్త్యారాధనకు మూలముగా చేయబడుటలో వింత యేమియును లేదు. ఈ సూక్తదర్శినియగు మహిళ యెవరైనను ఆమె వైదికయుగమున నిస్సందేహముగా ఒక గొప్ప స్త్రీ.

విశ్వవార :

తక్కిన తొమ్మండుగురు మంత్రదర్శినుల సూక్తములలో మనకు ఇంత ఉన్నతభావము కాని, ఉన్నతానుభవము కాని అందదు. భగవత్సంబంధమైన ఉన్నతభావము లేకున్నను, యీ మహానుభావురాండ్రు తమ గృహసంబంధమైన తమ ఆనంద విషాదములకు ధారాళమైన భావుకతా రూపము నొసంగిరి. ఈ మంత్రములు కొద్దిపాటివైనను ఋగ్వేద కాలమునాడు స్త్రీ లధిగమించిన ఉన్నతస్థితిని తెలుపునంత ప్రాముఖ్యము నొందుటయే కాక, స్త్రీల అంతర్యమును సున్నితముగా ప్రదర్శించు చున్నవి.

అత్రికుటుంబమునకు చెందిన విశ్వవారయను సూక్తదర్శిని దర్శించిన ఆరు ఋక్కులుగల మంత్రసూక్తము ఋగ్వేదమున గలదు. వివాహితయైన విశ్వవార ఉషఃకాలమున ప్రజ్వలితమగుచున్న యజ్ఞాగ్నిని సమీపించి,

ప్రాఙ్ముఖులై, తమ వైవాహికజీవితము ప్రేమభరితముగా, సుఖమయముగా సాగిపోవుటకు ఆ వీతిహోత్రునుద్దేశించి యీవిధముగా స్తుతించును.

"సంపూర్ణముగ ప్రజ్వలించు నగ్ని ఆకాశమున కున్ముఖముగా, ఊర్ధ్వముగా, ఉదీచ్యభిముఖముగా, విశాలముగా యెంతోదూరము ప్రకాశించును గాక. కృతాంజలియై, దేవతలను స్తుతించుచు, ఉపహారములతో గరిటెనిండ వెన్న తీసికొని విశ్వవార ప్రాఙ్ముఖముగా సాగుచున్నది."

"బాగుగా ప్రజ్వలించు ఓ అగ్ని, నీవు అమరత్వమునకు అధిపతివి. నీకు నైవేద్యములను (బలులను) చెల్లించువారికొఱకు నీవు యోగక్షేమములను గొనివచ్చి వారి ననుసరించెదవు. ఎవరినైతే నీవు అనుసరించుచున్నావో ఆ అర్చకుడు (నిన్ను పూజించువాడు) ఓ అగ్ని, నీ సన్నిధానమున తన గౌరవ మర్యాదలను పచరించును."

"ఓ అగ్ని, మాకు శాశ్వత శోభనము, సుస్థిర భాగధేయము కల్గుటకై మా శత్రువులను అణచివేయుము. మహా ఘనత వహించిన నీవు మా కొఱకు ఐశ్వర్యమును గొనితెచ్చెదవు గాక! మా వైవాహిక జీవితమును పూర్తిగా నియమబద్ధము కావింపుము, మా శత్రువులపై నీ బలమును పూర్తిగా ప్రయోగింపుము."

భక్తిభరితమైన ఈ స్తుతివలన విశ్వవార యీ ఋఙ్మంత్రమునకు స్వయముగా సూక్తదర్శినిగా నున్నదను విషయమేకాక ఆమె తన సహజమగు స్వత్వము (హక్కు) గా యజ్ఞమునుకూడ చేసెననియు తెల్లమగుచున్నది.

**అపాల :**

ఋగ్వేదమున అష్టమ మండలమున (8-91) ఉట్టంకింపబడిన అపాల గాథ విచిత్రమైనది. ఈమెకూడ విశ్వవారవలె అత్రి కుటుంబమునకు చెందినదే. ఈమెకూడ వివాహితయే. అయినను చర్మవ్యాధిగ్రస్తయై అదృష్టహీనురాలైనది. ఆ చర్మవ్యాధిచే ఆమె శరీరమున ఎదుగుబాటు లేకుండెను. ఈ కారణమున భర్త ఆమెను విడిచిపుచ్చెను. ఏ విధమున నామె ఇంద్రుని

ప్రార్థించి తన దుర్భరవ్యాధినుండి విముక్తురాలైనదో ఆ విషయమే ఆమె సూక్తమున కితివృత్తము. ఈ గాథ అత్రికుటుంబ గాథలలో కాక ఋగ్వేద మున అష్టమ మండలమున వివరింపబడియున్నది.

ఇంద్రునకు సోమరసము ప్రీతికరమైనదని తెలిసి అపాల నీళ్లు తెచ్చు టకు వెళ్లుచు దారిలో సోమలతను పెరికి తన పండ్లనడుమ నిరికించి ఇంద్రుని కొఱకు రసము తీయదొడంగెను. ఇంద్రు డా చప్పుడువిని వచ్చి "యజ్ఞా ర్థమై గ్రావములతో సోమలతను చితుకగొట్టుచున్నారా ?" అని యామె నడిగెను. అంత నామె :

"ఒకకన్య నీరు దేబోవుచు దారిలోనున్న సోమలతను చూచి తిరిగి యింటికి వెళ్లునపుడు 'నేను దీనిని ఇంద్రునికొఱకై నమలుచున్నాను. శక్రునికొఱకు నమలుచున్నాను' అని పల్కెను."

"ఎవడవు నీవు ! గొప్పవారి వేషము వేసికొని ఇంటింటికి సోమము కొఱకు తిరిగెడివాడువలె నున్నావు. ఇటురా, వచ్చి నా నోటిలో నున్న ఈ సోమమును త్రాగుము. వేయించిన ధాన్యములతోడను, రొట్టెతోడను, స్తోత్రపాఠములతోడను కలిపి నా నోటనున్న ఈ సోమ మును త్రాగుము. 'ఓహో! ఇంద్ర! నీవు (నన్ను కాపాడుటకు వచ్చిన) ప్రభుడవా ! అయ్యో నేనెఱుగనైతిని. ఓ సోమరసమా ! ఇంద్రుని కొఱకు స్రవింపుము. ఇంకను మెల్లగా స్రవింపుము.

'చాలామార్లు ఇంద్రుడు మమ్ము బలవంతులను చేయునుగాక. చాలామార్లు ఇంద్రుడు మాకు ఐశ్వర్యము నిచ్చునుగాక.

పమ్యాభావముతో తిరుగు భర్తతో ఇకమీదట ఇంద్రు నాశీర్వచన ముచే తిరిగి కలిసికొందును గాక.'

'ఓ ఇంద్రా ! నా తండ్రిశిరమున కేశపాశమును, నా తండ్రి పొల మును, నా అవయవములును బాగుగా ఎదుగునట్లు చేయుము. బీడుగా నున్న మా పొలమును సారవంతము చేయుము.'

'రథచక్రము రంధ్రమున, కాడి సందున, రథముసందున మూడు

మార్గు త్రిప్పి నీవు అపాలను (నన్ను) శుద్ధపఱచి, (రోగ విముక్తురాల నొనర్చి) సూర్యునివలె ప్రకాశించు వైభవోపేతమగు శరీర సౌభాగ్యము నొసంగితివి'. "

ఘోష :

ఈ మహిళా మంత్రదర్శిను లందఱకంటె ఘోష దర్శించిన మంత్రములు చాలా కలవు. ఋగ్వేదమున దశమ మండలమున పూర్తిగా రెండు సూక్తములు ఘోష దర్శించిన మంత్రములే. అందొక్కొక్క మంత్రమునకు పదునాల్గు ఋక్కులు గలవు. ఈమె గొప్పగొప్ప మంత్రద్రష్టల కుటుంబమునకు చెందినది. ఈమె తాత దీర్ఘతమస్సు, ఈమె తండ్రి కాక్షీవతుడును అనేకములగు అశ్వినీదేవతా స్తుతిమంత్రములకు ద్రష్టలు.

ఇంత పెద్దవంశమున పుట్టినను శ్వేతకుష్ఠువుచే పీడితురాలగుటచే నవివాహితగానే తండ్రి యింటనుండి పోయి, వయసుమీరినదై పోయెను. ఆమె తాత తండ్రులచే పూజింపబడిన అశ్వినీదేవతలనే ఆమె తన యీ సూక్తద్వయమున నుపాసింపగా అశ్వినీదేవతలు కరుణించి, రోగ విముక్తురాలి నొనర్చి యామెకు వివాహోన్ముఖతను ప్రసాదించిరి. ఈమె దర్శించిన మంత్రముల తర్వాత ఈమె కుమారుడు సుహస్త్యుడు దర్శించిన మంత్రము కలదు. ఘోష దర్శించిన ప్రథమసూక్తమున గ్రుడ్డివారికి, బలహీనులకు, రోగపీడితులకును ఆయా బాధలనుండి విముక్తిని ప్రసాదించి, లోకమునకు అశ్వినీదేవత లొనర్చిన సహాయమును వర్ణించెను. రెండవసూక్తమున ఘోష తన స్వీయాభిరతిని, అభీప్సితమును వెలిబుచ్చెను. ఇది చాలా పెద్దది. కాని తన రోగవిముక్త్యనంతరము జరిగిన వైవాహిక జీవితానుభవమునందలి ధన్యత్వమును, ఆనందమును వర్ణించిన యీ క్రింది సూక్తములను కొన్నిటిని గాంచుడు :

"స్త్రీ పుట్టినది. వాంఛాయుతలగు కన్యలను ఆతడు కలియునుగాక.
ఆతనికొఱకు లతకూనలన్నియు వర్షముచే ప్రవృద్ధము నొందునుగాక.
సెలయేళ్లన్నియు నాతనికొఱకు ఇచ్ఛాపూర్వకముగ పల్లమునకు పారునుగాక.

అజేయుడైన అతనికొఱకు భర్తృత్వపు హక్కు లన్నియు నిరీక్షించునుగాక.

తమ జీవితము సుఖము (తమకు జీవితమున సౌఖ్యము కల్గించు భార్యల) కొఱకు ఎవరేడ్తురో, ఎవరు యజ్ఞములలో వారికి (తమ సహచారిణులకు) స్థానము నిత్తురో,

ఎవరు తమ కాంతలను దృఢాలింగనములలో బంధింతురో,

ఎవరు తమ తల్లిదండ్రుల (పున్నామ నరకమునుండి తప్పించు) కొఱకు సంతానము నర్థింతురో అట్టి భర్తలకు భార్యలు తమ ఆలింగన సౌఖ్యము నొసంగుదురు గాక."

"ఓ అశ్వినులారా! అట్టివారి జీవితసౌఖ్య మెట్టిదో మేమెఱుంగము. యువతుల ఇండ్లయందు యువకు లెందులకై తచ్చాడుదురో—

ఏ పురుషులు ఆసక్తికలవారై (గార్హస్థ్యధర్మరతులై), బలవంతులై, శౌర్యధనులై యుందురో, అట్టి పురుషుల యిండ్లకు మేము వెళ్ల గోరుదుము."

"ఓ అశ్వినులారా, నిండైన, పుష్టికరమైన నీ శుభాశంస (శుభాశీస్సు) మా యెడల ప్రసన్నమగుగాక. మా హృదయముల యందలి వాంఛలను నీవు నియమబద్ధము చేయుదువుగాక.

ఓ అమడలారా, మీరు మా సంరక్షకులుకండు. మా యోగక్షేమములకు మీరు యజమానులు కండు. మా భర్తలచే ప్రేమింపబడిన వారమై మేము మా భర్తృగృహములను చేరుకొందుముగాక."

## తక్కిన మంత్రదర్శినులు :

మిగిలినవారు సూక్తములను పూర్తిగా దర్శించినవారు కాదు. ఆ యా సూక్తములలో కొన్ని ఋక్కులను మాత్రమే వారు దర్శించి యుండిరి. ఋగ్వేదమున దశమమండలమునగల (10-134) అయిదున్నర

ఋక్కులు మాంధాత్రి కర్తృకములు. ఇవి ఇంద్రస్తోత్రములు. మిగిలిన ఆరవ ఋక్కుసగమును, ఏడవ ఋక్కును 'గోధా' కర్తృకము. ఇందు ఇంద్ర విశ్వేదేవుల స్తోత్రము తప్ప ఇంక హెచ్చుగా చెప్పవలసిన దేమి యును లేదు. పేరు ప్రస్తావింపబడని వాసుక్రపత్ని భార్య; ఋగ్వేదమున (10-28) గల ఇంద్రస్తోత్రమున ప్రథమ ఋక్కునకు వక్త్రి. ఈ సూక్త మున నింకొకభాగమున కీమె భర్త మంత్రద్రష్టయై యున్నాడు. పేరు తెలియని అగస్త్యసోదరి (10. 60-6) మంత్రమున ఒక ఋక్కునకు కర్త్రి. తక్కిన మంత్రమున కంతకును ఆమె కుమారులు గౌపాయనులు ద్రష్టలు. ఈ మంత్రమున నామె ఇక్ష్వాకువంశమునకు చెందిన 'అసమాతీ ప్రభునకు' తన కుమారుని సహాయార్థమై రమ్మని యొక వీరాహ్వానము నంపెను.

"ఓ ప్రభూ, అగస్త్యుని మేనల్లునికొఱకు నీరథమునకు ఎఱ్ఱని గుఱ్ఱము లను పూన్చి విచ్చేయుము. పూజలు చెల్లించనివారిని అణచివేయుము" అని.

ఈ అంశమునుబట్టి పరిశీలింపగా యుద్ధవీరలైన, క్రీడాప్రియలైన స్త్రీలకు ఋగ్వేదకాలమున కొదువలేదని తెలియును. ఖేలునిభార్య విష్పల, ముద్గలునిభార్య ముద్గలానియు యుద్ధవిశారదురాండ్రైన వీరవనితలే. అయితే వారు మంత్రదర్శినులు కారు.

లోపాముద్ర, శశ్వతి, రోమశ అను నీ ముగ్గురి నిర్మాణములైన మంత్రములు పై మంత్రమునకు విభిన్నముగా నున్నవి. తమ తమ భర్తలు మహాఋషులగుటచే వారి ఆలింగన సౌఖ్యమునకైనను నోచుకొనని తమ హృదయావేదనను దాచుకొనకుండ ధారాళమైన ప్రవాహమువలె పొంగులువారు కవితావేశముతో వీరు చక్కగా ప్రదర్శించిరి. అగస్త్యుని భార్యయగు లోపాముద్ర సూక్తద్వయదర్శిని. (1. 179-1, 2.) ఈ ఋక్కులు ప్రణయాంకితములై ఆమెకును, ఆమె భర్తయగు అగస్త్య మహర్షి కిని నడుమజరిగిన వింతసంభాషణను దెల్పుచున్నవి. కఠిన తపశ్చర్యలచే అలసిపోయెడు తన భర్తకు చిరకాలము పరిచర్యలు సల్పి సేవించుటలో, తనను నిర్లక్ష్యము చేయబడినదానినిగా తలపోసి, కడకు ఒకింత తన సహా

నము సడలగా, తన భర్తృసన్నిధిని ఆతని ప్రణయసాహచర్యముల నర్థించి యొనర్చిన విన్నప మీ క్రింద నీయబడుచున్నది :

"కడచిన పెక్కువత్సరములనుండి, రేయింబవళ్లును, ఉదయవేళల యందును నీకు పరిచర్యలు సల్పి, నాకు నేనై అలసిపోయితిని. నా శరీర సౌందర్యము క్షీణించిపోవుచున్నది. ఇంక ఏమికలదు ? భర్తలు తమ భార్యలను సమీపింతురుగాక ! (సమీపించు సుదినము సంప్రాప్తించును గాక !)"

"సత్యతత్త్వమును పొందిన, దేవతలతోడనే సత్యతత్త్వమునుగూర్చి చర్చించిన, ప్రాచీనులగు మహాఋషులు (కూడ) తమ తపస్సులకు భంగము వాటిలకుండ సంతానమును పొందిరి. కావున భార్యలు తమ భర్తల నుప సర్పింతురుగాక !"

ఈ కడపటి ఋక్కునుబట్టి పరిశీలింపగా లోపాముద్ర ప్రార్థన వ్యర్థము కాలేదని తెలియుచున్నది. ఈ ప్రార్థనానంతరము అగస్త్యుడు తన ఆర్ష విధులను, గార్హస్థ్యవిధులను తమ దంపతులలో ఎవరికిని నిర్లక్ష్యము కలుగ కుండునట్లుగా సమాన శ్రద్ధతో నిర్వహించెను.

'నారీ' - శశ్వతి :

నారీ అని పిలువబడిన శశ్వతియు తన భర్తయొక్క నపుంసకత్వము పోయి ఆయనకు పురుషత్వము సమకూరినపుడు తాను పొందిన అత్యంతా నంద పారవశ్యమును 179 - 6 వ సూక్తమున చక్కగా వర్ణించెను.

సూర్య :

ఇట్లే సూర్యయు తన వివాహ సందర్భమైన వైభవమును ఉజ్జ్వలా వేశముతో వర్ణించెను.

రోమశ :

భావయావ్య మహారాజు భార్య రోమశ; తాను ఆలస్యముగా ఋతుమతి యగుటచే తాను ప్రథమ పర్యాయము ఋతుమతియైనపుడు

తాను పొందిన అతిశయానందమును వ్యక్తముచేయుచు, తనతోడి పొందును బడసి సౌఖ్యానందముల ననుభవింపుమని భర్తను సవాలుచేయును.

అమాయికమైన, నిష్కల్మషమైన స్త్రీయొక్క మనోభావ, మనో వికారములకుకూడా మన యీ పవిత్ర మతగ్రంథములలో స్థానములభించుట గమనార్హము.

## ఉపనిషద్వాఙ్మయము నందలి మంత్రదర్శినులు

**మైత్రేయి :**

శ్రుతిశిరములై, అత్యున్నత బ్రహ్మజ్ఞాన ప్రస్ఫోరకములగు ఉపనిషత్సాహిత్యములయందు యాజ్ఞవల్క్యుని భార్యయైన మైత్రేయియు, యాజ్ఞవల్క్యుని ప్రతివాదినియగు గార్గియు నిజమైన సత్యతత్త్వాన్వేషకు రాండ్రైన బ్రహ్మవాదినులుగా కన్పట్టుచున్నారు. ఈ ఇద్దరు మంత్ర దర్శినులను గూర్చి బృహదారణ్యకోపనిషత్తు చాలా వివరముగాను, చక్కగాను పేర్కొనియున్నది.

ఆనాటి ఉత్తమ ప్రబోధకుడైన యాజ్ఞవల్క్యుడు మహాజ్ఞానియైన గృహస్థ ఋషిసత్తముడు. ఆయన ఒకప్పుడు ఈ సంసారమును త్యజించి అరణ్యములకు వెళ్లి అమృతత్వాన్వేషణము నొనర్పదలంచి తనభార్యలైన మైత్రేయీ, కాత్యాయనుల కిర్వురకును తనయింటియందలి ధనవస్తు వాహ నాదులను పంచిపెట్ట దొడంగెను. అపుడు మైత్రేయి భర్తతో : "స్వామీ, ఈ ధనరాశితో నిండియున్న యీ ప్రపంచము నాకు స్వాధీనమై, నాదైన చో (నీవు అన్వేషింపబోవు) అమృతత్వము నాకు సిద్ధించునా ?" అని అడిగెను. "లేదు. అందఱు ధనవంతుల జీవితమువలెనే నీ జీవితమును అగును" అని యాయన బదులిడెను. అపుడామె తిరిగి "యేనాహం నామృతాస్యాం కింతేనమమ ?" (నాకు అమృతత్వము ప్రసాదింపని ఈ సంపదలతో నాకేమి పని ?) అని ప్రశ్నింపగా యాజ్ఞవల్క్యుడు సంతోషించి యామెకు గృహ జీవితమునందుండగనే అమృతత్వము నొసంగు బ్రహ్మవిద్య నుపదేశించెను.

గార్గి :

గార్గి గొప్ప బ్రహ్మజ్ఞానముకల మహావిజ్ఞానిని, మహాపండితురాలు! ఈ సమస్త జగత్తునకు సత్తామాత్రమైన పరబ్రహ్మ తత్త్వమునుగూర్చి జనకునాస్థానమున జరిగిన పండిత చర్చయందు యాజ్ఞవల్క్యుని అతిసాహసముతో ప్రశ్న పరంపరలతో ముంచెత్తెను. ఈ గార్గీ-యాజ్ఞవల్క్యుల అతి సుదీర్ఘ సంవాదములు బృహదారణ్యకమున నున్నవి. ఈ వివాదమున గార్గి క్రమ క్రమముగా మఱింత పై స్థాయి ప్రశ్నలువేయగా, యాజ్ఞవల్క్యుడు "ఓ, గార్గీ, ఇంక ప్రశ్నింపకుము. (అడుగకూడని విషయములను గూర్చి ప్రశ్నించిన) నీతల పగులును." అని హెచ్చరించునంతవఱకు ఆమె యా బ్రహ్మవేత్తను ప్రశ్నింపగలిగెను.

గార్గి : గార్గితి, "కస్మిన్నుఖలు బ్రహ్మలోకా ఓతాశ్చ, ప్రోతాశ్చేతి"

యాజ్ఞవల్క్యః : 'సహోవాచ గార్గి! మాతి ప్రాక్షీ, ర్మాతే, మూర్ధా వ్యపప్తదనపిశ్న్యాం వై, దేవతామతిపృచ్ఛసి. గార్గి, మాతి ప్రాక్షీః' అని యాజ్ఞవల్క్యుడు హెచ్చరించునంత ప్రజ్ఞాసామర్థ్యములు గార్గికి కలవని ఈ ఘట్టము మనకు తెల్పును. ఇంతగా యాజ్ఞవల్క్యుడు హెచ్చరించిన తరువాతనే గార్గి ఆతని నడుగుట విరమించెను. ఈ సందర్భమున శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"తతోహ గార్గీ వాచక్నవ్యుపరరామ." అని

తరువాత మఱల గార్గి ఇంకొక సందర్భమున గార్గి యాజ్ఞవల్క్యుని బ్రహ్మతత్త్వ నిరూపణ విషయముననే ప్రశ్నించెను. తుదకు యాజ్ఞవల్క్యునకీడగు బ్రహ్మవేత్త మరి యెవ్వరును లేరను ప్రకటనను కూడ జనకుని నిండు కొలువున గార్గియే చేసెను. తనభర్తయగు మండన మిశ్రునకు, జగద్గురు శంకరాచార్యులకును నడుమ జరిగిన వాదమున న్యాయాధిపురాలుగ నుండిన ఉభయభారతియు సత్యధిక ప్రజ్ఞావంతురాలే.

విదేహు నాస్థానమున "నాకు నెనయైన పురుషుండు లేక యునికి" నేను అవివాహితగా నుండి పోయితినని ప్రకటించిన, సులభ, తత్త్వవేత్రి

యగు వృద్ధ గౌతమియు, భర్తకు పరతత్త్వోపదేష్ట్రియగు గుర్వీగా విరాజిల్లిన **చూడాలయు**, తన కుమారులకు జ్ఞానోపదేశ మొనర్చిన మదాలసయు నిట్టి శ్రేణికి చెందినవారే.

ప్రాచీన భారతవర్షమున నిట్టి ప్రతిభావంతురాం డ్రసంఖ్యాకలుగా నుండుట విజ్ఞులైన వారెటింగిన యంశమే.

# సంస్కృత కవయిత్రులు

మూలము :
డా. వి జ య రా ఘ వ న్,
M. A. Ph. D.
మద్రాసు.

అనువాదకురాలు :
బత్తుల కామాక్షమ్మ,
ప్రిన్సిపాలు,
ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల,
రాజమండ్రి

సంస్కృత ప్రాకృత వాఙ్మయచరిత్ర కేవలము, సంస్కృత ప్రాకృత వాఙ్మయౌన్నత్యము తెలుపుటయే కాక, ఉన్నత విద్యా సంస్కృతులు పొందిన స్త్రీల యొక్కయు, సమాజమునందును, విద్యావైదుష్యములు కల నాగరక వర్గములయందును తమ ప్రతిభాసామర్థ్యములచే ఉత్తమ పదము లలంకరించిన స్త్రీలయొక్కయు చరిత్రల నుల్లేఖించుటచేత కూడా అద్వితీయ స్థాన మధిష్ఠించియుండెను. ప్రాభవమందిన గొప్ప నాయికల యొక్కయు, పాండిత్య వైభవముచే నద్వితీయస్థానము నందిన స్త్రీల యొక్కయు, లలితకళలలో ప్రావీణ్యమునొందిన స్త్రీలయొక్కయు, హైందవ ధర్మములకు మూర్తులనదగు మహానుభావురాండ్ర యొక్కయు చరిత్రోల్లేఖనమే కాక సాహిత్యరంగమున ప్రవేశించి కవిత్వము చెప్పి, కావ్యములల్లి ప్రశంసింపదగిన ఉన్నతస్థానములను పొంది స్థిరమైన యశో విజయముల నార్జించిన కవయిత్రులు, రచయిత్రుల ప్రశస్తి ఈ చరిత్రకొక విశిష్టాలంకారము. గద్య, పద్య రచనయందు అగ్రగణ్యులైన బాణ, కాళి దాసాదులతో సమానమైన రచనము నొనర్చి, సముచిత విమర్శకులచే ప్రశంసింపబడుట, స్త్రీ సంఘముపట్ల ఏమాత్రమును కొంచెము గౌరవము కాదు.

ఇట్లధిక ప్రతిభావంతురాండ్రైన ఆ స్త్రీలలో కొందఱు సాహితీ పరులైన తమ భర్తల రచనోద్యమమున ధారాళముగ పాల్గొని, తాము నిర్వహించిన సమున్నతపాత్రచే గౌరవ ప్రతిష్ఠలు కల జీవిత భాగస్వామిను

లుగా తమ భర్తల జీవితముల కెట్టి ఆనందోత్సాహములు కల్గించిరో మనము తెలిసికొనగలము. సుప్రసిద్ధ కావ్య మీమాంసాకర్తయైన రాజశేఖరుని జీవితమునందువలె అట్టి అత్యధిక ప్రతిభావంతుడైన భర్తచేతకూడా పొగడ దగిన రచన, విమర్శనచేయగల భార్యనుకాని, స్వయంభూ జీవితమునందు వలె భర్త (విశ్రాంతి తీసికొనినపుడు) వదలిపెట్టిన అధ్యాయములను మధ్య మధ్యలో రచింపగల భార్యనుకాని, వాక్పతి, రత్నఖేట శ్రీనివాస దీక్షితుల అనుభవమునందువలె భర్తయొక్క అమూల్య కాలము వృథా కాకుండునట్లు ప్రత్యర్థి కవులను, విద్వాంసులను సమాధానపఱచి పంపగల భార్యనుగాని కల్గియుండుట అనునది నిజముగా ఒక గొప్ప అసాధారణా దృష్టమే కాక, అత్యంతానందప్రదము కూడ. విద్యా ప్రమాణములును, సాహిత్యావకాశములును, సామాన్య సంఘమునందు తగినంత ఉచ్చస్థితిలో నుండనిచో ఇట్టి కవితాకుసుమములు సాహిత్యోద్యానమున వికసించుటయు, సౌరభములను వెదజల్లుటయు ననునది నిజముగా సాధ్యపడనేరదు. ఈ మహనీయ కవయిత్రులయెడ గావింపబడిన ప్రస్తుతి ఎంత ఉదారముగా నున్నదనిన; ధనదేవుడనెడి వ్యక్తి ఈ ప్రస్తుతియెడ ఈర్ష్యాళువై "స్త్రీలు కవిత్వమల్లిన నల్లవచ్చును. కాని పురుషులు మాత్రమే పండితచర్చలకు, విద్వద్గోష్ఠులకును సమర్థులైనవారు" అని ఆత డనుభవించినబాధ పైకి వెళ్ల గ్రక్కదగినంత హెచ్చుగానుండెను.

(१) शीला विज्जा मारुला मोरिकाद्या : काव्यं कर्तुं सन्तु विज्ञा:-स्त्रियोपि ।
विद्यां वेत्तुं वादने निर्विजेतुं दातुं विध्यां य: प्रवीण: सवंद्य: ॥

కాని క్రింది విషయములను పరిశీలించినచో స్త్రీలు శాస్త్రములలో చర్చాదులలో కూడ పురుషులతో సమానమైన అపార పాండిత్యము కల వారై పొల్గొనినట్లు తెలిసికొనగలము.

## విజ్జిక :

పూర్వసాంప్రదాయ కావ్యరచనా యుగమునందలి కవయిత్రుల పరంపరకు విజ్జిక, విద్యా, విజయ, విజయాంక అను పేర్లతో ప్రసిద్ధురాలైన

కవయిత్రీమణి ప్రథమురాలుగా కన్పట్టుచున్నది. సంస్కృత సారస్వతము నందలి విభిన్నవ్యక్తుల రచనలను సంపుటీకరించిన సంస్కృత కావ్యమాలా సంపుటములలో కవయిత్రుల రచనలని చెప్పబడు శ్లోకములలో పై పేర్లుగల కవయిత్రియొక్క ఉత్తమశ్రేణి రచనములు ఎక్కువసంఖ్యలో కనబడు చున్నవి. "సూక్తిముక్తావళి, సుభాషితావళి, సదుక్తి కర్ణామృతమ్" అను ఈ కావ్యమాలా సంపుటములు వారి రచనలను కనుగొనుట కాధారములై యున్నవి. వారి రచనలు ఎప్పుడో నశించినవనియే చెప్పవలెను. రాజ శేఖరుఁడీ విజ్జికను గొప్ప కవయిత్రిగా ప్రశంసించుటయే కాక, రమణీయ మైన శైలిలో (వైదర్భీరీతిలో) రచన చేసిన మహాకవి కాళిదాసు తర్వాతి స్థాన మలంకరింపదగిన దీమె యొక్కతెయే అని కూడ ప్రస్తుతించెను.

"सरस्वतीव कर्णाटी विजयांका जयत्यसौ।
या वैदर्भी गिरां वासः कालिदासादनन्तरम् ॥"

ఈ వాగ్దేవి దక్షిణ భారతమునందలి కర్ణాట దేశస్థురాలని తెలియు చుండుట వలన ఈమె చంద్రాదిత్యుని భార్య యనియు, రెండవ పులకేశి కోడలనియు, 7వ శతాబ్ద మధ్యకాలపు శాసనముల మూలముగా నూహింప బడుచున్నది. ఇదికాక ఆమె కర్ణాటదేశస్థురా లనియు, ప్రతిభావంతురా లనియు తెల్పు ఆధారములు మఱి రెండు కలవు. ఈ యాధారముల కాధారమైన శ్లోకములలో ఆమె తన యద్వితీయ కవితాప్రతిభను తానే గుర్తించినట్లు కూడ స్పష్టపఱచెను. దండి మహాకవి సరస్వతీదేవి శ్వేతవర్ణ యని వర్ణించిన స్తోత్రమును గూర్చి పేర్కొనుచు ఆమె యొక శ్లోకమున 'విజ్జికను, నన్ను చూడకపోవుటచే సరస్వతి తెల్లని' దని దండి వర్ణించినాడు అను నర్థము వచ్చు ఈ క్రింది శ్లోకమును రచించెను.

"नीलोत्पलदलश्यमां विज्जिकां मामजानता।
वृथैव दंडिना प्रोक्ता सर्वे शुक्ला सरस्वती॥"

ఇంకొక శ్లోకమున విజ్జిక, బ్రహ్మ, వ్యాస, వాల్మీకులు మాత్రమే గౌరవింపదగిన గురువులు, కవులు నగుదురనియు, తక్కినవారు ఊరక

వినోదముకొఱకు గద్య, పద్యములు వ్రాసెడు వారనియు, వారి తలపై కర్ణాటరాజప్రియయైన తాను తన ఎడమకాలి నుంచెదననియు చెప్పెను.

"एको भून्नलिनात्ततश्च पुलिनाद्वल्मीकतश्चापरः
ते सर्वे कवयो भवन्ति गुरवः तेभ्यो नमस्कुर्महे।
अर्वान्चो यदि गद्य पद्य रचनैः चेत श्चमत्कुर्वते
तेषां मूर्ध्नि ददामि वाम चरणं कर्णाट राज प्रिया ॥"

సుకుమారమైన సూక్ష్మభావ చిత్రణతో తీవ్రమైన భావములను గాఢముగా (హృదయమునకు హత్తుకొనునట్లు) వర్ణించుట యందును, ఆనందప్రదమైన కవితా శిల్పసౌందర్యము ప్రదర్శితమగునట్లు వర్ణించుట యందును ఈమె సంస్కృత కవులలో అగ్రశ్రేణి కవయిత్రి యని ఈ క్రింది మూఁడు నిదర్శనములను బట్టి చెప్పవచ్చును.

"विलास मसृणोल्लस न्नृप ललाम दोः कन्दली
परस्पर परिस्खलद्वीविथनिःस्वनोन्द्धधुरा :
लसन्ति कलहुङ्कृति प्रसभ कम्पितोर : स्थली
लटद्गमक संकुलाः कलमखंडिनी गीतयः ॥"

ధాన్యమును నురిపిడిచేయు స్త్రీలయొక్క ఈ యద్భుత వర్ణనలో ఊతము సంగీతము కవితాప్రయోజనమును సిద్ధింపజేయుచు ప్రతి చరణము నుండియు ప్రతిధ్వనించుచుండును.

"प्रियसखि! विपद्दंड प्रपात परंपरा
परिचयचले चिन्ताचक्रे निधाय विधिः खलः
मृदमिव बलात्पिण्डीकृत्य प्रगल्भ कुलालवत्
भ्रमयति मनो नो जानीमः किमत्र विधास्यति ॥"

ప్రగల్భుడైన కుమ్మరి మట్టిని కొట్టి కొట్టి నలిపి నలిపి ముద్దచేసి చక్రముపై పెట్టి త్రిప్పినట్లు ఖలుడైన విధి విపత్తు అను దండముతో కొట్టి కష్టపరంపరయందు పడవైచి చింతాచక్రముపై పెట్టి మనస్సును త్రిప్పి త్రిప్పి పడవేయుచున్నాడు. ఇంకను ఏమి చేయనున్నాడో తెలియదు:

"कवेरभिप्राय मशब्दगोचरं स्फुरंतमार्द्रेषु पदेषु केवलं
वदद्भिरंगैः कृतरोम विक्रियैः जनस्य तूष्णींभवतोय मंजलिः"

ఈ శ్లోకమున భావము శబ్దమునందుకంటె అర్థము నెట్లాశ్రయించి యుండునో సోదాహరణముగ చూపబడినది. ఉదాహరణమునందు కూడ ఒక "రసికునియొక్క గగుర్పాటుకు చెందిన శరీరమును వర్ణించుట ద్వారానే భావమును వ్యక్తీకరించెను. కాని పదజాలముతో కాదు.

గ్రంథకర్త పేరు తెలియని 'కౌముదీ మహోత్సవము'ను ఏతత్ కర్తృకమని కొందరు విజ్ఞులు చెప్పుచుండిరి. కాని ఈమె కర్తృత్వమును బలపఱచుటకు చాలినంత యాధారములు కన్పట్టవు. కొందఱు విజ్జిక, విజయాంక, విజయ అను నీ పేర్లుగల కవయిత్రు లిర్వు రుండిరని యందురు.

వికటనితంబ :

రెండవ ప్రసిద్ధ కవయిత్రి 'వికటనితంబ'. ఆమె రచన పరిపూర్ణ మాధుర్యముతో తొలుకాడు చుండునని రాజశేఖరుడు చెప్పియుండెను. ఆ యా ప్రేమసంఘటనలయందలి యామె రచన సహజముగను, స్వేచ్ఛా యుతముగను గన్పట్టును. భోజుని 'శృంగారప్రకాశిక'ను బట్టి యామె స్వేచ్ఛాజీవితమును గడపెనా? యని భావించుట కెడము గన్పట్టుచున్నది. ఆమె స్నేహితురాలిచే ఉదాహృతమైన యీ క్రింది శ్లోకమును చదివినచో ఆమె పరిస్థితి కరుణాజనకమైన దనియు, దురదృష్టదేవత ఆమె పాలబడిన దనియు తెలిసికొనగలము. ఈ కవయిత్రికి ఎట్టి నిరక్షరకుక్షి భర్తగా విధింపబడెనో, ఆమె ఆతనితో నెంత బాధపడెనో ఊహించుటయు కష్టమే. "ఆతనికి (వికటనితంబ భర్తకు) దంత్యము, తాలవ్యము, ఊష్మము, ఓష్ఠ్యముల ఉచ్చారణభేదమే తెలియదు. మూఁడు సంయుక్తాక్షరములు కల అక్షరము నుచ్చరింపవలసివచ్చుచో అందేదోయొకధ్వనిని ఆతడు నోట బట్టక విడిచివేయు" నని యామె స్నేహితురాలొక శ్లోకమున తెలిపియుండెను.

विकटनितंबायाः पति मनुकुर्वाणा सखी प्राह
कालं माषं सस्ये वदति शकाशं चयश्च संकाशम्
उष्टे लुंपति रं वा षं वा तस्मै दता विकट नितंबा ।

శీలాభట్టారిక :

"మూడవ కవయిత్రియైన 'శీలాభట్టారిక' రచన బాణుని రచనముతో పోల్పదగినది. ఈమె పేరునందు భట్టారిక యని చేర్చబడుట వలననీమె గౌరవ ప్రపత్తికల స్త్రీ యని భావింపనగును. ఈమె కవిత్వమున బాణుని భావ వ్యక్తీకరణపద్ధతి కన్పడును. తగిన తూకముకలశైలి. శబ్దార్థముల పరస్పర మేళనము బాణునియందువలె నీమెయందు భాసించును." అని రాజశేఖరుడు చెప్పెను. ఆమెయొక్క ఈ క్రిందిశ్లోకము :

"శబ్దార్థయోః సమోగుంఫః పాంచాలీ రీతిరుచ్యతే
శీలాభట్టారికా వాచి బాణోక్తిషుచ సర్వతి."

చాలా ప్రసిద్ధమైనది. కవిత్వసంబంధమైన ప్రతిగ్రంథమునందును ఈ శ్లోకము లుట్టంకింపబడును. ఈ కవయిత్రి "నియమపూర్వకమైన సామాన్య వివాహముచే ప్రేమ అణచివేయబడు ననియు, పూర్వపు ప్రేమికుడే వరుడైనను మనస్సు నదీతీరములయందే విహరించుననియు వర్ణించిన ఈ క్రింది శ్లోకమును గాంచుడు :

यः कौमारहरः स एवहि वर स्ताएव चैत्र क्षपा :
ते चोन्मीलित मालती सुरभय : प्रौढा : कादम्बनिला :
सा चैवास्मि तथापि तत्र सुरतव्यापार लीला विधौ
रेवा रोधसि वेतसी तरुतले चेत : समुत्कण्ठते ।

భావవ్యక్తీకరణమునందలి నైపుణికి రాజశేఖరునిచే మిక్కిలిగా ప్రశంసింపబడిన కవయిత్రి సుభద్ర. సంస్కృత కావ్యమాలలో (Anthoolgy) అన్యాపదేశపూర్వకమైన ఆమెశ్లోకము నొక్కదానినే ఉదాహరించిరి. ఇందు ఆమె పాలయొక్క దుస్థితిని చక్కగా వర్ణించెను. "స్నేహశీలమైన ప్రవృత్తి యెప్పుడు సంఘముయొక్క కాఠిన్యమునకే గురియగును. అట్టివారినుండి వచ్చినంతవరకు రాబట్టుటయే ప్రపంచలక్షణము" అని వర్ణించెను.

"దుగ్ధంచయత్ తదను యత్క్వథితం తతోను
మాధుర్యమస్య హ్రృత మున్మథితం చ వేగాత్

జాతం పునర్ఘృతకృతే నవనీతవృత్తి
స్నేహో నిబంధన మనర్థ పరంపరాణామ్."

లాట దేశస్థురాలైన "ప్రభుదేవి"ని కూడా రాజశేఖరుడు పేర్కొని ఆమెకు బహుముఖప్రశస్తి యున్నట్లు వర్ణించెను. ఆమె చాలా శ్లోకములు రచించి ప్రజాహృదయముల నధిష్ఠించినట్లు రాజశేఖరుడు చెప్పెను. కాని ఆమె రచనలని చెప్పబడునవి ఒక్క శ్లోకమైనను కాన్పింపదు.

మారుల :

ధనదేవుడు ఈర్ష్యతో పేర్కొనిన నల్గురు కవయిత్రులలో 'విజ్జిక', 'శీల' లను గూర్చి ఇంతకుపూర్వమే చెప్పబడియుండెను. తక్కిన యిర్వురు మారిల, మోరిక అనువారు. మారుల రచించిన శ్లోకములు రెండు కన్పించు చున్నవి. ప్రియ వియోగమునగల్గు బాధలను వర్ణించునది యొక శ్లోకము. "చాలానాళ్ళు ప్రియుడు తనపై యుపేక్షవహించి తన విషయమే పట్టించు కొనకుండ కొన్నాళ్ళకు మఱల తనను ప్రేమతో నాదరింపవచ్చుటయు అపుడామె తన కోపము సహాయముతో నిందించుటయు తుదకు వియోగ మును భరింపలేక కన్నీళ్లు కాల్వలుగట్టగా ప్రియుని వక్షముపై వాలిపోవు టయు ననునది ఈ శ్లోకమునందలి భావన :

"కృశాకేనా సిత్వం? ప్రకృతిరియ మంగస్య ననుతే
కలా ధూమ్రా కస్మాత్, గురుజనగృహే పాచకతయా
స్మరస్యస్మాన్ కించిత్ ? నహి, నహి, నహీత్యేవ మగమత్
స్మరోత్కంపం బాలా మమ హృది, నిపత్య ప్రరుదితా."

మోరిక :

రచనలు నాల్గు కలవు. అందు మూడిటిలో ప్రణయాసక్తయైన స్త్రీ యొక్క ఆవేదనానుభూతిని గూర్చి వర్ణించును. ఇంకొక శ్లోకమున నామె వియోగావస్థయందలి బాధను వర్ణించును. ఆ సందర్భముగా ఆమె ఈ క్రింది సంఘటనను వర్ణించుచు నిట్లు ప్రశ్నించును. "ప్రేమికులైనవారు తమంత తాము ప్రియురాండ్రకడ కేతెంచి తమ దూరదేశ గమనమును గూర్చి చెప్పుటకెట్లు సాహసింతురో తమ ప్రియురాండ్ర కన్నీరు కనులారగాంచియు

ఏదో కొంతమాత్రపు ధనలవము నార్జించుటకు దూరదేశముల కేగుట కెట్లు సమ్మతింతురో ?"

"యామీత్యధ్య వసాయపవ బలవాన్ బధ్నాతు నామాస్పదం
వక్తుం ప్రాణసమా సమక్ష మఘృణే నేత్థం కథం ప్రార్థితే
ఉక్తంనామ తథాపి నిర్భరగల ద్బాష్పం ప్రియాయాముఖం
దృష్ట్వాపి ప్రవసన్త్యహో ధనలవ ప్రాప్తి స్పృహా మాదృశాః."

—మాదృశం.

**ఫల్గునస్తిని :**

ఎనిమిదవ శతాబ్ది చివటిభాగమునకు ముందు గణుతికెక్కిన కవయిత్రి యీమె. కాశ్మీర చక్రవర్తి జయాపీడుని కాలమున అలంకార శాస్త్రకర్తయైన వామను డీమెనుగూర్చి చెప్పియుండెను. ఈమె శ్లోకములు రెండు కన్పించుచున్నవి. అందొకటి శుక్లపక్ష చంద్రుని స్తోత్రము :

"త్రిణయన జటావల్లీ పుష్పం, నిశావదనస్మితం
గ్రహా కిసలయం, సంధ్యా నారీ నితంబ నఖక్షతమ్
తిమిర భిదురం, వ్యోమ్నశ్శృంగం, మనోభవ కార్ముకం
ప్రతిపది నవస్యేందోః బింబం సుఖోదయ మస్తునః."

**ఇందులేఖ ;**

ఇందులేఖయొక్క ఒక్క పద్యము జ్ఞాపకము నందున్నది. అంత కంతకు అభివృద్ధియగు వియోగబాధ ననుభవించు స్త్రీయొక్క వేదనను ఆమె యిట్లు వర్ణించెను. "రాత్రి సమీపించునపుడు సూర్యునియొక్క కాంతి ఏవేవో స్థలములలోనికి వెళ్లునని కొందఱు చెప్పెదరు. కాని నిజముగా ఆ వేడి విప్రలబ్ధ హృదయములలోనికే ప్రవేశించును."

**నాగమ్మ :**

శార్ఙ్గధర పద్ధతిలోని ఒక చిన్నబాల సూర్యదేవతా ప్రార్థనవలన మాత్రమే ఈమె తెలియుచున్నది. ఆ ప్రార్థనను బట్టి పరిశీలించినచో ఆమెకు శబ్దగత ధ్వని మూలకమైన రచనయందు ప్రావీణ్యము కలదని తెలియును.

"శుకతుండచ్ఛవి సవితుః చండరుచః పుండరీక వనబంధోః
మండల ముదితం వందే కుండల మాఖండలాశాయాః."

ఈమె దాక్షిణాత్యయని తెలియుచున్నది.

భావాక :

భావాక లేక భావదేవి అనునామె ప్రభుదేవివలె ఉన్నతవర్గమునకు చెందినది. కావ్యమాలలో ప్రకటితములైన "కవీంద్ర వచన సముచ్చయ", "సదుక్తి రత్నమాల"ల యందు ఈమె శ్లోకములు మూడు కలవు. అందు ఒక శ్లోకమున ఒక స్త్రీ చిత్రముకొఱకు ఇరువురన్నదమ్ములు తగవులాడుటను వర్ణించెను.

త్రిభువనసరస్వతి :

ఈమె ఒక ప్రశస్తివహించిన కవయిత్రి. ఆమె పేరునుబట్టి ఆమె కొంత ప్రాముఖ్యము వహించినట్లు తెలియును. 'సదుక్తి కర్ణామృతము'న విష్ణుస్తుతిపూర్వకమైన చాటు వొకటి కాననగును. ఈమెను గూర్చి రాజశేఖరుడు తన 'కర్పూరమంజరి' యందు అపూర్వవిధానమున ప్రశంసించెను. కర్పూరమంజరి నాటకము నందొక ఘట్టమున మహారాజును, రాణియు నాసీనులైయుండగా కొందఱు కన్యలు కవిత్వప్రదర్శన చేయగా అందు ప్రతిభావంతురాలైన యొక కన్యను త్రిభువన సరస్వతియొక్క కనిష్ఠ సోదరిగా ప్రశంసించెను.

సీత :

అలంకార శాస్త్రకర్తయైన వాగ్భటుడు తన కావ్యానుశాసనమున సీతయను కవయిత్రి రచనల నుదాహరించెను. భోజమహారాజు సాహిత్య గాథలయందును, మేరుతుంగుని 'ప్రబంధ చింతామణి' యందును, బాలతాలుని భోజప్రబంధమునందును పేర్కొనబడిన 'సీతాపండిత' యీమెయే కావచ్చును. మేరుతుంగుడు చెప్పినదానినిబట్టి పరిశీలింపగా ఆమె మొదట ఒక వంటలక్క, తరువాత విద్యావతి యయ్యెను. ఒకమాఱు విద్యావతియైన తన కుమార్తె విజయతో భోజుని ఆస్థానమునకు వెళ్లెను' అని తెలియును. మేరుతుంగునిచే విజయయొక్క శ్లోకములు ఉదాహరణములుగా

నీయబడెను. బాలబాలుని రచనలో నీమె సీతగా రెండుస్థలములలో పేర్కొనబడెను. ఆమె శ్లోకములలో ఒకశ్లోకము శార్ఙ్గధరపద్ధతిలో 'సరస్వతీ కుటుంబ దుహిత' యను పేరున నీయబడెను. 'సదుక్తికర్ణామృతము' శార్ఙ్గధరపద్ధతి గ్రంథములలో మదాలస, లక్ష్మి, సరస్వతి అను మువ్వురు కవయిత్రుల పేర్లుట్టంకింపబడినవి.

## అవంతిసుందరి :

ఇంతవఱకు పైనచెప్పబడిన మహిళావాఙ్మయము ఒకతరగతికి చెందినది. ఎందువలననగా వారి రచనలు సరిగా లభింపకపోవుట వలనను పై వాఙ్మయ మంతయు ఒకవిధమైనదని చెప్పవచ్చును.

కాని రాజశేఖరుని పత్నియైన అవంతిసుందరి విషయమునమాత్రము స్ఫుటమైన యాధారములతో చరిత్ర లభించును. రాజశేఖరుడు సర్వంకషమైన ప్రజ్ఞకలవాడు. రచయత, కవి, నాటకకర్త, విమర్శకుఁడు. 9 వ శతాబ్దపు అంత్యభాగమునను, 10 వ శతాబ్దపు ప్రారంభమునను కనోజు రాజైన మహేంద్రపాలుని యాస్థానకవిగా గౌరవింపబడెను. ఆతడు తన ప్రాకృత నాటకమైన కర్పూరమంజరి యుపోద్ఘాతమున చాహుణ కుటుంబమునుండి వచ్చిన అవంతిసుందరి తన నాటకమును ప్రయోగింప నభిలషించు చున్నదని వ్రాసెను.

> "చాహుణకుల మౌలి మాలికా రాజశేఖర కవీంద్ర గేహినీ
> భర్తుః కృతి మవంతి సుందరీ సాప్రయోజితు మేతదిచ్ఛతి"
>
> —ఛాయా.

బ్రాహ్మణ కవియైన రాజశేఖరునకు, విద్యాధికురాలైన క్షత్రియ కాంత అవంతి సుందరి భార్యయగుటచే రాజశేఖరునకు సంప్రాప్తమైన గ్రంథరచనా ప్రోత్సాహ మాతని బృహద్రచన యగు "కావ్య మీమాంసా" రచనమున కాననగును. ఇప్పటికి మిగిలిన కావ్య మీమాంసా భాగములలో రాజశేఖరుడు తన భార్య అభిప్రాయములను మూడు మార్లుట్టంకించి యుండెను. (18P, 20, 46, 57 G. O. S. Cdn.) ఆయా ఘట్టము

లన్నింటి యందును, ఆమె యొక్క నిశిత సారస్వత జ్ఞానము, విమర్శ నాత్మకమైన సూక్ష్మబుద్ధియు తెలియుచుండును. కావ్యము యొక్క పాకము విషయమై చర్చరాగా అవంతి సుందరి తనకంటె పూర్వాలంకార శాస్త్ర కర్తలైన వామనాదుల యభిప్రాయములకు వ్యతిరేకించెను. "వామనుడు చెప్పినట్లుగా పద వినిమయమే పాకము గాదు. రసభావ సన్నివేశమునకు తగిన పదములతో కవిత్వ మల్లుటయే పాకము". అని యీామె నిర్వచించెను. వస్తువు యొక్క ప్రకృతిని కవి యుపయోగించుటను గూర్చిన చర్చలో ఆమె "వస్తువుయొక్క ప్రకృతిని శాస్త్రసిద్ధ (సహజసిద్ధ) ముగా నెట్టిదైనను, కవి వస్తువునైనను సన్నివేశమునుబట్టి వేరువేరుగా నుపయోగింపవచ్చును." అని చెప్పెను. ఇక నీమె సూచించిన మూడవ యంశము గ్రంథచౌర్యమును గూర్చినది. :—"గ్రంథచౌర్యము జరుగుటకు గల కారణములను గూర్చియు పరిస్థితులను గూర్చియు విపులముగా చర్చించెను. మహమ్మదీయ, విజయనగర సామ్రాజ్య, ఆంగ్లేయ పరిపాలనా కాలములలో కూడ మహిళలలో సంస్కృత విద్య కాన నగును. రచనల సందర్భముగా చూచినచో ప్రాచీన కాలమునందలి రచనలకంటె తరువాతి కాలమునందలి రచనలే మన కుపలబ్ధము లగుచున్నవి. లబ్ధములైన వాని యందును చెప్పదగిన రచనలు మూడు కలవు. అందు రెండు విజయనగర సామ్రాజ్యమునందలి మహాకావ్య, చంపూకావ్యములు. ఒకటి తంజావూరు నాయక రాజుల కాలము నాటిది. ఈ సందర్భమున ముఖ్యముగా గమనింపదగిన యంశమేమన నీ మూడు కావ్యములును ఆయా మహారాజులరాణులచే గాని లేదా వారి యంతఃపుర స్త్రీలచేగాని రచింపబడియుండుట! విజయనగర సంస్థాన సచివాలయమునందును, అంతఃపుర, రాజభవనములందును నాలుగువేలమంది స్త్రీ లుండెడివారు. వీరిలో నట్టువరాండ్రు, గాయకురాండ్రేగాక, లెక్కపని చేయుటకు, దినచర్య వ్రాయుటకు, ఇతర సాహిత్య వ్యాసంగములకు కూడ వీరు నియుక్తలై యున్నట్లు నసీజ్ వ్రాసి యుండెను.

సంస్కృతమునందును, ఆయా ప్రాకృతముల యందును, తెలుఁగు నందును మంచి పాండిత్యము, ప్రతిభాజ్ఞానములు కలిగి ఆ ఎనిమిది భాషల యందును కవిత్వము చెప్పగల్గుటయేకాక ఆశ్చర్యపడదగినంత వేగముగా నాయాభాషలలో నాశుకవిత్వము చెప్పదగిన స్త్రీలు సంఖ్యకుమించి తంజావూరు ఆస్థానమునందు కలరని ఆస్థానాంధ్ర కవయిత్రియైన రామ భద్రాంబ తన 'రఘునాథ నాయకాభ్యుదయము'న పేర్కొని యుండెను.

## గంగాదేవి :

స్త్రీ రచయిత్రుల చివరి రచనలలో ఉత్తమమైన రచన 'మధురావిజ యము.' చారిత్రక కావ్యసాహిత్యమున నీ 'మధురావిజయము' చాలా ప్రశంసనీయమైన రచన. బుక్కరాయని కుమారుడైన కంపరాయ సార్వ భౌముని మహారాణి గంగాదేవి తన భర్తయగు కంపరాయని శౌర్య సాహస ములతో కూడిన విజయ యాత్రలను వర్ణించిన యత్యద్భుత కావ్యమిది.

"వీరకంపరాయ చరితమ్" అనున దీ కావ్యమునకు నామాంతరము. క్రీ. శ. 1367 లో వీరకంపరాయడు సాంబవరాయని ఓడించి కంచియందు కొంత కాలముండి మహమ్మదీయ దురాక్రమణమును తొలగించుటకై మధుర కేగెను. తరువాత నా మహావీరుడు శ్రీరంగమున రంగనాథ దేవాలయమున శ్రీ రంగనాయక విగ్రహ పునః ప్రతిష్ఠాపన కార్యము నొన ర్చెను. ఇట్టి మహావీరుడైన తన భర్త వీరకంపరాయని వీరగాథలను గంగా దేవి సంస్కృతమున మహోదాత్తముగ రచించెను. ఈ కావ్యమంతయు వీరరస స్ఫోరకమై యున్నది. ఈమె రచనయందు దేశభక్తి యుట్టిపడు చుండును. దక్షిణభారతమంతయు ఒక దేవతగా రూపొంది కంపని యెదుట సాక్షాత్కరించి, మహమ్మదీయుల బాధ నుండి తనకు విమోచనము కల్గింప వలసినదిగా కంపరాయని ప్రోత్సహించినట్లు ఇందు వర్ణింపబడి యున్నది. ఈ ఘట్టము నందామె చూపిన దేశభక్తి నిరుపమానము. ఈ కావ్యము విశేష చారిత్రాత్మక సంఘటనలతో కూడి చారిత్రక పరిశోధకులకు మిక్కిలి యుపయోగకారిగా నుండుటయేగాక సరళము, మనోహరమునైన

శైలితో రమణీయమై యున్నది. గంగాదేవి మహాకవి కాళిదాసును కవితా రచనమున తన కాదర్శముగ గైకొనెను. ఆమె రచనలు కాళిదాసు రచనా సౌమనస్యమును ప్రతిధ్వనించుచుండును. ఈ కావ్యము బహుశః పదిసర్గల కావ్యమై యుండవచ్చును. (19 Edn. త్రివేండ్రమ్). కాని యిది యిప్పుడు తొమ్మిది సర్గల వరకు లభించుచున్నది. ఈమె తన కావ్యారంభమున క్రియాశక్తిని తన గురువుగా పేర్కొని ఆయన కభివాద మొనర్చియున్నది. సౌగంధికాపహరణ కావ్య రచయితయైన విశ్వనాథకవిని తన కవితా గురు వని పేర్కొనెను.

తిరుమలాంబ :

ఆ విజయనగర సంస్థానమునందే అచ్యుతరాయల కాలమున (క్రీ. శ. 1500) నాతని రాణులలో నొకరైన తిరుమలాంబ తాను రచించిన "వరదాంబికా పరిణయము"ను చంపూ కావ్యమున తన ప్రభునకు వరదాంబతో జరిగిన వివాహము మొదలుకొని తరువాత అచ్యుతరాయల కుమారుడైన చిన్న వేంకటాద్రి యొక్క యౌవ రాజ్య పట్టాభిషేకము వఱకును వర్ణించెను. తిరుమలాంబ పురాణేతిహాస, కావ్య, నాటకాదులలో తనకు గొప్ప పాండిత్యము కలదనియు, తాను ఏకసంథాగ్రాహిణి ననియు చెప్పుకొనెను. 'రఘునాథనాయకాభ్యుదయము'ను రచించి తన స్వామియు, తంజావూరు ప్రభుడునగు రఘునాథనాయకుని వర్ణించిన 'రామభద్రాంబ' (క్రీ.శ. 1614-33) తిరుమలాంబకు సాటియని చెప్పవచ్చును. తంజావూరు ఆస్థానము నందే 'మధురవాణి' యను నింకొక కవయిత్రి తన ప్రశస్త రచనముచే ప్రశస్తి పొంది యుండెను. ఈమె రఘునాథ నాయకునిచే నాంధ్రమున రచింపబడిన 'రామాయణము'ను సంస్కృతీకరించెను. మధురవాణి సంస్కృత రామాయణ కావ్య ముపలబ్ధమై యున్నను యింతవఱకు ప్రచురింపబడలేదు.

పద్మావతి :

ఈ కాలమునాటి ఉత్తరదేశ కవయిత్రులలో పద్మావతి యనునామె యొక కవయిత్రిగా కన్పట్టుచున్నది. 17 వ శతాబ్దము వాడైన హరి

భాస్కరుని కావ్యమాలయైన "పద్యామృత తరంగిణి" యందు ఈమె శ్లోకములు చాలా కన్పట్టుచున్నవి. ఈమె రచన స్త్రీల యవయవ సౌందర్య వర్ణనతో కూడియున్నది భావ వ్యక్తీకరణమునం దీమె యొనర్చిన ఉదాత్త రచనా వ్యవసాయము మెచ్చదగినది.

1644 వ సం॥రమందలి "సూక్తిసుందర", 17 వ శతాబ్ది యందలి 'పద్మవేణి', 'సుభాషితసార సముచ్చయము', అను కావ్యమాలల మూలమున తెలియబడిన కవయిత్రి 'గౌరి' యను నామె యొకరు కలరు. ఈమె రచనము పద్మావతి రచనముకంటె నిస్సందేహముగా మేలైనది. వంగదేశ కవయిత్రియైన "ప్రియంవద" (17 వ శతాబ్ది) 'శ్యామరహస్య' అను కృష్ణ స్తోత్రమును రచించెను. ఇంతకు పూర్వము 15 వ శతాబ్దమున మిథిల ప్రభువైన శివసింహుని పత్ని 'లఖిమాఠాకూరాణి' ఒక సుప్రసిద్ధ కవయిత్రిగా కన్పట్టుచున్నది. ఆయా సన్నివేశముల కతుకునట్లు రమణీయముగ రచింపగల్గిన ఒకానొక హాస్యకవిత్వ రచనా ప్రజ్ఞయం దీమె యద్వితీయురాలు.

దక్షిణభారతదేశమున 16 వ శతాబ్దపు అంత్యభాగమున నాయక రాజులచే నాదరింపబడిన బహుకావ్య కర్తయగు రత్నఖేట శ్రీనివాస దీక్షితుని భార్య యొకామె లఖిమాఠాకూరాణి వలె అత్యంత ప్రజ్ఞావతిగా కన్పట్టుచున్నది. జింజినాయకుడీమెను ఆదరించి ప్రోత్సహించెను. ఆమె ప్రజ్ఞను గూర్చి అనుస్యూతముగా వినబడుచున్న రెండు సాంప్రదాయ సిద్ధములైన కథలు గలవు. ఆమె తన స్వామి (భర్త)తో చర్చా గోష్ఠులలో పాల్గొను చుండెడిది. ఒకనాడామె గోష్ఠికి వెళ్ళుటలో కొంత ఆలస్యము జరిగెను. అపుడామె భర్త శ్రీనివాస దీక్షితుడు "వేషధారణము నందును, అలంకారము నందును, ఇంత ఆలస్యము జరిగెనా ?" యని ఆమెను ప్రశ్నించెను. ఏమియు ఆలస్యముచేయక వెంటనే ఆమె "ఔను నేను జడ అల్లుకొనగా ఒక నెమలివచ్చి ఆ నాజడను పాముగా భ్రమించి తినుటకు వచ్చెను. అప్పుడు నేను జడను విప్పివేసితిని. అంతట ఆ నెమలి విప్పి యున్న నా చికురభరమును గాంచి తనతో పోరాడవచ్చిన ప్రత్యర్థి

మయూరముగా భావించి నా కేశజాలమును పొడువవచ్చెను. అంతట మఱల నేను నా కేశపాశమును చుట్టి ముడిగా వైచితిని. అప్పుడా నెమిలి నా కొప్పును జలదముగా భ్రమించి నాట్యమొనరింప నారంభించెను. నేనును విస్తుపోయి ఆ నాట్యమును తిలకించుచు నిలువఁబడి పోయితిని అందుచే ఆలస్యమైనది.'' అని యామె చమత్కరించుచు తన భర్తకు ఒక శ్లోకరూపమున ప్రత్యుత్తరమిచ్చెను.

"వేణీభూతేషు కేశే ష్వసితఫణిధియాద్రష్టు మాగత్య కేకీ
పశ్చా దారభ్య యోద్ధుం ప్రతి శిఖి మనసా తేషు విస్రంసితేషు
భూయో ధమ్మిల్లి తేషు ప్రకర ఘనధియా నర్తనా యోజ్జజృంభే
పతస్మాత్కారణాన్మే ప్రియసఖ! సమభూన్మండన శ్రీ విలంబః"

సమయస్ఫూర్తితో సన్నివేశమునకు తగిన కల్పన చేయుటలో నీమెకు గల ప్రతిభను తెల్పు మఱియొక సంఘటన యీ క్రింద నీయఁబడుచున్నది. ఒకనాటి తెల్లవారు జామున ఉత్తర దేశ పండితుడొకడు రత్నఖేట దీక్షితుని ప్రఖ్యాతిని విని ఆయనతో వాదించుటకై వచ్చి దీక్షితుని ఇంటిముందు తచ్చాడు చుండెను. తెల్లవాఱు జామున ముంగిలికస వూడ్చి కళ్లాపు జల్లి ముగ్గులు పెట్టుటకై వీధిలోనికి వచ్చిన దీక్షితపత్ని తమ యింటి ముందు తచ్చాడుచున్న ఆనూతనాగంతుకుని చూచి ఆతని యభిప్రాయమును గ్రహించి తన భర్తకు వృధా కాల హారణము కాకుండుటకై ఈ కింద్రి విధముగా నొక శ్లోకము నల్లి దానిని చదివెను. ఆమె పేడ కల్లాపి చల్లుచు ఇంటి ముంగిలి యందు తాను తిరుగు గతికి లయ సరిపోవు ఒక వింత ఛందములో నామె శ్లోకమును చదివెను.

''విపశ్చితా మపశ్చిమే, వివాద కేలి నిశ్చలే–సపత్నజి త్యయత్నమేవ రత్నఖేట దీక్షితే, బృహస్పతిః క్వజల్పతి, ప్రసర్పతి క్వసర్పరాట్, అసన్ముఖశ్చః షణ్ముఖ స్సదుర్ముఖ శ్చతుర్ముఖః॥'' పండితులలో నద్వితీయుడై, వివాద కేలియం దచంచలుడై, ప్రత్యర్థి జయమున నప్రయత్నుడై రత్నఖేట దీక్షితుడు ప్రకాశించు చుండగా షణ్ముఖుడైన కుమారస్వామి విగత

ముఖుడై, చతుర్ముఖుడు దుర్ముఖుడై, పరాభవింపబడు చుండగా ఇక బృహస్పతి ఏమి మాట్లాడగలడు ? అనంతుడైన పతంజలి ఎచట సంచరింప గలడు ?"

ఇది విని ఆ నూతనాగంతుకుడు దీక్షితపత్నియే యింత ప్రతిభా వంతురాలై యుండ ఇంక దీక్షితుల పాండిత్యమును గూర్చి ఏమి చెప్ప వలెను ? అనుకొనుచు పలాయనము చిత్తగించెను.

త్రివేణి :

ఈమె తరువాత (క్రీ. శ. 1817-83) దక్షిణ భారతమున త్రివేణి యను నొక శ్రీవైష్ణవ యువతి కవయిత్రిగా కన్పట్టు చున్నది. ఈమె ఉదయేందిర పురం అనంతాచార్యుల కొమారిత, శ్రీ పెరుంబూదూరు వాస్తవ్యుడైన ప్రతివాది భయంకరం శ్రీ వేంకటాచార్యుల పత్ని. ఈమెకు వైధవ్యము సంప్రాప్తింపగా తాను స్వయముగా ఆధ్యాత్మిక వ్యాసంగ మొనర్చి అనేక తీర్థయాత్రాదుల నొనర్చెను. యాత్రా సందర్భమున నామె వెళ్ళిన స్థలములలో నామె కపూర్వ స్వాగత సత్కారములు లభించెను. ఆమె స్తోత్రములను, కావ్యములను రచించుటేకాక మేఘసందేశ కావ్యాను సారముగా రెండు కావ్యములను, రెండు వైదాంతిక నాటకములను రచించెను. ఆమెకు తర్వాత మలబారు దేశపు పండిత కవయిత్రులైన మనోరమ, లక్ష్మిరాణి అనువారు చెప్పదగినవారు. ఇందు మనోరమ గురుత్వ మున ఎందఱో పురుషులు కూడ అధ్యయన మొనర్చి యుండిరి. 19 వ శతాబ్దియందు కాడట్టనాడు వాస్తవ్యురాలైన లక్ష్మిరాణి "సంతాన గోపాల కావ్య" అను మూడు సర్గముల కావ్యమును రచించెను. ఇటలీ సంస్కృత పండితుడు, టూరిన్ యూనివర్శిటీ ప్రొఫెసర్ M. వెల్లోరి (Vallouri) ఈమె రచించిన భాగవత దశమస్కంధ ద్వితీయ భాగమునకు చెందిన గాథను ప్రచురించెను.

సుందర వల్లి :

ఆధునికులలో సంస్కృత కావ్యరచన చేసిన వారిలో మైసూరు

సుందరవల్లి, కుంభకోణం జ్ఞానసుందరి ముఖ్యులు. ఈ రెండవ యామె మధురానగర గాధలను, హాలాస్య చంపూ కావ్యమును రచించెను.

ఇతర విద్యలలో కూడ ఇటీవలి శతాబ్దములలో స్త్రీలు గణన కెక్కిరనుట ముదావహము.

బీనాబాయి :

యాదవ సంస్థానమునకు చెందిన మాండలిక రాజు కుమార్తెయు, ప్రతాపుని మనుమడు, వీరసింహుని కుమారుడును, పాటలీపుర ప్రభువు చాహువాన వంశ రాజును అయిన హరిసింహుని భార్యయునైన బీనాబాయి గొప్ప ప్రతిభా వంతురాలు. ఈ రచయిత్రి కాలము 15 వ శతాబ్దముగా కన్పట్టుచున్నది. వీరికుటుంబ మంతయు వైష్ణవమతాను యాయులు. మిక్కిలి పవిత్రక్షేత్రమైన ద్వారకా నగరమును గూర్చి "ద్వారకా పట్టల" అను పేరుగల మత సాంప్రదాయ గ్రంథమును బీనాబాయి సంకలన మొనర్చెను. ఇది వఱకే ప్రస్తావింపబడిన లఖిమాదేవి ఠాకూరాణి తోడికోడలును, ఠాకూరాణి మఱది పద్మసింహుని భార్యయునైన విశ్వాసదేవి యును సాహిత్యాభి రుచికల్గి "గంగా వాక్యావళి" అను గ్రంథమును సంకలనము చేసినదని చెప్పెదరు. ఇది యామె యాశ్రయ మందున్న విద్యాపతి కర్తృకమై యుండవచ్చును. 17 వ శతాబ్ద్యంత్య భాగము నందును, 18 వ శతాబ్దపు ప్రారంభమునను ఉన్న వైద్యనాధుని భార్య లక్ష్మి యను నామెకుకూడ నిట్టి పేరు కలదు. యాజ్ఞవల్క్యస్మృతికి వ్యాఖ్యానమైన 'మితాక్షరకు', 'కాలమాధవ' కును లక్ష్మీ వ్యాఖ్యానము అను పేరున నీమె వ్యాఖ్యానములు రచించెను. కాని ఆమె కుమారుడైన బాలంభట్టు ఈ వ్యాఖ్యానములు రచించి తల్లిమీది గౌరవముచే తల్లిపేరు పెట్టెనని యందురు. కాని అందు స్త్రీల వారసత్వపు హక్కు విషయమునను, దత్తత విషయమునను, స్త్రీలపై యభిమానము చూపు ప్రశ్నావళి కాన్పించును.

క్రీ. శ. 1728-36 సంవత్సరముల నడుమ తంజావూరును పాలించిన

తుకోజీ యాస్థానమున ఘనశ్యాముడను మంత్రి యుండెను. ఆతనికి సుందరి, కమల యను నిర్వురు భార్యలుండిరి. రాజశేఖరుని విద్ధసాల భంజిక నాటికకును, చమత్కార తరంగిణికిని ఇర్వురును కలసి వ్యాఖ్యానము రచించిరి. 19 వ శతాబ్దాంత్య భాగమున తంజావూరు జిల్లాలోని మాయావరము నందున్న కామాక్షి యను నామె బాల వితంతువై తనంత తాను తర్క వేదాంత శాస్త్రముల నధ్యయనము చేసి న్యాయ, వేదాంతములపై, 'న్యాయబోధిని' 'నీల కంఠీయ విషయ మాల', 'అద్వైత దీపిక' 'శ్రుతిరత్న ప్రకాశిక' అను గ్రంథములను రచించెను.

# ప్రాకృత కవయిత్రులు

మూలము :
డా. విజయరాఘవన్,
M. A. Ph. D.
మద్రాసు.

అనువాదకురాలు :
ఖత్తుల కామాక్షమ్మ,
ప్రిన్సిపాలు,
ఆంధ్రయువతీ సంస్కృత కళాశాల,
రాజమంద్రి.

ప్రాకృత వాఙ్మయమునందు కూడ స్త్రీలు ఉత్తమ వాఙ్మయాభిరతి కలవారుగా కన్పట్టుచున్నారు. ఈ సాహిత్యమున ప్రాథమిక రచన యనదగు ప్రాకృత గాథా సంపుటము నందును, హాల శాతవాహనుని గాథా సప్తశతి యందును చాలామంది ప్రాకృత రచయిత్రుల రచనలు కాన్పించు చున్నవి. ప్రాకృత గాథలు ముఖ్యముగా ప్రేమగేయ రచనా విషయికముగా మణి పూసల వంటివి. ఈ గాథా రచయితల వర్గమున స్త్రీ రచయిత్రులు పురుష రచయితల ప్రతిభకు ఏమాత్రమూ తీసిపోని రచన మొనర్చి తమ సమకాలీన పురుష రచయితలతో బాటు ప్రశంసింపబడిరి.

రేవా :

ఈ రచయిత్రి రచించిన రెండు గాథలు ఆమెకు రచనా కళయందు గల విన్నాణమును, శక్తి సామర్థ్యములను చక్కగా తెలుపును.

"అవలంబిత మాన పరాఙ్ముఖ్యాః, ఆగచ్ఛతో మానిని ప్రియస్య
పృష్ఠపులకోద్గమ స్తవ కథయతి సమ్ముఖస్థితం హృదయమ్."

తన చేత తిరస్కరింపబడి ప్రియుడు వెళ్లిపోవుట గమనించిన ప్రియు రాలిని జూచి యామె సఖి "నీహృదయము నందలి ప్రేమకు సాక్ష్యముగా నీ వీపున పులకలు కనబడు చుండగా నీ ముఖము నందలి కోపారుణిమ కర్థమేమి ?"

ఆమె యొక్క ఇంకొక గాథ :

"కింతావత్ కృత మధవా కరోష్యసి సుభగేదానీమ్ ।
అపరాధం నామ లజ్జాశీల కథయకతమే క్షమ్యతామ్॥"

అను శ్లోకమునందు మిక్కిలి అపరాధియై సిగ్గుమాలి బ్రతిమాలు తన చంచల ప్రేమికుని "క్షమించుటా? ఏ తప్పులను ? ప్రాత వాటినా ? ఇప్పటి వాటినా ? ఇక ముందు చేయబోవు వాటినా? " అని యామె యడిగించినది.

రోహా :

ఈమె రచించిన గాథలో మగవాని యొక్క సంపూర్ణమైన తాహతు, వానికి గల చెల్లుబాటు, స్త్రీ యొక్క అమాయికత, మగవాడు కృతాప రాధుడైనను, స్త్రీ పంతగించినను స్త్రీ పంతము చెల్లక పోవుటయు ఒక నవ్వుతో స్త్రీ బిగువు సడలి పోవుటయు చక్కగా వర్ణించి ఊరు తగుల బెట్టినను అగ్ని కావలిసినవారు అగ్ని నారాధింపకమానరు కదా! అను నుపమానముతో తన భావమును చక్కగా నిరూపించెను. "యేనవినా నజీవ్యతే అనుపనీతే సకృతా పరాధోఽపి । ప్రాప్తేఽపి నగరదాహేక్షణ । కస్య న వల్ల భోగ్నిః॥"

అనులచ్చి :

అనులక్ష్మి నాలుగు గాథలు రమణీయముగా రచించిన కవయిత్రి. సూటిగా హృదయమునకు హత్తుకొను భావవ్యక్తి కీమె సుప్రసిద్ధురాలు. కాని ఆమె గాథల యందు స్వభావ వర్ణనకు తావలమైన ఒకగాథ చాలా అందముగా నున్నదని సారస్వత వేత్త లభిప్రాయ పడిరి. బాట ప్రక్కనున్న ఒక మఱిచెట్టు క్రిందకు నీడనాశించి కొందఱు పాంథులు చేరిరి. తరువాత కొద్ది సమయమునకు తమకు ఎండ తగులుట కనిపెట్టి వారు తలలు పైకెత్తి చూడగా ఱెక్కలను టప టప కొట్టుచు నవ్వుచు ఆకసమునకు గుంపులు గుంపులుగా ఎగసిపోవు చిలుకలు హెచ్చు సంఖ్యలో కానంబడెను ఆ చెట్టసలు ఎండిపోయినది. కాని చిలుకలశరీరపు ఆకుపచ్చరంగును ఆకులుగాను, ముక్కుల ఎఱ్ఱరంగును పండ్లుగాను భ్రమించి పాంథులా చెట్టుక్రిందకు చేరుటయు, వారి అమాయికతను కనిపెట్టి చిలుకలు తమాషా చేయు టయు నిందు చక్కగా వర్ణింపబడియెను.

"హాసితం సహా స్తతాలం, శుష్క వటముపగతై ః పథికై ః
పత్ర ఫలానాం సదృశే ఉడ్డీనే శుకబృందే."

ఇందు ఆకుపచ్చ, ఎఱుపురంగుల నాధారపఱచుకొని కవయిత్రి అల్లిన మనోజ్ఞమైన స్వాభావిక వర్ణన ప్రశంసనీయమైనది.

పామి లేక ప్రహాతా :

తమ మధ్య జరుగు సంఘటనలను ఉల్లాసముగ పరిహాసదృష్టితో గైకొనుచు ఆనందమయ జీవితమును గడుపు ప్రేమిక ద్వంద్వముల నీమె చక్కగా వర్ణించెను.

వద్ధావహి :

ఒక విరహిణి అనుభావముల నొక శ్లోకమున వర్ణించెను.

అసులద్ధి :

ఈమెపేరున రెండు గాథలు కలవు. అందొకటి విరహిణియొక్క బాధానుభవము, వేఱొకటి నాయికచే పంపబడిన దూతిక నాయకునితో వాదించుట.

శశిప్రభ :

ఈమె ప్రేమ ప్రకృతియొక్క సంపూర్ణమైన ఉదాత్తమైన లక్షణమును తన రచనలో పొదిగి అందిచ్చెను. "స్థిరమైన ప్రేమకల ప్రణయిని తన ప్రియుని స్వభావ మెట్టిదైనను, నాతనిని విడువక ప్రణయ సార్థకత భజించును. చెట్టు ఎంత బిఱ్ఱబిగుసుకొని నిగడదన్నుకొని నిలువబడినను, లత దానిని చుట్టుకొనుట మానదు'' అని వర్ణించెను.

''యథా యథా వాదయతిప్రియః, తథా తథా నృత్యామి చంచలే
ప్రేమ్ణి, వల్లీ వలయత్యంగం, స్వభావ స్తబ్ధేపి వృక్షే.''

మాధవి :

మాధవి స్త్రీ హృదయభావమును నిసర్గసుందరముగా వర్ణించెను. స్త్రీకి ఎట్టి పురుషుడు ప్రియుడు ? ఎట్టి పురుషుడు యజమాని ? అని

ప్రశ్నించుకొని "స్త్రీ కోపగించినపుడు దాసునివలె బ్రతిమిలాడినవాడు ప్రియుడు. అట్లు చేయనివాడు నిరంకుశముగా తన యాజమాన్యము చెల్లించుకొనువాడు యజమాని" అని యామె వ్రాసెను.

"గోపయంతి యే ప్రభుస్త్వాం, కుపితాం దాసా ఇవ ప్రసాదయంతి
తాఏవ మహిలానాం ప్రియాః శేషాస్స్వా మిన ఏవవరాకాః."

ప్రాకృత ఛందో లక్షణ శాస్త్రమైన స్వయంభూ చ్ఛందస్సులో (1-6-120) విజ్జ, రావా అను నిరువురు కవయిత్రుల పేర్లతో పద్యము లుట్టంకింపబడెను.

*వోహా :

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు ఆంధ్రీకరించిన శాలివాహన గాథా సప్తశతీ సారమునందు 'వోహా' యను కవయిత్రి పద్యము లనేకము కనబడుచున్నవి.

ఆంతర్యమునందును, బాహిరముగను రూపమెత్తిన కోమలత్వమో యను నట్లుండు శ్రీ అనంతకృష్ణశర్మగారి ఈ ఆంధ్రీకరణము వారి ప్రకృతికి ప్రతికృతి. కావున వారి అనువాద పద్యములనే ఈ క్రింద నిచ్చుచున్నాను.

"నా కొడుకు తొల్లి యొక్క బాణమున జావ
గొట్టగలవాడు దొరయేనుగులను గూడ
అంపమోపుల గొనిపోవునదిగో ; యిపుడు
చూడు మడవికి ; కోడలి చూపు మహిమ."

—శా.వా.గా.స.శ. సారము. 'వోహా' 116 పుట 469 ప.

"దవ్వుగడచిచనిన దయితుగానక చూడ్కి
పట్టి త్రిప్పుకొంటి నెట్టకేని ;

*సంకలనకర్త్రి వ్రాసినది.

కాని పాడుమనసు వాని వెన్నంటి మ-
ల్లాడు చున్నదిపుడు నడ్డులేక.''    (7. 58)

—శాలి.గా.స.శ.సారము. పుట 119. 486 ప.

సుకుమార భావములకు, సులలిత శృంగారమునకును నిలయమైన ఈ కవయిత్రీమతల్లుల కృతి సౌభాగ్యములచే ప్రాకృత వాఙ్మయమునకు కొదువలేని భాగ్య మబ్బినది.

# అసామ్ కవయిత్రులు

మూలము :
ప్రొఫెసర్ జోగేశ్ దాసు,
చెన్నైకుత్తి - గౌహతి.

అనువాదము :
ఊ. సుహాసినీదేవి, M. A.
బాపట్ల.

ఇప్పటికి తెలిసినంతవఱకు అసామీ భాషలో తొలుదొల్తటి సాహిత్యము 13 వ శతాబ్ది నుండియే కన్పట్టుచున్నది. చాలా ప్రాచీన కాలము నుండియే బాగుగా వికాసము చెందిన ఇండో ఆర్యను భాషగా ఈ భాష స్వతంత్రముగనే అభివృద్ధి చెందినను 13 వ శతాబ్దికి ముందు మాత్రము అసామీయ సారస్వతము ఎచ్చటను ఆ కాలమునకు ముందు కన్పట్టదు. 7 వ శతాబ్దపు తొలి యర్ధభాగమున అసాము దేశమున పర్యటించిన ప్రముఖ చైనాయాత్రికుడైన హ్యూయాన్ త్సాంగ్ కామరూపభాష(ప్రాచ్య అసామీ భాష) మధ్య హిందూదేశమునందలి భాషకంటె కొంచెము విభిన్నముగా నుండునని వ్రాసెను. ఆ కాలమున మధ్య హిందూదేశములో వ్యవహారములోనున్న మైథిలీ లేక మాగధీ భాషలకంటె విభిన్నముగా నున్న ఒకానొక రూపమునకు దగ్గఱగా ఈ భాష అభివృద్ధి చెందు చుండెనను సత్యమునకు ఇది అమూల్యమైన సాక్ష్యము. 13 వ శతాబ్దము నకు ముందున్న రాజులచే వేయించబడిన భూదానమునకు సంబంధించిన తామ్రశాసనముల వలనను, మఱి యితర ప్రమాణముల వలనను, సంస్కృత భాష హిందూదేశమునందలి ఈ భాగములో బహుళ ప్రచారములో నుండెనని విశదమగుచున్నది. కాని ఆ కాలమునకు సంబంధించిన అసామీయ సారస్వతము గూర్చి మాత్రము ఏమియును తెలియరాలేదు. మిక్కిలి విలువ కల్గినట్టియు, సాహిత్యమునందుగల సాంప్రదాయ వైవిధ్యము గల్గినట్టి సాహిత్యము 13 వ శతాబ్దినుండి ఈ భాషలో ప్రవర్తిల్లినట్లు పెక్కు ఉదాహరణలు గలవు.

పద్మప్రియ :

19 వ శతాబ్దపు ప్రారంభమున పాశ్చాత్యుల ప్రభావము ఈ భాషా సాహిత్యములపై ప్రసరించునంతవఱకు గూడ అసామీయ భాషాసాహిత్య చరిత్రలో రచయిత్రుల పేర్లేవియు మనకు కన్పించకపోవుట చాలా వింతగా కన్పించును. అసామీ సాహిత్య చరిత్రకారులు పరిశీలించి చూచినంత వఱకు వైష్ణవ యుగమునకు (1450-1650 A. D.) చెందిన 'పద్మప్రియ' యను నామె పేరొక్కటియే కనుగొన గలిగిరి. కాని అప్పటినుండి ఇప్పటి వఱకు గూడ ఆమె రచన లేవియు వెలుగునకు రాలేదు. పూర్వకాలమున అసాము దేశస్త్రీలకు విద్య నిషేధింపబడినదని ఎవ్వరును చెప్పజాలరు.

పురాతనకాలమున అసామునందు ఉన్నత విద్యావతులైన స్త్రీలకు కొఱత ఏమీ లేనట్లుగా చాలా నిదర్శనములు కన్పించుచున్నవి. అసాము దేశపు జన సామాన్యమునకు, స్త్రీలకును కూడ సులభగ్రాహ్య మగునను కారణమున తాము అసామీ భాషయందే కావ్యరచన చేయుచున్నా మని ఆ దేశ కవులు తమ తమ కావ్యములలో వ్రాసికొనిరి. పండిత సార్వ భౌమ భట్టాచార్యుని భార్య ఒక గొప్ప విద్యావేత్త్రియనియు, ఆమె కూచి బిహారు రాజైన నరనారాయణ మహారాజు యొక్క ఆస్థానమును సందర్శించుచుండు వంగదేశీయుడగు రఘునందనమిశ్రుని ఒకానొక శాస్త్ర చర్చయందు ఓడించి ఘనవిజయము నొందెననియు ప్రమాణ పూర్వకముగా తెలియుచున్నది.

అహోమ్ వంశ రాణులైన పూరేశ్వరి, మదాంబికలు (1714-44) సాహిత్యమునందు విశేషాభిమానము కలిగియుండుటయేకాక, చాలా గ్రంథములను అత్యంత శ్రద్ధతో వ్రాసినట్లు తెలియుచున్నది. ఈ నిదర్శన ములు పురాతన కాలమున అసాము దేశస్త్రీలు విద్యాయోగ్యత కల్గి యుండిరని విశదీకరించుచున్నవి.

అట్టి తఱి 19 వ శతాబ్దమునకు ముందుండియు అసంఖ్యాకముగ నుపలబ్ధములైన అనేక వ్రాతప్రతులలో స్త్రీలరచన లేమియు కన్పింపక

పోవుటకు కారణమేమి ? పైగా ఎప్పుడును పురుషుల రచనలే దొఱకుట కును కారణము లేమి ?

దీనికి ఒక ప్రత్యుత్తరమును సాహసించి చెప్పుకొనవచ్చును. గొప్ప వైష్ణవ సంస్కర్తయైన శ్రీ శంకర దేవునకు అసాము దేశమున దాదాపు 15 వ శతాబ్దపు మధ్యభాగమునుండి, 17 వ శతాబ్దము వఱకు స్థిరమైన గొప్ప పలుకుబడి యుండెను.

శ్రీ శంకర దేవులును, ఆయన అనుచరులును అసంఖ్యాకములైన గ్రంథములను, కావ్యములను వ్రాయుటయేకాక, నవ్యవైష్ణవ సిద్ధాంత ములను ప్రచారము చేయు నుద్దేశముతో అనేకములగు నాటకములను, పాటలను, మతసంబంధములైన కొన్ని గ్రంథములను రచించిరి. అంతియే కాక రామాయణ, మహాభారతములను పురాణములను కూడ తమ భాష లోని కనువదించిరి. ఈ మత ప్రవాహమును, దాని ననుసరించి ఉద్భవించిన సాహిత్యమును ఈ రెండును అసాము దేశపు తూర్పు సరిహద్దునుండి పశ్చిమ మున కూచ్ బిహారు వఱకును విస్తరించినది. ఈ మత సాహిత్యము ముందు అసాము సాహిత్యమునందలి ఏ యితర రీతులుగాని, ఏ యితర ప్రక్రియలుగాని ప్రజలను ఆకర్షింప లేకపోయినవి. మఱియు అసాము ప్రజలు కూడా ఈ మత సాహిత్యేతరమైన యే యితర నూతన చైతన్య మును ప్రోత్సహింపలేదు. శ్రీ శంకర దేవులకు చాలామంది శిష్యులుండెడి వారు. ప్రఖ్యాతిచెందిన శిష్యులు కూడా కొందఱు ఆయన శిష్యవర్గములో నుండిరి. కాని దురదృష్టవశాత్తుగా ఆయన శిష్యవర్గమున స్త్రీ లొక్కఱును కాన్పించుటలేదు. ఇప్పటికిని బార్ పేటా (Bar Peta) వంటి ముఖ్య మైన వైష్ణవ మందిరములలో పూజా గృహములలోనికి స్త్రీల ప్రవేశ మును అనుమతించుటలేదు. స్త్రీల యెడ విధింపబడిన ఈ విధమైన నిషేధ ములే వైష్ణవ యుగమున స్త్రీలు రచించిన గ్రంథ మొకటియు లేకుండు టకు కారణము కావచ్చును.

దీనికి ముందు పురుష రచయితల గ్రంథములు కొన్ని మాత్రమే

వెలుగు లోనికి వచ్చినవి. అప్పటి గ్రంథములలో ఇప్పటికిని నశింపకుండ నున్న గ్రంథము 13 వ శతాబ్దము నాటిదేనని స్పష్టమగుచున్నది. కావున దీనిని బట్టి ఆ కాలమునాటి స్త్రీలు రచన చేసిరో లేదో నిర్ణయించి చెప్పుట చాలాకష్టము తరువాత వైష్ణవ యుగమునకు పిమ్మట ఆంగ్లేయ శకము వఱకును (క్రీ. శ. 1820 సుమారు) పరస్పర ప్రతికూలములగు రాజకీయ పరిస్థితులచే, గొప్ప సాంఘిక సంక్షోభమునకు గురియయ్యెను. బర్మీయులు అసాముపై మూడు మాఱులు వరుసగా దండెత్తి జయించిరి. అంతియే కాక సువ్యవస్థితమైన సాంఘిక పద్ధతులను, వారి సంస్కృతిని ఆయా తాత్కాలిక జయములు సాధించిన ప్రభుత్వములు చెల్లాచెదరుచేసి, ఆ భూభాగమును శూన్యము చేసెను. ఆ కాలము నాటి సాహిత్యరూపముల ఆనవాళ్ళుగా కొన్ని కొన్ని అపుడపుడు వెలికి వచ్చుచునే యున్నవి. కాని అందును ఇంతవఱకును స్త్రీల గ్రంథము లేవియు కానరాలేదు. నిర్ణీత మైన యే యుగమునందును చేర్చుటకు వీలు కానటువంటి జానపద సాహి త్యములను గూర్చి పరిశీలింతము. అది అనామధేయమును, వ్రాతమూల కము కానిదియునై యున్నది. కొన్ని మాత్రము ఆ గేయములందు అంతర్భూతమైన సహజ స్వభావమును బట్టి అవి స్త్రీల చేత కూర్పబడినవే నని మనకు నిశ్చయముగా తెలియుచున్నది.

పెండ్లి పాటలు :

అసాము దేశమున, ఆ ప్రజల సాంఘిక జీవితమున ప్రముఖ ప్రచా రమును పొందిన 'బియానామ్' అనబడు పెండ్లి పాటలు ఎప్పుడును స్త్రీల చేతనే కూర్పబడి పాడబడు చుండెడివి. స్త్రీయే కుటుంబమున కంతకును ముఖ్యాధారము. మఱియు పెండ్లిపాటలు స్త్రీ యొక్క భావగర్భితమైన, హృదయ కుహరమునుండి వెల్లువికి గృహమును, గృహజీవితమును వర్ణించు చుండును.

ఒక బాలికను స్వగృహము నుండి యింకొక యింటికి పంపుట అను నది హృదయవిదారకమైన ఘట్టమగుటచే ఆ పాటలు చాలా తీవ్రావేదనా

మయములగును. హృదయమును కదిలించివేయునవిగను ఉండును. కొన్ని సందర్భములలో అవి హాస్యరస భరితముగను, నిందాస్ఫోరకములుగా కూడ నుండును. ఒక పక్షము నందలి బాలికలు ఇంకొక పక్షము వారిపై పరిహాసోక్తులను విసరుటయు, ఎదిరి వారు వానిని విఫల మొనర్చుటయు సంభవించు చుండును. అసామీ స్త్రీ జీవితము నుండి విడదీయరాని సంబంధము కలిగినట్టి నేతమగ్గము, రాట్నముల గూర్చి ఆ పాటలు వర్ణించు చున్నవి. ఆ పాటలు సాంఘిక సమస్యల నన్నింటిని అద్దములో వలె చూపును. తఅచుగా ఆశ్చర్యము కల్గునట్లుగా పాటలలో, పల్లవులలో చేర్చబడి యుండును.

పిల్లను అత్తవారింటికి పంపునపుడు :

"పడకటింటిలో రాట్నమును, జిన్ను (మద్యము) విలపించు చున్నది.
నడవలో సోదరి విలపించు చున్నది.
పెరటిలో నేతమగ్గము మూల్గుచున్నది.
ఈ విషాద మంతయు పిల్లకు పెండ్లి యగునని విననపుడె సుమా"
"నిన్న ఈ పాటికి నీవు అమ్మ సెజ్జపై నిద్రించు చున్నావు.
నేడు వెనక దావాగ్నిని విడిచి వెళ్లిపోవు చున్నావు.

థాయ్‌నామ్ :

జోల పాటలు కూడా స్త్రీల చేతనే కూర్చబడి పాడబడు చుండును. ఈ పాటలు బిడ్డల మనస్తత్త్వమును కొలచుటలో స్త్రీలయొక్క శక్తి సామర్థ్యములను చూపును. ప్రతి తల్లియు తనబిడ్డకు ఈ విధముగా చందమామను గూర్చి బోధించును.

"ఓ చంద్రక్కా (చందమామా,) నాకొక సూదినిమ్ము 'ఎందుకు ?' అని చందమామ ప్రశ్నించి నట్లు ఊహించును. దానికి సమాధానము. మఱల ప్రశ్న ! ఈ విధముగా సంభాషణ కొనసాగును. సూదియొందు కనగా సూదితో సంచి కుట్టి అందులో డబ్బులేసి ఆ డబ్బుతో ఏనుగును కొని ఆ యేనుగుపై పాపాయి యెక్కి సవారీ చేయును. ఆ విధముగా ప్రతిచిన్న

బిడ్డ యందును గొప్పవ్యక్తిని చూచుట యీ పాటలలో కాననగును. లేదా, కొన్ని పాటలలో తల్లి బెదరించుటకు గాను ఆడునక్క వచ్చుచున్నదని భయపెట్టి పాపను నిద్రపుచ్చుటకు యత్నించును.

> "ఓ ఆడునక్కా ఈ రాత్రి నీవు రావద్దు. నీ చెవులను కోసి మేము దీపములు పెట్టు కొంటాము."

ఆయనామ్ :

ప్రకృతి మూల కారణమైన అమ్మవారిపై పాటలు సాహిత్యమున మతసంబంధమైన భయభక్తులు కల్గించునవిగా నుండును. ఆయ్ లేకమాత అనుపదము మశూచిక వ్యాధికి అధిష్ఠాన దేవతగా ఎంచబడును. ఈ వ్యాధి గ్రామమున వ్యాపించినపుడు ఆ గ్రామ స్త్రీలందఱును, నామ్ఘర్ (సామూహిక ప్రార్థనా మందిరము) లో కూడి ఆ దేవత యొక్క ఆగ్రహమును ఉపశమింప జేయుటకై ప్రార్థనలను జరుపుదురు. గూఢభక్తి ప్రపూరితములై యుండు ఈ పాటలు బహుశః తంత్రశాస్త్ర ప్రభావితములై యుండును. పూర్వకాలము నుండి నశించకుండా, ఇప్పటికిని సజీవముగా నున్నట్టి ఈ శక్తి పూజకు పిచలానది, ఫుల్ బారీఘాన్ వంటి ప్రదేశములు ఆ రోజులలో ఆటపట్టులై యుండెను.

ఈ దిగువ నిచ్చిన చక్కని ఉదాహరణమును పరిశీలింతము.

" మన పేదయింటికి అమ్మ వచ్చును. కాని అమ్మ కర్పించుటకు మన యింట నేమి కలదు ? మా కేశపాశముతో అమ్మా, నీ కాళ్ళు తుడిచెదము. మాశరీరములతో నీకు వారధి కట్టి త్రోవచేయగలము" అని.

## 19 శతాబ్దము రచయిత్రులు

ఇక్కడ నుండి 19 వ శతాబ్దపు మధ్య భాగమునకు సమీపింతము. సరిగా ఆ సమయముననే బ్రిటిషువారి అసాము రాష్ట్ర ప్రవేశము జరిగినది. వారితో బాటే అమెరికను బాప్టిస్టు మిషనరీల ప్రవేశము కూడ జరిగినది. ఆంగ్లేయ పరిపాలకులు వారితో బాటే వారి రాజ్యాంగ విధానము నందలి

నూత్న పద్ధతులను, విద్యా విధానమును అట్లే వారి సారస్వత పద్ధతులను కూడా తెచ్చి ప్రవేశ పెట్టిరి. పాశ్చాత్య విద్యా విధానముతో బాటుగానే ప్రజాస్వామిక జీవిత విధానములో మార్పులు కూడా భారతదేశములోని ఇతర భాగములలో వలెనే అసాములోకూడ ప్రవేశపెట్ట బడినవి. ఈ విధమైన మార్పు క్రమముగా జరుగుటకు చాలా కాలము పట్టినది. కాని ప్రాత పద్ధతులు మారి క్రొత్త పద్ధతులు వచ్చుటతో పురుషులతోబాటే స్త్రీలకు కూడా ఉచిత బోధనావకాశములు కల్పింపబడినవి. అప్పటినుండి మనకు మహిళా లోకమున రచయిత్రులు కాన్పింతురు.

ఎలీజాబ్రౌను :

కాని దురదృష్టవశాత్తుగా ఈ యుగమున అసామీ కవయిత్రులలో చెప్పుకోదగిన ప్రప్రథమ వనిత అసామీ మహిళ కాదు. ఆమె 'ఎలీజాబ్రౌన్' అను ఒక అమెరికను మహిళ. బాప్టిస్టు మిషనరీలు అసామీ భాషకు అగణ్యమగు సేవ కావించిరి. బెంగాలు నుండి అసామునకు ఆంగ్లేయులతో బాటే వచ్చిన ఒక గుమాస్తాల సంఘము అసాము ప్రభుత్వకార్యస్థానముల యందును, న్యాయస్థానముల యందును, విద్యాలయముల యందును అసామీ భాషను తీసివేయవలసినదిగా బ్రిటిషు వారికి దుస్సలహా నిచ్చినది. కాని మిషనరీలు మాత్రము భాషకు జరుగుచున్న ఈ అన్యాయము సహింపలేక హోరాహోరీగా పోరాడి చివఱకు అసామీ భాషను ఉచిత స్థానమున ప్రతిష్ఠించుటకు సహాయ పడిరి. అమెరికను మిషనరీలు (మతప్రచారకులు) తమ ఏసుక్రీస్తు చరిత్రను ప్రచారముచేయుటకు గాను అసాము భాషను అభ్యసించి గ్రంథ రచనకూడ చేసిరి. ఆ ప్రచారము నిమిత్తమే వారు 1846 లో 'అరుణోదయ్' (సూర్యోదయము) అను ప్రప్రథమ అసామీ పత్రికను ప్రచురించిరి. కాని అదికూడ పాఠకులకు లోకజ్ఞానమును కల్గించుటకు రోజువారీ వార్తలను అందించుటకు మాత్రమే ఉద్దేశింప బడినది. 'రెవరెండ్ నాథన్ బ్రౌను' అతని భార్య 'ఎలీజాబ్రౌను', 'రెవరెండ్ ఆలివర్ థామస్ కాటర్', ఆయన భార్య 'హారియట్ బి. యల్ కాటర్', అను

మత ప్రచారకులు ఈ ఉద్యమమునకు మార్గ దర్శకులైరి. ఎలీజాబ్రౌను (1807-86) జానపద గాథలు, అంక గణితము, భూగోళశాస్త్రము లను గూర్చి అసామి భాషలో మూడు గ్రంథములను వ్రాసెను. హారియట్ కాటర్ కూడ ఆంగ్ల అసాము పదములతో కూడిన ఒక నిఘంటువును 1840 లో ప్రచురించెను.

## గుర్నేసతి :

ఈ సందర్భమున ఇంకొక రెండు పేర్లు కూడా గమనింప దగినవి 'ఫుల్ మణి - ఓ - కరుణా' అను గ్రంథమును బెంగాలీ భాషనుండి అసాము భాష లోనికి అనువదించిన శ్రీమతి గుర్నే ('కామినీకాంత' అను ప్రప్రథమ స్వతంత్ర నవలను అసామీ భాషలో రచియించిన ప్రప్రథమ నవలా రచయిత యగు రెవరెండు A. K గుర్నే భార్య) మఱియొకరు ఆంగ్ల అసాము పదముల నిఘంటువును 1864 లో రచించిన శ్రీమతి S. K. వార్డు అను నామెయునై యున్నారు. అసాము దేశపు ఆధునిక సాహిత్యము, సాంఘిక వ్యవస్థ రెండును కూడా ఒక సువ్యస్థిత రూపమును సంతరించుకొనుచున్న రోజులవి. ఆ సమయమున వచ్చిన రచన లన్నియును సంస్కార పూర్వక విధానములతోనే నిండియుండుట ఆనాటి సాహిత్యమున గల ప్రత్యేకత.

దాదాపుగా ఆనాటి పురుష రచయిత లందఱు కూడా తమ తరువాతి తరము వారు స్వయముగా అభ్యున్నతిని పొందగలుగు మార్గములను, సంస్కారములను తాము సృజించు సాహిత్యమునసే ప్రవేశపెట్టి కొంతవఱకు మానవ పురోభివృద్ధికి పాటుపడిరి.

## విష్ణు ప్రియా బరువానీ :

విష్ణుప్రియా బరువానీ అనునామె రచించిన నీతికథా సంగ్రహము, ఆమె కుమార్తె స్వర్ణలతాదేవి రచించిన 'ఆర్హితిరోటా' (Ideal Woman) అను గ్రంథములు రెండును 1884 ప్రాంతమున వ్రాయబడినవి. అవి

రెండును భావము నందును, వస్తువు నందును నీతిబోధకములే. విష్ణుప్రియ భర్తయగు గుణాభిరామ బారువా ఉదార భావములు గలవాడు. అతడు వితంతు వివాహోద్యమ విషయముపై ఒక నాటకమును రచించెను. అతని ప్రథమభార్య మరణానంతరము వితంతువగు ఈ విష్ణుప్రియను వివాహము చేసికొనెను. వితంతు వివాహోద్యమమున ఆయన ఎనలేని సేవ యొనర్చెను. ఆయన ఈ సిద్ధాంతము ననుసరించి వితంతు వగు తన కుమార్తె స్వర్ణలతకు కూడా పునర్వివాహము గావించెను. ఆనాటి అసామీయు లెల్లరును ఆయన యొక్క సంస్కారయుతమైన అభిప్రాయములచే సహజముగ ప్రభావితులగుటయే కాక తన్ముద్రతో అసామీ రచయితలు అనేక గ్రంథములను కూడ రచించిరి.

పద్మావతీఫుకనానీ :

ఇంచుమించు ఇదే సమయమున నీతిదాయకమైన రీతిలో పద్మావతీ దేవిఫుకనానీ అను నామె 'హితసాధికా' (Benefactor) అను గ్రంథమును పిల్లల కొఱకు రచించెను. ఇందు ఆమె అల్పవయస్కులైన పాఠకులకు చాలా సులభమైన భాషలో జ్ఞానము, కర్తవ్యము, ఆత్మవ్యక్తిత్వము, గర్వము, విద్య, పాండిత్యము, ఆచారకాండ, అసూయ, దయ, శాంతము, సాధుత్వము, కృతజ్ఞతాభావము మున్నగువానిని గూర్చి విశదపరిచినది. ఈ వ్యాసములు 'జ్ఞానమౌక్తికములు' (Pearls of wisdom) అని ప్రకటింపబడినవి. ఇంత నిశిత పాండిత్యము, ఇంత శక్తి సామర్థ్యములున్నను పద్మావతీదేవికి ఈనాడు; 1884 లో వ్రాసిన 'సుధర్మార్ ఉపాఖ్యానము' అను నవలా రచయిత్రిగానే గొప్ప ప్రఖ్యాతి కలదు. ఆ విధముగనే ఆమె పాఠకులకు సుపరిచితయైనది. ఈ నవలయందు వివాహితులగు ముగ్గురు దంపతుల జీవితము, వారి యెడబాటు, తుదకు వారి పునర్మిలనములను సులభశైలిలో చిత్రించినది. నిజమునకు ఈ నవల పాత్రచిత్రణ కూడా లేనట్టి ఒక కల్పితమైన అల్పనవల. ఒక విధముగా ఇది నీతి ప్రబోధకమైన నవల. రచయిత్రి ఇందు 'భార్యాభర్తలు తమ జీవితమున పరస్పరము నెట్లు

మెలగుకొనవలెనో నిదర్శన పూర్వకముగా చూపినట్లు కాన్పించును. అందు వలననే ఇందు కొన్ని కొన్ని స్థలములలో పవిత్రత మున్నగు నంశములపై ఉన్నతస్థాయిని చర్చలు జరుగు సందర్భమున కథ సంభాషణాత్మకముగా సుదూరము సాగినది. ఇది ప్రప్రథమ అసామీ నవల అగుటయే దీనికి ఇంత ప్రతిభ వచ్చుటకు కారణము. పూర్వకాలమున ఆధునిక నవలవంటి సాహిత్య ప్రక్రియ లేకుండెను. అసామీ భాషా సాహిత్యమునకిట్టి రూపవిశేషములు ఆంగ్లపరిపాలకులతోడను, వారి సాహిత్య పరిచయమువలనను కల్గినవనుటలో అతిశయోక్తి లేదు. రెవరెండ్ ఎ. కె. గుర్నే రచనయైన 'కామినీకాంత' పై నవలకంటె ముందేరచించిపబడినను, అది కేవలము క్రీస్తుమత ప్రచారార్థమై వెల్వడినదగుటచేతను, అదియొకవిధమగు చిన్న విజ్ఞాపనాపత్రము వలె ఉండుటచేతను, పద్మావతీఫుకనానీ నవల అట్టిది కాకపోవుటచేతను, ఆమె నవలయే అసామీభాషలోని తొట్టతొలినవలగా పరిగణింపబడినది. ఇదియేకాక ఆమె తన కాలమునందలి వివిధపత్రికలలో తన పద్యములను, ఇతరవిషయములను ప్రచురించుచుండెడిది. అసామీ భాషకు ఉచితస్థానమును సంపాదించుటలో అనన్యసేవచేయుటచే అసామీభాషయనెడు మహాభవనముయొక్క 'రక్షకుడు మఱియు నిర్మాత' అను బిరుదముచే గౌరవింపబడిన, సుప్రసిద్ధుడైన అసాము దేశీయుడు ఆనందరామ్‌ఢేకి యాల్ ఫుకన్ (1829-59) అనువారికి పద్మావతీ ఫుకనానీ కుమార్తె. ఆయన తన దేశస్థులస్థితిని, దేశమున జరుగు మార్పులను గమనింపవలసినదిగా హెచ్చరించినాడు. తండ్రియొక్క ఈ ఉదారస్వభావమే కుమార్తెను కూడ ప్రభావితురాలినిగా నొనర్చెను. 19 వ శతాబ్ద మధ్యభాగమున జన్మించిన ఈమె తనకాలపు స్త్రీల పరిస్థితులను, వితంతువులను గూర్చియు వ్రాసిన వ్యాసమున ఈ క్రిందిరీతిగా లిఖించియున్నది :

"ఈ కాలపు స్త్రీవిద్య ఇంకను నియమితమార్గములలో బోధపఱుపబడుటలేదు. మనపెద్దలు మిడిమిడిజ్ఞానము అపాయకరమని యందురు. మనము ఇది సత్యమని ఒప్పుకొనవలెను. విజ్ఞానోత్సాహముల నిచ్చు

విద్యకు ప్రత్యేక ప్రయోజన ముండును. సగము సగము ఆసక్తితో నవలలు, నాటకములు, కావ్యములు చదువుటవలన జ్ఞానము కలుగదు సరికదా, ఆలోచన క్షీణించును'' అని.

ఆమె తన కావ్యములలో ఒకటియగు 'ప్రార్థనా' కావ్యమున గాఢమైన మతచింతనమును వెలిబుచ్చుట సహజమే. సమాజమున స్త్రీల పరిస్థితులను గూర్చికూడ ఆమె వ్యాసములను వ్రాసెను.

అనేక సారస్వత పత్రికలకు వ్యాసములు వ్రాసిన 'శరత్కుమారీదేవి' ఇంకొక రచయిత్రి. వంగదేశపు ఠాగూరు కుటుంబమునకు చెందిన 'ప్రజ్ఞా సుందరీదేవి' ప్రఖ్యాతిచెందిన అసామీ సాహిత్యవ్రతుడు 'లక్ష్మీనాథబెజ్ బౌరా' భార్య, పాకపద్ధతులు అను విషయములపై ఒక గ్రంథమును వ్రాయుటయే కాక పత్రికలకు వ్యాసములను కూడ వ్రాసినది.

## హేమప్రభాదాస్ :

నీత్యుద్బోధకమగు ఇతివృత్తమును స్వీకరించుటయే గాక 'జ్ఞాన మాలా', 'సజ్కథా' (Moral Sayings) అను రెండు పుస్తకములను కూడ రచించెను.

## నళినీబాలదేవి, ధర్మేశ్వరీదేవి బారువా :

మనము ఈ వ్యాసమును ముగించులోపుగా ఇక ఇద్దరు రచయిత్రుల నామమును పేర్కొనుట యుక్తము. అసామీ వాఙ్మయమున ప్రఖ్యాత రచనలు చేసినందులకై 'పద్మశ్రీ' బిరుదమును బొందిన 'నళినీబాలదేవి' అనువారును, కీర్తిశేషురాలైన 'ధర్మేశ్వరీదేవిబారువా' అనువారును 19వ శతాబ్దపు చివరిభాగమున జన్మించిరి. అయినను వారి కావ్యము లనేకములు పుస్తకరూపమునను, పత్రికాముఖమునను ఈ శతాబ్దారంభమున వెలుగులోనికి వచ్చినవి. వీరిద్దఱును ఉన్నతశ్రేణికిచెందిన రచయిత్రులుగా వారి కవితాస్వభావమును బట్టి నిర్ణయింపబడుటయే కాక ఇద్దఱును ఒక ప్రత్యేకశ్రేణికి చెందినవారుగా పరిగణింపబడుచున్నారు. ఇద్దువురును తమ వ్యక్తిగతజీవితమున కడగండ్లపాలైనవారే. ఇప్పటికిని కవిత్వరచన

నొనర్చుచున్న నళినీబాలాదేవి వివాహమైన అనతికాలముననే వైధవ్యము నందినది. ధర్మేశ్వరీదేవి మేహావాతమువలన శక్తియుడిగి కడకంధురాలై నది. కాని ఈ యిర్వురు కవయిత్రులును సర్వజ్ఞమును, సర్వశక్తిమంతమును, సుందరమును నైన పరమశక్తిని శరణుజొచ్చిరి. ఇర్వురును యోగినులైరి. విశేషించి నళినీబాల, తన తండ్రి నవీనచంద్రబార్డోలీ ప్రోత్సాహమునను, రవీంద్రనాథ్ ఠాగోరు రచనలచే ప్రభావితురాలగుటచేతను ప్రతిభావంతు రాలై ప్రస్తుతము 'సంధ్యార్ సూర్' (Songs of Evening) అను కావ్య మును రచియించెను. సృష్టియొక్క ప్రతి కవళికయందును ఆమె అమృతజీవన చైతన్యమును సందర్శించును. అజరామర సౌందర్యపిపాసతో మానవులు అన్వేషించు అనంత శక్త్యాకర్షణలో ఆమెకు సుస్థిరవిశ్వాసము కలదు. పర తత్త్వముయొక్క బహుముఖ వర్ణనచేయు భారతీయ తత్త్వమువలెనే, బహుముఖమగు ఇష్టదేవతారాధనమును ఆమె కవిత్వమునందు మనము చూడగలము. నళినీబాల కవిత్వసృష్టికి ఆధ్యాత్మికతత్త్వమే ప్రధానశక్తి. భారతీయ హృదయమునందలి నిత్యగీతమైన ఆధ్యాత్మికతత్త్వము ఆమె కవితయందు వెల్లుబుకుచు ఎప్పుడును సంసిద్ధముగా ప్రతిధ్వనించుచుండును. నళినీబాల కవితాప్రశస్తి కిదియే ముఖ్యకారణము. సమకాలిక స్థితుల కనుకూలమైన మానవత, గాంధీజీ, ప్రాచీన భారతీయౌన్నత్యమువంటి వివిధ విషయములపై ఆమె ఖండకావ్యములను రచించెను. ఈమె రచనలు నేడు అయిదు ఖండకావ్య సంపుటములుగా నున్నవి.

ఇక ధర్మేశ్వరీదేవి బారువా యన్ననో, ఆమె ఆరోగ్యమును బాగు పఱచుకొను నుద్దేశముతో సముద్రతీరములకు ఆమెను తోడ్కొనిపోయియు, అనేకవిధముల ఔషధసేవ చేయించియు ఆదరించిన భర్తసాహచర్యమున ఆమె బాగుగా దుఃఖోపశమనము నొందినది. ఆమె భర్త ప్రోద్బల ప్రోత్సాహములతో అపారసముద్రమును గూర్చియు, తుఫానుల బీభత్స మును గూర్చియు కావ్యరచన చేయనారంభించెను. తద్ద్వారా ఆమె వాటి సృష్టికర్త - తనకును సృష్టికర్త - యగు మూలతత్త్వమును సమీపింప

గల్గెను. ప్రాపంచిక సంకటములు, పరీక్షలు పరమేశ్వరుని వరములుగానే స్వీక రించి ఆమె తనను పూర్తిగా ఆయనపాదముల కర్పించుకొనెను. భారతీయ తత్త్వస్వభావానుకూలముగా ఆమె ప్రతివస్తువునందును ప్రతిస్థలమునందును పరమేశ్వరుని సత్తను దర్శించును. తాత్త్వికఘట్టమున (స్థాయిని) ఆమె సర్వ జీవులను తనవైపున కాకర్షించు శాశ్వత నాదమును అన్వేషించును. నిత్య సాయుజ్యమును, నిత్యసుఖమును, నిత్యగానమును నిరంతరమును ఆమె అన్వే షించును. ఆమె ఖండకావ్యసంపుటములు 'ఫూలార్ సరాయ్' 'ప్రాణార్ పరీశ్' (ప్రాణస్పర్శ) అను కావ్యములయందలి పద్యములు సరళఛందస్సున సరళశైలితో నుండును. కాని వానియందలి భావములు మాత్రము ఉత్తమములు, ఉన్నతములు. ఆమెకు భగవంతునియెడలగల విశ్వాసమున కును, తాత్త్వికచింతనకును ఇవి సాక్ష్యములు. జీవితానందముకంటె ఆమె కవిత అహంకార రాహిత్యమును ఎక్కువగా వర్ణించునందురు. ఆమె యేకాంతవాసి కవయిత్రి. ఆమెకు పరమేశ్వరుని కరుణయు, భర్త ప్రేమయు ముఖ్యమైన ప్రాపులు. ఆమె అనుభవమును నదియే. ఆమె కవిత్వమునందు కూడ ఇదియే ప్రత్యక్షమగును.

# ఆంధ్ర కవయిత్రులు

రచయిత్రి :
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

## తొలితరము - ప్రాచీనాంధ్ర వాఙ్మయము

భారతీయ దేశభాషలయందు ఆంధ్రభాష ఒకటి. Italian of the East' అనియు "దేశభాషలందు తెలుగు లెస్స" అనియు కీర్తింపబడిన ఈ మధురాంధ్రభాష దక్షిణభారతమునందలి సుమారు నాల్గుకోట్ల ఆంధ్ర దేశీయుల దేశభాష ! మాతృభాష !!

జగత్ప్రసిద్ధిచెందిన పూజ్యులు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, పోతన, శ్రీనాథ, శ్రీకృష్ణదేవరాయ, పెద్దన, వేమనాది మహాకవులయొక్కయు, చానమ్మ, తిమ్మక్క, మొల్ల, మోహనాంగి, గంగాదేవి, మధురవాణి, రంగాజమ్మ, రామభద్రాంబనాచి, ముద్దుపళని, వెంగమాంబ, సుందరీమణి, జ్ఞానమాంబ మున్నగు మహాకవయిత్రుల యొక్కయు; అన్నమయ్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య మున్నగు గొప్ప వాగ్గేయ కారకుల యొక్కయు మహనీయ రచనలచే ఆంధ్రభారతి విశ్వవిఖ్యాతి నార్జించి యున్నది.

కోమలమగు పదవిన్యాసముచే సహజముగానే మధురమైన తెలుగు భాష వాఙ్మయశోభను తమ తమ మంజుల రచనలచే ద్విగుణీకృతముగ అతిశయింపజేసిన ఆంధ్ర రమణుల రమణీయ సాహితీపరిశ్రమము ఆంధ్ర వాఙ్మయమునకు గర్వకారణమేకాక యావద్భారత వాఙ్మయ చరిత్రకే అలంకారప్రాయమైనది.

పదమూడవ శతాబ్దమున ప్రవర్తిల్లిన వీరసతి చానమ్మనుండి నేటి మహిళాభ్యుదయ వాఙ్మయమువఱకు సమగ్రకృషి సలుపగా సుమారు నాలుగువందల కవయిత్రులు, రచయిత్రులుగల ఈ మహదాంధ్ర మహిళా

వాఙ్మయ చరిత్రయందు 19 శతాబ్ది అంత్యభాగమువఱకు తమ తమ రచనా పరిష్క్రియచే ఆంధ్ర సాహిత్యమున కితోఽధిక సౌందర్యమును సమ కూర్చిన ఆంధ్రకవయిత్రుల చరిత్ర ప్రస్తుత మీ వ్యాసమున పొందుపరుపబడు చున్నది.

## ప్రాచీనాంధ్ర కవయిత్రులు

### 1. చానమ్మ :

మధురాతి మధురమగు ఆంధ్ర సారస్వత వాహినిని కమ్మని కవితా మరందములు చిందించిన కవయిత్రులు పూచిన పొందమ్మిలై పరిమళించు చున్నారు.

అందు ఆంధ్రభారతీ సంసద్భవమున కవయిత్రీ ప్రాతినిధ్యము నంగీక రించిన ప్రథమస్థానిని; చానమ్మ!

ఆంధ్ర సాహిత్య ప్రశస్తికి మూలస్తంభ మనదగిన కవిబ్రహ్మ తిక్క నార్యుని వదినగారును, "ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రమ్మ"ని ఆచరణలో నిరూపించిన ఖడ్గతిక్కన భార్యయునైన చానమ్మ, తన భర్త ఖడ్గతిక్కన పరాజితుడై 'పగఱకు వెన్నిచ్చి' రణరంగమునుండి యింటికి తిరిగిరాగా స్త్రీలకుపెట్టినట్లు బిందెపై పసుపుముద్దనుపెట్టి మంచము చాటుచేసి స్నాన మునకు నీళ్లుపెట్టెనట! అదిచూచి ఖడ్గతిక్కన బాధపడుచుండగా :

> "పగఱకు వెన్నిచ్చినచో
> నగరే మన మగతనంపు నాయకులెందున్
> ముగురాడువార మైతిమి
> వగపేలా జలకమాడ వచ్చినచోటన్."

అని ఆశువుగా పల్కి భర్తకు వీరరస ప్రోత్సాహపూర్వకమగు కవితోపచార మును చెల్లించినది. ఖడ్గతిక్కన ఈ పరాభవమునకే బాధపడుచుండగా తల్లి ప్రోలమ భోజనసమయమున విరిగినపాలను వడ్డించి 'ఆత డిది యేమి ?' యను నర్థముతో చూడగా —

"అసదృశముగ నరిపీరుల
పసమీరగ గెలువలేక పందక్రియ న్నీ
వసివైచి విరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్క పాలున్ విరిగెన్."

అని శూలములవంటి పలుకులతో ప్రత్యుత్తరమిడెను. భార్య, తల్లి యొనర్చిన ఈ వీరప్రబోధముచే ఉద్రిక్తుడై ఖడ్గతిక్కన తిరిగి యుద్ధభూమికి వెడలి విజయుడైయై ప్రాణముల విడచెను. స్వదేశ స్వాతంత్ర్యమునకు తమ ప్రభువు నకును సంఘటించిన ఘోర విపత్తును తొలగించుటకై నిజమాంగల్యమునే సరకుసేయని వీరకాంత చానమ్మయు, స్వదేశ స్వాతంత్ర్య రక్షణార్థము కడుపుతీపినైతము త్రోసిపుచ్చిన వీరమాత ప్రోలమ్మయు పలికిన పై పద్య ముల యందలి భావోద్దీప్తి, అకృత్రిమమగు స్వాతంత్ర్యపిపాస, వ్యర్థపద ములు లేకుండా హృదయమునకు సూటిగా తగులునట్లు చెప్పగల కవితా శిల్పమును గమనింపదగినవి. ఇట్టి అకలుషితాంధ్ర యువతీ వీరరసో ల్బణము; మాననీయాంధ్ర మహిళా సాహిత్యస్రవంతికి పుట్టువగుటచే నిజ ముగా ఈ సాహిత్యము ధన్యమైనది.

## గంగాదేవి సంస్కృత మహాకవయిత్రి మధురావిజయము

వీరవిక్రమాటోపమునను, సారసామర్థ్యమునను పరమశివున కెన యైన వీరకంపరాయల పట్టమహిషి గంగాదేవి గీర్వాణభాషయందు 'మధురా విజయ' మను మహాకావ్యమును రచించెను. కంపరాయలు విద్యానగర సామ్రాజ్య ప్రతిష్ఠాపకులగు సంగవంశప్రభువులలో మూడవవాడు. 1370 ప్రాంతమున విద్యానగరము నేలిన ఈ మహావీరుడు ఆనాడు దక్షిణ భారతదేశమున చోళ పాండ్యదేశములయందు దుష్పెనగా ఉప్పతిల్లుచున్న మహమ్మదీయ దండయాత్రల నెదుర్కొనుటకై ఆంధ్ర సేనావాహినిని వెంటనిడుకొని యేగి మహమ్మదీయులతో యుద్ధము నొనర్చి జయమంది తిరిగివచ్చిన పరమసాహసి భర్తకు తగిన భార్యయై కదనశిల్ప పారంగ

తత్వమే కాక, కవితాశిల్ప ప్రాభవమును కల్గి గంగాదేవి తన భర్తృ విజయ గాధనే "మధురావిజయమ్" అను పేరున సంస్కృతమున మహా కావ్యముగ రచించెను. "వీరకంపరాయచరితమ్" అని దీనికి నామాంతరము కలదు. ఇందు కావ్యాదిని సంస్కృతకవి స్తుతియు, వెనుక—

"తిక్కయజ్వ కవేస్సూక్తిః కౌముదీవ కలానిధేః
సతృష్ణైః కవిభి స్సైస్వైరం చకోరై రివ సేవ్యతే."

ఈ విధముగా ఆంధ్రకవి స్తుతి నీమె నూతనవిధానమున నొనర్చెను.

సుకుమార భావుకతకు, ధారాళమగు శైలికి, సున్నితములగు ఉపమలకును నీమె పెట్టినదిపేరు.

ఈమె తన కవిత్వమునకు కవికుల గురుడగు కాళిదాసును ఆదర్శముగ గైకొనెను. అయినను కొన్నితావులలో ఉపమలను చిత్రించుటలో కాళిదాసును కూడ మించెను. కాళిదాసుయొక్క, గంగాదేవియొక్క ఈ క్రింది శ్లోకములను పరికింపుడు :

కాళిదాసు : ససేనాం మహతీం కర్షన్ పూర్వసాగర గామినీమ్
భభౌ హరజటాభ్రష్టాం, గంగా మివ భగీరథః.

హరజటాజూటమునుండి భ్రష్టమైన గంగను భగీరథుడు కొనిపోయినట్లు, పూర్వసాగరగామినియగు మహాసేనను గొంపోవుచు నా రఘుమహారాజు ప్రకాశించెను.

గంగాదేవి : సనయన్ మహతీం సేనాం, వ్యరుచ ద్వీరకుంజరః
పయోదమాలా మాకర్షన్ పౌరస్త్య ఇవమారుతః.

వీరకుంజరుడైన కంపభూధవుడు మేఘమాలను గొనిపోవు తూర్పు పయ్యెరవలె గొప్పసేనను వెంటనిడుకొని పోయెను.

లాలిత్యము, స్త్రీ సహజ సౌకుమార్యముకల ఇట్టి వర్ణనలు ఈ కావ్యమున మనకు లభించును.

## తొలి తెలుగు కావ్య కవయిత్రి

### 4. తాళ్లపాక తిమ్మక్క - సుభద్రాకళ్యాణము :

సుభద్రా కళ్యాణము అను మృదుమధుర ద్విపదకావ్యమును తెన్గున రచించిన తిమ్మక్క (15 వ శతాబ్దము) సుప్రసిద్ధపద కవితాపితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యుని సతీమణి. వీరి కుటుంబము పదకవితకు, ద్విపద రచనకు వాసికెక్కినది. అలవోకగా కృతులు రచించుట వీరి కులవిద్య. చక్కని తెలుగు జాతీయము, చిక్కని భావ మృదులత, మినుమిక్కిలి యగు సుకుమార శృంగార రసావేశము ఒకదాని కొకటిమించి అలలవలె పైకొనగా రసార్ణవమున పరవశమున మున్కలువేయుచు నిందలి పండ్రెండు వందల ద్విపదపాద సోపానముల నధిగమించి, పఠితలు ఆనందపదసీమను తెలియకయే చేరుకొందురు.

ముగ్ధమనోహరమైన ఇందలి వర్ణనలకు నిదర్శనము : అన్నగారగు శ్రీకృష్ణుడు తన్నుబిలువగా సుభద్ర కృష్ణుని దరిసినతీరు :

"అని ఇట్లు తమ అన్న అంకించి పిలువ
పసిడి సలాకనా పణతి సుభద్ర
వలిపువ్వుగుత్తుల తవిరాకుబోణి
లలిత సౌరభశోభ గులుకరింపంగ
పసి చక్కగా పైట సవరించుకొనుచు
నడనడ చిన్నారి నడుము జవ్వాడ
అందెలు మ్రోయంగ హారముల్ తూగ
మొలనూళ్లు ఘంటలు మద్దియల్ మ్రోయ
సంది దండలు వెల్గ, సరిపెణలుదూల
దివ్వెలై హారముల్ తెరువుజూపగను
అల్లనల్లనవచ్చె అన్నముందరికి
భద్రేభగమన సుభద్ర రమ్మనుచు
తోయజాతుడు తన తొడపైననునిచె

నీలాలవంటి వా నెలత నెఱికురులు
వాలారు కొనగోళ్ల వడిచిక్కుదీసె
చుబుకంబు పైకెత్తి చూచి యోదార్చె
కుంచించుకొని శిరసు వంచుకొనబోవ
శిరసు తా బైకెత్తి చెల్లెలిన్‌జూచి."

విద్యా విజ్ఞాన సంస్కారాదులచే నధికులయ్యు నా అన్నా చెల్లెండ్ర హృదయములనుండి పొంగులువారిన అకృత్రిమానురాగధుని పై పంక్తులలో వెల్లివెరిసి, ఆ యనురాగమహిమను వ్యక్తీకరించుటకీ భాషా ప్రపంచము చాలదనిపించెను. ఈ కావ్యమింత సుదిమెత్తనిదగుటచేతనే చేమకూర వేంకటకవి యిందుండి పాదములకు పాదములు తన విజయవిలాసమున వాడుకొనెను.

## మహాకావ్య నిర్మాత్రి - ఆతుకూరి మొల్ల
## రామాయణ మహాకావ్యము

శ్రీరామచంద్ర చరణారవింద సంసేవనానంద పారవశ్యమున రామాయణ మహాకావ్యమును రచించిన మొల్లకు ఆంధ్రవాఙ్మయమున నొక భద్రాసనము కలదు. పోతనార్యుని వలెనే "చెప్పుమని రామచంద్రుడు!................... చెప్పించిన పలుకుమీద...................నే" తెలుగునకు పొందై వీనులకు విందైన కందువమాటల సామెత లందముగా కూర్చి రామకథను కావ్యముగా గానముచేసిన మహా తపస్విని; మొల్ల!

ప్రౌఢ పాండిత్యప్రకర్షకు, మురువు గులుకు తెలుగు మరుగుఁతోడి అర్థవ్యక్తికల సులభశైలికి, వర్ణనలపట్ల సహజచిత్రణకు, శబ్దార్థముల యొండొంటి యొదుగుబాటుచే రూపొందు హృదయంగమ రూపకల్పనకును మొల్ల కవితాశిల్పము పేరుగాంచినది.

"సుడిగొను రామపాదములు సోకిన ధూళివహించి రాయియే
ర్పడ నొకకాంతయయ్యె నట పన్నుగ నీతని పాదరేణు వి

య్యెడ వడి నోడసోక యిది యేమగునోయని సంశయాత్ముడై
కడిగె గుహుండు రాముడు పదకంజయుగమ్ము భయమ్ము పెంపునన్."

ఇందలి గుహుని సంశయమునందలి హృదయంగమ కల్పనకును, అద్భుత చిత్రణమునకును ఏమిచ్చి తెలుగుజాతి మొల్ల ఋణ మీగగలదు ?

"ఉన్నాడు లెస్స రాఘవుడు"..........."కంటికిన్ జానకి........"
మొదలగు పద్యములయందలి ఔచిత్యము "మొగము బిగించి..........."
మొదలగు పద్యములయందలి వర్ణనాసహజతయు అనితరసాధ్యములు.

కుంభకారకులసంజాతయగు నీ మహానుభావురాలి తండ్రి ఆతుకూరి కేతన. ఈమె 16 వ శతాబ్దమునాటి దనియు, ఆంధ్రభోజుడగు శ్రీకృష్ణ దేవరాయల సమకాలీన యనియు నందురు. ఈమె శ్రీకృష్ణదేవరాయల యాస్థానమునకేగి యా ప్రభుని ప్రశంసించుచు కొన్ని పద్యములను జెప్పె ననియు నా ప్రభు వామెను సత్కరించెననియు నందురు. ఎంత సత్యమో.

## 6. మోహనాంగి - మరీచీపరిణయ కావ్యకర్త్రి ;

కవులపాలిటి ముంగొంగు బంగారమైన ఆంధ్రభోజుడు శ్రీకృష్ణ దేవరాయల కుమార్తె మోహనాంగి మరీచీపరిణయ కావ్యకర్త్రి యను నైతిహ్యము సారస్వతలోకమున అనూచానముగ సాగివచ్చుచున్నది. కాని గ్రంథ మెచ్చటను కానవచ్చుటలేదు.

కాని చాలాకాలముక్రిందట ప్రచురింపబడుచు వచ్చిన సమదర్శిని పత్రికయం దీమె కావ్య ప్రారంభపద్యములుగా ప్రచురింపబడినవానిని శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు తాము రచించిన "భట్టుమూర్తి - రామరాజభూషణుడా?" అను గ్రంథమున ప్రచురించియున్నారు. వారు తాము ఆ పద్యములను సమదర్శిని పత్రికయందు చూచియుంటినని నా కిటీవలనే తెల్పియున్నారు.

అవి యివి :

1. "అకలుష మాధురీకలితయై యలసాని కవీశుబోలె న
ల్లిక బిగి, ముక్కు తిమ్మకవి లీలను ముద్దగుబల్కు, పాండు రం

గకవిగతిఁ బదక్రమముగల్గు కవిత్వముతోడ విష్ణుచి
త్తుకథ రచించు మజ్జనకు దోరపుబత్తి నుతించి మ్రొక్కెదన్.''

2. మనుచరిత్రము కృతిగ నొసంగు పెద్దన
దగు నాంధ్ర కవితాపితామహుండు
నర్థిమై పారిజాతాపహరణము కృ
తిగ నొసంగిన నంది తిమ్మనకవి
మాటల నతులిత మాధురీమహిమంబు
తోడ బల్కుచుండు ధూర్జటికవి
రసముప్పతిలుచుండు రచనచే సుధ వెద
జల్లు మాదయగారి మల్లనకవి
మున్నుగల యష్టదిగ్గజంబులను కవుల
మంత్రిసత్తముడైన తిమ్మరుసుగూడి
భువనవిజయ నామక సభాభవనమందు
నోలగంబుండు కృష్ణ భూపాలకుండు.''

ఇదివరలో ఈమెదని చెప్పబడిన పద్యము నీ క్రింద చూపుచున్నాను.

ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిచూచి
తరుణి తనుమధ్య మెచటికో తలగిపోయె
నుండెనేనియు గనుపడకున్నె యహహ
యుద్ధతులమధ్య పేదలకుండదరమె.

మోహనాంగి నిజనామము 'తిరుమలాంబ' యని యొక యైతిహ్యము! ఇవియన్నియు నెంతయథార్థమో? ఈమె కావ్య మెందుదాగియున్నదో?

## సంస్కృత కావ్యకర్త్రులు

### 7. తిరుమలాంబ - వరదాంబికా పరిణయము :

వరదాంబికా పరిణయ కర్త్రియగు తిరుమలాంబను ప్రస్తావించుటతో వైభవోపేతమగు విద్యానగరమునకు చెందిన కవయిత్రీ చరిత్రము

ముగిసినట్లే. గంగాదేవి, మొల్ల, మోహనాంగి. *తుక్కా పంచకమును రచించిన దను ప్రసిద్ధిపొందిన తుక్కాదేవియు, తిరుమలాంబయు కలిసి వీరైదుగురైనారు.

శ్రీకృష్ణదేవరాయల యనంతర మాతని సవతి తమ్ము డచ్యుత రాయలు సింహాసనము నధిష్ఠించెను. వరదాంబిక యాతని పట్టపురాణి. ఈ యిర్వురి పరిణయ గాథను తిరుమలాంబ సంస్కృతమున చంపూ గ్రంథముగా రచించెను. ఈమె తన కావ్యమున సర్గాంత గద్యాలలో తన పాండిత్య ప్రాబల్యమును గూర్చి చాల అధికముగ ప్రస్తావన మొనర్చినది.

ఈ 1530 ప్రాంతపు కవయిత్రి గంగాదేవితో ప్రారంభమైన సంస్కృత కావ్యరచనకు తిరుమలాంబ రచనతో ప్రోది యేర్పడినది.

19 వ శతాబ్ద్యంత్య భాగము వఱకు ప్రవర్తిల్లిన మహిళా సారస్వత మంతయు — మహిళా సారస్వతమే యననేల ఆంధ్ర సారస్వతమే — కావ్య సాహిత్యమే అందును ప్రాచీన సాంప్రదాయ సిద్ధమైన కవితా శిల్పము దక్క ఇంకొక ప్రక్రియా భేదము కాని, రచనా శిల్ప భిన్నత కాని కాన్పింపదు.

ఆంధ్రమునకే కాక, ఎల్ల భాషలకు సంస్కృతి సాంప్రదాయముల నొసగి సాకిన తల్లిభాషయగు దేవభాష యందు సమర్థముగ మహా కావ్యరచన చేసిన మానినీ మణులు పెక్కు రాంధ్ర మహిళ లుండుట నిజముగా ప్రస్తుతి ప్రాతము. ఇట్టి కవయిత్రులలో తిరుమలాంబ రెండవది.

### 8. నాచి - నాచీ విజయ నాటక కర్త్రి :

వేద వేదాంగ కోవిదుడును, సంస్కృతాంధ్ర సాహితీ నిష్ణాతుడును, జ్యోతిషాది సమస్త శాస్త్రవేత్తయునైన వలేశ్వరోపాధ్యాయుల కుమార్తె నాచి గొప్ప పండితురాలు. బాల్యమునందే వైధవ్యము నొంది

*తుక్కా పంచకమని ప్రసిద్ధిపొందిన శ్లోకము లైదింటను రెండు తత్పూర్వమే వల్లభదేవుని సుభాషితావళి యందును ఒకటి ముకుళభట్టు అభిధావృత్తి యందును కానవచ్చుచున్నవని శ్రీ ఆంధ్ర శేషగిరిరావుగారు వ్రాయుటచే నామెను గూర్చి నేను ముచ్చటించలేదు.

తండ్రికడ ఆయన గురుకులమున సాంగోపాంగముగ సర్వవిద్యా, శాస్త్ర కళా రహస్యముల శిక్షా పూర్వకముగ కైవసము చేసికొని కాశీయాత్రకై యిలు వెడలి మధ్య మార్గమున గల పండితులను జయించి తన జయగాథ లనే "నాచీ విజయ" మను పేర సంస్కృతమున నాటకముగ రచించిన ప్రతిభాశాలిని, నాచి! ఈ అఖండ ప్రతిభావంతురాలి రచనమున ఒక శ్లోక మేని కాన్పింపకుండుట ఆంధ్ర వాఙ్మయ దురదృష్ట మనవలెను.

## 9. లీలావతి - గణితశాస్త్ర కావ్యకర్త్రి :

నాచిని పోలినదే లీలావతియును, సుప్రసిద్ధ గణితశాస్త్రా చార్యుడైన భాస్కరాచార్య తనయ; లీలావతి. లీలావతి కూడ గణితశాస్త్ర వేత్త్రియే పురా కాలముననే విషయమును రచించినను కావ్య రూపమున రచించుటయే సాంప్రదాయ సిద్ధమైన సదాచార మగుటచే లీలావతి తన గణిత శాస్త్ర మును సంస్కృత కావ్యముగ రచించినది.

భాస్కరాచార్యులు గొప్పజ్యోతిష శాస్త్రవేత్త. తన గారాబుపట్టి లీలావతికి విధివిహితమైయున్న వైధవ్యమును తప్పింపవలెనని ఆతడెన్నియో యత్నముల నొనర్చెను. కాని అది కొనసాగలేదు. పసుపు పూయుటయు ముసుగు వేయుటయు పాపము లీలావతి కొకమాఱు జరిగెను. జరిగిన దానికి చింతించి భాస్కరాచార్యులు తన తనయకు గణిత శాస్త్రమున ప్రవేశము కల్పించెను. అందామె గొప్ప నైపుణ్యమును సంపాదించి 'లీలావతీ గణిత' మను పేర నొక గణిత శాస్త్ర గ్రంథమును రచించెను.

లీలావతీ గణితము జగద్విఖ్యాతి నొందినది. ఈ గ్రంథము ఆంగ్ల పరాసు భాషలలోనికి కూడ అనువదింప బడినది.

"అస్తి స్తంభతలే ఘటః తదుపరి క్రీడా శిఖండీస్థితః
స్తంభేహస్త నవోచ్ఛ్రితే త్రిగుణిత స్తంభ ప్రమాణాన్తరే.
దృష్ట్వాహింబిల మావ్రజన్త మపతత్తిర్యక్స, తస్యోపరి
క్షిప్రం బ్రూహి తయో ర్బలా త్కృతికరై స్యామ్యానగత్యోర్యుతిః.

ఆమె గణితశాస్త్ర కవిత యింత రసవత్తరముగా నున్నది.

## 10, 11 శారద, త్రివేణి :

దేవరాయల ఆస్థానియగు శారద సంస్కృత కవయిత్రియట. విశేషములు తెలియవు.

త్రివేణి శ్రీ రంగాభ్యుదయ చంపూ ప్రబంధమును ఇంకను ఇతర గ్రంథములను రచించిన త్రివేణియు సంస్కృత కావ్యకవయిత్రియే. రంగనాథ సహస్రము, లక్ష్మీనాథ సహస్రము, శ్రీ రంగాభ్యుదయము, సంపత్కుమార విజయము, రంగరాట్సముదయము, తత్త్వముద్రాభద్రోదయము, శుక సందేశము, భృంగ సందేశము అను పెక్కు సంస్కృత కావ్యములను రచించిన ప్రశస్త కవయిత్రి త్రివేణి. ఈమె కావ్యము లన్నియు నింకను అముద్రితములై తంజాపుర సరస్వతీ గ్రంథ భాండా గారమున ముద్రణ భాగ్యమెపుడాయని తపించుచుండుట చింతాకరమైన అంశము !

గొప్ప విద్వాంసుడైన ఉదయేంద్రపురం అనంతాచార్యుల కుమార్తె ఈమె. తండ్రి కడనే చక్కగా విద్య నభ్యసించినది. భర్త అయిన ప్రతివాది భయంకరం వేంకటాచార్యుల సన్నిధిని కూడ ఆమె విద్యకు మంచి దీప్తి కలిగినది.

త్రివేణి వైష్ణవి, విశేషించి శ్రీ రంగేశ భక్తురాలు. ఆమె కావ్యముల యందు మొదటి రెండును సహస్రనామ కావ్యములు - మూడవది చంపువు. తత్త్వముద్రాభద్రోదయము విశిష్టాద్వైత మత సాంప్రదాయకమగు వేదాంతగ్రంథము. శుకసందేశ, భృంగసందేశ కావ్యములు, వియోగ శృంగార రసాత్మకములగు సందేశ కావ్యములు. శ్రీ రంగనాథ చంపువున ఆశ్వాసాంత శ్లోకములలో తన కావ్యమును గూర్చి సద్బృందవంద్యమైన మహా కావ్యమనియు ఆమ్నాయమువలె మధురమైనదనియు ప్రశంసించినది.

అది యిట్లున్నది :

"త్వద్గఙ్గాఙ్గ తరఙ్గ పఙ్క్తి విల సద్భంగత్ర ప్రాకృతస్వావా
గ్గుంభోఽనన్త విరస్త్వసూత తనయాం యో సౌత్రివేణ్యాత్మికాం
శ్రీ రంగాభ్యుదయే త్వయా విరచితే సద్బృందవంద్యేమహా
కావ్యేఽసౌ దశమ స్సుధాకృతరస స్సర్గస్య మాధుర్య కృత్."

## 12. రామ భద్రాంబ (1633) రఘునాథాభ్యుదయము

సంగీత సాహిత్య కళాకోవిదుడును, మహా పరాక్రమశాలియు నైన రఘునాథ భూజాని తంజాపురము నేలినపుడు అనేకులగు విద్వత్కవులను పోషించి నట్లే, విద్వత్కవయిత్రులను గూడ పోషించెను. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర యందు కవయిత్రులను ఆస్థానముల యందు పోషించుట యనునది నాయక రాజులతోడనే ఆరంభమైనది.

రఘునాథ నాయకుని ఆస్థానమగు లక్ష్మీవిజయ విలాస భవనము కవి పండిత గాయక కవయిత్రులతో సందడిగా నుండెడిది.

నాయక రాజుల ఆస్థానముల యందలి కవయిత్రు లందరును అష్ట భాషా విశారద లౌటయే కాక ఆయా భాషలయందు కవిత్వము కూడ చెప్పగల దిట్టలు. సమస్యా పూరణము, ఆశు కవిత్వము ప్రాస్తావిక పద్య కల్పనము, చిత్ర బంధ కవిత్వ రచనము మున్నగు కవిత్వ క్రీడలయం దారి తేరినవారు. వారు నాయక రాజాస్థానమునకే గాదు ఆంధ్ర దేశము నందలి కవి లోకమునకే అలంకారమన దగినవారు. రఘునాథ నాయకుని ఆస్థానమున మెఱసిన వారిలో రామ భద్రాంబ "రఘునాథాభ్యుదయము" అను ద్వాదశ సర్గలును, 900 శ్లోకములును కల సంస్కృత కావ్యమును రచించెను.

రాజగోపాల విలాసాది కావ్యకర్త యగు చెంగల్వ కాళకవి యీమెకు కవితా గురువు. అటనట వాడిన శార్దూల మాలినీ, స్రగ్ధరా వృత్తములు దప్ప తక్కిన కావ్యమంతయు ఒకే ఛందము. ఇది రఘునాథ నాయకునిపై చెప్పిన కావ్యము. ఇందు రఘునాథ నాయక, వంశ, రాజ్య, పరాక్రమాది వర్ణనలే కాక ఆనాటి స్త్రీ విద్య, స్త్రీల సంస్కారము, సంగీత విద్య, రావణ హస్తము, నాటక రచనము, గాన నృత్య విశేషములును చెప్పబడుట గమనింప దగినది. ఆనాటి మూడేండ్ల బాలికల విద్యా వైభవము కూడ నాయక బహూకృతము కాదగినంత విశేషముగా నుండెడిదట.

"చింతా సమస్యా శతమేకదైవ తత్కీర్తివార్తా నహివర్ణనీయా
అశేష లోకాశ్రయవృత్త భేదవిద్యా విశేష ప్రథితస్యయస్య
అంతఃపురాన్తర్వారిణేక్షణానుత్రివోయణీనామపి దీప్యమానాన్
విలోక్య విద్యా విభవానజస్రం వశంవదాం యస్య వదంతి వాణీం.

వశంవదయైన వాణితో విరాజిల్లు రఘునాధ నాయకుని కాలము నాటి విద్యా వైభవమును రామభద్రాంబ చక్కగా వర్ణించెను.

తెలుగు భాషలో పూరించిన సమస్యలు ప్రాకృతమున చెప్పిన పద్యములు చాలా కలవు.

తెలుగుసమస్య : ఏరీ నీసరి రాజులు
భూ రమణులు నిన్నుజాల బొగడుదురు భళీ
స్వారాజని, రేరాజని
రారాజని యచ్యుతేంద్ర రఘునాధనృపా !

ప్రాకృత సమస్య : పరిపుణ్ణ కళాహి సోహమాణో
అహోయం సక్కుళణిచ్చ సెవ్వమాణో
సహోవి (స ?) చెంది ఆవో
రహుణాక్ఖితి చెందిరో విహోయి

ఛాయ : (పరిపూర్ణ కళాభి శోభమానః
అభితస్సత్కుల నిత్యసేవ్యమానః
సఖియ (శః) చంద్రికాఢ్యో
రఘునాధక్షితి చంద్రో విభాతి.)

ఏ భాషలో వ్రాసినను మృదువగుశైలి, భావపుష్టి ఈమె కవితా విశేష గుణములు.

## 13. మధురవాణి - రామాయణ సారకావ్య తిలకము :

సర్వ కళా కుశలుడైన రఘునాధ నాయకుడు ఆంధ్రభాష యందు రామాయణ కావ్యమును రచించెను. దానిని సంస్కృతీకరింప సమర్థులెవరు ? అని యా మహారాజు తన యాస్థానమున ప్రశ్నింపగా నెవ్వరును

బదులాడక మిన్నకుండుటయు, తదాస్థానినియును, నాయకునివలెనే సర్వ కళాకుశలయునగు మధురవాణి తాను సంస్కృతీకరింతునని తెల్పి యత్యంత ప్రభావ పూర్ణముగ నా భూధవుని కావ్యమును సంస్కృతీకరించుటయు జరిగెనట.

రఘునాథ నాయకుని ఆంధ్ర 'రామాయణము' కాని, మధురవాణి 'రామాయణ సారకావ్య తిలకము' కాని సంపూర్ణముగ లభించుటలేదు. ఈ కావ్యము తంజాపురము నుండి బెంగుళూరు నందలి మల్లేశ్వరము నందున్న వేదవేదాంగ గ్రంథాలము చేరినదట - సుందరాకాండ వఱకు లభించు చున్నంత వఱకు 1500 శ్లోకములు గల 14 సర్గల గ్రంథము కనబడు చున్నది.

మధురవాణి మహాప్రజ్ఞాశాలిని యగు ప్రౌఢకవయిత్రి. సర్గాంత గద్య లలో ఈమె చెప్పిన "మాధుర్యధురంధ రాంధ్ర కవితా నిర్మాణ సమ్మాన్యయా" అను వాక్యమును బట్టి యీమె ఆంధ్ర కావ్యములను కూడ వెలయించెనని తెలియుచున్నది. కాని యవి లభింపలేదు.

"ఘటికార్ధ నిర్మిత శతశ్లోకిననియు" "షడ్భాషా రచనా విశేష బహుధా విఖ్యాతకీర్తి" కలదాననని యు "సమస్త వ్యాకరణాదిశాస్త్ర నిష్ణాత" ననియు 'సద్యోవిస్మయకృన్ని రోష్ఠ్య కవితా సందర్భ ధారాసుధా సారోర్మి పరిపూరితశ్రుతిసుధీ సంభావితాభిఖ్యా' ననియు 'సూరిస్తవ్య కుమార సంభవ మహాకావ్య ప్రతిగ్రన్థన ప్రాగల్భ్య ప్రకట శ్రియా పదపద ప్రఖ్యాత వైదుష్యము 'కలదాననియు,' 'ప్రౌఢ శ్రీరఘు నాథనాయకకృత స్వర్ణాభిషేక క్రియ' కలదాన ననియు సర్గాంత గద్యలలో వ్రాసినది. సూరి స్తూయమానమగునట్లు కుమార సంభవ మహాకావ్యమును రచించినదట. ఏ భాషయందో ఈ ప్రతిభావంతురాలు రచించిన ఆ కావ్యము కాన రాకుండుట ఆంధ్రుల దౌర్భాగ్యము కాక మఱియేమి!

ఈ మహా కవయిత్రిని సరసరసాధి దేవతయగు రఘునాథ నాయకుడు స్వర్ణాభిషేకము కావించెనట! అబ్బురమే మున్నది? "కథాగ్రథన

సంవిధానములో, కళావైదగ్ధ్యములో, నీ కావ్యముత్తమ కావ్యమై, రఘువంశ, కుమార సంభవాదుల యంత ఉత్తమముగా నున్నది. శబ్దముల యందలి యవ్యక్త మధురమైన నాద విశేష మీమెకు బాగుగా తెలియును. పేశలమృదూక్తి కీమె శైలి పెట్టినదిపేరు. భాష, ఈ భాషా సరస్వతికి మిగుల వశవర్తిని, కల్పనాశక్తి యప్రతిమానము' అని శ్రీ కురుగంటి సీతా రామయ్యగారు ఈ కావ్యమును ప్రశంసించిరి.

ఈ కావ్యము నందలి రఘునాధనాయక వర్ణన ఘట్టము నందలి లక్ష్మి విజయ విలాస భవన వర్ణనమును గాంచుడు.

బందీకృతా యేన పరక్షితీశ మహో మణీమందో కీర్తికన్యాః
పరార్ధ్య దంత ప్రతిమా నిభేన స్తంభం సమాలంబ్య చిరంవసంతి.

ఈ రఘునాధ (నాయకుని సభా భవన స్తంభములపై చెక్కబడిన మణి పుత్రికలు; ఆ మహావీరునిచే జయింపబడిన పరరాజుల నుండి బందీగా తీసి కొనిరాబడి స్తంభములకు కట్టివేయబడినవారికీర్తి కన్యలవలె శోభిల్లు చున్నవై చిరకాలము ఆ స్తంభముల యందే వెలయుచున్నవి.) ఎంత రమణీయమైన కల్పనయో, ఎంత మనోహరమైన శైలియో పఠితలకే తెలియగలదు.

ప్రౌఢ పండితులకును దుర్గ్రాహములగు 'రాజనీతి రహస్యశా' వంటి ప్రయోగము లెన్నోకలవు. ఆ ప్రయోగముల కామెయే యర్థము వ్రాయుటయు కలదు.

పండిత వాదమున మధురలో నున్న సరస్వతీ గ్రంధ భాండాగార మును గెలిచి తంజాపురమున ప్రతిష్ఠించిన అపర సరస్వతి యీామె.

రఘునాధ నాయకుడే యొసంగిన "కింతేరఘునాధ నాయకా యన్తే" అను సమస్యను.

"కతి కతిన క్షితిపతయః. కిం? తే, రఘు నాధనాయకాయన్తే."
భువి బహవః కిల తరవః, కిం? తే, సంతాన పాదపాయన్తే
అని వెంటనే పూరించినదట.

ఆమె పూరించిన ప్రాకృత సమస్య ఇంకొకటి :

తెళ్లోక్కేక్క సుహావహా సుహాయర, వియయ రాహావం సఇణం దెణ్ణూణణియ తణూయం, వద్ధహి రహుణాహరాయ పాహోహె

ఛాయ : త్రైలోక్యైక సుఖావహా శ్శుభకరోవిజయ రాఘవ శశినం దృష్ట్వానిజతనూజం, వర్ధతేరఘునాథ పాథోధిః. క్రీ గీత గల పాదము సమస్య

రఘునాథ నాయకుని యాస్థానమున తేనెటీగలు రొదచేయునట్లు మహిళా కవయిత్రులు సందడిచేయు చుండెడివారట.

మహిళా కవయిత్రీమణులకు వసంత కాలమనదగిన నాయక రాజుల కాలమునందలి కవయిత్రు లందఱిలో మధురవాణి నాయక హీరమణి. ఇంతతో ప్రాచీనయుగ సంస్కృత కావ్యరచన చేసినవారి చరిత్ర ముగిసినది.

## 14. కృష్ణాజీ - 15 రంగాజీ :

### ఉషా పరిణయ మన్నారుదాస విలాసములు :

రఘునాథ నాయకుని తర్వాత నాతని పుత్రుడు విజయ రాఘవ నాయకుడును కావ్య ప్రణేత యగుటయే కాక సరస కళా వినోదియైన భూజానియై యుండెను. ఎందరోకవి, కవయిత్రు లాతని యాస్థానమును గూడ నలంకరించి యుండెడివారు. అందు రంగాజీ ప్రముఖ కవయిత్రి.

రంగాజీ పసుపులేటి మంగమాంబా వేంకటాద్రుల కుమార్తె. సంస్కృత, ప్రాకృత, శౌరసేనీ, మాగధీ, పైశాచీ చూళికా, అపభ్రంశ, ఆంధ్రభాషలలో కవిత్వమల్ల గల్గిన అద్భుత ప్రజ్ఞావతి.

ఈమె తన గద్యలో చెప్పుకొనిన "విచిత్ర తరపత్రికా శత లిఖిత'త్వము, 'రాజనీతి విశారద'త్వము, 'అతు లితాష్ట భాషాకవితా సర్వంకష విశేష విశారద'త్వమును 'శృంగారరస తరంగిత పద కవిత్వ మహనీయ మతి స్ఫూర్తి' త్వమును ఏ మాత్రము నతిశయోక్తులు కావు.

అద్వితీయ కవితా వైదుష్యములకు ప్రతిరూపమైన రంగాజీ కృతులు (1) మన్నారు దాసవిలాసము-ప్రబంధములు (2) మన్నారు దాస

విలాసము—నాటకము (3) ఉషాపరిణయము ప్రబంధము–రామాయణ, భారత, భాగవత సంగ్రహములు ఇవియన్నియు పద్యకావ్యములు-ఇవికాక లలిత ఫణితిని మృదురసాస్పదముగ పెక్కు పదములు రచించెను.

వాని యందు మన్నారుదాస విలాస నాటకము (యక్షగానము) ఉషా పరిణయము మాత్రము అచ్చుపడినవి.

ఉషాపరిణయ ప్రబంధమున గొప్ప కవితాశిల్పముకాని, నైపుణ్యము కాని అగపడకున్నను, సమాసాడంబరముచే సౌందర్యము కోల్పోవని సరళ సులభ గ్రాహ్యమగు శైలియు, ధారా విశుద్ధియును స్పష్టముగా కన్పట్టును. శైలీ విశుద్ధతకు ఉషా పరిణయము నుండి :

"ఇచ్చకము లాడి మిక్కిలి విచ్చలవిడి గొల్లచెలులవేడుకమీరన్ !
దచ్చనల గూడి జొణిగెడు నచ్యుతునకు మనుమడనిన నడుగగనేలా."

నాయకరాజుల యాజమాన్యమున విలసిల్లిన దక్షిణదేశీ యాంధ్ర వాఙ్మయ మంతయు తెలుగు నుడికారపు సొంపుతో వెలుగు భాషనే వాడి యుండిరి. ఆ ప్రభావ మీ మహిళా వాఙ్మయముననుు ప్రసరించి యుండుటలో అతిశయములేదు. పై పద్య మట్టిదానికి ఉదాహరణమే.

మన్నారుదాస విలాస నాటక రచన పూర్తియైన వెనుక దానిని చదివి వినిపించు చుండగా తనస్వామి విజయ రాఘవుడు హరివంశము నందలి ఉషా పరిణయగాథను కావ్యముగా రచింపు మనగా తానీ జతన మొనర్చినట్లు ఈమె వ్రాసియున్నది.

యక్షగాన శాఖకు చెందిన మన్నారు దాసవిలాస నాటకము నందు పట్ట మహిషియగు కాంతిమతికిని, విజయ రాఘవునకు జరిగిన వివాహగాథ వర్ణింపబడినది.

15 వ శతాబ్ద్యంత భాగమునుండి ఆంధ్ర వాఙ్మయమున యక్షగాన రచన ప్రారంభింపబడినది. ఆనాటి నుండి జరిగిన యక్షగాన రచనలో కవయిత్రులును పాల్గొనుటలో వింతయేమియును లేదు. అట్టి యక్షగాన రచన మొనర్చిన కవయిత్రులు వేరుగానున్నారు. వారిని గూర్చి ముందు

పేర్కొందును. రంగాజీ కావ్యప్రణేత్రియేకాక నాటక కర్త్రికూడ. అయితే ప్రాచీన లక్షణ లక్షితములగు దృశ్యకావ్యములను మాత్రమే ఆంధ్ర సారస్వతేయులు నాటకములనిరి. అంతేకాక సంస్కృత నాటకములను ఆంధ్రకవులు కావ్యములుగనే అనువదించిరి. అగుటచే ఆంధ్రులకు 15 వ శతాబ్దము వరకు దృశ్య వినోదము కాని, రంగవిజ్ఞానావకాశము కాని లభింపలేక పోయెనేమో. ఆ పండిత పామరలోకమునకును చిత్త విచ్ఛిత్తిని కల్గింపగల సాహిత్య ప్రక్రియా విధానముగా పాటలతో, మాటలతో కూడిన యక్షగాన ప్రక్రియను నాటక రూపమున తొల్దొంటి ఆంధ్రులు సృష్టించుకొనిరి. అట్టి ప్రక్రియనేవారు నాటకము అని పేర్కొనిరి. అట్టి నాటక శాఖకు చెందిన యక్షగానమే రంగాజీ కృతి "మన్నారు దాసవిలాస నాటకము" ఇందు పాత్రోచిత భాష వాడబడినది. విజయ రాఘవు నా స్థానమున దక్షిణ భాషలగు తమిళ, కన్నడ, కేరళ భాషల యందును సంస్కృతము నందును, శౌరసేన్యాది సమస్త ప్రాకృతముల యందును కవిత్వము చెప్పగల్గిన చదురాంధ్రు కలరను ప్రశంసకు రంగాజీ అన్ని భాషలయందును చెప్పిన కవిత్వమే ప్రబల నిదర్శనము.

సంస్కృతము : ఔదార్య మంగన్నృప భంగవిధాన ధుర్యమ్
శౌర్యంచ ధైర్యమపి శౌర్యుపలాల నీయమ్
రూపంచ పంచశర వీరవిలోభ నీయమ్
యస్యాస్త్యహో విజయ రాఘవ సార్వభౌమ.

మాగధి : పశుప శరాసన రూవేణహారియ్యా మహిమాయే
దాణేహం రాహేయే వియయిరహు నాహశామి సంతాణే.

చూళిక : ఖమళ విలోచన మధనే, యాచక ఝునధోవ్యపాదపో యేసో .
భాహో భళభళ పద్దా ఆరవికారయ వియయరాహివో విషయ .

ఇట్లే అన్ని ప్రాకృతముల యందును ఆమె కవిత్వము చేసినది.

ఇక అముద్రితమగు మన్నారుదాసవిలాస ప్రబంధమున రఘునాథ నాయక వర్ణన సందర్భమున గల ఒక పద్యము :

సారభుజా బలంబునను, జక్కదనంబున, సద్గుణంబులన్
ధీరమతి ప్రతాపముల, దిక్కుల మిక్కిలి నిండు కీర్తులన్
ధారుణి బ్రోచునేర్పున, నుదారదయన్, గవితాచమత్కృతిన్
శ్రీరఘునాథ భూమిప ఫణీ మణికిన్, సములే నృపాలకుల్.

ఇది శ్లేషా లంకార సమన్వితమైనది. శైలియిల్లే సులభ గ్రాహ్యముగా నుండును.

రంగాజీ అటనట తనకృతులలో వ్యాకరణ, జ్యోతిషాది శాస్త్రములలో దనకుగల ప్రజ్ఞాపాటవములకు దిక్ప్రదర్శకములగు ఘట్టములను వెలయించినది. ఈ మన్నారు దాసవిలాస కావ్యము, అల్లాడ విజయసింహభూపతి విలాస కావ్య మను పేరున సౌందరియను నామె యింకొక కవయిత్రి వ్రాసినట్లు మద్రాసు ప్రాచ్యలిఖిత భాండాగారమున కన్పట్టుచున్నదట. కాని అదిసరి కాదని తేలినది.

అసామాన్యధిషణా ప్రాభవముకల ఈ కవయిత్రిని విజయ రాఘవుడు కనకాభిషేక గౌరవముచే సమ్మానించెననిన ఆశ్చర్యమేమున్నది ?

నాయక రాజుల కాలమున పేరుపెంపులు వహించిన యీ కవయిత్రు లందఱును తమప్రభువులకు తాము ధర్మపత్నుల మనియే వ్రాసికొని యుండిరి. రంగాజీయెడ బద్ధాను రాగుడై విజయ రాఘవ నాయకుడు పట్టమహిషియైన కాంతిమతి యెడ విరక్తుడై యుండుట కాంతిమతికి మిక్కిలి వ్యసనము గూర్చుటయు దానిపై కాంతిమతి తనభర్తను రంగాజీ వశ మొనర్చుకొనెనని దూషించుచు చెలికత్తెలచే రంగాజీకేదియో వార్త పంపెననియు దానిపై రంగాజీ

"ఏ వనితల్ మముందలపనేమిపనో తమరాడువారుకా
రో వలపింపు నేర్పెఱుగరో, తమకౌగిటలోన నుండగా
రావది యేమిరా విజయరామ యటంచిలుదూరి బల్మిమై
తీవర కత్తెనై పెనగి తీసుకవచ్చితినా తలోదరి.

అని వెంటనే వ్రాసిపంపెనట. దానిపై తరువాత చాలగ్రంథము జరిగెను. విజయ రాఘవుడు రంగాజీతో తనకుగల సంగతి ధర్మబద్ధము కాదని

తెలిసికొని రంగాజీ యింటికి వెళ్ళుట మానివైచెను. అయినను ఏకచారిణి యగు రంగాజీ రాఘవుని ప్రణయమునే నమ్ముకొని వియోగ జీవితము గడిపి శుష్కించి మరణించెను. ఆనాటి నాయకరాజుల ఉపకాంత లందఱును పవిత్ర జీవనలై యుండుటయు, ఏకచారిణులై విశుద్ధ ప్రణయినులుగా జీవితమును గడుపుటయు ఎన్నటికిని స్పృహణీయమగు నంశము.

రంగాజీ అక్కగారని చెప్పబడు కృష్ణాజీయు కవయిత్రియే. కాని కృతులు కాన్పింపవు.

రంగాజీనుండి బహు కావ్యరచనము కావించిన కవయిత్రీమతల్లు లగపడెదరు.

ఈ మహనీయురాంధ్ర కావ్యములన్నియు చారిత్రక పరిశోధనకు మిక్కిలి ఉపకరించుటొక గొప్ప యంశము.

రంగాజీతో నాయకరాజుల కాలమునాటి కవయిత్రుల సందర్శనము ముగిసినట్లే.

## 16. ముద్దుపళని - రాధికాసాంత్వనము (1740-1780) మోహశృంగార కావ్యము :

ఆంధ్రకవయిత్రీ లోకమున శృంగార మధుర కావ్యమును రచించిన ఏకైక కవయిత్రి ముద్దుపళని. ముద్దుపళని కాలమునాటికి భావుకతా లోపము చేతను, అనుకరణ ధర్మముచేతను, స్త్రీల అంగాంగ వర్ణనాసభ్యత చేతను, అతి బాహ్యకామశృంగార కావ్య రచనా వ్యామోహము చేతను ఆంధ్రవాఙ్మయము క్షీణయుగ మనిపించుకొన్నది. కాలప్రభావము మహిళా కవయిత్రిని సహితము లోగొనుట ప్రత్యేక గమనార్హము. రామభద్రాంబ, మధురవాణి, తిరుమలాంబ, రంగాజీ మున్నగువారు వారిప్రభువులకు ఉపకాంతలైనను, ఆనాటికే ఆంధ్ర సారస్వతమున మోహశృంగార కావ్య రచన తల చూపియున్నను వారు మాత్రము ఆ దరి దాపులనే త్రొక్కి చూడలేదు. స్త్రీలుకూడ ఎట్టి అంశములనైనను నిరుపమ ప్రజ్ఞతో రచింప గలరని నిరూపించుటకై ముద్దుపళని ఈ కావ్యరచన చెసెనేమో.

ఏమో, ఏమోలతో నేమి పని ? ముద్దుపళని మోహా శృంగార కావ్య రచన చేసినది. అందును ప్రస్తుతి పాత్రమగు రచనా విధాన ముట్టి పడునట్లు పదపదమునను ముద్దులు మూట గట్టునట్లు రచించినది.

నాయకరాజుల యనంతరము దక్షిణాపథము నేలిన ప్రతాప సింహుని కాలమున అనగా 1740-1780 ప్రాంతమున ముద్దు పళని వెలసి యున్నది. ఈమె కూడ ప్రతాప సింహుని ఉపపత్నియే. ఈమె తండ్రి ముత్యాలు తల్లి పోటిబోటి.

గ్రంథము శృంగారరసార్ణవము. దీనికే ఇళాదేవీయమను నామాంత రము కలదు. రాధ ఇళను బాల్యమునుండి ప్రేమతో పెంచి ఆమెను కృష్ణున కిచ్చి పెండ్లిచేసి తన ప్రేమధనము కొల్లగొట్టబడెనని చాల బాధపడు టయు, ఇళా కృష్ణులు ఇళాదేవి తండ్రి కుంభకునింటికి వెడలగా విరహ మోర్వలేక రాధ తనచేతి చిలుకను కృష్ణుని కడకు రాయబార మంపు టయు, కృష్ణుడు రాగానే రోసమున రవాళించుటయు, కృష్ణుడు బ్రదిమ లాడుకొనగనే ప్రశాంతత చెందుటయు ననునది ఇందలి కథా భాగము. ఇది నాలుగాశ్వాసముల కావ్యము.

రచనయందు మృదు మధురమగు తెలుగుభాష మఱుగు జాలు వారు చుందును. సామెతలు కుప్పలు, తెప్పలు. సవతిగల స్త్రీ హృదయము నందలి స్పర్ధా స్వభావము అచ్చుపడునట్లు చాల సహజముగా వర్ణించినది. రాధ విరహ వర్ణనలు ఎంత మురిపెముగనున్నవో చెప్పనలవికాదు. సుకుమారమైన స్పర్ధాభావమును, ఈర్ష్యను, కృష్ణునిపై తనకుగల అక్కసును వెలిబుచ్చుటలో అచ్చ తెలుగు పదములు వాడి ఈ పదముల కింత అర్థశక్తి భావప్రదీపన సామర్థ్యము కలదా యనిపించినది, ముద్దుపళని !

"అల్లందుకొన్నను నీ
బెల్లింపులబడిన మొదలు పెనుబాములకే
యిల్లైతి నరసిచూడగ
గొల్లనితోపొందు చెలికి కొదువే కొదువల్."

కృష్ణుని దెప్పుచు పల్కిన పల్కులలో దెప్పరికము వెనుకనుండి పైకి స్ఫుటముగా కనబడుచున్న ఆంతరంగికమగు అపేక్షను చూపుటలో ముద్దుపళని యెంతటి ఒయ్యారము కనబఱచినదో కాంచుడు! కావ్యమంతయు నిట్లే ఒయారపు నడకలతో ముద్దులమూట గట్టుచుండును.

"సొమ్మిమ్మయ్యవచ్చు - సొమ్మందమియవచ్చు
ఇయ్యరాని ప్రాణ మియ్యవచ్చు
తనదు విభునివేరు తరుణిచేతికినిచ్చి
తాళవశమె యెట్టిదానికైన?"

ఇళకు కృష్ణునప్పగించి వెనుదిరిగినవెంటనే పైకొనిన వియోగముతో బాధపడిన రాధ గోలతనము, బేలతనము, మానినీహృదయగత సపత్నీ స్పర్ధాస్వభావమును ఎంత కోమలముగనో చిత్రించినది.

వర్ణనలును, హాస్యమునుగూడా చాలవిశిష్టముగా నిర్వహించినది.

కాని కేవల బాహ్యముగ వర్ణించిన శృంగారవర్ణనాదులు వెగటుగ నున్నవి. అది ఆనాటి కాల స్వభావమని యుపేక్షించి సంతృప్తిపడ వలయునంతే.

ముద్దుపళని, ఆండాళ్లుపాశురములను కూడ తెలిగించినది. అవియును చాల రమణీయముగా నున్నవి.

## 17. దార్ల సుందరీమణి - భావలింగ శతకము (1829) :

ఆంధ్రదేశమున మిక్కిలి సుప్రసిద్ధుడైన తత్త్వవేత్త పోతులూరి వీరబ్రహ్మంగారి శిష్యవర్గమునకు చెందిన దార్ల సుందరీమణి 1829 ప్రాంతమునాటిది. గుంటూరుజిల్లా యందలి చెర్లగుడిపాడునందలి గంజ శ్రీరాములు, నాగమాంబలు ఈమె తండ్రియు, తల్లియునై యున్నారు. రామచంద్రపుర నివాసియగు దార్ల శేషయ్యగారి నీమె భర్తగా బడసెను.

దార్ల సుందరీమణి సంఘ కల్మషమును శక్తిమంతమగు భాషతో నిరాసముచేయుచు ఉద్దీప్తమగు భావములతో కూడిన తత్త్వశాఖకుచెందిన భావలింగశతకమును రచించినది.

ఆంధ్రవాఙ్మయమున శతకము ఒక విశిష్టమైన ప్రక్రియ. ఏదేని ఒక మకుటమున సంఘములోని దురంతమును వెళ్ళగ్రాసి, సంఘమును మంచి త్రోవకు మళ్ళించుటకును, ఇష్టదైవస్తుతికిని శతకమును ప్రయోగించుట వాఙ్మయమున ప్రాచీనకాలమునుండియు కన్పట్టుచున్నది.

అట్టి శతకములలో తత్త్వశాఖకు చెంది, సంఘ కల్మషమును శక్తిమంతముగ బయటపెట్టిన ఒకే ఒక గొప్పశతకము; వేమనశతకము!

పురుషులలో వేమనయొక్కడే అట్టి శతకమును వ్రాసెను. స్త్రీలలో దార్ల సుందరీమణి యొకతెయే. ఈ తెగకుచెందిన కవయిత్రి. వేమనకు పిమ్మట 19 వ శతాబ్దమున నీమె రచించిన ఈ శతకమే మరల అంత ప్రతిభావంతముగ కన్పట్టుచున్నది. వేమనవలెనే ఈమెయు ఆటవెలదినే ఉపయోగించెను. సంఘసంస్కారమునకే యిర్వురు యోగులును ఆటవెలదుల నుపయోగించుట భారతీయ సంస్కృతియందలి గొప్పతనమును (ఆకర్షణా రాహిత్యమును) సూచించుచున్నది. ఈమె మకుటము "పాపభయ విభంగ భావలింగ" అనునది.

ఈ గ్రంథమును సత్తెనపల్లి తాలూకా కోసూరుగ్రామ వాస్తవ్యులైన బూదూరి సుబ్బారెడ్డిగారికడచూచి సుప్రసిద్ధకవివరేణ్యులు శ్రీ కొండవీటి వెంకటకవిగారు ఇటీవల ప్రచురించి ఆంధ్రభారతి కొక యమూల్యాభరణమును ప్రసాదించిరి. దీనికి వీరభివంద్యులు.

వ్యర్థపదములు లేకుండ, అందరును వాడుకొను సామాన్య పదములతో, మహార్థమును ప్రతిపాదించుశక్తి యీ పద్యములకు మూలశక్తి:

"భూమిగోరువారు బూడిదై పోయిరి
ధనముగోరువారు దగ్ధమైరి
నిన్నుగోరువారు నిత్యులై యుండిరి
పాపభయవిభంగ భావలింగ."

ఆడినమాట తప్పకుండుటలోని గొప్పతనము నెంత గొప్పగా ప్రతిపాదించినదో చూడుడు.

"మాట నిల్పువాడు కోటియేండ్లుండును
మాట నిల్పడేని మరణమొందు
మాట నిల్పుపదవి మఱినేర్వ డేలకో ॥పాప॥"

నిర్గుణ, నిరాకార తత్త్వోపాసనను గూర్చి ఎంత సూక్ష్మముగా, ఎంత సులువుగా తేటతెలుగుమాటలతో ఎంత అర్థవంతముగా పల్కినదో చిత్తగింపుడు :

"ఏమి లేదటంచు నెన్నివిద్యలొ చెప్ప
వేయి విద్యలేల ? వెఱ్ఱి ! చదువ !
నేమిలేనివాని నెఱిఁగినంజాలదా ॥పాప॥"

ఆటంబాంబునో, అమృతభక్ష్యమునో, అవసరసందేశమునో, పొట్లముకట్టి సూటిగ హృదయములోనికి గిరవాటువేసిన ఈయమ కవితాశక్తి మిక్కిలి ప్రశంసా పాత్రము.

## 18. తఱికుండ వేంగమాంబ (1840-80)

### వేంకటాచల మాహాత్మ్యము :

ఆంధ్ర సాహిత్యమున పేనుమిగిలిన విదుషిగా, కవయిత్రిగా పేరొందిన తరికుండ వేంగమాంబ మహాయోగిని. ఈమె 19 వ శతాబ్ద మధ్య భాగమున జీవించియున్నట్లు బ్రౌను మహాశయుడు వ్రాసియుండెను.

ఆంధ్ర సారస్వతమున మొల్లకును, ముద్దుపళనికి, తఱికుండ వేంగమాంబకును గొప్పస్థానము కలదు. తిమ్మక్క సుభద్రాకళ్యాణము, తక్కిన గ్రంథములును ఇటీవలనే బయల్పడుటచే పూర్వకవి చరిత్రకర్తలు వీరినే కవిచరిత్రలలో పేర్కొనుచువచ్చిరి.

వేంగమాంబ కృతులు చాల కలవు. అందు ద్విపదరాజయోగ సారము, వేంకటాచలమాహాత్మ్య కావ్యమును చాల ప్రఖ్యాతములు. ఇవి కాక ఆమె ద్విపద భారత, భాగవతములను రచించినది. నరసింహాశతక మను నొక శతకము, నరసింహావిలాసకథ, శివనాటకము, పారిజాతాపహరణ సత్కృతి, కృష్ణనాటకము, రమాపరిణయము (పెండ్లిపాట), చెంచు నాటకము, కృష్ణమంజరి (ద్విపద), శ్రీరుక్మిణీ నాటకము, గోపికానాట

కము, ముక్తికాంతావిలాసము అను పెక్కు గ్రంథములను రచించెను. ఇందు ద్విపదలు, శతకము, పెండ్లిపాట కాక తక్కినవన్నియు యక్షగానములై యుండునేమో. ఇప్పుడివియన్నియు లభింపవు. పారిజాతాపహరణ యక్షగానము మాత్రము ప్రాచ్యలిఖిత భాండాగారమున లభ్యమగుచున్నది.

ఈమె బాలవితంతువు. తండ్రి కానాలి కృష్ణార్యుడు. తల్లి మంగమ్మ. సోదరుడు కృష్ణుడు. గురువు వేదాంతోపదేశికుడు ; సుబ్రహ్మణ్యదేశికులు.

"నా చిన్ననాట నోనమాలనైన
నార్యులెవరు నా కానతీలేదు
ఇక నేను చెప్పుదు నెట్టులో వాణి
నకలంకుడై జిహ్వాయందుంచె గురుడు."

అని యీమె వ్రాసినదానినిబట్టి గురుకటాక్షమహిమచే నత్యద్భుత కవితా ప్రావీణ్య మలవడెనని తలంపవలసియున్నది.

కవిత్వమం దల్పదోషము లున్నను కవనమతి మనోహరమైనదని శ్రీ వీరేశలింగము పంతులుగారు వ్రాసియుండిరి.

రాజయోగసారము కపిలునకు దేవహూతికిని జరిగిన తాత్విక సంభాషణము.

"సంపదగల్గిన సామర్థ్యమనుచు
సొంపుమీరగ తుచ్ఛ సుఖ మిచ్ఛయించి
కామాంధులై తమగతిగానలేక
భామల యొడిలోన బడిలేవలేక
తఱుగని యీషణత్రయవార్ధిలోన
మఱిమఱి మునుగుచు మమత రెట్టింప
నాలుబిడ్డలకని యర్థంబుగూర్చి
కాలంబునూరకే గడుపుచునుండి
... ... ... ...
... ... ... ...
పుట్టుచు గిట్టుచు బొరలుచుండెదరు.

వేంకటాచలమాహాత్మ్యము కలియుగ ప్రత్యక్షదైవమగు వేంకటేశ్వర స్వామి మాహాత్మ్యగాథా కథనము.

ఇది కేవల మాహాత్మ్య కథాగ్రంథమైనను, మనోహరమగు వర్ణనలు, కాంతిపూర్ణమగు శైలి, హృదయంగమములగు ఉపమాద్యలంకారములతోను గూడి చాల ప్రౌఢముగానున్నది. ఈ కావ్యశైలి :

"శరదభ్రశుభ్ర భాస్వర శరీరంబునందు
శ్వేతప్రకాశ విభూతి మెఱయ
ధవళ సంపూర్ణ చంద్రకళంకమనగ
నైల్య వత్కృష్ణాజినంబు మెరయు" నట్లుగా నున్నది.

## ఇతర శతక కవయిత్రులు

తఱికుండ వెంగమాంబతో ఈ కావ్యయుగమున ప్రసిద్ధ కవయిత్రురాండ్రను గూర్చి తెలిపినట్లే ఇక రాఘవరామ, రఘురామ, కేశవరామ శతకములను రచించిన మదిన సుభద్రమ్మ.

'మీనాక్షీశతక' కవయిత్రి బండిబాపమ్మ, 'వేంకటరమణ శతక' కవయిత్రి రత్నమాంబ, 'జానకీ శతక' 'పార్థసారథి శతక' కవయిత్రి చెలికాని చెల్లాయమ్మయు నిట సుస్మరణీయలు.

## యక్షగాన కవయిత్రులు

**23. బాలపాపాంబ :**

ఈ ఆంధ్రకవయిత్రీ చరిత్ర యందు కావ్య కవిత్వ విభాగమును పూర్తి చేయుటకు ముందు కాల విభాగమును బట్టి ముఖ్యముగా ప్రాచీనాధునిక కవితాదృష్టిని బట్టి యక్షగాన వాఙ్మయ రంగమున పరిశ్రమ యొనర్చిన మహిళామణులను గూర్చి పేర్కొనుటవసరమై యున్నది.

యక్షగానము ప్రయోగ యోగ్యమైన దృశ్యరచనము. అట్లని కేవల సంస్కృత నాటక లక్షణ లక్షితము కానేరదు. గీత, పద్యగద్య

రూపమైన, పండిత పామర రంజకమైన గేయనృత్య రూపమైన సాహిత్య ప్రక్రియ యక్షగానము.

ఆంధ్రవాఙ్మయ యక్షగాన చరిత్ర లిఖించిన ఆంధ్ర విశ్వ విద్యాలయాంధ్రా చార్యులు శ్రీ డా. యస్వీ. జోగారావు గారు "మనకిప్పటికి దెలిసినంతలో దెనుగున వెలసిన మొట్టమొదటి యక్షగానము క్రీ. శ. 15 వ శతాబ్ది యుత్తరార్ధమున నుండిన ప్రోలుగంటి చెన్నశౌరి సౌభరి చరితమే" నని తమ యక్షగాన చరిత్రలో వ్రాసియున్నారు. శ్రీ నిడదవోలు వెంకట్రావుగారు ఆంధ్ర మహిళలో 'విస్మృత కవయిత్రి బాలపాపాంబ అను వ్యాసము వ్రాయుచు అక్కమహాదేవి చరిత్రమును యక్షగానముగ రచించిన వీరభోగ వసంత రాయల కుమార్తె బాలపాపాంబ 1600 ల సంవత్సర ప్రాంతమున వెలసి యున్నట్లు తెలిపి యున్నారు.

దీనిని బట్టి చూడ యక్షగాన రచనము నందు స్త్రీలు ఏమియు వెనుక బడలేదని తెలియు చున్నది.

బాలపాపాంబ వీరభోగ వసంతరాయల కుమార్తె. శ్రీశైల మల్లికార్జున ప్రియభక్తురాలైన కర్ణాటక మహాయోగిని అక్క మహాదేవి చరిత్రము నీమె యక్షగానముగా రచించినది.

పండిత పామర రంజకమగుటచే యక్షగానము మతప్రచారార్ధము అధికముగ నుపయోగింప బడినది. అక్కమహాదేవి చిక్కనైన శివశరణి. పోతులూరి వీరబ్రహ్మంగారి తత్త్వమును, మాయా ద్వైతమును ప్రబోధము సేయు కాలజ్ఞానాదుల యందు ప్రసక్తుడైన వీరవసంత వసుమతీశుల కొమరితయు, భద్రకాళి భక్తురాలునైన బాలపాపాంబ అక్కమహాదేవి చరితమును యక్షగానముగ రచించుటలో వింత యేమియులేదు.

"అష్టయోగాది విద్యాప్రవీణకుడగు, వీర వసంత వసుమతీశునకు
ప్రథమ పుత్రిక బాలపాపాంబ యనగ, నధిక తేజంబున నపుడుద్భవింప
సంగీత సాహిత్య నరసలక్షణముల, రంగుమించినయట్టి రమణిదానగుచు
నల భద్రకాళి నాయాత్మలోపలను, బలికించునేరీతి, పలికెదనసుచు

నవనిలో యక్షగానావళికెల్ల, రవళి మించిన శిరోరత్నమో యనగ
మంగళ ప్రదమగు మహాదేవి చరిత, యింగితజ్ఞానివై యీ కృతి జేసె.

బాలపాపాంబ కృత్యాదిని వ్రాసిన ద్విపదను బట్టి పై యంశములు స్పష్ట మగుచున్నవి.

"ఈ యక్షగానమున జంపెలు, రచ్చరేకులు, ఏకతాళి మొదలగు దేశిపద రచనలు, జోలపాటలు, మంగళ హారతులు మొదలగు పాటలు కలవు. ఇవి యన్నియు బాలపాపాంబ సంగీత సాహిత్య విద్యను ప్రదర్శించును, అని శ్రీ నిడదవోలు వెంకటరావుగారు వ్రాసి యున్నారు. అక్కమహాదేవికి అల్లమ ప్రభువొనరించిన తత్త్వోపదేశము పట్టున ఈమె చూపిన నైపుణ్యమును బట్టి తరికుండ వేంగమాంబకు ముందుగా యోగ మార్గోపదేశమును సాహిత్య బద్ధము చేసిన ఆంధ్ర కవయిత్రి బాలపాపాంబ యనియు వీరు తెల్పి యుండిరి. ఈమె గొప్పయోగ నిష్ఠాపరురాలు. పవిత్రజీవన సంగీత, సాహిత్య విద్యా వైదుష్యములు గల మహిళా రత్నము అట్టి యీమె రచన; ప్రప్రథమాంధ్ర మహిళా యక్షగాన రచనము ముద్రణా భాగ్యము నందక పోవుట శోచనీయము.

## 24. అన్నదానము వెంకటాంబ 18 వ శ.:

రామాయణము'ను యక్షగానముగ రచించిన అన్నదానము వెంకటాంబ సేలంజిల్లా హోసూరు తాలుకా తోగిరాగ్రహారమను శ్రోత్రియ గ్రామమందలి అన్నదానం వెంకట రామావధానుల భార్య. ఈ గ్రంథమున కొన్ని దోషములున్నవి. ఇందు ప్రసిద్ధరాగ తాళములలో దరువులు, కీర్తనలు, ద్విపదలు, సీసగీత పద్యములు, వచనము, లాలి, శోభనము, మంగళహారతి పాటలు కలవనియు, ఇందలిశైలి ఆఖ్యానకశైలి యనియు, రాముని బాల్యము, సీతా కల్యాణము మున్నగు వర్ణనలలో చక్కని తెనుఁగు తన ముట్టిపడుచున్నదనియు శ్రీ జోగారావుగారు రచించి యుండిరి.

## 25. రూస్థానుపేట రత్నమ్మ (1847-1929) :

ఈమె రెడ్డి కులజ. జన్మస్థానము ఇప్పటూరు. నివాసము పర్గితాలుకా రూస్థానుపేట. రచనము- 'శివకురువంజి' ఇతర కృతులు 'వేంకటరమణ' 'శ్రీనివాస శతకములు', 'బాలబోధ' 'దశావతార వర్ణనము' మొదలగునవి.

## 26. ఓడం రచయిత్రి - శ్రీరామపుత్రి :

"శ్రీరామపుత్రి" యను మారు పేరున నొక కవయిత్రి వ్రాసిన సీమంతినీ చరిత్ర మొకటి కనఁబడుచున్నది. ఇందు 'ఓడం' అను పద్ధతికి చెందిన పాటకన్పట్టుచున్నది. ఈ పే రతివిచిత్రముగ నున్నదనియు, ఇతరత్ర కూడ ఇది కేవల మశ్రుత పూర్వమనియు శ్రీ జోగారావుగారు తెల్పిరి. ఇది 1907 లో రాజరాజేశ్వరీ నికేతన ముద్రాశాల యందు ముద్రింపబడినది.

ఉదా : "చూడ చూడా వేడుకాయె, సీమంతీ
నేడు పెండ్లీ కూతురాయె.
మూడు భువనాల్ కీర్తినిండే- దుఃఖంబూ
వీడి తనదూ విభుని గూడె
బంగారు తట్టతో మంగళారతులూ
శృంగారముగ నిచ్చి అంగనలు అపుడు."

## 27. కొత్తూరు రంగనాయకమ్మ : "ఆండాళ్ళు చరిత్రి" :

ఈమె ఈచంబాటి శ్రీనివాసా చార్యుల శిష్యురాలని మాత్రము ఇందలి కొన్ని పాటల వలన తెలియుచున్నది. ఇది యిట్లుండ వరయూరు జియ్యరు తిరుపతి సంబంధురాలగు రామానుజమ్మ రచించిన "శ్రీ రంగనాథ పంగుణ్యుత్తరోత్సవ యక్షగానము చివర "తంగబిందు" అను రంగనాథ స్తుతి పరమైన యొక గేయము చివరిచరణమున "ఈచంబాటి శ్రీనివాసా చార్లకృపను - రంగ దాసురాలిని బ్రోవరా" అని యుండుటచే

రామానుజమ్మయు, రంగనాయకమ్మయు, నొకరో లేక వీరిరువురును ఒక గురువు శిష్యురాండ్రో తెలియుట లేదని శ్రీ జోగారావుగారి లేఖనము. రంగనాయకమ్మచే రచింపబడిన ఆండాళ్లు చరిత్రము నందలి రచనయందు కొద్ది దోషములున్నను రచన చక్కగా నున్నదనియు, పెండ్లి వేడుకల పాటలు ముచ్చటగా నున్నవనియు శ్రీ జోగారావుగారు వ్రాసిరి.

## 28. రామానుజమ్మ :

శ్రీ రంగ పంగుణ్యుత్తరోత్సవ యక్షగానము కూడ బాగున్నది. ఇందు శ్రవ్యకావ్య ధోరణి హెచ్చు.

## 29. శేషాంబ :

ఈమె కానాల వారి యాడు పడుచు కర్నూలుజిల్లా కోయిలకుంట్ల తాలుకా నందిపాటి గ్రామము. ఈమె రచన "మిత్రవిందా పరిణయము" 1919 లో ముద్రితము. భాగవతమున నామ మాత్రముగనున్న ఈ కథను "అపూర్వ పాత్ర చిత్రణతోడను, సరస సంభాషణలతోడను, సన్నివేశముల తోడను, మాంసలముగా దీర్చి మనోజ్ఞ నాటక ఫక్కిని రచించినది." రచన ఆధునికముగా నున్నదని శ్రీ జోగారావుగారు వ్రాసిరి.

## 30. సూర్యనారాయణశాస్త్రి సుత :

శుక చరిత్రము రచన యొక విధముగా నున్నది. సాంకేతిక సంవిధానము సంమజసమని శ్రీ జోగారావుగారి యభిప్రాయము.

## 31. ముడుంబై అలమేల్మంగ తాయారమ్మ :

సుల్తానీ కల్యాణము. ఇది 1917 లో వాణీ ముద్రాశాలలో బెజవాడలో ముద్రితము. ఈమె కౌశిక గోత్రజ. నరసింహ దేశికుని శిష్యురాలు. ఇది తాళప్రధానమైన దరువులు ప్రచురముగా గల రచన. ఇందు ద్విపదలు, సీసములు, కందములు, ఏలలు, లాలిపాటలు, అర్ధ చంద్రికలు, ధవళశోభనములు సంధి వచనములును గలవు" అని శ్రీ జోగారావుగారి కథనము.

### 32. ఏనుగుల చూడమ్మ :

రుక్మిణీ కల్యాణము. ఈమె 19 వ శతాబ్ది ఉత్తరార్ధమున నున్న ఎరగుడిపాటి వేంకటాచలము పంతులుగారి పుత్రికయట. గ్రంథ ముద్రణము 1879 లో కాకినాడ ముద్రాక్షరశాలలో. ఇది యక్షగానమని చెప్పబడక పోయినను, ఇందా లక్షణములే కొంత కన్పించుచున్నవి. ప్రసిద్ధ రాగ తాళములలో దరువులు, సంధి వచనములు, జోలలు, లాలి, గొబ్బి, నలుగు, మేలుకొలుపు, మంగళహారతి మొదలగు పాటలు కలవు. ఆఖ్యానక శైలి యెక్కువ. రచన సలక్షణమని, సరసమని శ్రీరావుగారి అభిప్రాయము.

### 33. బలభద్ర దాసి :

కపోత వాక్యము. కవిసోమయ సోముని ( బసువని ) భామ. మల్లాంబిక పట్టి. 1829 కి పూర్వమే గ్రంథరచన జరిగినది. భారతము నందలి కపోతోపాఖ్యాన మిందలి వస్తువు. ఇందు విడివిడిగా రాగతాళ ప్రధానములగు దరువులు, ద్విపదలు, కందములు, చౌపదములు, జాళి పదాలు, నడలు, రేకులు, అనువులు, అర్ధచంద్రికలు, సువాలములు మొ॥ రచనలు గలవు. మంచి పలుకుబళ్లుగల పదగతి, సూనృతమైన భావావేశము కలరచన యని శ్రీ జోగారావుగారు పేర్కొనిరి.

### 34. హోసూరి సాకమ్మ :

ముక్తికాంతా విలాసము, చిక్కదేవరాయ విలాసము, లక్ష్మీ విలాసము అను యక్షగానములను రచించినది.

యక్షగాన కావ్యజనయిత్రియగు తఱికుండ వేంకమాంబను, మన్నారు దాసవిలాస యక్షగాన ప్రబంధ రచయిత్రి రంగాజీని మున్నే పేర్కొని యుంటిమి.

వీరుకాక ప్రాచీన యుగమునకు చెందిన రేవణూరు కవయిత్రులు కొందఱు కలరు.

త్యాగరాయ ప్రశిష్య వర్గమునకు చెందిన అమ్మాజీ గాన ప్రబంధ రచయిత్రి యందురు. ఆదికవి నన్నయ భట్టారకునకు సైదోడైన

నారాయణభట్టు కొమరిత కుప్పమ్మ అతులిత ప్రభావపూర్ణమగు కవిత చెప్పెడిదట. మఱి యీ కావ్యము లెందు దాగి యున్నవో.

సుమారు నలుబదికి పైబడిన సంఖ్యకల కవయిత్రుల చరిత్రలు కల ఈ ప్రాచీనాంధ్ర వాఙ్మయ యుగమునకు ప్రాతినిధ్యము వహించిన తరమింతతో ముగిసి నట్లే.

## మధ్యాంధ్రవాఙ్మయము - మలితరము

ఆంగ్ల విద్యాధికతతో బాటు ఆంగ్లవాఙ్మయ ప్రభావము భారత దేశీయ భాషలపై ప్రసరించిన వెనుక దేశీయ భాషల స్వరూపమే పూర్తిగ మారిపోయినదని చెప్పవచ్చును. ముఖ్యముగ రచనా సంవిధానము పూర్తిగా మార్పునొందినది.

వచన సాహిత్యముపై, కథలపై, విమర్శలపై, దేశీయాభిమాన రచనలపై పాఠకులకు ప్రీతి మెండైనది. ఈ సాహిత్య లక్షణము ఆంధ్ర వాఙ్మయమున 19 వ శతాబ్దపు చివరిభాగము నుండియు కాన్పించును. ఆంగ్లేయుల పాలనాదాస్యమునుండి మాతృభూమికి విమోచనము కల్పింప వలెనను కాంక్ష నాడు నాటికి ముదిరి, ఆకాంక్ష ఉద్యమముగా మారిన కొలది వాఙ్మయమున దేశభక్తి ప్రబోధక రచనలు హెచ్చుకాజొచ్చినవి. కాని విచిత్రమేమనగా భావమునందును, రచనా సంవిధానము నందును, కల్గిన యీ మార్పు మాత్రము ఆంగ్లవాఙ్మయ ప్రభావ పరిణామమే యగుట.

ముఖ్యముగ ఆంధ్రదేశమున శ్రీ గురుజాడ అప్పారావుగారి రచనల తోడను, వచన, కథా, నవలా, విమర్శక వాఙ్మయముపట్ల శ్రీ వీరేశలింగం పంతులుగారి తోడను, ఈ మార్పు ప్రారంభమైనది. ఇంతేకాక శ్రీ వీరేశలింగము పంతులుగారి ప్రబోధన ఫలముగా స్త్రీ విద్యా, సంస్కార ప్రబోధ వాఙ్మయము ఆంధ్రదేశమున రచయిత్రులచే హెచ్చుగా సృజియింప బడినది. ఈ కాలము నుండియే స్త్రీల సంపాదకత్వమున పత్రికలు బయల్వెడలుట మొదలైనది.

కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారి శిష్యురాలు, గొప్ప పండితు రాలునైన పులుగుర్త లక్ష్మీనరసమాంబగారు "సావిత్రి" అను పత్రికను నడపిరి. ఈ పత్రిక సనాతన పక్షమై పంతులుగారి వితంతూద్వాహ సంస్కారోద్యమమునకు వ్యతిరేక పక్షముగ నడుపబడినది. తరువాత బాలాంత్రపు శేషమ్మగారు "హిందూ సుందరి" యను పత్రికను, వింజమూరి వెంకట రత్నమ్మగారు "అనసూయ" యను పత్రికను నడిపి యుండిరి.

## 35. కొటికలపూడి సీతమ్మ :

శ్రీ పంతులుగారి ముఖ్య శిష్యురాలైన కొటికలపూడి సీతమ్మగారు 'సాధురక్షా శతకము', 'అహల్యాబాయి', 'పద్యభగవద్గీత', 'భక్తిమార్గములు', 'సతీ ధర్మములు', 'లేడీ జేన్ గ్రే', 'శ్రీ వీరేశలింగంగారి జీవిత చరిత్ర' అను కావ్యములకు జనయిత్రి. శైలి మిక్కిలి సరళము.

'అహల్యాబాయి' కావ్యమునందలి :

"స్త్రీలు విద్యనేర్వ జెడిపోదు రనుమాట
కల్లయనుచు దోప నెల్లఅకును
విశదపఱతునొక్క విద్యావతి చరిత్ర
సంగ్రహంబుగాగ చదువుడయ్య."

అని వ్రాసియుండుట గమనార్హము. ఈమె 'సాధురక్షాశతకా'దులలో బ్రహ్మసమాజభావదీప్తి కాననగును.

1913 వ సంవత్సరమున బాపట్లయందు జరిగిన ప్రథమాంధ్ర మహాసభ యందలి మహిళాసభ కధ్యక్షతవహించిన మహిళామణి, తెనాలి తాలూకా జెవుడుపాడు వాస్తవ్యులు శ్రీ అబ్బూరి సుబ్బారావు పంతులు గారి కుమార్తె, కొటికలపూడి రామారావుగారి సతి, పిఠికాపుర రాణి యగు రాణీ చిన్నమ్మారావుగారికి గురుపద మధిష్ఠించియుండిన మహానుభావురాలు.

## 36. రాణీ చిన్నమ్మారావు :

ప్రఖ్యాతాంధ్ర భాషాపోషకులు, సంఘ సంస్కర్తయునైన పిఠికాపుర మహారాజు సూర్యారాయ మహీపతి బహద్దరువారి ధర్మపత్ని. విద్వ

త్కవయిత్రియే కాక కొటికలపూడి సీతమ్మ, జూలూరి తులశమ్మ మున్నగు విద్వత్కవయిత్రుల నాస్థాన కవయిత్రులుగ మన్నించి కవితాగోష్ఠి నెఱపు చుండెడి రసజ్ఞురాలు. పద్యకావ్యములనే కాక 'ఉపన్యాసమాలిక' అను పేర ఈమె తన ఉపన్యాసములను కూడ ప్రచురించెను.

## 37. కందుకూరి రాజ్యలక్ష్మమ్మ :

ఇట్లే కందుకూరి వీరేశలింగం పంతులుగారి ధర్మపత్ని, రాజ్య లక్ష్మమ్మగారు కూడ బ్రహ్మమత కీర్తనలు రచించినది. వీరేశలింగం పంతులు గారి సంస్కారోద్యమము లన్నింటను ఈమె సహాయము కలదు.

## 38. భండారు అచ్చమాంబ (1874) :

సుప్రసిద్ధ విమర్శకుడు, భాషాసేవకుడునైన కొమఱ్ఱాజు లక్ష్మణ రావుగారి సోదరి. భండారు అచ్చమాంబ 'అబలాసచ్చరిత్ర రత్నమాల' యను వచనగ్రంథమును రచించెను. వివిధ రంగములలో ప్రఖ్యాతి వహించిన మహిళామతల్లులను గూర్చి పౌరాణిక స్త్రీలు, చారిత్రక స్త్రీలు, (ఆంగ్లే యాది) విదేశరమణులు అను మూడుభాగములుగ రచింపబడిన గ్రంథమిది. స్త్రీలలో వచనగ్రంథ రచన గావించిన వారిలో నీమెయే ప్రథమురాలు. గ్రంథశైలి మిక్కిలి కాంతిమంతముగ నుండును.

## 39. బుర్రా సూరమాంబ :

ఆంధ్రదేశమున విద్వత్కుటుంబముగ ఖ్యాతివహించిన బుర్రా దేవ నాథంగారి పత్ని యీమె. శ్రీకాకుళము వీరి నివాసస్థలము. భారతీ స్తవస్తబకము, హరినాథ, నందనార శతకములు, ప్రహ్లాద నాటకము, హరనాథ శతకము, శ్రీకృష్ణబోధామృతము, సావిత్రీవిజయము ననునవి వీరి కృతులు. ఇందు ప్రహ్లాదనాటకము సంస్కృత నాటక లక్షణ లక్షితమే.

ఈ యుగమున రచింపబడిన నాటకము లన్నియు ప్రాచీన లక్షణ లక్షితములే.

## 40. వేమూరి శారదాంబ (1881-1889) :

సుప్రసిద్ధ నృత్య, సంగీత, సాహిత్యవేత్తయు, కవి, పండిత, గాయక, నర్తకులునైన శ్రీ దాసు శ్రీరాములుగారి కుమార్తె యీమె. శ్రీరాములు గారి 'దేవీభాగవత' కావ్యము, 'తెలుగునాడు' అను ఖండకృతి ఆంధ్ర వాఙ్మయమున సుప్రసిద్ధములు. ఈమె తన పదునొకండవ యేటనే కవిత్వము చెప్పనారంభించి ముచ్చటగు మూడు కావ్యములను రచించి పదునెన్మిదేండ్ల పిన్నవయస్సుననే మరణించిన మహామనీషిణి.

భర్తయగు వేమూరి రామచంద్రుడుగారితో ఉద్యోగ ధర్మమున మద్రాసులో నుండుచు 11 వ యేట రచించిన ప్రథమకావ్యము "నాగ్నజితీ పరిణయము." ఇది "నగరర్త్వినశశి........" మున్నగు నష్టాదశ వర్ణనలతో ప్రాచీనకావ్య లక్షణానుసారము వ్రాయబడిన మూడాశ్వాసముల కావ్యము. అయినను వెట్టిమొట్టి విరహవర్ణనలు, చంద్రదూషణాదులును లేవు. శైలి తేజోవంతముగను, ధారావాహికముగను, అర్థభావములలో నొదిగిన శక్తిమంతములగు పదప్రయోగములతోడను కూడియుండును.

శైలికి చాతుర్వర్ణసందర్భమున క్షత్రియ వర్ణనము—

"వీరులు, నీతిచారులు, గభీరులు, ధీరులు, నర్థికోమలో
దారులు, ఖడ్గధారులును, ధర్మవిచారులు, వజ్రహారులున్
శూరులు, ప్రేయసీ హృదయచోరులు, నింకగడున్మనోహరా
కారులు, తత్పురంబునను గల్గిన రాజకుమారు లెంతయున్."

ఈమె ఇంకొక రచనమగు మాధవశతకమున ఆనాటి సంఘముల స్త్రీల అవిద్య చాలా సహజముగా వర్ణింపబడినది.

"గొల్లది చల్లవాడుకిడ గోడల గీతలుగీసి లెక్కలన్
దెల్లముసేయు, జాకలిది తెచ్చినబట్టలు వ్రైచుబట్టలున్
పల్లవపాణి వ్రాడునకు బాగుగవ్రైచుచు, విప్పు ముల్లు, దా
నల్లలితంబుగా, జదువజాలని చిన్నియ లెన్నమాధవా."

ఈమె యింకొక పద్యమున పేర్కొనిన దానినిబట్టిచూడ నీమె సమకాలీనురాలు వింజమూరి తిమ్మక్క యనునామె ద్విపదలో "డోలా చరిత్రము" అను కావ్యమును మిక్కిలి రసపుష్టిగా నొనర్చినదట. కాని యీ కావ్య మగపడదు.

"అధ్యాత్మ రామాయణ ద్విపద"ను రచించిన మామిడన్న సుభద్రమ్మయు, పెక్కు నవలలు రచించిన గోపిసెట్టి లక్ష్మీనరసమ్మ, శ్రీనివాసమ్మ, చిల్లరిగె రమణమ్మ, కృపాబాయి సత్యనాథమ్మగార్లు సుస్మరణీయురాండ్రు. ఇందు కృపాబాయి సత్యనాథను అనునామె కలెక్టరు సత్యనాథను సతీమణి. ఈమె 'విద్యావతి' అను నవలను రచించినది. వీరి కుమార్తె శ్రీమతి పద్మినీసేన్‌గుప్తగారు ప్రస్తుతము కలకత్తాలోనున్న ప్రసిద్ధ రచయిత్రి.

వీరుకాక "లక్ష్మీ స్వయంవరము" అను ఏకాంకికను రచించిన గూడపాటి లక్ష్మీనరసమ్మ; "శ్యమంతకమణి నాటకము", "రామేశ్వర యాత్రా చరిత్ర" మున్నగు కృతులను రచించిన గుండు అచ్చమాంబ, చోరగుడి సీతమ్మ, 'మీరాబాయి' కావ్యకర్త్రి. మొసలిగంటి రామాబాయమ్మ, 'మృగశృంగ' కావ్యకర్త్రి. చూడి కుడుతమ్మాళ్, 'భద్రాచలాధీశ్వర శతక' కర్త్రి. మోదవరపు లక్ష్మీనరసమాంబగార్లు కూడా ఇట స్మరణీయురాండ్రే.

## 53. వెన్నెలగంటి హనుమాయమ్మ (1879) :

నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా యందలి వెలగపూడి సుందర రామయ్యగారి కుమార్తె, వెన్నెలగంటి నటేశముగారి భార్యయైన హనుమాయమ్మ సంస్కృతభాషను ప్రౌఢముగ కవనముచెప్పిన విదుషీమణి.

బాల్యముననే వైధవ్యము సంప్రాప్తింపగా తమ్ములును, మేనమామలును సంస్కృతము నభ్యసించుచుండగా విని, తానును సంస్కృతము నేర్చుకొని ప్రాక్తన జన్మవాసనాబలమున గొప్ప ఆధ్యాత్మికవేత్త్రియై సంస్కృతమున గ్రంథముల నొనర్చినారు.

వీరి రచనలు - "పరమహంస పరివ్రాజకాచార్య శ్రీశ్రీ బ్రహ్మానంద సరస్వతీ స్వామివారి పాదుకా పూజనమ్" కీర్తనల రూపమున నున్న

"దత్తపూజాకదంబకమ్" "శ్రీ జగద్గురు శంకర భగవత్పాదాచార్య పూజావిధిః", "శ్రీమచ్ఛంకర భగవత్పాద సహస్రనామావళిః." ఈ గ్రంథము లన్నియు అపూర్వములే. శ్రీ శంకరుల కిట్లు సహస్రనామావళి కూర్చిన వారు లేనేలేరు. ఆ భాగ్య మీ యాంధ్రవనిత పాలబడినది. ఈ గ్రంథమున మూడువందల ఇరువదితొమ్మిది అనుష్టుప్పులలో 1021 నామములు కలవు. ఈమె గ్రంథములకు ఉత్తరాదిని బాగుగా వ్యాప్తి కలదు.

ఇవిగాక మహాస్రగ్ధరావృత్తమున పుష్పమాలికాబంధమున గాయత్రీ స్తవ మొనర్చినది.

"హంసస్థాం, సత్యసంధా మగజగనిగమాధార తారస్వరస్థాం,
గాయత్రీం, యజ్ఞయజ్ఞాం, సురనరవరదాం, పంకజాం, కంబుకంఠీం,
సావిత్రీం, విద్యవిద్యాం, శ్రుతిమతి గతిదాం, దేవసౌవర్ణవర్ణాం,
వందేహం, దేవదేవీం, విమలమణిమయీం, కుంద సౌందర్యదన్తాం."

ఆమె రచనయంతయు నిట్లే సౌందర్యప్రభామండితముగా నుండును. ఇవికాక విశ్వామిత్రప్రోక్తమైన అధ్యాత్మరామాయణము నందలి శ్రీరామ భగవద్గీతలకు తెలుగున టీక వ్రాసిరి.

ఈ యుగమున నీమె యంత ప్రతిభావంతముగ సంస్కృత రచనలు చేసిన వారీమెయే కాన్పించుచున్నారు. ఈమె రచనలు నేడు కాన్పింపవు. గృహలక్ష్మియందలి విమర్శనమే యాధారము.

## 54. సీరము సుభద్రయాంబ :

జయపుర సంస్థాన కవియు, శతాధిక గ్రంథకర్తయు నైన సెట్టి లక్ష్మీనరసింహముగారి సోదరి సీరము సుభద్రయాంబగారు గొప్పకవయిత్రి.

'సురుచీవిజయము', 'శిరోమణి' యను నాటకములను, 'శ్రీ వేంకటేశ్వర', 'శ్రీరామ' శతకములను, 'ఉత్తరరామచరిత్ర' యను నిర్వచన కావ్యమును, 'శుకజనక సంవాదము', ఆంజనేయ స్తోత్రాష్టాదశకము' అను కావ్యములను, వివిధములైన వ్యాసములతో కూడిన వ్యాసగుచ్ఛమును, 'జాగిలము' అను నవలను (ఆంగ్లానువాదము) రచించిరి. ఇవికాక 'ఉత్తరా

విలాపము', 'రుక్మిణీసందేశము', 'గృహలక్ష్మి' అను ఖండకావ్యములను రచించిరి.

అన్నింటను వీరి రామాయణ రచన మిక్కిలి మనోజ్ఞమై ధారా శుద్ధితో కూడినదై, సరళమైయున్నది.

స్త్రీలయందు ప్రప్రథమ నవలా రచయిత్రి యీమెయే.

## 55. అవధూత జ్ఞానమాంబ :

తపస్వినియై తత్త్వవేత్త్రియై కవీశ్వరురాలై తన యునికిచే మనికిచే ఆంధ్రమాతను, ఆంధ్రభారతిని పావన మొనర్చిన పరమపూజ్యురాలు జ్ఞానమాంబ. ఈమె శేషమాంబా సుబ్బరాయుల పుత్త్రీమణి. బాల్యముననే అక్షరాభ్యాసమైన కొన్నిదినములకే అక్షరమాలనంతను గ్రహించుటే కాక నాతిచిరముగ ఈడునకుమించిన విద్యను నేర్చి పండ్రెండవయేటనే రంగావధూతగారి శిష్యురాలై, బాల్యమున తలిదండ్రు లొనర్చిన వివాహబంధమును రోసి దుర్గమగిరి గహ్వరముల కేగి తప మొనర్చి 'జ్ఞానమాంబ' యను పేరున సుప్రథితురాలైన మహాభాగ ఈమె.

ఈ మహాయోగిని రచనలు దేవుడు, విజ్ఞానామృతము, కాశీప్రసాదిని, రంగావధూత, సత్ప్రభుశతకము, గార్గి యనునవి. బొండుమల్లెల పేర్లవలె, అదభ్రరుచి కిరవగు మౌక్తిక మాలవలె స్వచ్ఛకాంతులతో, అతివిశదమగు శైలితో, ఓజోవంతమగు గంభీరార్థముతో వెలయు నీమె కృతులు లోకతారకములు.

దేవుడను కావ్యమునందలి దేవు డెవరు? అను సంవాదము ఎల్లరు తప్పక చదువదగినది.

"అక్కరో! దేవు డెవ్వరు? అత డెక్కడుండు?" నని ప్రశ్నింపబడి యీమె యిట్లు ప్రత్యుత్తర మిచ్చును :

"దేవు డెచ్చటో కలడదే త్రోవనేగి
దర్శనము చేయవలెనని తలచువారు

ఆకసము నెత్తిపైనున్న దనెడువారు
.... .... .... ....
ప్రేమ కేమైన రూపంబు పెట్టినారె ?
ప్రేమ నెఱుగనివార లీ పృథివిగలరె ?
.... .... .... ....
ప్రేమధాముని దేవు దర్శింపలేవె ?"

'కాశీప్రసాదిని' యందలి : "ఏమార్గమునందు నిడిన
నామార్గమునందె నడచి యది విడలేదా
నీ మనసు నెఱిగి నిర్మల
మౌ మార్గమునందె యుంచ నగునో బాలా."

ఇట్టి పద్యములు ఉపనిషదర్థ ప్రతిపాదకములై యున్నవి.

'చంద్రకళావిలాస' మను ప్రబంధమును రచించిన శ్రీమతి కర్రా సుబ్బలక్ష్మమ్మ, 'గురుమౌళి శతకము'ను రచించిన గ్రంధి మాణిక్యాంబ, 'గృహలక్ష్మి' యందు పెక్కు వ్యాసములను ప్రకటించిన ఆచంట సత్యవతమ్మ 'చంద్రమౌళి' యను గ్రంథమును, 'చంపకమాలిని' యను నవలను రచించిన రాజాంబయు, వాజపేయయాజుల మహాలక్ష్మమ్మ, 'ప్రబోధ మను ఖండ కావ్యకర్త్రి ఇనగంటి సరస్వతీదేవియు 'భక్తిరసామృతము', 'దివ్యక్షేత్ర సందర్శనము' అను రుచిమద్గ్రంథములను రచించిన సీమకుర్తి సత్యవతి, 'విక్టోరియా క్రాసు' మున్నగు పెక్కులగు సుప్రసిద్ధ నవలలను రచించి ఆంగ్ల ప్రభుత్వకాలమున ప్రభుత్వపారితోషికముల నందిన పులవర్తి కమలావతీదేవి, రాజశేఖరకవి కృతమగు 'కర్పూరమంజరి' యను ప్రాకృతనాటకమును తెలుగీకరించి ఇంకను పెక్కు ఖండకావ్యములను రచించిన రావూరి వెంకట సుబ్బమ్మ, 'భీష్మస్తవరాజము' మున్నగు గ్రంథములను రచించిన భువనగిరి లక్ష్మీకాంతమ్మ 'జనార్దనశతక' కర్త్రి దొంతి రాజరత్నమ్మ ఆంధ్రరాష్ట్రా స్థాన కవీశ్వరులును, సుప్రసిద్ధ కవీశ్వరులునగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి గారి తనయ, సంగ్రహ భారత, భాగవత, రామాయణ కావ్యకర్త్రి కల్లూరి విశాలాక్షమ్మ, నాళము సుశీలమ్మగార్లు ఇట సుస్మరణీయురాండ్రు. వీరంద

బును ప్రతిభావంతురాంధ్రైన కవయిత్రులే. కాని స్థలాభావముచే నిట్లు సమూహముగ పేర్కొనవలసివచ్చినది.

## 69. పులుగుర్త లక్ష్మీనరసమాంబ (1878) :

స్త్రీల కుపయుక్తమగు అనేక రచనలుచేసిన లక్ష్మీనరసమాంబగారు చింతలపూడి అగ్గమాంబా నీలాచలం పంతులుగార్ల కొమారిత. మహా విద్వాంసులైన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారి శిష్య. వీరేశలింగంపంతులు గారి సంస్కారోద్యమములలో వీరిది వ్యతిరేక సనాతనపక్షము. విమర్శకా గ్రేసరులైన నడకుదుటి వీరరాజు పంతులుగా రీమెకు మేనమామ.

'సావిత్రి' యను పత్రికకు సంపాదకురాలై ప్రథమ స్త్రీ పత్రికా సంపాదకురాలను ఖ్యాతి గడించినది. వామన పురాణమును వచనముగ తెనిగించిరి. స్త్రీల యభివృద్ధికై 'విద్యార్థినీ సమాజ' మను పేర నొక సమాజమును తమ వాసస్థలమగు కాకినాడయందు స్థాపించి సేవచేసిరి. వీరికి హిందీ, వంగభాషలయందు కూడ పాండిత్యము కలదు. ఆ భాషల నుండి కూడ అనువాదముల నొనర్చిరి. మంగళహారతుల శతకము, కొన్ని నవలలు, పురాణ కథలు, మహిళాకళాబోధిని యను కావ్యము మున్నగు రచనలు వీరివి పెక్కుగలవు. సుప్రసిద్ధ భాషాసేవకురాలు. స్త్రీ సంఘా భ్యుదయ కాంక్షిణి, ఈ నడుమనే కాకినాడయందు స్వగృహమున మరణించిరి.

## 70. జూలూరి తులసమ్మగారు ;

"పద్మావతీ విజయము", "సుమతి చరిత్ర", "రాణీభవానీ" మున్నగు పెక్కు కావ్యములను 'గులేబకావళి' యను నాటకమును పెక్కు వ్యాసములను వ్రాసిన జూలూరి తులశమ్మ గొప్ప విద్వత్కవయిత్రి. ఈమె రాణీ చిన్నమాంబ గురుపరంపరలోనివారు. ఆ రాణి కాస్థాన కవయిత్రి. వీరి 'గులేబకావళి' నాటకము తెనుగునాట మిక్కిలిగా ప్రయోగయోగ్యత నందినది.

## 71. కవితావిశారద కాంచనపల్లి కనకాంబ (1893) :

బహు గ్రంథకర్త్రియు, గొప్ప విద్వాంసురాలును, క్వీన్ మేరీ కళాశాల (మద్రపురిలో) ఆంధ్రోపన్యాసకురాలుగను, ప్రభుత్వ విద్యాశాఖా సభ్యురాలుగాను, 'గృహలక్ష్మి' పత్రికా సంపాదకులు కేసరిగారి స్వర్ణకంకణ గృహీత్రియునై వెలసిన కాంచనపల్లి కనకమ్మగారితో ఆంధ్ర మహిళా రచయిత్రీ లోకమున నొక పరిణామ మగపడుచున్నది. శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావుగారు, మున్నగు కవివరుల నూతన కవితా పంథయు, జాతీయభావ సంస్కారమును ఈ కాలమునుండి రచనలలో ప్రతిబింబించుట కాననగును.

వెనుక పేర్కొనిన శ్రీమతి పులవర్తి కమలావతిగారును కేసరికంకణ స్వీకార మొనర్చినవారే.

కాంచనపల్లి కనకమ్మగారు 'జీవయాత్ర' 'అమృతానంద బోధ సారము', 'ఆనంద సారము' అను నాధ్యాత్మిక కావ్యములను, 'హంస విజయము' అను వేదాంత నాటకమును, శాకుంతలానువాద నాటకమును రచించిరి. ఇవి కాక వీరివి పెక్కు గద్య పద్య కృతులు కలవు.

దుర్గ్రాహమగు వేదాంత విషయమునైనను, సుగ్రహశైలిలో, రమణీయముగ రచించుట వీరి ప్రత్యేక కవితా గుణము :

"త్రిప్పి, త్రిప్పి, త్రిప్పి, తిన్నన నిలుజేర్చి
గొడ్డు వెంట నంటి గొల్లవాడు
త్రిప్పి, త్రిప్పి జీవు దిద్ది ప్రోచునుగద
తత్పరుండు హరి పరాత్పరుండు."

వీరు సంఘమును ప్రబోధించుపట్ల వ్యంగ్యధోరణి తోడి సున్నితమును, గంభీరమునునగు హాస్యమును పోషించినారు. మిక్కిలి లౌకికానుభవ పూర్ణములై నూత్నశైలితో చక్కని పెక్కు గ్రంథములను రచించి మించుటేకాక విజయవాడలో శ్రీ చుండూరి వెంకటరెడ్డి గారిచే నెలకొల్పబడిన త్రిలింగ విద్యాపీఠమున నాచార్యవర్యయై ఆజన్మాంతము ప్రతి

వత్సరము పండితచర్చలు, సన్మానములు చేయించి విద్యాసేవ చేసి ధన్యత నొందిరి.

## 72. గుడిపూడి ఇందుమతీదేవి :

'అంబరీష విజయము', 'లక్షణా పరిణయము', 'తరుణీ శతకము', 'రాజేశ్వరి శతకము', 'నీతి తారావళి', 'నరసింహ శతకము' 'సోదరి', 'గోవిలాపము', మున్నగా గల పెక్కు పద్య కావ్యములను, 'నర్మద' యను నాటకమును, గాంధీ కీర్తనలను, రామకథా మంజరి యను గద్య గ్రంథమును రచించిన ఉత్తమ కవయిత్రి శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవిగారు ఆంధ్రదేశమున సుప్రసిద్ధులైన మతుకుమల్లి వారి ఆడపడుచు, వీరిభర్త కీ. శే. గుడిపూడి రామారావుగారు. ఇందుమతీ దేవిగారి ప్రస్తుత నివాసము విజయవాడ.

సలలితశైలితోడి వీరి రచనలు హృదయాహ్లాదకరములుగా నుండును.

'సోదరి' కావ్యము నందలి భావుకతా సహజలతకు —

"ఒడిని బాలనుంచు నొయ్యన ముద్దాడు
శిరము మూరు కొనును, చేతనిమురు,
కనులనీరు నించు, గనుగొంటి నిన్నాళ్ళ
కమ్మ ! నిన్నటంచు హర్షమందు."

## 73. 'కవిరాణి' చిల్కపాటి సీతాంబ (1900) :

"ఆజికిదప్పి శత్రువుల కౌదల లొగ్గితిరేని మేమికన్
గాజులనూడ్చి కత్తులను, కత్తళముల్గొని, వైరిసేనలన్
తేజమడంచి । యీ భరతదేశము కున్నతి గూర్చి, హైందవ
స్త్రీజన శౌర్యముద్దెలిపి చేతులు మోడ్వగ జేతుమిత్తరిన్."

భారత మాతకు దాస్యవిముక్తి కల్గించుకై ఆంగ్ల ప్రభుత్వముతో గాంధీజీ నాయకత్వమున భారతీయులు సాగించిన సత్యాగ్రహ సమర సమయమున శ్రీమతి సీతాంబగారు వ్రాసిన ప్రబోధములోని దీపద్యము.

సీతాంబగారి పలుకు తేట తెల్లముగను, సునిశితముగను, గంభీరముగను నుండును. వీరి తల్లిదండ్రులు పర్ణశాల అలమేల్మంగ తాయారు, రాఘవాచార్యులుగార్లు. చిలకపాటి వెంకట నరసింహాచార్యుల సతి, నెల్లూరు మూలపేట సంస్కృత కళాశాల యందు ఆచార్యులుగారు పండితులు. 'పద్మినీ పరిణయము' అను ప్రబంధము, 'క్షీరసాగర మధనము' అను నాటకము, 'దిలీప' యను నేకాంకిక 'అరవింద' యను నవల, 'శూర్పణఖ' యను నేకాంకికలను రచించిరి.

## 74. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

ఆధునికాంధ్ర వాఙ్మయమున జాతీయమగు తెలుగుభాషను సరస రచన చేయగల విదుషీమణి శ్రీమతి వరలక్ష్మమ్మగారు.

పాలపర్తి శేషయ్య, హనుమాయమ్మగార్ల కొమరిత. కీ. శే. కనుపర్తి హనుమంతరావుగారి సతీమణి. బాపట్ల నివాసము.

కథానికా రచనమున వీను మిగిలిన రచన వీరిది. గృహలక్ష్మి మున్నగు మాస పత్రికలలో ఆయా సమయముల కవసరములగు సాంఘికేతి వృత్తములను పరామర్శించుచు వీరు 'శారద లేఖల'ను వ్రాసి యున్నారు. 'పద్మ' అను నాటకమును, ఆంధ్రమహిళోద్యమముపై నొక బుఱ్ఱకథయును, లక్ష్మియను మకుటమున కొన్ని నీతి పద్యములను రచించిరి. వీరు నిరంతర రేడియో ప్రాసంగికురాలు. గృహలక్ష్మి సంపాదకులగు శ్రీ కేసరిగారు వీరికే ప్రప్రథమమున స్వర్ణకంకణ మిచ్చి బహూకరించిరి. సీతాంబగారును ఇట్లు బహూకృతలైన వారే. బాపట్లయందు "స్త్రీ హితైషిణీ మండలి" అను సంస్థను స్థాపించి సేవచేయు చున్నారు.

## 75, 76 శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ. కీ. శే. పొణకా కనకమ్మ గార్లు.

నెల్లూరు నందలి కస్తూరిదేవి విద్యాలయ స్థాపకురాలైన కీ. శే. పొణకా కనకమ్మగారును, శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారును జంట కవయిత్రులు. గాంధీజీ పిలుపు నందు అసహాయోద్యమమున బహుధా

శ్రమించిన మహిళా రత్నములు వీరు. శ్రీ రమణ భగవానుని శిష్యురాండ్రై వీరు 'ఆరాధన', 'నైవేద్యము' 'జ్ఞాన నేత్రము' మున్నగు రమణభక్తి రస తుందిలములగు చక్కని కావ్యములను రచించుటయేగాక గీతాను వాదమును కూడ పొనరించి యుండిరి. రసవత్తరమగు రచనా భంగి, ప్రసన్న రుచిరమగు శైలియు వీరి కవితకు విశిష్టాలంకారములు.

"జగములు దన్ను తేజ స్సముద్రమ్ము
అడుగడ్గునకు క్రొత్తయందమ్ము దోప
తనివితీరని యమృత స్వరూపమ్ము
నిరతమ్ము మాలోన నివసించుగాక".

ప్రస్తుతము ఆంధ్ర ప్రభుత్వము వారిచే M.L.C. పదముతో సమ్మా నింపబడి శ్రీ లక్ష్మీబాయమ్మగారు సేవ చేయుచున్నారు.

## 77. 'కవికలహంసి' చేబ్రోలు సరస్వతీదేవి :

'సరస్వతీ రామాయణమ'ను బృహత్కావ్యమును రచించుటయేగాక ఆత్మోపదేశము' 'శారదా శతకము, అనుమేలి కృతులను విరచించిన కవయిత్రీమణి సరస్వతీదేవిగారు. ఈమె నూజివీడు పుర వాస్తవ్యులగు శ్రీ చేబ్రోలు రాజగోపాలము నాయుడుగారి సతీమణి. చల్లగా, తియ్యగా నుండు కవిత్వ ధర్మముతో ఆంధ్ర భారతిని సేవించిన గేస్తురాలు. వీరును కేసరికంకణ గృహీతియే.

## 78. శ్రీమతి ఆత్మూరి అన్నపూర్ణమ్మ :

కుమార సుగుణబోధినియను శతకమను కొరడాతో కువ్యవసాయు లగు దుష్టులను ఝుడిపించిన ధీరురాలు శ్రీమతి అన్నపూర్ణమ్మగారు. అన్నపూర్ణమ్మగారి మాతా పితృవంశములు రెండును విద్యా విజ్ఞానములలో ముందంజ వేసినవే. యజ్ఞము నొనర్చి మహాసంస్కార భావములతో సంఘ సేవ యొనర్చిన కీ. శే ఆత్మూరి నరసింహంగారి కోడలీమె.

ఈమె తండ్రి కొల్లిపర శ్రీరాములుగారు. వీరు తహసీల్దారుగా పని చేసినవారు.

లోకమున స్త్రీలను గూర్చి నీతులు చెప్పువారు చాలా అధికము కదా! కుమారీ నీతి శతకాదు లెన్నో లోకమున వ్యాపించి యున్నవి. పురుష సంఘమున గల నిరంకుశాచార పరతను దిద్దుకొనుటకు పూను కొనువారు మన సంఘమునకు అవసరముకాదా! యనునొక ప్రశ్నకు వీరి కుమార శతకము ప్రత్యుత్తరము.

"పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
విచ్చల విడి వేయునట్లు, విరివిగసుకవుల్
హెచ్చుగ విద్యల నేరిచి
వచ్చిరె స్త్రీ నీతి గఱుప వసుధ కుమారా.

రుసరుసలాడుచు, దిట్టుచు,
గసరుచు గోపింప, సతులు గ్రక్కున వశలై
మసలుదురని తలపోయుదు
రసురులవలె దుష్టపురుషు లవని గుమారా.

సంసార శకటము నీడ్చుటలో సరిసమాన బాధ్యతకల స్త్రీ పురుషు లలో స్త్రీని నీతి పేరిట అణంచుటకు అందఱును పెద్దలుగానే కన్పట్టు చున్నారు. కాని పురుష సంఘమున గల దురంతములను బాపు కొనుట కేనాడు సంఘమున ప్రయత్నము జరుగునో ఆనాడే సంఘము బాగుపడు నను భావమును వీరు చక్కగా తమ రచనలలో వెలిబుచ్చిరి.

## నవ్యాంధ్ర కవిత

### 79. శ్రీమతి తల్లాప్రగడ విశ్వ సుందరమ్మ (1900) :

20 వ శతాబ్దము ప్రారంభమగు నంతవఱకు మహిళా వాఙ్మయమున Lyric అనబడు భావ కవిత్వము వెలయలేదు.

సుప్రసిద్ధ కాంగ్రెసు వాదులగు తల్లాప్రగడ నరసింహం గారి ధర్మ పత్నియీమె.

'కుపితవిధి', 'చిల్కా', 'అంధకారము' 'స్నేహారుచి' మున్నగు ఖండ కృతులను రచించిరి. నవ్యాంధ్ర కవితా సంపుటమగు 'వైతాళికులు' అను సంకలమున వీరి కావ్యములు కలవు.

'కుపితవిధి' యందలి విరహార్త:-

"పూల మాలికలల్లి నందుకు
కలుకు కత్తులె కాన్కలాయెను
తేనె సుధలను చల్లినందుకు
తేటికాటుల పోటులాయెను
అగ్నిమండెను గుండెలోపల
ఆరదేమి చేతునే ?...."
మలయ పవనుడు పారిపోయె
మాధవీ మృదు సౌరభముగొని
..............................ధ్వన్యుప

లక్షితమగు మధుర కవిత వీరిది.

## 80. చావలి బంగారమ్మ 1900 :

ఆంధ్ర వాఙ్మయ క్షేత్రమున పరిపక్వమాద్వీక ఫలములగాయించిన అమృతహస్త యని పేరొందిన చావలి బంగారమ్మగారు 'కప్పతల్లి పెండ్లి' 'ఆకొండ', తమస్సు, 'కార్తీక పూర్ణిమ' అను శీర్షికలతో భావగీతములను రమణీయముగ రచించిరి.

ఇంతతో 19 వ శతాబ్దాంతము వఱకుగల ఆంధ్ర మహిళల మహనీయ సారస్వతమును చూచాయగా వివరించుటైనది.

భారతదేశము స్వాతంత్ర్యము నొందిన వెనుక ఆంధ్రమహిళలు పెల్లుబుకు నుత్సాహముతో వివిధ ప్రక్రియలలో రచనము గావించుచు ఆంధ్ర సారస్వతమున కలంకారమును చేకూర్చు చున్నారు.

# ఉర్దూ కవయిత్రులు

మూలము :
జీనత్ నాజిదా

అనువాదము :
శ్రీ గడియారము రామకృష్ణశర్మ

భారతదేశము సువిశాలమైనది. ఉత్తరమునుండి దక్షిణమునకు, తూర్పునుండి పడమరవరకు గల ఈదేశ భౌగోళిక పరిస్థితులు భిన్నభిన్నముగ నున్నవి. ఇచటి వాతావరణమునందును, ప్రజల జీవనవిధానము లందును భిన్నత కానవచ్చుచున్నది. వేరువేరుగ ప్రాంతమున కొక భాష యున్నది. వారివారి సాంప్రదాయ ప్రత్యేకతలు భిన్నములుగ నున్నవి. జార్జి గ్రియర్సన్‌గారి యభిప్రాయమునే సత్యమని నమ్మినచో శబ్దజాలము నందును, సామెతలయందును, పలుకుబడులయందును, ఉచ్చారణ విధానము లోను భేదము, మార్పులతో కూడిన 544 వ్యావహారిక భాషలు, 176 ప్రాంతీయభాషలు భారతదేశమున గలవని చెప్పవచ్చును. వీనియందలి బహుభాషలలో సుందరసాహిత్యములు వెలసినవి.

దేశభాషలయం దెంతటి విభిన్నత గోచరించినప్పటికిని దేశమంతయు నొక సమష్టి సభ్యత అంతస్స్రోతమై సాంస్కృతిక సమైక్యతను ద్యోతకము చేయుచున్నది. ఇది యెంతయో ఆశ్చర్యకరమైన విషయము. ఇందువలననే బాహ్యదృష్టికి విభిన్నమై కానవచ్చినను ఈ భరతదేశము మాత్రము ఒకే ఒక మహాదేశముగా నున్నది. భారతీయత అనునది ఒక జాతిగ పరిగణింపబడుచున్నది. ఈ సమష్టి భావనిర్మాణమునకు ప్రతిప్రాంతము సహకరించినది. బహువర్ణవిలసితులైన జాతులయందలి నానాత్వమును తొలగించి ఏకత్వమును సాధించుటలోనే ఈ దేశపు గొప్పతన మిమిడియున్నది.

ఈ సమష్టిభావమును పర్యాప్తము చేయుటయందును, ప్రాంతీయ ప్రజలు ఒకరినొకరు అర్థముచేసికొని, సమైక్యభావముతో మెలగుటకును అధిక సహాకారములగు నాయాభాషల ప్రాధాన్య మెంతేనిగలదు. దేశము

నందంతటను సంచరించి, జనసామాన్యమున భక్తిని, సేవాభావమును ఏకత్వమును బోధించిన, సాధువులు, సన్యాసులు, సూఫీలు, కవుల ప్రయత్నములు గూడ ప్రశంసనీయములైనవి.

ప్రధానములైన భారతీయభాషలలో ఉర్దూభాష ఒకటి యనుటలో సందేహములేదు. ఈ భాష ఎట్లేర్పడినది, ఎట్లు వికాసమునొందినది అను విషయములనుగూర్చి ఉర్దూభాషా తత్త్వవేత్తలు తేల్చుచున్నారు. అమీర్ ఖుస్రూ, గేస్‌దరాజ్ వంటి మహాకవు లీ సాహిత్యారంభమున కృషిచేసి దాని యభ్యున్నతికి మార్గము లేర్పరచినారు.

దక్షిణాపథము ఉత్తరదేశమును కాదని, అన్నిపరిస్థితులలో తన ప్రత్యేకతను నిలబెట్టుకొనినది. ఆ విధముగనె ఉర్దూభాషకూడ ఈ ప్రాంతములలో సర్వతోముఖాభివృద్ధిని పొందగలిగినది. ఉత్తరహిందూదేశమునకన్న ఈ ప్రాంతమే ఉర్దూభాషా సాహిత్యవికాసమున కనువై అవకాశమునిచ్చినది. ఆకాలమున నీ భాషను 'దక్కనీ' యనియే వ్యవహరించుచుండిరి. బహమనీ రాజ్యముతోబాటు, ఈ భాషకూడ ఉన్నతగౌరవము నందుకొనినది. బహమనీరాజ్య పతనానంతరము గోల్కొండనవాబులు, బీజాపురపాలకు లీ భాషా సాహిత్యమున కెంతయో తోడుపడినారు. సూఫీలతత్త్వ ప్రచారముల ద్వారమునను, భూమ్యాదాయశాఖలయందు ఉర్దూభాషలోనే వ్యవహారములు జరుగుటవలనను, యావద్భారతమునందలి భాషాపదములను గ్రహించుటచేతను, రాజకీయ వ్యవహారకారణముగ ఔత్తరాహుల కలయికచేత నీ భాష పుష్టిని చేకూర్చుకొని గద్యపద్యములందు ఉత్తమరచనల కనువైనభాషగా రూపొందినది.

ఉర్దూభాషా స్వభావమునకు కవితారచన అందివచ్చినది. కాన ఎందరో మహాకవు లుద్భవించి, మహాకావ్యముల వ్రాసి అజరామరతను సంపాదించుకొనినారు. కాని పేరున కొక్క కవయిత్రికూడ లేకపోవుట ఆశ్చర్యకరమైన విషయము. సౌకుమార్యవతియైన స్త్రీకి రచనలయందు ప్రాధాన్యమున్నప్పటికిని కవయిత్రిగ ముందునకు రాకపోవుట గమనింప

వలసిన విషయము. నిజమునకు పరిశీలించినచో నీ విషయము ప్రపంచ సామాన్యమై గోచరించుచున్నది. అన్నిటను ప్రాధాన్యమును వహించిన పురుషుడు స్త్రీని తన ఆస్తిగభావించి దానికి తాను యజమానియైయుండు వాడు. ఆతని ఐశ్వర్యములో ఆమె యొకభాగమైయుండి అతనిచేతనే రక్షింపబడునది 'స్త్రీ' సర్వానర్థములకు మూలమని నిరసింపబడునది. అందు కనే 'స్త్రీ' ఏ ప్రాధాన్యములేక తెరమరుగునకు వెళ్లినది. అయ్యును అవ కాశము లభింప అన్నిరంగములందు కూడ పురుషునికన్న మిన్నగ స్త్రీ వ్యవహరింపగలదని చాటుటకు గ్రీసునందలి 'సైనూ', ఈరాన్ దేశపు 'తాహెరా', భారతదేశమునందలి 'మీరాబాయి' లను పేర్కొనవచ్చును. కేవలము సుకుమార, సుందరసృష్టియైన కవితావిషయములందేగాక రాజ్య పాలనా విషయములందు కూడ స్త్రీలు సమర్థలేనని చాటుటకు పెక్కు ఉదాహరణములున్నవి.

మొట్టమొదట కవితారచన స్త్రీలలో రాకుమార్తెలతోనే ప్రారం భింపబడినది. తరువాత మెలమెల్లగ ధనికకుటుంబపు స్త్రీలయందు కవ యిత్రులు బయలుదేరినారు. వేశ్యలు కూడ రాజకన్యలవలెనే సాహిత్యము నందు కృషిచేసి కవయిత్రులైనారు. ఇక 19 వ శతాబ్దము తరువాతనే ప్రాచీన నిర్బంధములన్నియు తొలగి, హాలీవంటి కవిప్రబోధరచనల ప్రభా వము వలన స్త్రీవిద్యపట్ల సుముఖత్వ మేర్పడి యా సంస్కరణల ఫలితముగ స్త్రీసామాన్యమునందు కవితారచన ప్రారంభింపబడినది.

దక్కన్ ప్రాంతమునందు 'మర్సియా' (శోకగీతము) చాల ప్రచా రమునం దుండినది. దీనిని స్త్రీలు పాటలుగా రచించుచుండిరి. ఈ మర్సి యాలపై మత, సాంఘిక ప్రభావములు పడనందున స్త్రీలభావములు ఈ గీతికలద్వారమున వెల్లడిచేయుటకు మంచి అవకాశము వారికి చేకూరినది. ఆ కాలమున రాజాస్థానములందు సంగీత, నృత్య, వినోదకార్యక్రమములను చతురలైన స్త్రీలే నిర్వహించుచుండిరి. మహారాజుల ననుసరించి వారి సామంతులు, అధికారులు, ధనికులు కాలక్షేపమునకై ఇట్టి స్త్రీలను తమ

కొలువునందు నియోగించువారు. ఈ స్త్రీలు, విద్యావతులును, కళాకుశల లును అయినప్పటికిని సంఘమునందు వారికి గౌరవమర్యాదలు లేకుండెను. అట్టి స్త్రీలందర రొక ప్రత్యేక సంఘముగ వేశ్యలనుపేర పిలువబడుచుండిరి. కులస్త్రీలు జంకుచున్నను, ఈ వేశ్యలు సభాప్రాంగణములందు ప్రవేశించి, పురుషులతోపాటు కవితాగోష్ఠులందు పాల్గొని, 'గజల్' మొదలైనవానిని రచించుచుండిరి.

దక్కన్ ప్రాంతమునందుకంటె 'ఉత్తరహిందూస్థాన'మున గజల్ చాల ప్రచారముననుండెను. ఈ 'గజల్'లోని భాష, భావములు శృంగార పరిధులను మించియుండుటచేత కేవలము కులస్త్రీలు చేపట్టునవిగా మాత్రము లేకుండెను. ఈ గీతములయందు ముఖ్యముగ స్త్రీ సహజాలంకారమగు లజ్జ పాటింపబడనందువలన నవి వాస్తవమునకు స్త్రీలచే రచింపబడినను స్త్రీ లిట్టి రచనలు చేయుదురనిన నమ్ముటకు వీలులేనివిగా నుండెను. అయ్యును నిజమునకు ఆ కాలమునందలి వేశ్య లిట్టి రచనములను గావించినారు.

19 వ శతాబ్దమువరకు 'దివాన్లు' రచించిన స్త్రీలు తక్కువగనే ఉన్నారు. ఇరువదవ శతాబ్దముననే వీనిని రచించిన స్త్రీలసంఖ్య ఎక్కువగ కానవచ్చుచున్నది. మొదటి ఉర్దూదివాన్‌ను రచించినఖ్యాతి 'కులీకుతుబ్‌షా' మూలమున హైదరాబాదునకు చెందినట్లే మొదటి 'దివాన్' రచయిత్రి కూడ హైదరాబాదునకు చెందినదియగుట ముదావహము. గర్వకారణము.

## జేబున్నిసా :

మొగలు పాదుషా కుమార్తెయగు జేబున్నిసా, జేబు ఉన్నిసా మఖ్ఫీ 'అను పేర నొక ఉద్గ్రంథమును ఫారసీ భాషలో రచించినది. ఈమె ఉర్దూభాషలో మూడు గీతములను మాత్రమే వ్రాసినది. ఈ గీతములు చాల సరళశైలిలో వ్రాయబడినవి. తెలిసినంత వరకు, ఈమెయే మొట్ట మొదటి ఉర్దూ కవయిత్రిగ గోచరించు చున్నది.

## షాహజాది హయాత్ బక్షి బేగం :

ఈమె ఉర్దూ భాషలో ప్రథమ 'దివాన్' రచయిత్రి. ఈమె మహా

మ్మద్ కులీ కుతుబ్‌షా పుత్రిక సుల్తాన్ మహమ్మద్ కుతుబ్‌షా భార్య అబ్దుల్లా కుతుబ్‌షాకు తల్లి. ఈమె హాయాత్ నగరమున మసీదు కట్టించి, విద్యాశాలలను స్థాపించి విద్వాంసుల నాదరించి అనేక ప్రజోపయోగకరములైన యనేక కార్యముల చేయుటచేత నీమె జనాదరణము నతిగాపొందినది. ఆ కాలమున స్త్రీలు విద్యావతులు గాకున్నను పాటల నెన్నియో అల్లినారు. ప్రజాజీవితము ప్రతిబింబింపబడిన ఈ పాటలు నేటికిని ఇంటింట వినబడుచునే యున్నవి. కాని వీని కర్తలెవరో తెలియరాదు

## లుత్ఫున్నిసా ఇమ్తియాజ్ :

ఈమె హైదరాబాద్(దక్కన్) నివాసిని. ఆసఫ్‌జాహి యుగారంభ కాలమునకు చెందినది, 'ఇమ్తియాజ్' అనునది యీమె లేఖనీ నామము. ఈమె రచన లన్నియు సాలార్జంగ్ గ్రంథాలయమున భద్రపరుపబడి యున్నవి. ఈమె రచించిన 'గుల్షన్‌షేరా' అను గ్రంథము వలననే యీమె జీవితవిశేషములు తెలియవచ్చినవి.

ఈమె తల్లి బాల్యముననే గతించుట, తండ్రి దేశాంతర గతుడగుట వలన, దగ్గరి బంధువుల పోషణములో నీమె విద్యాబుద్ధుల నేర్చినది. ఈమె బాల్యమునుండియే కవితల నల్ల నేర్చినది. యుక్తవయస్సున నీమె అసదలీ ఖాన్‌తమన్నా అను నాతని పెండ్లియాడి, అచిరకాలముననే యీతడు గతించుట చేత, దుఃఖమునుండి ఓదార్పును పొందుట కీమె కవిత్వమును శరణుపొంది హృదయములను కదలించు రచనలను చేసినది. ముప్పదియారు సంవత్సరముల వయస్సులో నీమె 'దివాన్ల'ను రచించినది. తరువాత పది సంవత్సరములకు 'మస్నవీ'లను రచించినది.

'మస్నవీ' యనునది ఫార్సీ సాహిత్యము నందలి ఒక రచనా విశేషము. ఇది క్రమముగా ఉర్దూలో ప్రవేశించినది. దక్కనీ ఉర్దూలో దీనికి ప్రాధాన్యమధికము. ఇది దీర్ఘ పద్య రచన. ఇందుకొన్ని [illegible]లు వర్ణింప బడును. దక్కన్ నివాసినియైన ఈమె కీ ప్రక్రియ[illegible]త్తదికా[illegible] ఈమె మస్నవీలో దాదాపు ఆరువేల కవితలున్నవి. ఈమె [illegible] దివా[illegible]లో

కేవలము గజులులే కాక, ఖసీదా, మర్సియా, దుబాయి, మఖ్మస్. ఖతా, మొదలగు ఛందోవిధానము లెన్నియో గలవు.

నాడు పలువురు రాణులకును, రెండవ ఆసఫ్‌జాహోకును గురువైన బీజాపుర 'షాహ అతావుల్ల' శిష్యురాలైన తరువాత నీమెకు ఆధ్యాత్మిక దృష్టియేర్పడ, విశాల దృక్పథము కలిగినది. ఆ ప్రభావమునే ఈమె రచనల యందు తాత్త్విక భావములు గోచరించు చున్నవి.

**లఖాబాయి చందా :**

నృత్య గీతములు, అందచందములు, కవిత్వ పాండిత్యములు చందా రూపమున అవతరించిన వనగా అతిశయోక్తి కాదు. ఈమె పూర్వికులు, ఉన్నత కుటుంబమునకు చెందినవారయ్యు విధి వైపరీత్యమునకు లోబడి వీరు కష్టములకు గురికావలసి వచ్చినది.

నిరుపమాన సౌందర్యవతులైన ముగ్గురు బిడ్డలకు తల్లియై విద్యాబుద్ధులను, నృత్యగీతములను నేర్పించినది. తల్లి మరణానంతరమున వీరనేక రాజాస్థానములను దర్శించుచు హైదరాబాదును చేరినారు. అప్పటి ప్రధాన మంత్రి యగు ఆరస్తూజంగ్ భార్య, మెహతాబ్ కుమర్‌బాయి చందా'ను పుత్రికగా స్వీకరించినది.

'హయాతెమాయెలఖా' అను చరిత్రలో నీమె జీవిత విశేషములు వివరింపబడినవి. ఈమె మేధాసంపత్తి, వాక్చాతుర్యములు సాటిలేనివట. ఆసఫ్‌జా దర్బారులో సామంత సభ్యులతో సమస్థానమును పొంది గౌరవింప బడినదట. మీర్ ఆలం ఈమెను పొగడుచు మస్నవీలనుగూడ వ్రాసినాడు. ఈమె బుద్ధి విశేషములను గుర్తించియే, యుద్ధసమయములందు గూడ నీమె యాలోచనలను పొందుటకై వెంట తీసుకొని ప్రభువులు వెళ్లువారు. అట్టి ఈమె సేవను గుర్తించియే నవాబు పెద్ద జాగీరునిచ్చి 'మాహెలఖాబాయి' అను బిరుదుతో సత్కరించినాడు. నిర్మల్, పానుగల్లు దండయాత్రల సందర్భమున నీమె సేనల వెంటనుండినదట. సంధిరాయబారములను నడుపుటయందు కూడ నీమె సామర్థ్యము ప్రశంసనీయమైనది.

ఈమెకు కవి, పండితులనిన గౌరవ మధికము. ఈమె గ్రంథాల యము చాల గొప్పగా నుండినదట. ఈమె సంగీత విద్యను తాన్‌సేన్ పరంపరకు చెందిన ఖుశాల్‌ఖాన్ తుల్‌వంత్‌తో నభ్యసించినది. మహాకవి యగు ఇమాన్ శిష్యురాలు. జాతి, మత, విచక్షణ లేక ప్రతిభావంతులను గౌరవించు సద్గుణ మామెకు వెన్నతో బెట్టిన విద్య. ఈమె హజ్రత్ అలీ భక్తురాలు. అందునకే దివాన్‌లోని గజల్ చివరి చరణములో తాను హజ్రత్ అలీదాసిగ వ్రాసుకొనినది. ఈమె మౌలాలీ గుట్టమీద ఒకపెద్ద మండపమును, ఒక సత్రమును, నీటి తొట్టిని కట్టించినది. అచటనే తన సమాధికి కూడ ఏర్పాటు చేసుకొనినదట.

ఈమె రచనలన్నియు ముద్రితములై అందరి అందుబాటులోనున్నవి.

జహీరా-మెష్తిరీ :

ఉమ్రావ్‌జాన్ జహీరా, ఖమరున్‌ఖాన్ మెష్తరీ అనువారిద్దరు లక్నో లో ప్రసిద్ధవేశ్యలు. మంచి పాటకత్తెగ పేరుపొందిన 'ఇమాంబందీ' అను నామె వీరి తల్లి. ఆ కాలములో గౌరవ కుటుంబమునకు చెందిన యువ తులు మర్యాదలను నేర్చుకొనుటకు వీరి గృహములకు వెళ్ళుచుండువారట.

సంగీత, సాహిత్య, నాట్యాదికళలలో నీ అక్కా చెల్లెండ్రు ఇద్దరు మంచి పేరును పొందియుండిరి. ప్రసిద్ధ కవియగు మీర్ ఆగా అలీ షంసీ అను నాతడు వీరికి గురువు. వీరిద్దరుగూడ కవితా రచనలు గావించిన వారే కాని వీరిలో మెష్తిరీ, జహీరా కంటె కవిత్వమున మిన్నగా నెన్నబడు చున్నది. కొంత కాలమునకు తరువాత వీరిరువురు వేశ్యావృత్తి వదలిపెట్టి వివాహితలై ఘోషా పద్ధతిని అవలంబించినారట.

సాహిత్య ప్రపంచమున 'మిర్జాగాలిబ్'పై నున్న వ్యతిరేకత కారణ ముగ వీరు ప్రసిద్ధిని పొందినారు.

షిరీన్:

ఈమె భూపాల్‌రాణి. పూర్తిపేరు షహాజహాఁ బేగం. ఉర్దూ ఫారసీ భాషలలో కవ్యము వ్రాసినది. ఈమె వ్రాసిన ఉర్దూ 'దివాన్' ముద్రింప బడినది. కాని ఇప్పుడు లభ్యమగుటలేదు. ఈమె రచిం

చిన కొన్ని పద్యములు మాత్రమే దొరకుచున్నవి. స్వయముగా నీమె గొప్ప విద్యావతియై కవిపండితులను పోషించినది. ఒక నిఘంటువును, ఒక చరిత్రను, ఒక నీతి గ్రంథమును వ్రాసినదట.

## ఢిల్లీ కవయిత్రులు

**బేగం :**

ఈమె మీర్ తఖీమీర్ పుత్రిక. కవిత్వమనిన ఈమెకు ప్రీతి మెండు. ఈమె వ్రాసిన గజల్ ఒకటి దొరికినది. ఇది సాధారణపద్ధతిలో వ్రాయ బడినను చక్కని భాషలో నున్నది.

**జయినాబేగం :**

ఈమె మీర్జాబాబర్ పుత్రిక. యువరాజు జహందార్ షా భార్య. ఈమె రచించిన కొన్ని పద్యములు మాత్రము లభించుచున్నవి. ఈమె భాష ఢిల్లీకోటలోని ఉన్నతవర్గములకు చెందిన భాషగ నున్నది.

**కామిలాబేగం జాఫరీ - ఖాదరీబేగం ఖాదరీ :**

వీరిద్ద రక్కచెల్లెండ్రు. వీరు ప్రసిద్ధకవియగు 'షాహనసీరు'నకు శిష్యురాండ్రు. ఛందోబద్ధ కవిత్వమును వ్రాయుటలో వీరు సమర్థులు. వీరిభాష శబ్దాలంకారయుతమై యుండును. ఇది వారికి తమ గురువు కవితాప్రభావమువలన సిద్ధించియుండవచ్చును. ఆ కాలమున వీరికి ప్రఖ్యాతి మెండు.

**హయాతున్నిసాబేగం, హయా :**

ఈమెను సాధారణముగ 'ఘోరా' బేగం అనువారు. ఈమె ఢిల్లీ చక్రవర్తియగు 'షా ఆలం' కుమార్తె. ఈమె జీవితాంతము బ్రహ్మచారిణియై చాలాకాలమువరకు జీవించియుండినది.

ఈమెవ్రాసిన రెండు పద్యములు మాత్రము లభించుచున్నవి.

**అఖ్తరెమహల్ అఖ్తర్ :**

ఈమె తైమూర్ వంశమునకు చెందినది. ఈమెవిద్యావతియై, నైతిక విషయములగూర్చిన పరిజ్ఞానము కలిగి చాలభాగము మత విషయముల కథావస్తువులుగా గ్రహించి కవితారచనలు గావించినది.

ఈమె ప్రధానముగ 'నాత్ మిన్ ఖబత్' ఛందములనే గ్రహించి వ్రాయునది. ఇవిగాక కొన్ని 'గజల్'లను వ్రాసినది. ఫారసీలో మహమ్మద్‌ను గూర్చి 'ఖుద్దూసీ' అను కవి వ్రాసిన 'నాత్' కవితపై ఈమె 'తజ్మీన్'* వ్రాసినది. ఇది చాల సమర్థముగా నిర్వహింపబడి ఆమె కవితా శక్తిని చాటుచున్నది.

**ముబారక్ :**

ఢిల్లీలో షహానసీర్ అను ప్రసిద్ధకవికి ఈమె కోడలు, శిష్యురాలు కూడ. ఈమె చివరిదశలో వైరాగ్యమునుపొంది మక్కాకు వెళ్లి అచ్చటనే మరణించినదట. ఈమె కవితావిషయములు చాలవరకును మతసంబంధము లైనవిగనె గోచరించును.

**అహమ్మదీ :**

ఈమె ఢిల్లీ సమీపమునందలి సోనీపత్ నివాసిని. ఆ కాలమున కుల స్త్రీలు కవితావ్యాసంగమునందు చిక్కుకొనుట మర్యాదకు భంగమని తలచురోజులు. అందునకే ఈమె రచించిన 'దివాన్'ను సయితము భర్త దాచివేసినాడు. భర్తచేసిన ఆ కార్యమునకు దుఃఖించి, బాధను సహింప లేక మరణించినదట.

**షోఖ్ :**

ఈమెపేరు గున్నాబేగం. ఈమె ఔరంగజేబ్ చక్రవర్తి మంత్రి యగు ఉమాదుల్‌ముల్క్ గాజీఉద్దీన్ భార్య. ఆకాలమున ప్రసిద్ధ కవయిత్రిగ గణింపబడినది. ఈమె కవిత్వము శక్తిమంతమై గోచరించును.

**గోహర్ :**

ఈమె కాబూలునందు జన్మించి భారతదేశమునకు వచ్చినది. పుష్తూ, ఫారసీ, ఉర్దూ భాషలయందు ఈమెకు మంచి పాండిత్యముకలదు. ఈమె

*తజ్మీన్ : అనగా ఒక కవివ్రాసిన కవితలో ప్రతి రెండు చరణములకు తన మూడవ చరణమును జోడించి వ్రాయుట. చాల కష్టమైనపని. పై కవి రచనతో సమానశైలియందే తన మూడవ చరణమును వ్రాసి సహృదయుల మెప్పించవలసియుండును.

శైలి మధురమై సరళముగా నుండును. ఈమె కేవలము కవయిత్రియే గాక, అందకత్తెయట. ఆవిషయము నీమె తనరచనలయందు ప్రస్తావించినది.

జమీయత్ :

ఈమె ఒక ఆంగ్లస్త్రీ. మేజర్ ఆర్. జట్సన్ భార్య. సంగీతమును సశాస్త్రీయముగ నభ్యసించినదట. చాలకాలము కలకత్తాలోనుండి ఉర్దూ, హిందీ, ఫారసీ భాషలను నేర్చుకొనినది. ఈ మూడు భాషలయందును ఈమె కవిత్వము చెప్ప నేర్చినదట.

ఈ విధముగనే ఢిల్లీకిచెందిన కవయిత్రులందు మలికా, ఖఫీ, మరియు హార్మా (సయీాదతున్నిసా) అను స్త్రీలను పేర్కొనవచ్చును.

ఉర్దూస్త్రీ కవయిత్రులనుగూర్చి రచించిన సంక్షిప్తచరిత్రయందు వేశ్య లకు స్థానమునివ్వక కేవలము కులస్త్రీ కవయిత్రులనుగూర్చియే వ్రాసినారు. 19 వ శతాబ్దమువరకు ఢిల్లీకిచెందిన 45 గురు కవయిత్రులను పేర్కొనినారు. కాని అందు వారినిగూర్చిన వివరములేవియు ప్రకటింపలేదు. ఆ విధముగనే లక్నో స్త్రీ కవయిత్రులు 27 గురిని పేర్కొనినారు.

## లక్నో కవయిత్రులు

వాజదలీ భార్యలు :

లక్నో కవయిత్రులలో లక్నో పరిపాలించిన 'వాజదలీషాహ' భార్యలు కూడ పేర్కొనబడినారు. కవయిత్రులైన భార్యలు, కవియైన భర్తతో కవిత్వమునందే ఉత్తరప్రత్యుత్తరములను జరుపువారట.

ఖమర్ :

ఈమెపేరు హైదరీబేగమ్. ఈమెనే 'మాహెతలల్' అని కూడ నందురు. సత్స్వభావముకలదిగా పేరుపొందిన ఈమె భర్తతోపాటు కల కత్తాలో నుండి ఉర్దూ, ఫారసీ భాషలయందు కవిత్వము వ్రాసినది.

సదర్ :

ఈమెపేరు నవాబ్ సదర్ మహల్. 'బాదషానామ్ రీసంనార్' అను నవి ఈమె రచనలుగా లభించుచున్నవి.

మహాబూబ్ :

ఈమెపేరు సుల్తాన్‌జహాం. సుప్రసిద్ధ కవయిత్రి. పై పేర్కొనబడిన నాజదలీభార్యల రచనలలో లక్నో పద్ధతి కనబడుచున్నది. మీదుమిక్కిలి వీరు భర్తనుగూర్చిన విషయములనే ఇతివృత్తములుగ స్వీకరించి రచనలు గావించినారు.

యాస్మిన్ :

ఈమె ప్రసిద్ధకవియైన ఇన్షాయొక్క జానిస మరియు శిష్యురాలు. ఈమెకు పురుషజాతిపై ద్వేషముమెండు. ఇన్షాయొక్క బలవంతముపైన వివాహితయై మూడవనాడే వైధవ్యము ననుభవించినది. ఈమె రచనలు కొన్ని కానవచ్చుచున్నవి.

ఆబిదా :

ఈమెపేరు నవాబ్ ఉమ్రావ్‌బేగమ్ రాంపూర్‌నవాబ్ యూసుఫ్ అలీఖాన్ కూతురు. ఉర్దూలో ఒక దివాన్ రచించినది. మరియు వేటపై ఒక మస్నవీనికూడ రచించినది. ఈమె కవిత్వము సాటిలేనిదియట.

షరీర్ :

ఈమెపేరు మిస్ మేరీ ఫ్లోరాసార్కస్. ఈమె ఆగ్రానివాసిని. చిన్నతనమునుండియే కవిత్వమును వ్రాయుట కలవాటుపడినది. రాంపూర్ నవాబ్ దర్బారులో 'అఖ్తర్‌జహాన్‌బేగం' అను బిరుదును పొందినది. నవాబ్ వ్రాసిన ఒక గజల్‌మీద ఈమె తజ్మీన్‌ను వ్రాసినది. అది చాల శ్లాఘించబడి ఈమె ప్రసిద్ధికి కారణమైనది.

జానకీబీబి :

ఈమె అలహాబాదులోని ఒక హిందూ కాయస్థకుటుంబమునకు చెందినది. ఈమె ఉర్దూ ఫారసీ భాషల నభ్యసించి 19 వ శతాబ్దపు చివరికాలమున కవయిత్రిగా పేరుగాంచినది.

ఈమె 'ఆహెల్' అను పేరుతో కవితలను వ్రాసినది.

ఈ విధముగనే 'బహూ బేగం' అనుపేరుతో ప్రసిద్ధిచెందిన జానీ అను నవాబ్ ఆసిఫ్ ఉద్దౌలా భార్య గొప్ప కవయిత్రియని పేర్కొనబడినది. ఇతని మరియొకభార్య దుల్హాన్ అనునామెకూడ ఉర్దూలో మంచికవిత్వము చెప్ప నేర్చినదియట.

ఇంతకుమించి పై కవయిత్రులను గూర్చిన అధికవిశేషము లెవ్వియు గోచరింపవు. 1902 లో మౌల్వీ అబ్బాస్‌గారు రచించిన 'షాహిర్ నిస్వాన్' అను గ్రంథము ఆధారముగ నీ పై విషయములు సేకరించుట జరిగినది.

# ఒడియా కవయిత్రులు

రచయిత :
శ్రీ పురిపండా అప్పలస్వామిగారు,
శరణ్ కుల్.

పురాతనమైన భారతీయ భాషలలో ఒడియా భాష ఒకటి. మహా మహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రిగారు నేపాలులో ఆవిష్కరించిన బౌద్ధగాన ఓదోహా, సంకలనములో ఒడియా సాహిత్య ప్రథమ స్వరూపము గోచరమగును. అందలి కవులు లూయీపా, కాళీపదా, కృష్ణాచార్య (కానూపా), సవరపా, తిళిపా, ఇంద్రభూత మొదలైనవారు పదవ శతాబ్ద ప్రారంభమువారు. ఇందులో కృష్ణమాచార్యుడు పన్నెండవ శతాబ్ది యందుండిన ఒడియా కవి. 11 - 13 శతాబ్దములలో గంగ వంశపురాజుల శాసనములలో ఒడియా కవిత గద్యపద్యరూపముతో కనబడును. అయితే అవియంతయు ఒక స్థాయిని అందుకోలేదు. పూర్తిగా ఒడియా కవిత్వము ఒక స్వరూప మందుకొనిన తరువాత కనబడు కవులలోఁ కేశవకోయిలి, రచయిత మార్కండేయ దాసును తొలి కవిగా అనేకులు అంగీకరించిరి. మార్కండదాసు పదమూడవ శతాబ్దమువాడు. ఒడియా మహాభారత కర్త సారళాదాసు పదునాల్గవ శతాబ్దమువాడు.

సారళాదాసు మొదలుకొని పందొమ్మిదవ శతాబ్దము చివరి వరకు ఒడియాలో ఎందఱో గొప్ప కవులు విలసిల్లిరి. గొప్పగొప్ప కావ్యములు వెలిసినవి. ఇంత సుదీర్ఘ కాలములో, ఇంతమంది కవులలో చరిత్ర కందిన కవయిత్రులు ఏ ఒకరో ఇద్దరో మాత్రమే. ఒడియా సాహిత్యేతిహాస రచయిత ఆచార్య వినాయక మిశ్ర తమ గ్రంథములో ఇద్దరు కవయిత్రులను మాత్రమే ఏ పది పంక్తులలోనో పేర్కొనిరి.' కవి జీవని రచయిత అపర్ణా పండా ఒక్క రచయిత్రినే పేర్కొనెను. Encyclopedia of Literature లో ఒడియా సాహిత్య చరిత్ర వ్రాసిన గోపాల చంద్రప్రహరాజు

(19-వ శతాబ్దివరకు) ఒక్క కవయిత్రిని కూడ పేర్కొనిన పాపమున పోలేదు. వీరి భాషా కోశములో మాత్రము ఒకరిద్దరు కవయిత్రుల పేర్లు కాన్పించును. పండిత సూర్యనారాయణదాసు అనసూయా ప్రసాద పాఠక, డా॥ హరేకృష్ణమహతాబుగార్ల గ్రంథములలో కూడ అంతే. దీనికి కారణము తగినంత పరిశోధన జరుగకపోవడమే.

చెదురు మదురుగా లభించు లఘుకావ్యములలో కొందరు కవయిత్రుల పేర్లు కనుపించును. పేర్లు తెలియని కవయిత్రుల రచనలు కూడ కొన్ని కన్పించును. ఆ కవయిత్రులను గమనించిన వారుకాని, ఆ కావ్యాల రచయిత్రులను పరిశోధించిన వారుకాని కానరారు. ఈ లఘుకావ్యాలు కల్లాకపటము లేని సరళమైన సుబోధమైన చక్కని శైలిలో ఉండును. వీటిలో కొన్నింటిని పాత పాటలలో చేర్చినారు; సంకలనకర్తలు. పేరు తెలియని ఒక కవయిత్రి తన లఘుకావ్యములో తన పసుపుంగుంకుమ చల్లగా ఉండగానే తను కళ్లుమూయాలని కోరుకొనుచు ఇట్లనును.

"కాచలో మాచ్ఛఖాయి సరుమోదిన
అహ్యాడెంగురా బాజిహేవుమరణ."

( నా చేతి) గాజుల్లారా చేపలుతింటూ నా దినాలు గడిచిపోనీ పుణ్య స్త్రీ వాద్యాలు మోగుతూ మరణం రానీ")

'చేపలు తింటూ దినాలు గడవనీ' అన్నది ఒడియాలో జాతీయం. ఒడియాలో ఇంచుమించు అన్ని జాతులవారును మత్స్యభుక్కులు. వైధవ్యము కలిగిన స్త్రీలు మాత్రము అగ్రవర్ణములో తినరు. చేపలు తినుచు దినములు గడవనీ అంటే వైధవ్యము రాకుండా దినములు గడవనీ అని భావము. ఆ కావ్యములో కవయిత్రి ఇంకను ఇట్లు కోరుకొనును. పుణ్యస్త్రీ వాద్యాలు మ్రోగుచుండవలెను. బంధువులు వాహకులై మోసుకువెళ్లుచుండవలెను. పిల్లలు దారిపొడుగునను పేలాలూ, గవ్వలూ పరుకొనుచుండవలెను. భర్త కొడుకుల ముందు నడుచుచుండవలెను. ఇరుప్రక్కల మరదులు నడుచుచు ఉండవలెను. ఆ విధముగా సగౌరవముగా నా మృతదేహము శ్మశాన

భూమికి పయనించవలెను. వైధవ్య దుఃఖ మామెకు రాకూడదని ఆమె ఆకాంక్ష. ఇలాటి లఘు కావ్యములు ఎన్నో ప్రచారములో ఉన్నవి. అయితే కవయిత్రుల చరిత్రలు మాత్రము తెలియవు.

## దీనసుందరి :

ఈమె చక్కని నుడికారము కలిగిన కవయిత్రి. ఈమె విరచితమైన లఘుకావ్యము "నటుచోరి" (బొంగరాల దొంగతనము) బహుళ ప్రచారమునందుచున్నది. నటుచోరి భాషను బట్టి ఈమె పదిహేను పదహారు ప్రాంతముల కవయిత్రి అని భావించవచ్చును.

చిన్ని కృష్ణుడు యమునానదీ తీరమున అడవిలో కడిమిచెట్టుక్రింద ఆడుకొనుచుండును. ఇంతలో మేనత్త రాధ అక్కడికి వచ్చును ఆమెను చూడగనే ఆమె దగ్గరకు చిన్నికృష్ణుడు వెళ్లును. "అత్తా, ఇంత ఎండలో ఎక్కడికి వచ్చావు ? మొహమంతా చెమట పోసింది. మామ కోప్పడడూ తెలిస్తే? రానే వచ్చావు, నన్ను ఎత్తుకోవూ ?'' అనుచు గారాము చేయును.

రాధ అతనిని ఒడిలోకి తీసికొనును. అతడు వెంటనే ఆగడము మొదలుపెట్టును. "మీ మామ ఎన్నడూ నన్ను కోప్పడడు, కాని ఏమిటీ నీ ఆగడము? ముక్కుపచ్చలారని చిన్ని బాలుడవు కదా ! ఈ వయసులో ఈ ప్రేమ చేష్టలేమిటి కృష్ణా ?'' అని రాధ అనును.

"అదేమిటత్తా అలా అంటావు ?'' అనుచు ఈ విధముగ చిన్ని కృష్ణుడు బదులు చెప్పును. "నాగుపాము పిల్ల చిన్నదైతే మాత్రము దాని కోరలలో విషముండదూ ? నేను బాలుడినే అయితేనేమి, ప్రేమ ఎరగనా ? అని కృష్ణుడు ఆగడము చేయుచున్న సమయములో అతనిని వెదకుతూ యశోద మొదలైన గోపికలు అక్కడికి వత్తురు.

''నీ కొడుకు చెట్టెక్కి గంతులు వేయుచు నన్నుచూసి "మా అమ్మతో చెప్పకుమా'' అనుచు నా దగ్గరకు వచ్చి మారాము చేయుచున్నాడు'' అన్నది రాధ.

కళ్ళనీళ్ళు తుడుచుకొనుచు లేచి కాదమ్మా నా బొంగరాలు రెండు దొంగిలించి దాచుకొన్నది అత్తయ్యా. అడిగితే చెట్టెక్కాననీ బొంకుచున్నది. పయ్యెదలో దాచినది" అని కొంటి కృష్ణుడు బదులు పల్కును. రాధ లేదనును. "పయ్యెద దులుపు" మని యశోద అనగా రాధ పయ్యెద దులుపును. అపుడు నిజముగా రెండు బొంగరాలు క్రిందపడును.

"సిగలో బొంగరం తాడు దాచినదమ్మా" అని కృష్ణుడు అనగా రాధ సిగ విప్పును. అప్పుడు బొంగరపు తాడు కూడ బయటపడును. "ఇదేమి చిత్రమమ్మా! ఏ మంత్రము, ఏ తంత్రము చేసెనో ఈ చిన్ని కృష్ణమ్మ" అనుచు నివ్వెరపోయి నిలబడిపోవును రాధ. ఇదీ "నటుచోరి" లోని కథ. కావ్యము మొదలుపెట్టిన క్షణములమీద ముగించువఱకు విడిచి పెట్టలేరు పాఠకులు. కావ్యము చివర కవయిత్రి తన పేరు ఇలా చెప్పుకొన్నది.

"కహే దీనసుందరి
ఎణు శేష హేలా నటుచోరి"

"దీనసుందరి నుడివిన నటుచోరి ముగిసినది."

ఈ కవయిత్రి చరిత్ర ఇంతకంటె అధికముగ తెలియదు.

మాధవిదాసి :

ఒడియా తొలి కవయిత్రులలో చెప్పదగిన కవయిత్రి మాధవిదాసి. పదిహేనవ శతాబ్దమున ఈమె జన్మించినది. చైతన్య దేవుని సమకాలికురాలీమె. చైతన్య దేవుని శిష్యురాలుకూడ ఈమె. మాధవిదాసికంటె ముందు చైతన్యునకు స్త్రీ శిష్యులు లేరు. ఈమెయే తొలి శిష్యురాలు.

మాధవిదాసి గొప్ప వైష్ణవ భక్తురాలు; వాగ్గేయకారకురాలు; సుప్రసిద్ధ గాయకురాలు; ఒరిస్సా అంతటిలోను ఆనాడు సాటిలేని లేఖకురాలు. ఈమె అక్షరములు ముత్యాలకోవలు.

పూరీ జగన్నాథస్వామి దేవాలయమున చిరకాలమునుండి తాళపత్రములమీద చరిత్ర వ్రాసిపెట్టు ఆచారమున్నది. ఆ చరిత్ర గ్రంథము

లను 'మాడలాపంజి' అందురు. పదిహేనవ శతాబ్దమున ఒడిశా సింహాసన మారోహించిన ప్రతాపరుద్రదేవు ఒకటు దేశములోని లేఖకులనందఱను పరీక్షించెను. అందరిలోను ఉత్తమ లేఖకురాలుగా నెగ్గినది మాధవిదాసి. అందమైన ఆమె అక్షరపంక్తులు చూచి ముగ్ధుడయ్యాడు మహారాజు. దానితో ఆమెను మాడలాపంజి రచనకు నియోగించాడాయన. మాడలా పంజి అంతవరకు పురుషులే వ్రాసేవారు. మాడలాపంజి లేఖకులలో మాధవిదాసియే మొదటి స్త్రీ.

మాధవిదాసి శిష్టకరణకులములో జన్మించినది. పూరీ ఈమె నివాస స్థలము. శిఖిమహాంతి ఈమె సోదరుడు. వైష్ణవిగా జీవించిన ఈమె వివాహము చేసుకొనెనో లేదో తెలియదు. ఈమె ప్రతిభావికాసానికి పూరీ క్షేత్రము తగిన రంగస్థలమైనది. భక్తిపారవశ్యముతో ఈమె తన కీర్తనలు గానము చేయుచుండగా వేలాది ప్రజలు తన్మయులై వినెడివారు.

చైతన్యదేవులు పూరీక్షేత్రము వచ్చి కవయిత్రి మాధవిదాసి ప్రతిభ విన్నారు. అతని దర్శనముకొఱకు మాధవిదాసి కూడ తహతహపడినది. అయితే సన్యాసి ధర్మమవలంబించిన చైతన్యదేవుడు స్త్రీ ముఖారవింద విలోకనము చేసెడివాడు కాడు. అందువలన మధ్య తెర యేర్పరచి దర్శన మిచ్చినాడు; మాధవిదాసికి. తెఱమాటుననే యుండి మాధవి తన గానము భజన వినిపించినది; చైతన్యస్వామికి. ఆమె భక్తిగానము ఆలించి పరవశు డాయెను స్వామి. ఆమెను శిష్యురాలిగా అంగీకరించినాడు. చైతన్య దేవుని ప్రథమ శిష్యురాలయిన భాగ్యము మాధవిదాసికే లభించినది. గురుదేవుడు స్త్రీ ముఖావలోకనము చెయ్యడు కనుక తెరమాటుననే ఉండి అతని ఉపదేశామృతము ఆస్వాదించినది మాధవి.

మాధవిదాసి 'వ్రజబోలి' భాషలో ఎన్నో కీర్తనలూ, భజనలూ, కవితలూ వ్రాసినది. వ్రజబోలి అనగా వ్రజభాష కాదు. రామానంద రాయి, అస్సాము కవి శంకరదేవు, మైథిలి విద్యాపతి మొదలైన సుప్రసిద్ధ కవులు ఒడియా, అస్సామీ, మైథిలి, బంగ్లా భాషలు కలగాపులగముగా కలిపి యేర్పరచిన భాష వ్రజబోలి.

చైతన్యస్వామి శిష్యులలో బలరాముడు గోవిందదాసు, వాసు ఘోషు మొదలైన సుప్రసిద్ధుల కీర్తనలతో సమానముగా ఉండును ఈ కవయిత్రి మాధవిదాసి కీర్తనలు. వాటిలో భక్తిరసము చిప్పిలుతూ ఉండును. బ్రతికినన్నాళ్ళూ తన భక్తి కీర్తనలు పాడుచు క్రొత్త క్రొత్త కీర్తనలు విరచించుచు తన జన్మ సార్థకపరచుకొని పూరీ క్షేత్రములోనే పాంచభౌతిక శరీరము విడిచిపెట్టినది మాధవి కవయిత్రి.

**బృందావతిదాసి :**

పదిహేడవ శతాబ్దము చివరి భాగములో జన్మించిన కవయిత్రి బృందావతిదాసి. పూరీ జిల్లా మశిపడ గ్రామము ఈమె నివాసము. ఈమె మామగారూ, భర్తా, కుమారుడూ, మనుమడూ కూడ కవులగుట గొప్ప విశేషము. శిష్టకరణ కులములో పుట్టి చిన్నప్పుడే పుట్టింట విద్య నేర్చుకొన్నదీమె. కవులమధ్య, కవుల కుటుంబములో కాలు పెట్టినది. పురాణాలు చదివినది. ముఖ్యముగా వైష్ణవ గ్రంథములు అవగతము చేసుకొన్నది. ఇంట నిరంతరము సాహిత్య చర్చ సాగుచుండుటవలన కావ్య రహస్యములు కవిత్వమర్మములు జీర్ణము చేసుకొన్నది. సంస్కృతముకూడ కరతలామలకము చేసుకొన్నది. వయసుతోపాటు జ్ఞానముకూడ పరిపక్వమైన తరువాత నవాక్షరిచ్ఛందస్సులో పూర్ణతమ చంద్రోదయము అనే చక్కని కావ్యము రచించినది. శాశ్వతమైన కీర్తి గడించినది. ధన్యురాలైనది.

బృందావతిదాసి మామ జగన్నాథదాసు, భర్త చంద్రశేఖరదాసు, కుమారుడు భీమదాసు, మనుమడు కృపాసింధుదాసు. వీరందరును వైష్ణవ కవులు. అందరును బృందావతిదాసివలెనే శ్రీకృష్ణలీలలే తమ గ్రంథములలో వర్ణించినారు.

భీమదాసు తన భక్తిరత్నావళిలో :—

"కరజానుశె ఉపపన్న
తాతమో విష్ణుభక్తిజన
చంద్రశేఖర మహాపాత్ర

నామ అవనీతలఖ్యాత
మూం తంకర కనిష్ఠనందన."

"కరణ కులంలో నా పుట్టుక, నా తండ్రి విష్ణుభక్తుడు, చంద్ర శేఖరమహాపాత్రుడు, విఖ్యాతుడు, నేను ఆయన కనిష్ఠ నందనుడను" అని వ్రాయుటచేత బృందావతికి భీమదాసుకు ముందు ఇంకను సంతానము కలదని తెలియుచున్నది. కాని వివరము తెలియదు.

కవయిత్రి బృందావతి తనపూర్ణతమ చంద్రోదయము వింశతి అధ్యాయములో తన ఆత్మ పరిచయము ఇలా వివరించినది.

"గృహా మహార మళిపడ
క్షేత్రకుదుయి జుణఛడ
థాయిణ గృహస్థ దర్శరె
సుతసదన సంపత్తిరె,
ఆహూరి సుణిమా సుజనె
మోకుళ సదా పరాక్రమె
శ్వశురపతి పుత్రనాతి
ఆదిసే జెతక ఆచ్ఛంది
సే పితా పితా మహాక్రమె
కృష్ణ సేవక కుళధర్మె
సాధుచరణ సేవాకరె
జే నిజకుల భాగ్యబలె
జగత జనం కరహితె
కృష్ణ మహిమా కులగీతె
సమస్తే అ ఉటంతిసే కవి
కృష్ణ చరణ పద్మసేవి.
ప్రభుంకతాత జగన్నాథ
దాసనామరె మహిరె ఖ్యాత
జే కృష్ణ యశగుణమాన

గీతే తరిచ్ఛంతి రచన
ప్రభు చంద్రశేఖరదాస
మహిరె కవిజే ప్రకాశ
శ్రీకృష్ణ తత్వ చంద్రోదయ
నామేణ గీత సుధామయ
పుత్రమోహార భీమదాస
జే కృష్ణ పద భక్తిరస
గీతరె కలేక ఉదయ
నామేణ భక్తి చంద్రోదయ
ఏ ఆది అనేక జే గాంధ
మహిరె హాయిఛి జా ఖ్యాతీ
నాతి మోహార కృపాసింధు
జే భీమదాస నిజబంధు
ఏకయిశ్లోక అర్ధగీత
పచిస అధ్యాయ యుకత
సే ఉపాసనా చంద్రోదయ
నామె అటంతి సుధామయ
ఏ భాబెవతి పుత్రనాతి
నమస్తే కృష్ణ పాదెభక్తి.''

"మా యిల్లు మళిపడా. ఇది పూరీ క్షేత్రానికి ఎనిమిదిమైళ్ళ దూరమున నున్నది. సుతులు, సదనము, సంపత్తితో గృహస్థ ధర్మము పాలించుచున్నాను నేను. ఇంకను వినుడు సుజనులు! నా కుల పరంపరాక్రమంగా మామగారు, నా భర్త, కుమారుడు, మనుమడు మొదలైనవారందరు పితృపితామహా క్రమముగా కృష్ణ సేవకులు. అది మా కులధర్మము. నిజకుల భాగ్య బలము వలన సాధుచరణ సేవచేసి, జగజ్జనుల హితము కొఱకు కృష్ణ మహిమ గీతాల్లో గానముచేసిరి. వారందరును కవులు.

"మా మామగారు జగన్నాథదాసుగారు; ఈయన జగద్విఖ్యాతులు. శ్రీకృష్ణ గుణవర్ణన చేసి కావ్యరచన చేసిరి. నా భర్త చంద్రశేఖరదాసు గారు. ఈయన శ్రీకృష్ణ తత్వ చంద్రోదయము రచించినారు. అమృత మయమైన గీతాల గ్రంథము శ్రీకృష్ణ తత్వ చంద్రోదయము. నా కుమారుడు భీమదాసు. ఇతడు 'భక్తి చంద్రోదయము' మొదలైన అనేక కావ్యములు వ్రాసెను. భక్తిరసము చిప్పిలుతూ ఉండును. భీమదాసు గ్రంథాలలో నా మనుమడు, భీమదాసు కుమారుడు కృపాసింధుదాసు ఒక శ్లోకమునకు అర్థ వివరణ చేసి, పాతిక అధ్యాయముల కావ్యము విరచించినాడు. ఉపాసనా చంద్రోదయము వ్రాసెను కృపాసింధుదాసు. అమృతమయముగా ఉండు నీ ఉపాసనా చంద్రోదయము. ఈ విధముగా పతి, పుత్రుడు, మనుమడు అందరు కృష్ణ పాదభక్తులు."

కవయిత్రి బృందావతి తన పూర్ణతమ చంద్రోదయ ప్రబంధము వార్ధక్యదశలో రచియించినది. అప్పటికి తన మనుమడుకూడ ప్రయోజకుడై గ్రంధరచన చేసి పేరుపొందెను. తన మనుమడు ఉపాసనా చంద్రోదయము రచించినాడని ఆమె తన ప్రబంధములోనే వ్రాసినది. "నాతి మోహార కృపాసింధు సే ఉపాసనా చంద్రోదయము. ......" అని పూర్ణతమ చంద్రోదయ గ్రంధరచనా కాలము గురించి ఇలా పేర్కొన్నది.

"శక అబద ఛడదశ
శత ఏకవింశ దరష
దివ్యసింహ దేవరాజన
త్రిదశ అంకే ఏ రచన
వైశాఖ మాస శుక్లపక్షే
పంచమి మృగశిరా బుక్షే
శుభే హాయిలా గ్రంధశేష
శుణి సకల పాపనాశ."

"పదహారువందల ఇరువది ఒకటవ అబ్దము (క్రీ. శ. 1699) న దివ్య సింహదేవు (ఒడిశా) రాజయిన ముప్పదవ సంవత్సరము, వైశాఖమాస

శుక్లపక్షము పంచమీ మృగశిరా నక్షత్రమునాడు శుభప్రదముగా ఈ గ్రంథము (పూర్ణతమ చంద్రోదయము) ముగిసినది.''

ఈమె కావ్యము ముగించుటకు ఏడేండ్లకు పూర్వము కుమారుడు భీమదాసు తన భక్తి రత్నావళి అను గ్రంథములో పేర్కొన్నాడు.

"........భక్తి రత్నావళి
గీత కరిచి స్పృహాకవి
శకాబ్ద షడ దశ శత
రచనా కవి విహుగీత.''

భక్తి రత్నావళి వ్రాయుటకు నిశ్చయించి పదహారు వందల పదు నాల్గవ అబ్దము (క్రీ. శ. 1692) లో విరచించినాను.''

భీమదాసు తన గ్రంథములో తెలిపిన వంశ పరిచయమునకు బృందావతి తెలిపినదానికి సరిగా సరిపోవుచున్నది.

పూర్ణతమ చంద్రోదయము సరళమైన నవాక్షరి చ్ఛందస్సులో ప్రేమ భక్తిరస పూర్ణమైన ప్రబంధము. శైలి ప్రసాదగుణము కలిగి పాఠకుల నాకర్షించును. గ్రంథములో అలంకారములు, పదప్రయోగములు, సమాస ముల కూర్పులు కవయిత్రి ప్రతిభను చాటుచున్నవి. శృంఖలాలంకారము నకు క్రింది చిన్న ఉదాహరణము పరికింపదగినది.

"కరి తారణ బానా జార
జారంగే ఖేల ఏ సంసార
సారస కలేజా నిహత
హత జే కరంతి సమస్త
మస్తకె నాబరె నాగర
నాగర అటంతి గోపర
పరమ పురుష సానంద
నందనందన ఆదికంద.''

బృందావతి గురువు దయాళుదాసు. అభిరామదాసు ప్రశిష్యు డాయన. అభిరామదాసు చైతన్యదేవుని సఖుడని, అతనికంటే వయో

జ్యేష్ఠుడని గౌడీయ గ్రంథములు తెలుపుచున్నవి. గురువు పరిచయము కవయిత్రి తన పూర్ణతమ చంద్రోదయములో ఇలా వివరించినది:

"సేగురుంక పాదచెని
నిరతె లభుమోమూర్ధని
నామజే శ్రీదయాళుదాస
శ్రీ అభిరామ నాతి శిష్య
మఠశాంకర క్షేత్రవరె
క్షేత్రర పశ్చిమ దిగరె
సేకుల శ్రీగురు అంభర."

శ్రీ గురుదేవుని పాదయుగళము ఎల్లప్పుడు నా శిరస్సును సోకి ఉండవలెను. వారి పేరు శ్రీ దయాళుదాసు, శ్రీ అభిరామదాసు ప్రశిష్యులు వారు. వారి మఠము పూరీ క్షేత్రములో ఆలయము పడమటి వైపున ఉన్నది. వారు మా కులగురువులు.

నిశ్శంకరాయరాణి :

పద్దెనిమిదవ శతాబ్దము ఒడియా సాహిత్యములో స్వర్ణయుగమన వచ్చును. వినాయకమిశ్రాగారి భాషలో అది ప్రమోద సాహిత్యకాలము. ఒడియా కవిసమ్రాట్ ఉపేంద్రభంజు శృంగార కావ్యములు దేశమంతను ముంచెత్తుచున్నవి. అదిగో ఆ సమయములో పుట్టిన కవయిత్రి నిశ్శంక రాయరాణి.

ఈమె గంజాము జిల్లా జరడా జమీందారు వాసుదేవ ధాటరాజు కూతురు. అదే జిల్లాలో బుడారసింగి జమీందారు గౌరచంద్ర నిశ్శంకరాయి భార్య. ఈమె తల్లి ఘుముసరరాజు శ్రీ శంకరభంజు కూతురు. శ్రీ శంకర భంజు క్రీ. శ. 1788 లో ఘుముసర సింహాసనము అధిష్ఠించిన వైనము గంజాము జిల్లా మాన్యూలు తెలుపుచున్నది.

కవయిత్రి నిశ్శంకరాయరాణి తండ్రి వాసుదేవధాటరాజుకవి. ఈమె జరడా నగరములో జన్మించినది. తండ్రి కవియగుటచేత బాల్యమునుండి ఈమెకు కవితావాసన అబ్బినది.

1788 ప్రాంతమున ఈమె గౌరచంద్ర నిశ్శంకరాయిని వివాహ మాడినది. జరడా పుట్టింటినుండి బుడారసింగి అత్తవారింట అడుగు పెట్టినది. అయితే భార్యాభర్తలకు అనుకూల దాంపత్యము కుదరలేదు. సుకుమార హృదయయగు నీ కవయిత్రి భర్తృ వైముఖ్యము భరించలేకపోయినది. చివరకు భర్తృ గృహము పరిత్యజించి పితృ గృహమునకు జరడా వచ్చి వేసెను. జరడాలోనే, పుట్టిన గడ్డమీదే మరణించినది. చివరి దినములు కవితా వ్యాసంగముతోను, కావ్య రచనతోడను గడిపినది. జీవితము సార్థక పఱచుకొన్నది.

కవయిత్రి నిశ్శంకరాయరాణి "పద్మావతీ అభిలాష" అనే కావ్యము రచించినది. సుబోధము, శుద్ధమూ అయిన చక్కని శైలిలో వివిధ ఛ్ఛందస్సులలో సాగినది ఈ కావ్యము. పద్మావతీ అభిలాషలో తన ఆత్మపరిచయము ఇలా వివరించినది కవయిత్రి.

"జరడా దేశ అధీశ జే వీరవర
కవి పణేదుతి సరస్వతీ కుసుమ
సిద్ధ విద్యా ఉపాసనారె పండిత
వాసుదేవ ధాట నరపతి మోతాత
గంగా వంశాబ్ధికర పీయూషకర
శ్రీ ఖిమిండి మహారాజ్యే జే అధీశ్వర
వీరాధివీర శ్రీ గజపతి నృపతి
భూపకులదీప జే ప్రతాప అతి
తాహాంక వంశే ఉత్పత్తిఖ్యాత మోప్రియ
శ్రీరామచంద్ర దేవంకర తనయ
బుడారసింగి దేశద్యుతి త్రిదశాలయ
శుక్రసమేతహిఁ కరిఛంతి విజయ
రూపేకామ, ధీమంత జే గీష్పతిసరి
దిసే దిసే జాహాంక యశప్రసరి
దయాశీల, దాత, బలిసమరే జే హుఁ

భీమ పరాక్రమె పరేందు రాహు
సదా సర్వత్ర జే విచక్షణ సమాజే
శ్రీ కాశీదేవిం కర వరపుత్ర జే
నామశ్రీ గౌరచంద్ర నిశ్శంకరాయ
దేవపద జాహాంక సుగుణనీయ
అటయితంకర సుప్రియజాయ
శ్రీ దుర్గామాధవ మతెకరంతిదయా
పద్మావతీ అభిలాష నామెప్రబంధ
ప్రకాశకవి అఠతిరిశఛంద.''

"జరడా దేశాధిపతి, వీరవరుడు, కవి, సరస్వతి కుమారుడు, సిద్ధ విద్యోపాసనలో పండితుడు, వాసుదేవ ధాటరాజు నా తండ్రి. గంగ వంశాబ్ధి చంద్రుడు పర్లాఖిమిడి రాజ్యాధిపతి భూపకులదీపకుడు, అతి ప్రతాపశాలి, అయిన వీరాధివీర శ్రీ గజపతిరాజు వంశములో పుట్టిన ప్రసిద్ధుడు శ్రీ రామచంద్రదేవు కుమారుడు నా భర్త, స్వర్గములో దేవేంద్రునివలె బుడారసింగి దేశములో ప్రకాశించుచున్నాడాయన. రూపానికి మన్మధుడు, బుద్ధికి బృహస్పతి వంటివాడు. దశదిశల ఆయన యశశ్చంద్రికలు అల్లుకొన్నవి. దయాశీలుడాయన; సమరములో భీమవిక్రముడు; శత్రు రాజచంద్రులకు రాహువు; శ్రీ కాశీదేవి వరపుత్రుడు. ఆయనపేరు శ్రీ గౌరచంద్ర నిశ్శంకరాయదేవు. ఆయన ప్రియభార్యను నేను. శ్రీ దుర్గా మాధవదేవుల దయవల్ల "పద్మావతీ అభిలాష" అనే ప్రబంధము ముప్పది ఎనిమిది ఛందస్సులలో రచించినాను."

భర్తృ ప్రశంస అతిశయోక్తులతో సాగించి, "ఆయన ప్రియ భార్యను, అని పేర్కొనడమువల్ల ఈమె భర్తృ గృహమునకరిగిన మొదటి దినములలో పద్మావతి అభిలాషను విరచించినదనిపించును. కాని అది సరి కాదు. ఈమె సుగుణముల కిది తార్కాణము మాత్రమే. పితృ గృహము లోనే కావ్యరచన చేసినదీమె.

భర్తృ సాంగత్యము పరిత్యజించి పుట్టింట నివాసము చేసిన తన దోషము గణింపకుడని పాఠకులకు నమ్రముగా నివేదించుకొనుచు ఇట్లు వ్రాసినది కవయిత్రి.

"సహజె అబల కర్మెహె విహీన
సుబుద్ధి నుహెం నాహిం పాఠపఠన
విధి ఆణిమతె కలా ఎతె హాటా
స్వదేశరె థిలె హాయిథాంతి సాట
ఏకాంతరె దివారజని నసరయి
తెణు బాల బోధనె మన దేయి
కహాయి మధు మాలతి కలారస
సాధుజన నధరి ణా దోష."

"సహజముగా నేను అబలను, కర్మహీనురాలి నయ్యాను. మంచి బుద్ధి ఎరుగను. చదువులా చదివినదానను కాను. విధి తెచ్చి ఇక్కడ ఇన్ని పాట్లు పెట్టాడు. స్వదేశములోనే ఉండినచో పట్టపురాణినై కూర్చొనేదాన్ని. ఇక్కడ ఏకాంతవాసములో రాత్రింబగళ్ళు గడవకుండా ఉన్నవి. అందుచేత బాల బోధలో మనస్సు లగ్నము చేసినాను. మధుమాలతి కలారసము (పద్మావతి అభిలాషలో మధుమాలతి కథ వర్ణింప బడింది) వర్ణించాను. సాధు జనులు నా దోషములు పరిగణించకండి."

ఆ దినములలోను, తరువాతి కాలములలోను ఉపేంద్రభంజు కావ్యాలు చదువనివారు, చదివి అనుకరించని కవులు ఒడిశాలో అరుదు. నిశ్శంకరాయరాణి కూడ తన పూర్వ కవుల గ్రంథములు, ముఖ్యముగ ఉపేంద్రభంజు కావ్యములు కూలంకషముగా పఠించినది. అందలి కవితా రహస్యములను అవగతము చేసుకొన్నది. తనకు నచ్చినపట్ల వర్ణనలను, భావములను అనుకరించి తన గ్రంథమునకు అందాలు కూర్చుకున్నది. ఈమె పద్మావతి అభిలాషలోని సరోవరవర్ణన ఉపేంద్రభంజు లావణ్యావతి లోని సరోవర వర్ణన ననుకరించినది. వన వర్ణన ఉపేంద్రభంజు "బార సోయి"లోని వనవర్ణన ననుకరించినది.

కవయిత్రి నిశ్శంకరాయ రాణి కవిత్వము ఒడియా ప్రబంధకవుల కవిత్వమునకు ఏ మాత్రము తీసిపోదని నిరూపించుటకు ఆమె పద్మావతి అభిలాషలోని వన వర్ణన పరికించ దగినది.

రాగము : బంగళా శ్రీ

కుసుమసమయ హోయిచి ఉదయ
పల్లవిత తరులతా
వృక్షేడాళెడాళ లగిణ బహుళ
బిభాకీ వరవనితా
సర్వతరుగణె వరజా త్రిపణె
రంతి బిభా సంభార.
వరకన్యాంకుకి జవు తికదె జే
బధాయి అచ్ఛంతి కర
ఫల పుష్పభరె తరులతా మానె
దిశంతి ఏ అధ్యాహార
బంధు గణలయి ఫులవేష హోయి
వేదీరె యే మంత వర.
పలాశలతా పలాశ దూర కరి
పుష్పే హోయిచి సువేష
హోమ అనల జ్వవిచా పరాదిశె
వరకన్యాంకర పాశ.
పుష్ట మధువహి ఘృతధార సేహి
నియోగి జే కాష్ఠరాశి
నామ బ్రాహ్మణ ఫుల్లసరఛేదిణ
హోమకీ కరుఛబసి
కెవు తరుగణ లతావేష్టితేన
దిసే జేహి శోభావన.

చిర పరవాస తేజకీ పురుష
  కాంతా అంగే ఆలింగన
దర వికాస కుసుమ కీ మందహా
  మన మోహు అఖి.
ఋర్ఘుఛి మకరంద చకిరఖి ద్వంద్వ
  రామాకీ అళు తేఝుఛి.
ఉచ్ఛడాళర, ఝ పుష్పపాఖుడి
  కుసుమ వర ప్రాయే
ప్రబలవాతె వల్లరీ గణచళి
  అలది చాలంతికి యే
వివిధ పక్షికోలాహల నాద చయ
  హుళహుళికి యేమణి
నానామృగగణ ఆతజాత పుణ
  చరచాలోక జాణి.

కుసుమ సమయమైనది. తరులతలు పల్లవించినవి. ప్రతి వృక్షము కొమ్మకొమ్మ చిక్కగా పెనవేసుకొన్నవి. వరకన్యల వివాహామువలె నున్నది వనము. అన్నిచెట్లు పెండ్లి పెద్దలవలె పెండ్లి సంబరాలు సమకూర్చు చున్న ట్లున్నవి. వరకన్యలకు పెండ్లికట్నాలందించుచున్నట్లు చేతులుచాచుచున్నవి. ఫలపుష్ప భరితములయి తరులతలు అర్ఘ్యాహారమునకు సిద్ధపడినట్టున్నవి. బంధుగణముతో కలిసి పూలవేషముతో పెండ్లి వేదికకువచ్చిన వరునివలె ఉన్నాడు; వసంతుడు. పలాశలత పలాశములు విడిచి పూలతో ముస్తాబయి నది. వధూవరుల దగ్గర హోమాగ్ని మండుచున్నట్లు కనుపించుచున్నదది. పూదేనె నేతిధార సమిధల మీద పడుచున్నట్లు కొమ్మలమీద పడుచున్నది. పురోహితబ్రాహ్మణుడు పూలసరులు వేలుస్తూ హోమంచేయుచున్నట్లున్నది. కొన్ని తరులతలు వనములో గాఢముగా ఆలింగనము చేసుకొనుచున్నవి. చిరప్రవాసము విడిచి స్త్రీపురుషులు కౌగిలించు కున్నట్లున్నదది. ఎత్తయిన కొమ్మలనుండి పూలరేకులు రాలుచునుండగా, మన్మథ బాణాలు తగిలిభర్త

ప్రవాసము ఉన్న యువతి కన్నీళ్ళుకార్చుచున్నట్లున్నది. ప్రబల వాయువుతో ఊగులాడుచున్న పూలజొంపాలు దీవనలనిచ్చు చున్నట్లున్నవి. రకరకముల పక్షులకోలాహలము పుణ్యస్త్రీలు ఉలవలు పోయుచున్నట్లున్నది.

శుభసమయములలో స్త్రీలు ఒడిశాలో ఉలఉల అని ధ్వనిచేస్తారు. ఈ మంగళధ్వనిని 'హుళహుళి' అంటారు. గంజాము ఆంధ్రులు ఉలవలు పొయ్యడమంటారు. నానారకాల మృగాల రాకపోకలు పెండ్లిలో ఆగంతకుల నభ్యర్థించు చున్నవారి సందడివలెనున్నది.

కవయిత్రి నిశ్శంకరాయరాణి కావ్యము పద్మావతీ అభిలాషలో ప్రసాద గుణమునకు చిన్న మచ్చుతునక పరికించ దగినది.

## సరోవరవర్ణన

రాగము : రామకిరి

సేనరవర సరోవర బులి
    దేఖంతి శోభా.
స్ఫటిక పావచ వకుళమూలె
    హాయివే ఉభా,
నీలసాఢి రంగ ఢాడి జె
    హంసావళి శోభన,
మహిమహిళా విస్తారిలా
    ప్రాయే దిసే రంజన
పద్మకుముదకోకనదంకర
    సువాస ఫేని,
    భ్రమరె భ్రమరె భ్రమంతి
    హరషే ధ్వని.
దీనదండి మండి సుందర
    సారస చక్రవాక,
హంస మరాళ సంగె
    కేళి కరు ఛంతి డాహుక్.

నిశ్శంకరాయ రాణి ఉత్తమ కవయిత్రి. ఈమె పద్మావతీ అభిలాష ఉత్తమ కావ్యము. ఇందలి అలంకారములు సహజసుందరమైనవి. భాష మధురమైనది.

రాణీ హీరావతి :

భర్తృ వియోగముతో చిన్న శోకకావ్యము వ్రాసిన కవయిత్రి ఈమె. ఒడిశారాజు దివ్యసింహదేవు రాణి ఈమె. దివ్యసింహదేవు 1878 లో పూరీ సింహాసన మధిష్ఠించాడు. విద్యాగంధ మబ్బలేదతనికి. తాగుబోతై, మత్తులో ఎవరిని బట్టిన వారిని కొట్టుచుండెడివాడు. అదేదో ఉన్మాదమను కొని రాజమాత మందులూ మాకులూ సేవింప జేసినది.

సాక్షిగోపాల దగ్గిర భవానీపురము మఠములో బాబాజీ శివదాసు అని ఒక మహంతు ఉండెడివారు. ఈశ్వర శక్తితో అసాధ్యమైనరోగాలు అతడు నయము చేయగలడని జనుల నమ్మకము. కుమారుని పిచ్చికుదురు టకు అతనికి కబురుచేసినది రాజమాత. బాబాజీ రాలేదు. కాని విభూతి ఇచ్చిపంపాడు. ఇది తెలిసిన రాజసేవకులు బాబాజీ మీద చాడీలుచెప్పారు రాజుకు. రాజు పగపట్టాడు. ఒకనాడు రాణివాసములో అస్వస్థతగా ఉన్న దని బాబాజీని పిలిపించాడు. అతను రాగానే కోట కుస్తీ వాకిట పదిహేను మంది మల్లులచేత బాబాజీని చావమోదించెను. మలద్వారములో జీలుగు తోసి, అగ్గిముట్టించి ఒక సందులో బయట పారవేయించెను. కొంతసేపటికి బాబాజీకి తెలివి వచ్చినది. దేకుకొనుచు వెళ్లి పోలీసులకు ఈ ఉదంతము చెప్పెను. వైద్యులు చికిత్సచేసినను పదిహేను దినములలో అతను మర ణించెను. ప్రభుత్వమువారు రాజును అండమాను పంపిరి. అక్కడే అతను పిచ్చి ఆస్పత్రిలో మరణించెను. భర్తృవియోగ శోకమును వర్ణించుచు రాణి శోక కావ్యము రచించినది. కలాపాణి (అండమానులు) అని దివ్య సింహదేవు శోకము ఇప్పటికీ ఒడిశాలో బహుళ ప్రచారములో ఉన్నది.

19 వ శతాబ్దము తరువాత ఇరువదవ శతాబ్ది ఆరంభములో ఒడిశాలో ఎంతోమంది కవయిత్రులు వెలిశారు. వారిలో కుంతలా కుమారి సాబత,

అన్నపూర్ణ, అపరాదేవి, సులక్షణీదేవి, రెంగరాయి ముఖ్యులు. వీరిలో అపర్ణాదేవి ఈ మధ్యనే కాలము చేసినది.

## కుంతలా కుమారి సాబత :

ఒడియా కవయిత్రులలో కుంతలా కుమారి వంటి కవయిత్రి ఇంత వరకూ ఉద్భవించలేదు. నవల, నాటకము, కవిత, వ్యాసము - అన్నిటి లోను అందెవేసిన చేయి ఆమె. అననుకూలమైన సాంఘిక పరిస్థితులలో పడి, ఒడిదుడుకులతో జీవనసంగ్రామము సాగించవలసి వచ్చినను ఆమె కవి హృదయము కుంటువడలేదు. నడియస్సులోనే ఈ ఉత్కల కోకిల అస్తమించుట ఉత్కల కావ్యకాననానికే కాదు, భారతీయ సాహిత్యో ద్యాన వనానికే తీరని లోపము సంభవించినది. పందొమ్మిదవ శతాబ్దము చివరి దినాలలో కుంతలాకుమారి అవతరించినది. ముప్పదెనిమిదేండ్ల వయస్సులోనే కాలం చేసినది.

కుంతలాకుమారీ పూరిజిల్లా ఖుర్దాలోని ఒక బ్రాహ్మణ కుటుంబ మున జన్మించినది. ఆమె మాతామహుడు క్రైస్తవ మతావలంబి. తండ్రి బర్మాలో డాక్టరుగా ఉండెడివాడు. అందుచేత కుంతలాకుమారి చిన్న తనము బర్మాలో గడిచినది. అందువలననే ఆమె స్వభావమున ఒడియా స్త్రీల తెలిచాటు పిరికితనము కాక, బర్మా యువతుల ధైర్యసాహసాలు నెలకొన్నవి. అవే ఆమె రచనలయందును స్పష్టముగా ప్రతిఫలించినవి. బాల్యమునుండియు తన జీవితమును ఎదుర్కొన్న వ్యతిరేక శక్తులను ఎదిరించ గలిగిన ధీరత్వమును ప్రసాదించినది.

కుంతలా కుమారికి బాల్యమునుండియే విద్యాభ్యాసమనిన అభిలాష అధికము. ఈ అభిలాషతోనే ఆమె సంస్కృతములు అభ్యసింపవలెనని ఢిల్లీ వెళ్లినది. అక్కడి ఆర్యసమాజముతో ఆమెకు పరిచయము కల్గినది. ఆర్య సమాజము అప్పుడు మతాంతర వివాహములను, వితంతు వివాహములను జరపు చుండెడిది. ఒక కుట్రలో చిక్కుకొని కుంతలాకుమారి ఆర్యసమాజ వివాహము చేసుకొన్నది. ఈ వివాహము ఆమెపాలిట అభిశాపముగా

పరిణమించినది. ఢిల్లీలో వివాహము జరిగినది, కాని సంస్కృతాభ్యాసము సాగలేదు. కుంతలాకుమారి భర్త కృష్ణప్రసాద్ బ్రహ్మచారి ఒక కంపౌండరు (తరువాత డాక్టరు) అతనితో ఆమె వివాహము కాకిముక్కులో దొండపండూ, వైదికుని చేతి విడెమూ అయినది.

కుంతలాకుమారి ఎల్. ఎం. పి. పరీక్షచదివి, కటకమున ప్రయివేటు ప్రాక్టీసు పెట్టినది. అనతికాలముననే మంచిపేరు ప్రతిష్ఠలు సంపాదించినది; రెడ్‌క్రాసు సంఘమున పనిచేసినది. మంత్రసానులకు శిక్షణ గరిపినది. జీవనయాత్రకొఱకు ఆమె వైద్యవృత్తి అవలంబించినను సాహిత్యజీవనమే ఆమె సాగించినది. సాంఘికసేవ దేశారాధనా ఆదర్శముగా పెట్టుకొన్నది.

కుంతలాకుమారి సహజ కవయిత్రి. ప్రతిభావంతురాలు నిందాస్తుతులు లక్ష్యపెట్టని సహృదయ. హిందీ, బాంగ్లా, ఇంగ్లీషు సాహిత్యాలు చక్కగా చదివి, ఉత్కల సాహిత్యమునందు సరిక్రొత్త రీతులు ప్రవేశపెట్టడానికి ఆమె యెంతయినా కృషిచేసినది. మాతృభాష మాతృదేశము ఆమెకు ఆరాధ్యదైవాలు.

కుంతలాకుమారి తొలిరచన 'అంజలి'. అంజలి భక్తిపూర్ణమైన మధురకావ్యము. రవీంద్రుని బాంగ్లా గీతాంజలితో దీనిని సరిపోల్చవచ్చు. గీతాంజలి చదివిన తరువాతే ఈమె అంజలి వ్రాసియుండ వచ్చునని తెలియును.

"మాతృభాషా దీపె జాళి తవ ధర్మాలోక
చితరిబ జేహ్నా తార మయూఖ ఉజ్వళ,
సే ఆలోకే పాసోరిణ దైన్యదుఃఖ, శోక
ఫుటి ఉఠిబ సహస్ర హృదయ కమళ."

(నీ ధర్మాలోకము, ఉజ్జ్వల మయూఖము వికసించినట్టు మాతృభాషా దీపము వెలిగింతును. దాని వెలుగులో దైన్యమూ, దుఃఖమూ, శోకమూ మరచి సహస్రహృదయ పద్మాలు వికసించి నవ్వును.)

ఇదీ కుంతలాకుమారి అంజలిలోని ఆవాహన,

'అంజలి,' 'అర్చన,' 'ఆహ్వాన,' 'ఉచ్ఛ్వాస,' 'స్ఫులింగు,' 'ప్రేమ చింతామణి,' 'అపూర్ణ ప్రేమ,' 'గోబరగోటియి,' 'కాళీబహు,' 'నలతుంజీ,' 'భ్రాంతి,' 'పరశవాణి,' 'రఘు అరక్షిత' మొదలైనవి కుంతలాకుమారి గ్రంథాలు. ఇందులో మొదటి అయిదూ కావ్యగుచ్ఛాలు. తరువాతది గేయ నాటకము. మిగిలినవి నవలలు.

కుంతలాకుమారి కావ్యాలలో ప్రాచీన ఉత్కల వైష్ణవ కవులు గోపాలకృష్ణ, కవిసూర్య, సామంతసింహాదులూ, బాంగ్లా వైష్ణవకవి చక్రవర్తి చండీదాసూ, మైథిలి కవికోకిల వింధ్యాపతీ ధ్వనింతురు. వీరితోపాటు పాశ్చాత్య కవులును తొంగిచూచుచుందురు. అర్చనలో ఒకటి, రెండు గేయాలు చూడండి.

"సారా పరాణటా తృషారే పూరి
సారామరమటా హేవుచి ఝురి
సకాళరు సంజే తువారి లాగి మూఁ
అనాయి బసిఛి పధే,
శిరారే శిరారే చమకె బిజుళి
ఛవిల ఛళిల పరా
ఝిమి ఝిమి దేహగోటాక్ మోహారి
అవిశ్వాసఘేరే త్వరా
తుఛాకు తుఛాకు కాంది బసే మానె
జీవనరహిబసతే
ఎతె దుఃఖ యదిదెబఖాళి ధిల
బేళున కహిల మోతె!"

(జీవనమంతా తృష్ణతో నిండినది.
హృదయమంతా నీ తలపుతోనే నిండినది,
నరనరాలలో మెరుపులు ఝళిపించుచున్నవి
శరీరమంతా తిమ్మెరలు పోవుచున్నవి.

త్వరత్వరగా అపనమ్మకం ఆవరించుచున్నది
అభిమానంతో పూరికే ఏడుపు వచ్చుచున్నది
నిలిచేనా ఈ ప్రాణము నిజముగా !
ఇంత దుఃఖపెట్టవలెనని యే తలంచుచు
ముందే నాకు చెప్పావు కావేమి ?)

ఈ చిన్ని గేయమున భావము మెరుపులవలె ఎలా ఝళిపించినదో పాఠకులు గమనించివుంటారు. కుంతలాకుమారి రచనలో ఇదే ఒక ప్రత్యేకత.

"తుమ దాసకు శెమూఀ సబురూ ఊణా
తేణుకి వంచిత ! నహేలా కరుణా ?
ఆసిధిలి మనేఘేనిజా పురాణా
ఏబేని రాశే నెవుటి చాలిఛి
ధావు దావు తవ ప్రేమిక పణియా
మూఀధిబి సంసార జంజాళ అళి ఆ
మో నీచ పణరేధిచి మవునరే
తహిఀ జీవన సపన మంశిబి."

(నీ దాస దాసీలలో నేనే అందరికంటే కనాకష్టం
అందుకనేనా ఈ వంచన। అందుచేతనేనా ఈ
దయమాలిన తనమూ ?
ఎన్నో ఆశలతో వచ్చితిని
నిరాశతో మళ్ళిపోవుదును
నీ వలపు నీదగ్గరనే ఉండనిమ్ము
నేను ఈ సంసార జంజాటమున తొక్కుగా మిగిలిపోవుదును
నా తక్కువతో నేను మౌనముగా ఉండిపోవుదును
అదే నా జీవనసాఫల్యా మనుకొందును.)

కుంతలాకుమారి ప్రేమ భక్తి కృత్రిమమైనది కాదు. అది ఆమె హృదయముయొక్క అట్టడుగునుండి ఉప్పొంగిన నిర్మల నిర్ఝరిణి.

అందులో కలతలేదు; వాంఛలేదు; వంచనలేదు. అందువలననే ఈ రచయిత్రి రచనలు చదివినపుడు తన్మయత కలుగును.

కుంతలాకుమారి మానసరాజ్యమునందలి దైవము రత్నకుండల ధారి, మణికిరీట మండితుడు కాడు. శేషశయనుడును కాడు. చింకిపాతలు కట్టుకొని, అనదుడై చెట్టుక్రింద నిద్రించు దరిద్రనారాయణు డతడు. భగవద్గీతలోని శ్రేష్ఠపదార్థాలలో శ్రేష్ఠపదార్థంకాదు. దీనుల జఠరజ్వాల, వితంతువుల కన్నీటిధార అతడు. కవయిత్రి ఉద్దేశించిన భగవంతుడు ఏమను చున్నాడో వినుడు :

"దీన సదనె మూఁ జఠం జ్వాళా
విధవాలోచనే లోతకమాళా
అనాధదేశేమూఁ సోయేఁ తరుతళే
సజాడు ఛుకిపాఁ ఏసజ కుసుమ ?
శిళారే ఘుషుచు సువాస చందన ?
సునాదీప జాళి ధోయి అర్ఘ్యధాళి
కహ కేవుఁ దేవే వందుఛు ?
పదారె బులేమూఁ పింధి ఛిండా కంథా
కెబెకి ఛువేతు చాహిఁ ఛు ?"

(దీనులయింట జఠరజ్వాలనేను
విధవల నేత్రాల కన్నీటిధారను
అనాధవేషమున చెట్టుక్రింద శయనింతును
సజ్జపువ్వులు సవరించెద వెందులకు ?
రాతిమీద చందనం రంగరించెదవేల ?
బంగారుదీపం వెలిగించెదవేల ?
అర్ఘ్య మిచ్చెదవేల ?
ఏ దేవుడికొఱకు నీవందనము చెప్పూ ?
చింకిపాతలతో ఆరుబయట తిరుగుచున్నాను నేను
పొరపాటుననైనా చూచితివా ఎన్నడైనన న్ను ?)

కుంతలాకుమారి కావ్యాలలో 'ప్రేమచింతామణి' శ్రేష్ఠకావ్యము. మూడంకాల గేయనాటక మిది. పద్మశ్రీ ఆర్తవల్లభ మహాంతి అన్నట్టు సౌందర్యోపపత్తే ఈ కావ్య ముఖ్యోద్దేశము. రాధాకృష్ణుల ప్రణయమే ఇందలి కథావస్తువు. కథానాయిక శ్రీమతి రాధ. కథానాయకుడు ప్రేమ చింతామణి శ్రీకృష్ణుడు. కమలా, విశాఖా, లవంగలతా, మంజులా, జాతిమాళా, లలితా, బృందావతీ - రాధ చెలికత్తెలు. సుబలుడు, సుధాముడు - శ్రీకృష్ణుడి సఖులు. మొదటి అంకము చాతకినీ, రెండవ అంకము నవనీరదం, మూడవ అంకము నీరపానం. అంకాలకు ఈ పేర్లు ధ్వనిపూర్ణమైనవి. చాతకిని రాధ. నవనీరదం కృష్ణమూర్తి. నీరపానం రాధాకృష్ణుల సమ్మేళనం. కవయిత్రి కల్పనాప్రతిభకు ఈ నామకరణము ఒక నిదర్శనము.

రాధాకృష్ణుల ప్రేమగాథ నాటకీయభంగిని కావ్యరచన చేసిన మొదటికవి చండీదాసు. చైతన్యస్వామివంటి మహాపురుషుడు దానిని అభినయించినాడు. అయితే చండీదాసు కావ్యానికి కుంతలాకుమారి కావ్యానికీ పోలికలు తక్కువ.

చండీదాసు రాధ యెంతో ప్రయత్నముపైకాని శ్రీకృష్ణుని ప్రేమించదు. మొదట కృష్ణుడే ఆమెవిషయము విని రాయభార మంపును. కాని ఆమె తిరస్కరించును. తుదకు కృష్ణుడు సమ్మోహనాస్త్రము ప్రయోగించిన వెనుక ఆమెలో ప్రేమస్మారకము కలుగును. ఈమధ్య ఎంతో తంతు జరుగును.

కుంతలాకుమారి రాధ అలాకాదు. ఆమే ముందు కృష్ణమూర్తి వారి విషయము విని ప్రేమతో విలవిలలాడిపోవును. ఆమె శరీరమున మెఱపులు ప్రాకి పరుగిడును.

పూలుగోయుచు ఆమె ఇట్లనును :

"ఆహా ఏయి పులటిపరి
చిర అంధార నీరవనిశిరె
శశిరేఖశిమూ ముగి !"

(ఆహో. ఈ పువ్వులాగే
చిర అంధకార నీరవ నిశీధినిలో
శిశిరంలో నేనూ చచ్చిపోతాను !)

"హృదయే పుటిఛి ఏ ప్రేమ కథి
అంధారే ఆగో, శుఖిబఝుడి,
మరమవేదనకే బుఝిబ ఆవు
యౌవనతార జిబటిసరి !"

(హృదయమున ఈ ప్రేమకళిక ఉద్భవించినది
ఓయమ్మా, చీకటిలో ఎండి, జారిపోవును
దీని యౌవనము చెల్లిపోవును
ఈమర్మ వేదనను ఎవరు తెలిసికోగలరు !)

ఇది విని చెలికత్తె లలిత ఓదార్చును.

కాని రాధ :

"సఖి, మూఁకి తారె ఛాడి పారె
జీవనాడి పఛే హాజిబ హృదరు
జ్యోతి లిభిజిబబేని నయనరు !"

(సఖి, హృదయమునుండి జీవనాడి విడిచిపోయినను
రెండు కండ్లనుండి జ్యోతి ఆరిపోయినను
అతగానిని విడుచుకోగలనటే !)

"గళారె మోహారఛార్ దేయిథలె
రహు ఆన ఆనందరె
మధావాణీ సమమణిచి మితణి !"

(నా గొంతుక కోసి వేఱొక ప్రేయసితో అతడు ఆనందము
అనుభవించిన అనుభవించుగాక,
నెచ్చెలీ, ఆతడే నా మస్తకమణిగా భావించుచున్నాను నేను.)

సఖి బృందావతి కూడా ఓదార్చును.

మళ్ళీ రాధ :

"ఏయి పథే జిబబలి
నిశినిశి ముంహిం ధిలి ఉజాగర
రఖిలి కవాట ఖోలి"

(ఈ దారినే అతడు వెళ్ళునని రాత్రిళ్ళు జాగరముచేసి తలుపు
తెరిచి ఇక్కడనే కూర్చొని యున్నానే.)

"కతే గుంథే ఫులమాళీ
ఉష్ణ అశ్రుధాళి"

(వేడి వేడి కన్నీళ్ళుకార్చి
ఎన్నో పువ్వులు మాలకార్చానే !)

"కహ ముం బంచిచి సతె !
సబ, బాటి మోరకంటా పడిఛిలో
జిబి ఆవు కేవుం పథే ?"

(నేను నిజముగా బ్రతుకుదునటే !
నా అన్నిదారులూ ముళ్ళతోనే నిండి ఉన్నవి.
ఏ దారిని వెళ్ళేది, చెప్పూ ?)

ఆమె తొలిమారు కృష్ణమూర్తిని చూచిననాటి సంగతి చెలికత్తెతో
ఇలా చెప్పును :

"ఆహో, సేదినకి భువిబి జీవనె
పహిలి జేదిన దేఖిలి నయనె
నవచూతపత్ర సుషమాశ్యామర
ధివికి ఏజగతరె !
భువిబి మోహర
కుళ మాన జ్ఞాన
అంధహేలి నిమిషరె
సేహిదిను ఝురి ఝురి

బులె వనే వనే
విజనే గోపనే
శ్మశానమణే మోపురీ."
(ఆహా, ఏనాడు శ్యామసుందరమూర్తిని చూచితినో,
ఆ తొలిరోజు మరవగలనటే ?
ఈ లోకంలో వున్నానటే ఆవాళ !
నా కులము, మానమూ, జ్ఞానమూ - అన్నీ మఱచిపోయాను
నిమిషములో అంధురాలినే అయిపోయాను
ఆవేళనుండియే అతనినే తలచుకొనుచు
అడవులలో తిరుగుచున్నాను,
విజనముగా, గోపనముగా.)

ఇదే సన్నివేశమును ఇంతకుముందు ఇద్దరు ఒడియా ప్రాచీనకవులు వ్రాసియుండిరి కవి సూర్య బలదేవరథోకిశోరి చంద్రానన చంపులో రాధ ఇట్లనును :

"కి హెలారే, కహితో నహోయి భారతిరే,
కాలి జా దూరరు సఖీ, కళనా కలామో ఆఖి
కళా ఇందీవ ఆరతిరే."

(ఏమి జరిగినదనుకొన్నావు, చెప్పుటకు నోరాడుటలేదు. దూరము నుండి నా కళ్లకు నల్లకలువల ఆరతి దర్శనమైనదనుకొనుము.)

గోపాలకృష్ణుని పదావళిలో రాధ
"ముహాం ముహిం కిశోరచంద్ర మాంకరమోర
ఆజి యమునాతీరె హోయిగొలామా,
వేళా శిళారెబసి హేలారె తను ఘుషి
హెవుధిలి, వయసి తారి దేలామా."
(ఈవేళ యమునాతీరమున కిశోరచంద్రునకూ (కృష్ణునకు)
నాకును ముఖాముఖి జరిగిపోయినదమ్మా,

నీలాటిరేవు రాతిమీద కూర్చొని యథాలాపముగా
ఒడలు తోముకొనుచున్నాను నేను. పక్కనున్న వయసుపిల్ల
నాకు కన్నుగీటినదమ్మా)

పై ముగ్గురు కవులలోనూ కుంతలాకుమారి చిత్రించిన సన్నివేశం మిన్న అని వేరే విడమఱచి చెప్పనక్కఱలేదు. కుంతలాకుమారి రాధ ఇంకా ఇలా చెప్పును.

"జేనియాఁ జాళిళి హియారె
సహస్ర సాగర నీర అజాడిలే
నవిభి బడిబ కాయారె."

(హృదయమున నేను రగిలించిన అగ్ని
వెయ్యి సముద్రాల నీరు పోసినను ఆరదు
మరింత మండును దేహమున.)

రాధికప్రేమ విహ్వల చిత్తముతో ఉన్మాదిని అయి విలపించుటతో తొలి అంకము ముగియును. రెండవ అంకమున శ్రీకృష్ణుని ప్రణయకథ రాధను చూచిన విషయమును సఖులతో శ్రీకృష్ణుడిట్లు చెప్పును.

"సఖా, ఎయిపథే చాలి
మరమె బాజిలా వాసనా కతురి
ధైర్య మీదేలా టాళి."

(ఈ దారినే నడిచివెళ్ళినదోయి నేస్తం!
ఆ మర్మ హృదయమున కోరికల కత్తెర తగిలి, నాధైర్యము
కత్తిరించి వైచినది.)

"ఖుయిఁరె ఊయిఁలా సహస్ర శశి,
శత తార ఆవా పడిలే ఖసి,
నందన నవ ఫాల్గుణ శోభా
అవనీరే దేలా ధాశి."

(నేలమీద వెయ్యి చందమామలు ఉదయించినట్టయినది.

వందలు వందలు తారకలు రాలిపడినట్టయినది. నందనవనము
తన ఫాల్గుణ శోభ భూమిమీద ఒలకబోసినట్టయినది.)

విని "ప్రేమరాజ్యము రాజుదగ్గిర, ప్రేమరాజ్యము రాణి" అంటారు నేస్తాలు సుబలసుధాములు. ఇద్దరును కృష్ణమూర్తినిట్లు ప్రశ్నింతురు.

"జాణు ఏతె కవితా తుజాణు ఏతె రంగ
కహ, ప్రేమిక నలభేకిపాం ప్రేయసీర సంగ
దూర మేఘ లాగి నాచె మయూర రహియా
ఆళిర చుంబిన వినా కుంజె వారె కియా"

(ఇంత కవిత్వము తెలుసు నీకు, ఇన్ని మర్మాలు తెలుసు చెప్పూ,
ప్రియునకు ప్రేయసి ఎందుకు లభించదు ? దూఱ మేఘము
కొఱకు నెమలిగుండె నాట్యమెందుకు చేయును ? తుమ్మెద
చుంబనము లేక కేతకి తుప్పలోనే ఎందుకు చచ్చిపోవును ?)

ఇంతలో రాధ యమునా తీరమునకు వచ్చును, మురళివిని, అపుడు ప్రేమ చింతామణి కృష్ణుడిట్లనును.

చిర పిపాసిత
హియా మోర ఆజి
లభిలా అమృత ఆస్వాద
చిరబందీ ఆజి
కారాగార కోణు
లభిలా ముక్తిర ఆహ్లాద."

(నా చిరవిరహిత హృదయము ఈవేళ అమృతము నాస్వాదించినది.
చిరకాల నిర్బంధితుడు కారాగారము నుండి ముక్తి ఆనందము
ననుభవించినాడు)

ఇది విన్న చెలికత్తెలు :—

"ఆజి ఆణహే మాలతీ కుంజలతికా
సజ సుమనర మాళ"

(ఓ మాలతీ కుంజ లతికా సజ్జ పువ్వులమాల
తీసుకురా ఈవేళ.)

రెండవ అంకము ఇట్లు ముగియును. మూడవ అంకము నీరపానము.

"మో మానస తిలోత్తమ
జనమె జనమె ఖోజి బులిధిలి
ఏయిమను ప్రాణ రమా"

(నా మానస తిలోత్తమ ఈమె. ఇదే నా ప్రాణ రమ. ఈమె కొఱకే ఎన్నో జన్మలనుండి వెదుకుచు తిరుగుచున్నాను నేను.)

అని కృష్ణమూర్తి పల్కును.

"కోటియుగ అబా అనాయి ధివిమూఁ
తిశె దరశన ఆశే
ప్రతి అంగ మోర ధన్యహాయిలా
అధర మధుర హాసే"

(కోటి యుగములనుండి ఈ రవంత దర్శనముకొఱకు కనిపెట్టుకొని యుల్లేయుంటిని. నా ప్రతి అంగమును ధన్యమైనది, అధర మధుర హాసముతో.)

అంటుంది రాధ.

"ఆత్మా చిహ్నిలా ఆత్మారసాధీ
నపుటిలా ముఖేకదా."

(ఆత్మ ఆత్మను పోల్చుకొన్నది. నోట మాట పెగులలేదు.)

అని కృష్ణుడు పల్కును.

"దీప ఆలింగిలా అనళశిఖాటి
హేమ ఆదరిలాహీరా."

(దీపశిఖ అగ్నిని కౌగిలించుకొన్నది. బంగారము వజ్రాన్ని పొదివి పట్టుకొన్నది.)

రాధావచనము :

"విహాంగం ప్రేమ సంగీతం పాడింది
సింధు తరంగం ప్రేమ నాట్యం చేసింది."

ప్రేమ చింతామణి చివరి అంకము తెరపడినది.

కుంతలాకుమారి ప్రేమ చింతామణి ఒడియా సాహిత్యపు ఒక మణి; చింతామణి. కవయిత్రి ప్రేమరసమునెంత రంజితముగా చిత్రించినదో దేశభక్తి కూడా అంత ప్రోజ్జ్వలముగా చిత్రించినది కవితలో. ఆమె స్ఫులింగం నిజంగా నిప్పు తునకల గేయసంపుటి.

ఆమె చిత్రించిన మాతృగీతం ఏ సాహిత్యమునందైనను మొదటి తరగతి గేయములలో చేర్చదగినది.

''ఆజి ఏకకంఠే మాబలి డాకహే
త్రైశకోటి మా ఆర సంతాన
మా నామ మహిమాశక్తిరె ఊఠి
దుర్బల భీత కంపమాన
మానామ గరిమాగిరి హిమాచళె,
శత శతాబ్దిర తుషార ఉజ్వళె
మాతృ స్నేహా ఝురా
గంగా సింధు ధారా.
బ్రహ్మపుత్ర బహే పవిత్ర కల్లోళె,
ఉఠె మహాగీతి వ్యోమె జళెస్థళె
మానా ఘరస్తుతి అంతరే ఉచ్ఛళె
వింధ్యాద్రి సహ్యాద్రి నీళగిరి కోళె
రేవా గోదావరీ
గా అంతి నీరళె.
శిరి బృందావనే చందనవనె
బద్రీనారాయణే మా నామర మంత్ర
బాజె హృదయయంత్ర మధుర నిక్వణె.

(ముప్పది మూడు కోట్ల తల్లిబిడ్డలారా! ఈవేళ ఐక కంఠ్యముతో అమ్మా అని పిలువండి. భయముతో వణకుచున్న దుర్బలులారా!

మాతృనామ మహిమశక్తితో లేవండి. మాతృనామగరిమ హిమగిరి. శత శతాబ్దాల తుషారమునుజ్జ్వల పఱచును. మాతృస్నేహముతో గంగా సింధు నదులు ప్రవహించుచున్నవి. బ్రహ్మపుత్ర పవిత్ర కల్లోలముతో పరుగిడుచున్నది. ఆకాశము మీద, భూమిమీద, నీటిమీద మహాగీతి ప్రతిధ్వనించుచున్నది. మాతృనామస్తుతి హృదంతరములలో ఉప్పొంగుచున్నది. వింధ్యాద్రి, సహ్యాద్రి, నీలగిరులు గానము చేయుచున్నవి. రేవా గోదావరులు నీరవంగా పాడుచున్నవి. మాతృనామ మంత్రము శ్రీ బృందావనమునందును చందనవనమునందును బదరీనారాయణమునందును వినిపించుచున్నది. హృదయ యంత్రము మధుర నిక్వణముతో మారుమ్రోగుచున్నది.)

ఈమె 'ఆహ్వానం'ను ఆనాటి తెల్లదొరతనము నిషేధించినది.

పిరికిపందలైన పురుషులను సంబోధించి కవయిత్రి కుంతలాకుమారి ఎలా ఆహ్వానించినదో వినండి :

"హే పురుషే ! యదిన ఉఠ పథర
ఆమె రణవేశే హాబు అగ్రసర
తుమెయది భయేదియె పఛగుంచా
ఆమెతే జిజిబు ఆమలా జులుచా
ఆమె నారీగణ కోనరు బాహారి
ధరిబుఁ అసహ యోగతరవారి
ఆమమాథిల్లె లక్ష్మీ దుర్గావతి
ఆమె కర్మదేవి పద్మినీ సంతతి."

(ఓ పురుషులారా ! మీరు ఈసారి లేవకపోతే మేము రణావేశముతో అగ్రసరలమగుదుము. మీరు భయముతో వెనకంజ వేసిన మేము లజ్జవిడిచి ముందుకువచ్చెదము. మేము నారీజనము అసహయోగ

తరవారి పట్టుకొని లేచెదము. మా తల్లి లక్ష్మీబాయి. మా అమ్మ దుర్గావతి. మేము కర్మదేవి, పద్మినుల బిడ్డలము.)

కలము పట్టిన చేతితో కత్తిపట్టి భారతవీర సైన్యాన్ని కుంతలాకుమారి ఎలా ఉద్బోధించుచున్నదో నేటి భారతదేశం కూడా చెవులొగ్గి వినాలి :

"అజి హోళీ ఔళ అసిఛి ఆహ్వాన,
ఫగుఖౌళ ఆవు నబళ పరాణ
ఢాళి స్వరుధిర అఛిర బదళ
నువా ఫగుఖేళ మాతిబా సకళ
జయ జగనాథ, ఉచ్చే దేయిడాక
ఉఠ భారతర వీరపుత్ర జాక
పూర్బె అహేరియ ఉత్సవె జెసనె
రాజసుతె దోళపరచె పాళనె
కరుథిల్లె దేశ సౌభాగ్య నిర్ణయ
తే సనె ఉఠహే, తేజదకా భయ
ఘంట ఘోడాయిణ రఖచె శ్రీహరి
జయ సునిశ్చయ, నాశజిచె అరి."

(ఈ వేళ హోళీ పండుగనాడు ఆహ్వానము వచ్చినది. వసంతము లాడుటకు మనస్సు ఒప్పుటలేదు. వసంతం బదులుగా స్వంత రక్తము నొలికిచి క్రొత్త హోళీ పండుగను అందరము జరుపుకొందము; జయ జగన్నాధ, అని కేకలువేసి భారత వీర పుత్రులంతా లేవండి. పూర్వము రాజపుత్రులు అహేరియా ఉత్సవముతో హోళీ పండుగ జరిపి, దేశ సౌభాగ్యమును నిర్ణయించినట్టు లేవండి. భయము భీతి విడవండి. శ్రీహరి మన రక్షకుడు. శత్రువు నశించును. మన జయము నిశ్చయము. కుంతలాకుమారి క్రాంత కవయిత్రి. ఆమె కలము కత్తికంటే వాడి అయినది. ఆమె వాణి బాణము కంటె వడి కలది. ఆమె నవలలో 'రఘు అరక్షిత' ఉత్తమ నవల.)

ఆమె సాహిత్య ప్రతిభను మెచ్చుకొని దేశమామెకు 'ఉత్కల భారతి' అనీ, 'భారత భూషణా' అని సన్మానించినది. ఆమె యింగ్లీషు లోనూ కవిత్వమల్లినది. హిందీలో ఒక పత్రికకు సంపాదకురాలుగా ఉండి ఒడియా సాహిత్య సేవ చేసినది. ఆమెకు ఒక కుమార్తె ఒక కుమారుడూ కలిగినారు. కూతురు పేరు సవిత, కుమారుని పేరు జగన్నాధం. మూడో సంతానం కుమార్తె కలిగినప్పుడు భర్తయొక్క పొరపాటు శస్త్రచికిత్స కారణముగా ఆమె అకాలమరణము పొందినది.

# కన్నడ కవయిత్రులు

మూలము : టి. యస్. వెంకట్రామశాస్త్రి, M. A. హైదరాబాదు.

అనువాదము : ఊ. సుహాసినీదేవి, M. A., బాపట్ల.

దక్షిణదేశ భాషలలో కన్నడమొక ప్రసిద్ధమైన భాష. కన్నడము నకు సంస్కృత నామమైన కర్ణాట శబ్దమునకు "కర్ణే అట తీతి" వీనులకు మధురముగా వినబడునది అని అర్థము చెప్పుదురు. కన్నడ భాషయందు 9 వ శతాబ్దమున సాహిత్య సృష్టికి ప్రారంభము జరిగినది. సాహిత్యము నకు స్త్రీ, పురుషుల భేదముతో పనిలేదు. కాని సామాన్యమగు గృహస్థ ధర్మ నిర్వహణ కారణములచేతనే అన్ని భాషలయందు వలె కన్నడ మందును స్త్రీ సాహిత్య సృష్టి ఆలస్యముగనే జరిగినది. పురుషులకువలెనే స్త్రీలుకూడ కవయిత్రులు కాగలరు. విజ్ఞానము స్త్రీ, పురుష వివక్షత లేకుండగనే ఇరువురి పట్ల అభేదముగా వర్ధిల్లినది. దేశ చరిత్రను తరచి చూచినచో రాకుమార్తెలు, మంత్రిపుంగవుల కుమార్తెలు రాజాస్థానముల నుండి వేశ్యలు, నర్తకులు, ఉపపత్నులు మున్నగువారందరును శాస్త్రముల యందును, కవిత్వమునందును అత్యద్భుతమైన, అతిశయమైన పాండితీ ప్రభావములను కలిగియుండిరని మనకు విశదము కాగలదు.

ఈ కథనము నిజమైనప్పటికిని సంస్కృత భాషా సాహిత్య చరిత్ర యందుగాని ఇతర భాషల సాహిత్యములందుగాని స్త్రీ రచయిత్రుల నామ ములుగాని వీరి రచనలుగాని పరిమితముగనే కన్పించుచున్నవి. బహుశః వారి సాహిత్యసేవ విస్తృతముగా లేకపోవుటయే దీనికి కారణము కావచ్చును. ప్రతిభావంతులైన కాళిదాసు, షేక్స్పియరు, పంప, మున్నగు వారి నిశితమగు మేధ ఔన్నత్యమును ఏ ఒక్క రచయిత్రియు అందుకొన లేకపోయినదనుట చాలా ఆశ్చర్యకరమగు విషయమే. ఈ స్థితి ఇట్లుండు టకు తగిన కారణములను ఇదమిత్థమని నిర్వచింపజాలము. సాంస్కృతిక,

వైజ్ఞానిక, సాంఘిక, మత సంబంధమైన పరిస్థితులు కాళిదాసాదులకు ప్రోద్బలకముగను, ప్రోత్సాహకరముగను యుండియుండవచ్చునేమో. ఈ సందర్భమున ఈ దిగువ నీయబడిన అభిప్రాయములను పరిశీలింతము.

(1) "బహుశః సాంఘిక నియమములు స్త్రీ విద్యను ఉన్నతమైన వారి అనుభూతులను ఆశయములను వారి కవితా శక్తిసామర్ధ్యములను అణచివేసి యుండవచ్చును."

మన దేశమున కవయిత్రులు తక్కువగా ఉండుటకు కారణము వారిలో తెలివితేటలు గాని, ప్రతిభ గాని, మేధాసంపత్తి గాని కొఱవడి యుండుట కాదు. కాని వారి వ్యక్తిత్వమునకు గాని, వారి అభివృద్ధికి గాని తగిన సౌకర్యములు లేకపోవుటయే నిజమైన కారణమని మనము చెప్పు కొనవచ్చును.

ఈ రెండు అభిప్రాయములను శ్రద్ధగా పరిశీలించినచో అవి నిజమే నని మనకు తేటతెల్లము కాగలదు. పై కారణముల వలననే స్త్రీ రచయిత్రులు సారస్వతమున ఆత్మవిశ్వాసముతో గాని, అభినివేశముతో గాని ముందంజ వేయలేకపోయిరి. ఇందు ఏవో కొన్ని అపవాదములుండి యుండ వచ్చును. దీనిని నిరూపించుటకు కన్నడ సాహిత్యమునందే ప్రబల సాక్ష్యములు లభించుచున్నవి. వీరశైవులు సమాజమున స్త్రీలకు పురుషులకు సరిసమానమైన ప్రతిపత్తిని, అవకాశములను కల్పించిరి. తత్ఫలితముగనే ఆ సంఘమందలి స్త్రీలు అత్యున్నతమైన ఆధ్యాత్మిక విజ్ఞానమును స్వశక్తి తోడనే సంపాదించుకొనుటయే కాక ఆచార్య పీఠములను గూడ అధిష్ఠించిరి. వచన రూపమును సంతరించుకొనినవారి ఆధ్యాత్మిక సూక్తుల యందు వారు తమ వ్యక్తిగత జీవితమునందలి ఆంతరంగికానుభూతులను, దివ్యానుభూతులను స్వేచ్ఛగా వ్యక్తీకరింపగల్గిరి. ఈ వచనములలో చాలా వరకు వారి కవితావేశ ఫలితముగ ఉద్భవించినవే యగుటచే వీనిలో పద్య కావ్య లక్షణములు కన్పించుచున్నవి. ఈ రచయిత్రుల పరిణతి చెందిన వారి కవిత్వమున మత సంబంధమైన, కావ్య సంబంధమైన నిగూఢ విషయ

ములకు అద్భుతముగా సమ్మేళనము పొడగట్టును. సాధారణముగా స్త్రీలు ప్రవేశించుటకును, మత, సాంఘిక స్వేచ్ఛలను పొందుటకును వీలులేనట్టి హాండాస సంప్రదాయమునందు కవయిత్రి పేరైనను కాన్పించుట లేదు. స్త్రీల సంబంధమైన విజ్ఞానమును వ్యక్తీకరించు పద్య కావ్యములును ఆ సాంప్రదాయమున దొఱకుటలేదు. అయినప్పటికిని, గిరియమ్మ అను నామె పై భాగవత సంప్రదాయ ప్రభావముతో కన్పించుచున్నారు. ఆమె రచనలను పరిశీలించినచో ఆమె బాహ్య ప్రభావములకు లొంగక తనంతటతాను సంఘమునకు దూరముగా తొలగియుండెడిదని సుస్పష్టము కాగలదు.

శైవమత సంప్రదాయము ననుసరించిన భక్తురాండ్రును, ఇతర కవులును తమ సంఘమున ఒక ప్రతిపత్తిని, స్వేచ్ఛను సంపాదించుకొనుటకై తాము చేసిన ప్రయత్నములను తమ తమ రచనలలో తరచుగా ఉల్లేఖించిరి. ఇది సారస్వత రంగమున పురుషుల ఆధిక్యమును, పరిస్థితుల వ్యతిరేకతను, తమ స్వాభావిక బలహీనతను అధిగమించుటలో వారి యత్నమును చక్కగా విశదము చేయును. భౌతికమైన విపత్తులను ఎదుర్కొనుటకై వారు చేసిన ప్రయత్నములను ఈ రచనలు విశదీకరించును. పురుషులు కవిత్వమునందు తమకుగల శక్తిసామర్థ్యములను గూర్చి డంబములు చెప్పుకొనుచుండగా స్త్రీలు మాత్రము తమ కావ్యరచనయందు వినమ్రత, సంకోచమును ప్రదర్శించుట గమనార్హము.

రాజులయొక్క ప్రోత్సాహజనకమైన అనురోధము లేనిచో హొన్నమ్మ, చెలువాంబల జీవితములలో సారస్వత వ్యాసంగములు ప్రారంభమయి యుండెడివే కావేమోనని మనము తలంచవచ్చును. కొందరు కవయిత్రులకు రాజాదరణ ప్రోత్సాహము సమృద్ధిగా లభించినను, వారు విద్య, సంస్కారము, మేధాసంపత్తి కల్గినవారేయైనను, కన్నడ రచయిత్రులు విశేషముగా కావ్యరచన చేయలేదు. బహుశః జీవితమున వారికి గల పరిమిత దృక్పథము, కవిత్వమునందు వారికిగల పరిమిత శక్తిసామర్థ్య

ములు, జీవితమునందు వారికి సరియైన అనుభవము లేకుండుట, సంఘమున వారికిగల కొన్ని నిర్బంధములు, కట్టుబాట్లు మున్నగునవి పైనచెప్పిన దానికి కారణములు కావచ్చును. స్త్రీలు రచనలుచేయు సాంప్రదాయము అంతగా లేకపోవుటయును, వారికి తగినంత ప్రోత్సాహము లేకపోవుటయు కూడ విశిష్టత గల్గిన రచయిత్రులు కొఱవడుటకు కారణములు కావచ్చును.

పై అంశములను పరిశీలించినచో సాహిత్య ప్రక్రియగా ఎంచుట కంతగా వీలులేని వచనములను కవిత్వాంశలేని పాటలను, మేధా సంబంధమైన ప్రశ్నాదికములను లేక నీతిని బోధించుచు సాహిత్యాంగములుగా చేర్చుటకు వీలుకాని పాటలును గణనకు తీసికొనినచో కన్నడ సాహిత్య రంగమున స్త్రీ రచయిత్రులు చాల కొలదిమంది మాత్రమే మనకు కన్పింతురు. కొంతమంది మత ప్రాతిపదికతో కూడిన పెండ్లి కథలను ఆకర్షకమైన కథానికలను వ్రాసిరి, కాని ఇవి చాలా తక్కువగానే యున్నవి. సాధారణముగా ఈ రచనలు ఎప్పుడును సాంప్రదాయబద్ధమైన ప్రాచీన కావ్యలక్షణములను అధిగమించలేక పోయినవి. సాహిత్యమున నూతన ప్రక్రియలను సృష్టించుటలో వీరు తమ ఉపజ్ఞను గాని, సాహసమునుగాని చూపలేక పోయిరి. అందువలన ఈ కోవకు చెందిన రచయిత్రుల రచనలలో వారివారి వ్యక్తిత్వములకును, ఉన్నతమైన గంభీరమైన వారి ఆశయములకును ఎచ్చటను చెప్పుకొన దగినంత పొందిక కాన్పింపదు. రచనా వ్యాసంగమునకై వారు స్వీకరించిన విషయములును చాలా తక్కువ పరిమితిలోనే యున్నవి. స్త్రీలకు వినోదము గలిగించుచు స్త్రీల అభివృద్ధి, శ్రేయస్సు మున్నగు అంశములకే పరిమితమై యున్నవి. ఇవి యన్నియు సాంగత్య చ్ఛందస్సులోనివే.

స్త్రీల రచనలలో విశ్వజనీనత, శాశ్వతత్వము, శైలిగాంభీర్యము, వైవిధ్యము, గాఢమైన భావుకత మానవుని మానసిక పరిణామ దశలను విస్తృతముగా స్పష్టముగా వ్యక్తీకరింప గల్గుటయు అంతటను గోచరింపక పోయినంత మాత్రము చేతనే స్త్రీల రచనలలో కవిత్వగుణము ఉన్నత స్థితిని పొందలేదని చెప్ప వలనుకాదు. ఈ చిన్న రచనలలో మనము సాను

భూతి మున్నగు భావముల వికాసమును, హృద్యమైన గీతి మాధుర్య గుణ వికాసమును కాంచగలము. హొన్నమ్మ, గిరియమ్మల రచనలలో శాశ్వ తత్వ మున్నది. అక్కమహాదేవి వచనములు ఆమెయొక్క గాఢమైన మతా వేశ పరత్వమును తెలుపుచున్నను, ఉత్పత్తి క్రమము నందును, వికాసము నందును అవిభావగేయ స్వభావము ననుసరించియే యున్నవి. అక్క మహా దేవి మొదలగువారు తమ కవిత్వమునకు శైవమత సిద్ధాంతముల నాధార ముగా గైకొనగా, చెలువాంబ. గిరియమ్మ మొదలగు వారి కవితావేశ మునకు వైష్ణవ మతము ప్రాతిపదికయైనది. హైందవ మహిళల స్త్రీత్వము యొక్క ఉన్నతాదర్శములకును, హైందవ మహిళా సమాజ సౌఖ్యాభి వృద్ధులకును సుఖమయ జీవితములయొక్క మహోన్నతాశయములకును ఒక సుస్పష్ట రూపకల్పన చేయుటయే హొన్నమ్మయొక్క ఏకకాశయము. కావున అక్కమహాదేవి, హొన్నమ్మ, చెలువాంబ, గిరియమ్మ నలుగురును కన్నడ సారస్వతమున ప్రముఖరచయిత్రులని నిరాటంకముగా చెప్పవచ్చును.

## 9 వ శతాబ్ది నుండి 11 వ శతాబ్ది వఱకు :

ఇప్పటికి మనకు తెలిసిన అతి ప్రాచీన 'కవిరాజమార్గమను (About 850 A.D.) కన్నడ గ్రంథమున ప్రాచీన వచన రచయితలను గూర్చియు, ప్రాచీన కవులను గూర్చియు సూచన చేయబడినది. కాని అందు మహిళా రచయిత్రుల విషయమై ఏమియు చెప్పబడలేదు. 9,10 శతాబ్దములలో మహిళా రచయిత్రులను గూర్చికాని వారి రచనలను గూర్చికాని ఎచ్చ టను కాన్పింపదు. (కాంతి అను నామె దీనికి బహుశ అపవాదము కావ చ్చును. కాని ఆమెకాలము ఇదమిత్థమని నిర్ణయింపబడలేదు.) 12 వ శతా బ్ద్యంతము వఱకును మహిళా రచయిత్రుల పేర్లు మనకెచ్చటను వినరావు. కన్నడ సారస్వత చరిత్రయందు స్త్రీల నామములు కన్పించుట కిదియే ప్రప్రథమ నిదర్శనము (శ్రీ R. నరసింహాచారిగారి కర్ణాటక కవి చరిత్ర అను గ్రంథమున సూచింపబడిన కవుల చరిత్ర ఆధారముగా ఈ విషయ ములు స్వీకరింప బడినవి.)

## కాంతి (About 1100 A. D.)

జైన కవయిత్రియగు 'కాంతి' యను నామెయే కన్నడ సారస్వతమున ప్రప్రథమ కవయిత్రి యనునది సర్వజనాంగీకార్యమైన విషయమే. సాహిత్య చరిత్రనుబట్టి చూచినచో ఈమె విషయము వివాదాస్పదముగ నున్నది. ఆమె జీవితకాలములకు సంబంధించిన విషయములపై పండితులలో బహు భేదాభిప్రాయము లున్నవి. ఉదాహరణకు ఆమె నామధేయమే భేదాభిప్రాయములకు తావిచ్చుచున్నది. ఆమెయెక్కడ జీవించినది, ఆమెను అభిమానించిన వారెవరు ? ఆమె సాహిత్యకృషి, రచనా వ్యాసంగము లెట్టివి ? ప్రస్తుతము ఆమె రచనగా చెప్పబడుచున్న గ్రంథము ఆమె రచించినదేనా ? మొదలగునవన్నియు అజ్ఞాతములుగనే యున్నవి. ఆమె సమాచారములు తెలిసికొనుటకు ప్రస్తుతము మనకు మూడేమూడు మార్గములున్నవి.

(1) బాహుబలి (1560A.D.) యొక్క నాగకుమార చరితె యందున్న ఒకానొక కథనము (2) దేవచంద్రునిచే రచియింపబడిన రాజావళికతె (1838 A. D.) యందున్న ఒకానొక వివరణము (3) కాంతి హంప సంవాదములు అను నామధేయముతో నున్న నానా విషయ సంగ్రహ సంపుటము నందున్న వివరణములు.

అందు శ్రీ వీరదొరప్రభు ఆస్థానమునందు కాంతి లక్ష్మీ దేవివలె నుండెడిదని బాహుబలి చెప్పుచున్నాడు. ఈమెకు రాజ ప్రాపకము కలదని దీని మూలమున తెలియుచున్నది. కాంతికేయారు అను ఆమె నామమునకు చేర్చబడిన బహువచన ప్రత్యయమునుబట్టి ఆమె తనకాలమునాటి కవులలో ఒక విశిష్టస్థానమును పొందియుండెనని తెలిసికొనవచ్చును. 'అభినవ వాగ్దేవి' (the new Goddess of speech) అనునది బాహుబలిచే నొసంగబడిన ఆమె బిరుదనామమే అయినను కావచ్చును లేదా ఆమెను గూర్చిన బాహుబలి యొక్క ప్రశంసోక్తిగనైన భావించవచ్చును. ఆమె విద్వత్తునకు అపారమైన పాండిత్యమునకు ఇది యొకగొప్ప ప్రశంసముగా నెంచవచ్చును.

తొలుదొల్త ఆమె యొక సామాన్య స్త్రీ యనియు, కాని ఒక విధమైన తైలమును (Oil of mental light) విజ్ఞానమును వృద్ధి పఱచు ఒకానొక ఔషధమును సేవించుటచే ఆమె జ్ఞానము వికాసము చెందిన దనియు, తద్ద్వారా ఆమె గొప్ప పండితురాలైనదనియు దేవచంద్రుని వర్ణనలవలన తెలియుచున్నది. ఈవిధముగ సంప్రాప్తించిన, నూతనజ్ఞానము తోడను ఆత్మబలముతోడను ఆమె పంప మొదలగువారిచే కూర్పబడిన సమస్యలను విడదీయ గల్గినది. ఈ విధముగా రాజాస్థానము నందలి కవులలో నగ్రగణ్యతను పొందుటయే గాక రాజాదరణమును పొందినది.

## కాంతి - హంప సంవాదములు :

కాంతి హంప సంవాదములు అను పేరుతో గల ఒక నానా విషయ సంగ్రహ సంపుట మొకటి వెలుగునకు వచ్చి ముద్రింపబడినది. ఇది ప్రశ్నోత్తర పూర్వకమైన కావ్యముగా రూపొందింప బడినది. ఇది శ్లేషార్థముల నిచ్చు పదములు గల్గిన సమస్యలతోడను చమత్కారయుతమైన సమాధానములతోడను కూడియుండును. ఈ విధమైన రచనలు సంస్కృత సాహిత్యమున ఎక్కువగా నుండియుండును. కాని కన్నడమున ఇది యొక్కటి మాత్రమే కన్పించుచున్నది. కాంతి - హంపలకు మధ్య జరిగిన సమస్యల యొక్క పోటీలయొక్క స్వరూపమును ఈ పద్యములద్వారా మనము గ్రహింపవచ్చును. కాంతియొక్క ఆత్మవిశ్వాసమును, ఆశుకవిత్వము చెప్పుటయందామెకు గల శక్తిసామర్థ్యములును ఈ పద్యముల వలన మనకు సుస్పష్టమగును. ఎట్లైనను ఈ పద్యములలో కవితా ధర్మముకంటె ఎక్కువగా ఆమెయొక్క అద్వితీయమైన మేధాశక్తియు, సమయస్ఫూర్తియు గోచరించుచుండును. ఈ పద్యముల యందలి పదముల కూర్పు పద్య రచనయందు ఆమెకు గల కౌశలమును, నేర్పును చూపుచున్నది. మొత్తము పై మూడు పాదములలో సంబంధములేక మిక్కిలి క్లిష్టమైన నాల్గవ పాదమునకు పై మూడుపాదములు చేర్చి అన్వయమును కల్పించి పద్యమును కూర్చుటలో ఆమె యొక్క ఉపజ్ఞామహితమైన అద్భుతశక్తి

కన్పట్టును. అదే విధముగానే పద్యమునందలి సంవాదమున కంతకును మిక్కిలి కీలక ప్రాయమై విభిన్నార్థములు కల్గి, సమాకృతిగల నాలుగైదు పదములను మాత్రమే పద్యమునందు (శ్లేష) వాడుట, ఒకే ఉచ్చారణ వర్గమునకు చెందిన అక్షరములు గల పదములను వాడుట (యమకము) ఇతరవిధముల క్రమవిహీన వర్గములకు చెందిన పదములను ఒకే క్రమమున వాడుట మున్నగు ఛందశ్శాస్త్ర విహితములైన పారిభాషిక సాంకేతిక లక్షణములతో కూడినట్టియు ప్రజ్ఞా సాధ్యమైనట్టియు కవిత్వరచనము నీమె యొనర్చినది. ఈమెను గూర్చిన ఒక విచిత్ర కథనము ప్రచారములో నున్నది. ఒకప్పుడు కాంతి తనను ప్రశంసింపగా వినవలెననెడు కుతూహల ముతో హంపడు మరణించిన వానివలె నేలమీద పరుండెను. ఈ పన్నాగ మంతయు తెలియని కాంతి సానుభూతితో హంపయొక్క గొప్పదనమును గూర్చి ప్రశంసింప నారంభించెను. ఇది వినిన హంప విజయ గర్వముతో ఒక్క ఉదుటున లేచి మొత్తమునకు పోటీలో తానే గెల్చితినని చెప్పెనట.

పైనుల్లేఖించిన వీరదొర లేక దోజా దొర ఎవరు ? ఈ హంప అను కవి ఎవరు ? శ్రీ R. నరసింహాచారిగారి అభిప్రాయాను సారము హొయ సల రాజైన మొదటి బళ్ళాలుడు (క్రీ. శ. 1100-1106) వీరదొర అయి యుండును. నాగచంద్రుడనబడు కవి హంప కావచ్చును. పైనచెప్పిన నిద ర్శనములను వారు బాగుగా నమ్మియుందురు. పైన చెప్పబడిన మూడు కథనములను అంతగా విశ్వసించుటకు వీలులేదనియు అంతమాత్రముననే ఒక నిశ్చితాభిప్రాయమునకు రాకూడదనియు డాక్టరు ఎ. వెంకటసుబ్బయ్యా గారు వాదించిరి. కాంతియను కవయిత్రి ఎప్పుడును జీవించియుండలేదని ఊహించుటయే శ్రేయస్కరమని వారి పరిశోధనలవల్ల తేలిన ఫలితము. ఈ అభిప్రాయమును శ్రీ R. నరసింహాచారిగారు కూడ గ్రహించినట్లు కనబడు చున్నది. డాక్టరు R. S. ముగలి అను నాయన కాంతి చారిత్రక వ్యక్తి యేనా ? అను విషయముపై ఇంకనూ రెండు సందేహములను వెలి బుచ్చిరి. ఈ విషయమై చెలరేగిన అనేక వాదముల నిచ్చట ప్రస్తుతింప వలనుకాదు. ఉచితమును కాదు. బాహుబలి కథనమును, కాంతి-హంప సం

వాదములును దేవచంద్రుని అభిప్రాయమునకు ఆధారములైన పక్షమున దేవచంద్రుని అభిప్రాయములను మనము విశ్వసింపక పోయినచో బాహుబలి కథనము మాట యేమగును ? బాహుబలి కథనము ఏవిధముగను త్రోసి పుచ్చరానిది కదా ?

ఏది యెట్లున్నను కాంతిలేక కాంతికే అనునొక కవయిత్రి 16 వ శతాబ్దికి ముందెప్పుడో ఒకప్పుడు జీవించి యుండెనని పరిశీలన జరిపినమీదట మొగలి అభిప్రాయముతో ఏకీభవించి విశ్వసింప వచ్చును. కాంతి యను కవయిత్రి యే ఆధారముచేతను లేనేలేదను వాదమును మనము అంగీకరింప వలనుకాదు.

## 12 వ శతాబ్దపు చరిత్ర :

వీరశైవము స్త్రీ పురుషులకు సమాన ప్రతిపత్తిని అంగీకరించి స్త్రీలు తమ పురోభివృద్ధికై స్వయముగా పాటుబడుటకు ఎన్నియో అవకాశములను కల్పించినది. గృహ నిర్వహణమందును, ఆధ్యాత్మిక పరిజ్ఞానమును సాధించుట యందును. స్త్రీలు తమ శక్తిసామర్థ్యములను చూపగల్గుచున్నారు. పైని చెప్పిన ఈ రెండు మార్గములలో నేదియో యొకదానిని ఎన్నుకొనుట యందును వాటిని అభ్యాసము చేయుటయందును, అప్పటికి సంపూర్ణ స్వాతంత్ర్యమును, సౌకర్యములును, నేర్పును స్త్రీలకు లభించి యుండెను. స్త్రీలు పురుషులకు ఆనందమును కూర్చుటకు మాత్రమే ఉపయోగపడు విలాస వస్తువులుగా గాని ఎట్టి గొణుగుడును లేకుండా బానిసవలె విరామములేక గృహ నిర్వహణము చేయుటకుగాని ఆనాటి మహిళలు కట్టుబడి యుండ నవసరములేక పోయినది. ఇద్దరు సరిసమాన భాగస్థుల నడుమ జరుగు సహకార జీవనమువలె వైవాహిక వ్యవస్థయు, శివార్చనయు ఆనాటి కుటుంబములలో నిరాటంకముగ సాగిపోయినది. భగవంతుని పూజించుట యందును, ప్రాపంచిక జీవితమును నడుపుకొనుట యందును ఆధ్యాత్మిక తత్త్వాన్వేషణ యందును భార్యాభర్త లిరువురును పరస్పరము సహాయము చేసుకొనిరి. విషయవాంఛాలోలుపత్వమున

హద్దులు మీరి నడువకుండునట్లుగా పవిత్రమైన నియమబద్ధమైన జీవితమునకు వైవాహిక వ్యవస్థ అవకాశములను కల్పించునని వారు విశ్వసించిరి. వారిరువురును ఒకరికొకరు న్యూనతాధిక్యములు లేక సహాయకులును, మిత్రులును అయి యుండిరి.

మానవులలో స్త్రీ పురుష భేదమనునది శరీర నిర్మాణ భేదముచేతనే గాని ఆత్మ ఒకటియే యను సిద్ధాంతమును ప్రజలు తమ అజ్ఞానమువలన తెలిసికొనలేకపోవుటచేతనే స్త్రీ, పురుష విచక్షణ కల్గినదని శైవుల ప్రగాఢమైన నమ్మిక. ఒకవేళ ఒక మహిళ అవివాహితగా నుండిపోవలెనని యనుకొన్ననూ లేదా శైవుడైన భర్త లభింపకపోవుటచే ఆమె తన యొక్క శైవమత (విశ్వాస) మును త్యజింపవలసివచ్చినను, ఆమె శివలింగమును తన భర్తగను తను శివుని భార్యగను పరిగణించుకొనవచ్చును. ఇంకను వీర శైవమత సిద్ధాంతానుసారము ఆమెకు ఆధ్యాత్మికోపదేశము కూడ చేయబడును. అంతియేగాక ఆరు దశలలోనుండు సాధనా మార్గములును ఉపదేశింపబడును. దీని మూలమున తన ఆత్మ నావరించియుండు త్రివిధములగు అపవిత్రతలనుండి ఆమె తన్నుతాను విముక్తి పొందించుకొనగలదు. ఇంకను మోక్షమార్గమును చేరుటకు తగిన పరిపూర్ణత్వమును, ఆత్మవికాసమును, సిద్ధిని పొందుట కర్హత ఉండెడిది. ఈ విధముగా లభించిన స్వేచ్ఛా స్వాతంత్ర్యములు, విజ్ఞానము, సదవకాశములమూలమున వారు ఆత్మవికాసమును, ఆత్మవిశ్వాసమును, మతముపట్ల దీక్షను పెంపొందించుకొనిరి. తద్ద్వారమున వారు ఆధ్యాత్మికౌన్నత్యమును సాధించి శైవ పురుష భక్తులవలె ఈ భక్తురాండ్రును, తత్త్వచింతనయందౌన్నత్యమును, భావోదయమును గలిగియుండుటచే ఆచార్యపదము నధిష్ఠింపగల్గిరి. కాని అట్టి జీవితము పుష్పశయ్యవలె మృదువైనది కాదనియు, జీవితము కంటక పూర్ణమై బాధాయుతమై యుండుననియు అక్కమహాదేవి జీవిత విశేషములవలన విశదమగుచున్నది. సంఘమున వారికెట్టి గౌరవ ప్రపత్తులున్నను జీవితకాలమునందెక్కువ భాగము మిక్కిలి దారిద్ర్యముతో గడపినప్పటి వారి వృత్తి వ్యాపారములెట్టివైనను గాఢమైన వారి శైవమతాను

సరణము, పవిత్రత, వారి వారి విధులను సక్రమముగ నిర్వర్తించుటలో వారికిగల దీక్ష, సాంస్కృతిక పునరుజ్జీవనము, మహోన్నతమైన సాధన వారు తమ జీవితములయందు ఆచరణపూర్వకముగా నిరూపింపబడిన భక్తి, జ్ఞానము, వైరాగ్యముల అత్యద్భుతమైన సమ్మేళనము వారి వచనములలో పరిపూర్ణముగా విశదీకరింపబడి ఆ భక్తురాండ్రకు, వారి అభిమత ధర్మసాధనయెడ వారికిగల అచంచల విశ్వాసమునకు తార్కాణములుగా నిలుచును.

ఈ శివశరణురాండ్రు సత్యమార్గమున ఆత్మోపలబ్ధిని బడయుటకు ప్రయత్నించిరి. వారి హృదయములు పరమేశ్వరునియెడ ప్రగాఢమైన భక్తివిశ్వాసములతోడను, విజ్ఞాన వైరాగ్యములతోడను నిండియుండెడివి. వారు అనుభవ మండపములలో జరుగు మత చర్చలలో పాల్గొనెడివారు. కొన్ని సమయముల పట్ల వారు తమ భక్తులకు దివ్యజ్ఞానమును బోధింప గల్గియుండెడివారు. అంతియేకాక వారికెన్నియో విధముల మార్గదర్శకురాండ్రుగ కూడ నుండిరి.

అట్టివారిలో బసవన్న భార్యయగు నీలాంబిక యొకతె. ఆమె తన భర్త అట్టి మండపములకేగు సమయములలో అతనికి పరమేశ్వరుని యొక్క శివశంకర ప్రవృత్తిని గూర్చి ప్రబోధించెడిది.

## అక్కమ్మ :

అక్కమ్మ అనునామె కూడ ఈ కోవకు చెందినదే. ఈమె బియ్యమును పోగుచేయు మారయ్య అనునాతని ధర్మపత్ని. శైవమునందచంచల భక్తివిశ్వాసములు గలిగిన గొప్ప శివభక్తురాలు. ఈమె శివానుగ్రహ సత్తాను గూర్చియు, శివభక్తి పారమ్యమును గూర్చియు, శారీరక కృషి ప్రాధాన్యమును గూర్చియు తనభర్తకు బోధించెడిది.

## రాణీ మహాదేవి :

మోరిగె మారయ్య భార్యయగు రాణీ మహాదేవి కూడ ఈ శ్రేణికి చెందినదే. ఆమె జగత్తునకంతకును ఏకేశ్వరుడైనట్టి శివుడే ఆత్మయని

భర్తకు బోధపరచెను. వారి వచనములయందీ అభిప్రాయములే కన్పించు చుండును. వీరి రచనలయందు తరచుగా మానవ జీవితమునందలి దుష్టత్వ మును సహించలేకపోవుటచే ఉద్భవించిన తిరస్కార భావములు అధిక ముగా కన్పించుచుండును. మానవులయందున్న ఈ దుష్ట స్వభావమును చూచి వీరు కోపాతిశయమును పొందెడివారు. ఒక్కొక్క సమయమున ఈ కోపాతిశయమే వారిని వచన రచనకు ప్రేరేపించుచుండెడిదనవచ్చును.

ఇట్టి ఆవేశపూరితలగు శివశరణురాండ్రు క్షుభిత మానవజాతిని కాంచి కల్లోలిత హృదయలై పైని చెప్పినట్లుగా వచనములను రచిం చిరి. మోక్షప్రాప్తినొందిన లింగమ్మ ఒక గొప్ప భక్తురాలు. ఈమె శైవమతమునందలి కఠిన నియమములను అత్యంత దీక్షతో సాధన చేసినది. అంతియేకాక గురులింగ జంగముయొక్క భక్తియోగ మార్గములను కూడ దీక్షతో అభ్యాసము చేసినది భక్తురాలిని భార్యగను, పరమశివుని భర్తగను గుర్తించిన మహా శివభక్తురాలైన అక్కమహాదేవి శివసాన్నిధ్యమును చేరుటకు వలసిన సాధనను కడుదీక్షతో చేసి తరించుటయే గాక శివభక్తు లందరి యందును అత్యున్నత స్థానమును, అత్యధిక ప్రశంసలను అందు కొనిన మహాయోగిని. రెమ్మెవ్వ, రేచవ్వ, సోమవ్వ, వీరమ్మ, కాలవ్వ, గుడ్డవ్వ, కాలవ్వె, మసానమ్మ, రేకమ్మవంటి భక్తురాండ్రు శివపూజా విధానమున కించిల్లోపమును, శైవమతమునకు సంబంధించిన కఠిన నియ మానుష్ఠానము పట్ల జరుగు చిన్న లోట్లనుకూడ సహించలేకపోయెడివారు. “శివశరణియే భార్య, పరమశివుడే భర్త” అను నాదర్శమును సాధించు టలో సత్యక్క, కదిరె రెమ్మవ్వ అనువారు అక్కమహాదేవి మార్గమునే అనుసరించిరి. బసవన్న లింగైక్యమును పొందిన తదుపరి అదృశ్యురాలైన సోదరి నాగలాంబిక ద్వైతాద్వైతముల గురించియు, అందలి అంశము లను గురించియు అల్లమ ప్రభువుతో కూలంకషముగా చర్చలు సాగించి ఆ రెండు సిద్ధాంతములయొక్క సారమును విస్పష్టముచేసి తదుపరి అల్లమ ప్రభువుతో ఏకీభవించినది. నాగలాంబికయు, గొప్ప తార్కికవాది

(హేతువాది)ని యగు ముక్తాయక్కయు సోదరీప్రేమ మూర్తీభవించిన భక్తురాండ్రు.

మతపరముగను, సాహిత్యపరముగను జరిగిన విప్లవ ఫలితముగా స్త్రీ రచయిత్రులు ఈ రెండింటికిని (మత, సాహిత్యములకు) అత్యంత సన్నిహితమైన సంబంధమును, సమ్మేళనమును కూర్చగలిగిన శక్తిసామర్థ్యములను సంపాదించిరి. సంభాషణాపూర్వకముగా పండితులకు మాత్రమే అర్థమగు క్లిష్ట చంపూప్రబంధశైలి పరిత్యజించి, సామాన్యులకుకూడ సులభముగా అర్థమగు వచనశైలిని స్వీకరించిరి. అట్లే క్లిష్టమైన ఛందస్సు, కఠిన శబ్దజాలములతో కూడిన గ్రాంధికభాష త్యజింపబడి దైనందిన జీవితమునందుపయోగించు వ్యావహారిక భాషయే ఈ రచనలలో స్వీకరింపబడినది. వీరశైవ మతాచార్యులందరును శైవమతము విస్తృతప్రచారమును పొందుటకును, తన్మత వ్యాప్తికిని, తమ తమ వ్యక్తిత్వములు సుస్పష్టమగుటకును కావ్యములలో పైనచెప్పిన మార్గములను అనుసరించిరి. వారిలో చాల మంది విద్యాధికురాండ్రు కాకపోయినను, వారు తమ సహజధోరణిలో తమ తమ అనుభవములను, భావములను సుస్పష్టముగా వ్యక్తీకరింపగల్గిరి. ఈ కారణమువలననే ఇతర సాహిత్యములయందుకంటె వీరశైవ సాహిత్యమున నెక్కువమంది రచయిత్రులు మనకు కన్పించుచున్నారు. వీరశైవానుష్ఠానమునందలి, కఠిన నియమములను దీక్షతో పాలించుట సత్ప్రవర్తన కలిగియుండుట నిష్కపటమైన భక్తియోగము నవలంబించుట శివునకాత్మార్పణము గావించుకొనుట గురులింగ జంగములయెడ భక్తిప్రపత్తులతో నుండుట మొదలగు ఈ ధర్మసూక్ష్మములన్నియు కలిసి శైవమత ప్రాథమిక సిద్ధాంతములకు ప్రాతిపదికలైనవి.

అయినప్పటికిని ఈ వచనములు రచయిత్రుల స్వకీయాధ్యాత్మికానుభవ వర్ణనములుగానే వారి హృదయకుహరముల నుండి వెల్వడినవనుట కొంత అతిశయోక్తి అగునేమో! వానిలో కొన్ని తాత్విక సత్యముల మానసిక ప్రకర్షలు; మఱికొన్ని చర్వితచర్వణములైన అతి సామాన్య

సత్యములు; మఱికొన్ని కేవల శుష్కానుకరణములు; మఱికొన్ని చిక్కు విడని సాంకేతిక సమస్యా గ్రంథులు.

పై పరిశీలన వలన తేలిన సారాంశమేమన ఈ రచయిత్రుల విశిష్టతను గుర్తింపవలెనన్నచో కేవలము నీత్యుద్బోధకములైన రచనల నుండి గుర్తింపదగిన సాహిత్యపు విలువ గల్గినట్టి వచనములను మనము వేర్పరుపవలయును. కొన్ని వచన రచనలు మత సిద్ధాంతములతో నిండియుండుట చేతను, మరికొన్ని మనోహరమైన ఆవేశపూరితమైన భావవ్యక్తీకరణముతోడను నిండియుండుటచేతను ఈ విభజన ఈ విధముగా చేయవలసియున్నది. సహజముగా ఇట్టి భావప్రకటన రచయిత్రియొక్క ఉన్నతమైన ఆధ్యాత్మిక సంపదపైనను, కవిత్వమునందు ఆమెకుగల సహజమయిన ప్రతిభావ్యుత్పత్తులపైనను ఆధారపడియుండును. అక్కమహాదేవి రచనలయందు ఉన్నత కావ్యశిల్పమునందుండదగిన లయబద్ధతయు ఆమెయొక్క ఆధ్యాత్మికానుభూతులును మనకు కన్పించుచుండును. ఇతరల రచనలయందు ఈ మూలసిద్ధాంతములు విభిన్న నిష్పత్తులలో కన్పించుచుండును. రచయిత్రుల తత్వచింతనమే మరికొన్ని సూక్తులకు ప్రతినిధిత్వమును వహించిననూ, వానిమూలమున రచయిత్రియొక్క వ్యక్తిత్వమునుగూర్చి గాని, కవిత్వ సామర్థ్యమునుగూర్చి గాని తగినంత పరిజ్ఞానమును కలిగింపజాలకున్నవి. ఇవియేగాక వీటితో పాటుఇంకను కొన్నిటియందు రచయిత్రులయొక్క ఆంతరంగికమైన వ్యక్తిగతానుభవములకు తావులేకుండగనే కేవలము మతసిద్ధాంతములతోడనే అత్యధిక భాగము రచించబడినట్లుగా కన్పించుచున్నవి. ఈ రచయిత్రుల రచనలగు వచనములు ఎన్నిఖిలములైనవి? ఎన్ని భద్రపఱుపబడినవి ? ఎన్ని ముద్రింపబడినవి ? అను విషయములేమియు మనకు సవివరముగ తెలియవు. ఇంకను వెలుగునకురాని వ్రాతప్రతులెన్ని గలవోకూడ మనకు తెలియరాదు. ఇంతేకాక కల్పితములను, పాఠాంతరములను సాధ్యమైనంతవరకు తీసివేసి మూలగ్రంథములను మాత్రమే ప్రచురించుటకెన్నియో ఆటంకములున్నవి.

కొన్ని వచనములు పూర్తిగా కవిత్వ ధర్మమును కలిగియున్నవని చెప్పుట కష్టమైనను అవి ప్రజలను ఆకృష్టులనుగా చేయుటకు తగినంత కావ్యశిల్పమును కలిగియేయున్నవి. భౌతికాధ్యాత్మిక విషయములు రెండింటియందును తమ తమ వ్యక్తిగతమైన సున్నిత భావములను కడు రమ్యముగ వర్ణించుటచే వీరి రచనలయందును, భావవ్యక్తీకరణమునందును సహజత్వము గోచరించును. కావుననే రచనలు మనోహరముగా నుండును. వీనియందు రూపకము, ఉపమ, దృష్టాంతము, యమకము, అనుప్రాసము మొదలగు అలంకారములతో కూడిన రచనలతో నివి శోభిల్లు చుండుటచే నివి కావ్యధర్మమును కలిగియున్నవనియే చెప్పవచ్చును. కొన్ని వచనముల యందు రచయిత్రులు లక్షణశాస్త్రమున నిర్వచింపబడిన ఉపమాద్యలంకార ములను జాతీయములను త్యజించి క్రొత్తరూప కాద్యలంకారములను వారి ఉపజ్ఞతతో సృష్టించుకొనిరి. ఇట్టి రచనలు స్వచ్ఛందముగను, స్వోపజ్ఞతోను విరాజిల్లుచున్నవి. అంతియేకాక ఇవి ముత్యముల హారమువలెను, ప్రకాశ వంతమైన స్ఫటికములవలెను నూతన కాంతులీనుచున్నవి. అయినను ఈ గుణము సర్వత్రా కాన్పింపదు. వీరి అనుయాయుల జీవితములపైనను, రచనలపైనను శక్తిమంతులైన తమ పూర్వరచయిత్రులయొక్క ప్రభావము కన్పించుచునేయున్నది. భావమునందును, భావ వ్యక్తీకరణమునందును, చాలా రచనలలో వారి గురువులయొక్క సన్నిహితానుకరణమును, వారి భావములపట్ల, వర్ణనలపట్ల ప్రతిబింబ, ప్రతిధ్వనులును, కడకు శైలీసంబంధ మైన రీతులుకూడ అన్నిటియందును సాధారణముగ కన్పించుచు సులువుగా గుర్తించుటకు వీలుగా నుండును. ఈ అనుకరణములలో భావము నందును, తద్వ్యక్తీకరణమునందును రచనలయొక్క శోభ కాన్పింపదు.

### అక్కమహాదేవి :

(సుమారు క్రీ. శ. 1160 ప్రాంతము)

ఈమె వీరశైవోద్యమ మహానాయకులైన అల్లమ ప్రభు, బసవన్నల సమకాలికురాలు. ప్రగాఢమైన మతచింతన యందును సాహితీ ప్రాగల్భ్యమునందును ఈమె బసవన్న అనుయాయిని. భక్తి యోగసాధన

యందు గల కఠినతర నియమపాలన యందును విజ్ఞాన, వైరాగ్యముల సాధన యందును, భావ వ్యక్తీకరణ విధానము నందును, ఆమెకు శైవ సాహిత్య ప్రపంచమున నొక అద్వితీయమైన స్థానముకలదు. ప్రాచీనాధునిక పండితులు కొందరు ఆమె రచనలయందలి చాలా సంఘటనలను తీసి, ఆమె జీవిత చరిత్రమును మన కందించుట కనుకూలముగా నుండుటకై వాటి నన్నిటినీ ఒకచో క్రోడీకరించిరి. 'మహాదేవి అక్కనరాగళె,' 'మహాదేవి అక్కన పురాణ,' 'మహాదేవి అక్కన సాంగత్య' అను నామములు గల గ్రంథములు చాలకాలమునకు ముందే ప్రచురింపబడినవి. ఇవి వాస్తవిక అవాస్తవిక కల్పనలతో కూడిన పౌరాణిక శైలిలో రచింపబడిన ఆమె జీవిత చరిత్రలు. ఆమె జీవిత సంగ్రహముయొక్క కథనమునం దెన్నియో వ్యతిరేకతలు, విభిన్నాభిప్రాయములు కన్పించుచున్నవి. అమె వివాహ వర్ణన ఒక వివాదాస్పదమైన అంశము. ఆమె ఆంతర్యమును ప్రతిబింబించు ఆమె వచనరచనలు ఇంకా అధిక సంఖ్యలో లభించినగాని ఆమె జీవితచరిత్ర మనకు సరిగా తెలియరాదు. ఆమె జీవిత చరిత్ర వ్రాసినవారిలో హరిహర కవి ప్రప్రథముడు. అతని కథనము ననుసరించి ఆమె జీవిత చరిత్ర, సంగ్రహముగా ఇది:- ఆమె తన అభీష్టమునకు వ్యతిరేకముగా కౌశికుని వివాహము చేసికొనవలసి వచ్చెను అతడు ఆమెకిచ్చిన వాగ్దానమును నిలబెట్టుకొనలేక పోయెను. తత్ఫలితముగా భర్తనుండి వేరుపడిన తదుపరి ఆమె శ్రీశైలమును చేరువరకు దేశ సంచారము చేసెను. తరువాత శ్రీశైలమున ఆమెకు చెన్నమల్లికార్జున దేవుని సాంగత్యము లభించెను

ఇంకను కొన్నికొన్ని చోట్ల ఈ విధముగా చెప్పబడినది. అక్కమ్మ (Shrine of Experiance of Shiva) శివానుభవ మండపమునకు వచ్చి చేరగా అచ్చట ఆమె అందలి భక్తులచే పరీక్షింప బడెను.

అక్కమహాదేవి చరిత్ర స్త్రీలకు ఆధ్యాత్మిక పరిజ్ఞానమును, గౌరవ మర్యాదలను, స్వేచ్ఛా స్వాతంత్ర్యములను సంపాదించుటయం దొక అధ్యాయముగా పరిగణింపబడుచున్నట్లు అన్నింటియం దుల్లేఖింపబడినది.

ఆమె రచనలు : 'వచనములు', 'యోగాంగత్రివిధి', 'సృష్టియ వచన అక్కగళ పితికె'. వీటిలో మొదటి మూడును ముద్రింపబడినవి. అక్క వర్ణించిన కొరవంజి అను నింకొకరచన కూడ ముద్రింపబడినది. 'వచనార్థ' అనబడు నొక సవివరణాపూర్వకమైన వ్యాఖ్యానముకూడ ముద్రింపబడినది. ఆమె రచనలు చెన్నమల్లికార్జునుని నామమున రచింపబడినవి. (మహాదేవి అక్కనసాంగత్య అను నొక గ్రంథమునందు గిరిమల్లికార్జునుని నామముపై వ్రాసినట్టి పదుసూక్తు లామెవి కలవు.)

వచనములు : భక్తురాండ్ర రచనలలో మహాదేవి అక్క వచనములే ఎక్కువగా నున్నవి. మొత్తముమీద 250 వచనము లిప్పటికి ముద్రింప బడినవి. వ్రాతప్రతులరూపములో ఇంకను కొన్నిరచన లుండియుండ వచ్చును. అవియన్నియు మతావేశముచే నిండియుండుటచే ఎప్పుడో ఒకప్పు డవికూడ వెలుగునకు రాకతప్పవు. వీరశైవ మతగ్రంథములు కొన్నింటియందు ఈ సూక్తులు చాలా ఉదాహరింపబడినవి. తదుపరి అవి యన్నియు ఒకచో కూర్చబడినవి. ఈమె జీవిత విశేషములను తెలియజేయు కొన్ని సూక్తులు, ఇంకను అజ్ఞాతముగనున్న కొన్ని వ్రాతప్రతులలో కన్పించవచ్చును. ఆమె జీవితచరిత్రను దృష్టిలో పెట్టుకొన్నను, సారస్వత చరిత్రను దృష్టిలో పెట్టుకొన్నను, ఈమె రచనలను, సూక్తులను, తప్పక వెతికి ముద్రింపవలయును. ఆమె రచనలపై సమగ్రమైన సమీక్ష చేయవలె నన్నను, ఆమె సూక్తుల నత్యంతశ్రద్ధతో పరిశీలించుట అవసరము.

అక్కమహాదేవి రచనలు చాలాకాలమునుండియే సాహిత్యలోకమున నొక అమూల్యమైన స్థానమును సంపాదించుకొన్నవి. కన్నడసాహిత్య చరిత్రయం దామెకొక శాశ్వతమైన స్థానముకలదు.

సమకాలీన సమాజ చరిత్రగాని తద్విమర్శగాని ఆమె రచనలలో కన్పింపదు. అంతియేకాక సమాజమును సంస్కరించుటకు ప్రయత్నించి నట్లుకూడ కన్పింపదు. ఆమె రచనలయందలి భావసంపదయంతయు ఆమె యిష్టదైవముగను, ప్రభువుగను, ప్రియతమునిగను ఆరాధించిన చెన్నమల్లి కార్జునుని గూర్చిన వర్ణనలే "భక్తురాలే భార్య; శివుడే ప్రభువు; కాని దాని

అర్థమేమో నాకు సంగ్రహముగ తెలియదు" అని ఆమె అన్నప్పటికిని ఆ సిద్ధాంతమునందిమిడియున్న వివరణమును తెలిసికొనుట కామెయే ప్రధానమైన ఉదాహరణము. ఆమె భక్తి యెప్పుడును బాహ్యాచారములవైపునకు మొగ్గలేదు. కాని నిశ్చలమును, నిర్విరామమునునైన ఆమె అచంచల ప్రభుభక్తి మాత్రమే ఆమె రచనలయందు వ్యక్తీకరింపబడినది. శివుడే నా ఆత్మ - నా ఆత్మయే శివుడు అను "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అనబడు ఉన్నతాద్వైత సిద్ధాంతమునుండి ఉద్భవించిన భక్తిమార్గమే ఆమె యోగసాధన శివుని నిజతత్త్వమును గ్రహించవలెననెడి ఆశ శివునియందామెకు గల ప్రేమానుబంధము. శివానుభవానంతర మామె పొందిన సంతృప్తి మున్నగునవన్నియు ఆమె వాక్కులలో చమత్కారముగ వ్యక్తీకరింపబడినవి. భక్తి యోగ సాధనయందును, జ్ఞాన, వైరాగ్యముల సాధనలయందును పరిపూర్ణతను పొందుట కామె యొనర్చిన ప్రయత్నములలో ఆమె దాదాపుగా బసవన్నకు ప్రతిరూపముగా నిలచును. తన తండ్రిగను, ఆచార్యునిగను, ఎంచుకొనిన బసవన్నయందామె కపారమైన భక్తిశ్రద్ధలు గౌరవమర్యాదలు కలవు. చతుర్గోచరమగు ఈ భౌతిక ప్రపంచమునందలి కట్టుబాట్లను దాస్యశృంఖలములను త్రెంచివేయుటకునై ఎన్నియో ఆటంకములను, విపత్తులను సాహసముతో ఎదుర్కొనినది. "ఆమె ఆత్మ ఎల్లప్పుడునూ పరమాత్మ తత్త్వచింతనయందే పరిభ్రమించుచుండెడిది. భౌతికమును, సాంఘికమును నీతివిషయకమునునైన అనేకములగు ఆటంకములనామె అధిగమించినది. ఆమెకై శివభక్తులు నిర్దేశించిన పరీక్షలన్నిటియందును ఆమె విజయముసాధించి వారందరికంటె అత్యుత్తమస్థానమును పొందినది. బసవన్నవంటి ఉత్తమగురువులయందామెకు ప్రగాఢవిశ్వాసము కలదు. వారిదయకు పాత్రురాలైన బిడ్డవలె ఆమె తన్నుతా నభివర్ణించుకొన్నది.

ఆమె వారి సాన్నిహిత్యమును, సాంగత్యమును గాఢముగా కోరినది. ఇదియంతయు నిట్లుండగా తత్త్వసాధనయందింకను పరిపూర్ణత్వమును

పొందనట్టియు అందు శిశుగా సహాయములను కోరునట్టియు తత్త్వసాధకు లకు గొప్ప ప్రాపుగా నుండెడిది.

యోగాంగత్రివిధి :

దీనియందు 67 అనుప్రాసనియమములుగల త్రిపదలు గలవు. ఇందు తత్త్వశాస్త్ర విషయములేగాక ఈమె జీవితచరిత్రకు సంబంధించిన విశేష ములును కొన్ని గలవు. వేదాంత విషయ వివరణములయం దామె శైలి అనితరసాధ్యమై దుస్తరముగా నున్నది. తగినంత పూర్వపరిచయముగాని తాత్సారముగాని లేకయే ఆమె వాదముల నర్థముచేసుకొనుట చాలా కష్టము. ఆమెయొక్క వచనములతో పోల్చిచూచినచో ఈ త్రిపదలలో కవితావేశము, ఆవేశభరితమైన శక్తిసామర్థ్యములు, స్వాభావికమైన ఆమె కవిత్వపోకడలు లోపించినట్లు కనబడును. ఆమె శైలి శక్తిమంతమును, సమర్థమునునైనను, ఈ పద్యములలో ఆమెయొక్క ఆధ్యాత్మికానుభూతు లను గాని, వ్యక్తిగతజీవితమునుగాని సంపూర్ణముగా గ్రహింపలేము. తన ఆధ్యాత్మిక గురువునెడ ఆమెకుగల భక్తిప్రపత్తులును, ఆమె విద్వత్తు, పాండితీప్రతిభలును ఈ గ్రంథమున చాలా స్పష్టముగ కనబడుచున్నవి. పారమార్థికసత్యములను సాంకేతికపద్ధతిని వర్ణించుటలో ఈమె నైపుణ్యము అత్యద్భుతమైనది.

సృష్టియవచన :

ఇదియొక బృహద్గ్రంథము. వీరశైవ మతానుసారముగ ఈ గ్రంథము నందు సృష్టివిధానము, శరీరప్రవృత్తి, జీవాత్మప్రకృతి మొదలగు విషయ ములు బాగుగా వర్ణింపబడినవి. మతవిషయకముగా మాత్రమే ఈ గ్రంథము ప్రాశస్త్యమును వహించినది. (ఇప్పటి పరిశీలనమున చెన్నబసవడే ఈగ్రంథ కర్త యని యభిప్రాయపడుచున్నారు. కాని ఈ విషయమును జాగ్రత్తగా పరిశీలింపవలసియున్నది.)

అక్క వర్ణించిన కొఱవంజి :

ఈ గ్రంథ రచనయందు అక్కమహాదేవి ఎంతవరకు బాధ్యురాలో చెప్పుట కష్టము. ఇందు శివునియెడ నుండవలసిన అచంచలమైన భక్తి,

యోగ సాధనగూర్చియు, శిక్షణనుగూర్చియు వర్ణింపబడినది. ఆమె వ్యక్తి గత జీవితచరిత్రనుగూర్చిన వివరములనుగాని లేదా సాహిత్యమునందామెకు గల యోగ్యతలను గూర్చిగాని తెలిసికొనుటకు ఉపయోగించునట్టి భావ గర్భితమైన రచనగాదు.

## సాహిత్యప్రపంచమున అక్కమహాదేవి స్థానము :

అక్కమహాదేవి కన్నడ సాహిత్యమున ప్రప్రథమ కవయిత్రి అని నిశ్చయముగా మనము చెప్పలేకపోయినను, ఆమె ఆ సాహిత్యమున నగ్ర గణ్యురాలైన కవయిత్రి యని చెప్పుటలో సందేహ మేమియును లేదు. కాంతి ప్రాచీన కవయిత్రి కావచ్చును. కొంతమంది శివభక్తురాండ్రు సాహి త్యాభివృద్ధికి ముందుగనే పద్యములు వ్రాసియుండవచ్చును. కాని అక్క మహాదేవి రచనలు మాత్రము ఉన్నతమైన కవిత్వముతో నిండియుండును. (Experience of Siva). ఆమె కవిత్వము వృక్షము పుష్పించినట్లుగా నుండును. శివానుభవముకొఱకు ఆమె పొందిన గాఢ వేదనయనెడు అగ్నియందు తప్తమై శుద్ధమైన మేలిమిబంగారమువలె ఆమెరచనలు ప్రకా శించుచుండును. ఆమె రచనలు అగ్రస్థాయికిచెందిన సాహిత్యప్రమాణ మును కలిగియున్నవి. ఒక బసవన్న ప్రవచనలలో తప్ప మిగిలిన కవిలోక మునకు, అనితరసాధ్యమైనట్టి సాహిత్యదర్పమును, ఉత్తమ భక్త్యుద్ఘాటన మును ఈమె రచనలయందు కన్పించును. చెన్నబసవరాజ ప్రవచనము అను గ్రంథము ఆమెనుగూర్చి యిట్లు చెప్పుచున్నది. "అక్కమహాదేవి సూక్తి ఒక్కటియే చాలామంది శివశరణుల సూక్తులకు సమానము.

## అక్కమహాదేవి సూక్తి :

ఓ చెన్నమల్లికార్జునప్రభూ ఆలింపుము.

ఈ ప్రపంచమున జన్మించితిమి కావున మనకు దూషణ భూషణ తిరస్కారాదు లేవి సంప్రాప్తించినను కోపము తెచ్చుకొనక ప్రశాంత ముగా నుండక తప్పదు.

పర్వతాగ్రమున నివసింపగోరి అచట గృహనిర్మాణమును గావించుకొని క్రూరమృగములకు భయపడిన ప్రయోజన మేమి ?

సముద్రతీరమున ఇల్లుకట్టుకొని సముద్రతరంగములకు భయపడిన ప్రయోజనమేమి ?

సంతబజారున ఇల్లుకట్టుకొని నివసించుచు రణగుణధ్వని అధికమని చెవులుమూసుకొనుటచే లాభముకల్గునా ?"

శ్రేష్ఠమైన ఆమె ప్రవచనములు సహజమైన అలంకారములతోడను, కల్పనలతోడను నిండియుండును. శ్లేషోత్ప్రాణితమైన ధ్వనికూడ యున్నది. సజీవచైతన్యముతో తొలుకాడు ఈ కవితాశక్తి ఆమెకు సహజోత్పన్న మైనది. ఆమె రచనయందుగల ఈ విశిష్టతయే ఈనాటికిని ప్రజలను ఆమె రచనలను అభిమానించునట్లు చేసినది. ఆమె సూక్తులు కొన్ని నిర్ణీతమైన రాగములలో పాడుకొనుటకు వీలుగనుండును. సులభగ్రాహ్యమగు ధోరణిలో, సుకుమారశయ్యతో వర్ణించిన ఆమె రచనలయందు సహజకోమల మైనట్టియు, భక్తిపూర్ణమైనట్టియు మానసికానుభవములు చాలా సున్నితముగా వర్ణింపబడినవి.

"అళిసంకులమా ! మాకందమా ! పండువెన్నెలా ! పరభృతమా ! మిమ్ము, మిమ్మునందరను ఒండు వేడెదను. నా యొడయడు చెన్నమల్లికార్జునదేవుని కాంచిన పిలచిచూపరే."

"ఆకలికి భిక్షాన్నము లున్నవి. తృష్ణయౌనెడ చెరువు, వాగు, బావు లుండె, పడకకు పాడుదేవళంబులుండె, చెన్నమల్లికార్జునయ్యా తోడునీడయైయుండె. ఏరునులేనిదాననంచు హడలి, కలతచెందనేల ? ఏమి చేయనెంచినను నేను బెదరుదానగాను. లేజివురుల మెక్కుచు నేనుంటిని, తీవచుట్టమీద నొరగి నేనుంటిని. నిప్పు నిప్పు రాచుకొన్న నాకు క్షుధాతృష్ణ లడగెనందును. మిన్ను విరిగిపడిన నాకు మజ్జనంబు జరిగెనందును. మీద కొండ కూలుచో పూలు బడినవంచు నెంతును. చెన్నమల్లికార్జునయ్యా తల పగిలికూలుచో అసువులు మీ కర్పింతును."

పాండిత్యప్రకర్ష గలిగిన భాషలో వైయుక్తిక మతానుభవములను ప్రభావపూర్ణముగా వర్ణించుట కామెశైలి బాగుగా తోడ్పడినది.

సంక్షేపముగా చెప్పవలెనన్నచో కన్నడ సాహిత్యమునందు అక్క శక్తిసామర్థ్యములు గలిగినట్టియు, సహజోత్పన్నమైన కవితాప్రతిభ గల్గి నట్టియు కవయిత్రి. సాంప్రదాయబద్ధమైన పౌరాణికరచన చేయకపోయి నను, అట్టి పురాణగ్రంథ రచనచేయుట కామె ఎన్నడును తలంపకపోయి ననూ, ఆమె వ్రాసిన పద్యములు కొన్ని సాహిత్యప్రపంచమున మచ్చు తునకలు కాలేకపోయిననూ, ఆమె కన్నడసాహిత్యమున ప్రధానముగా అత్యంత ప్రజాదరణముపొందిన మహాకవయిత్రియని నిశ్చయముగా చెప్ప వచ్చును.

## లింగమ్మ (1160 A. D.):

ఈమె వచనకర్తయగు హడప దప్పన్న భార్య. చెన్నమల్లేశ్వరుని శిష్యురాలు. దాదాపు 101 సూక్తులు ఆమెవిగా చెప్పబడుచున్నవి. "అప్పన్నప్రియ చెన్నబసవన్న" అనునది ఆమె రచనల ముద్ర. ఉత్తమమైన శివజ్ఞానానుభవమునందు ఆమెకుం గల అచంచల భక్తి విశ్వాసములచే సామాన్యగృహిణియైనను, ఆమె పరిపక్వతను బొందినది. తన ఆధ్యాత్మిక గురువుల కరుణయు, వయోవృద్ధులైన శివభక్తులయొక్క కటాక్షానుగ్రహ ములు సిద్ధిని వాంఛించువారి కుండవలసిన వినమ్రభావము, మానసిక పవి త్రత, శివునియెడ నిజమైనభక్తి చూపనివారియెడ ఆమెకుగల కోపాతి శయము, ఆత్మసాధనలయం దుండవలసిన విశుద్ధజీవనప్రవృత్తి, శివతత్త్వము యొక్క గొప్పతనము, మతజీవితమునం దామెకుగల వ్యక్తిగతానుభవ ములు మొదలగునవి ఈమె రచనావస్తువులుగా నున్నవి. ఆమె పదముల కూర్పు శైలి సులభమును, నిరాడంబరమునై యున్నది. ఈమె రచన ములు గురులింగజంగములయెడ ఈమెకుగల భక్తిని విశదపఱచును. అలం కారయుతమైన భాగములును కొన్నిగలవు. కాని ఈమె సూక్తులయందు కవితాధర్మము చాల తక్కువగా కన్పించును. ఆమె ఉపయోగించిన

రూపకాలంకారములలో నూతనత్వములేదు. సమకాలీన రచయితలశైలి ఈమె శైలియందు ప్రతిబింబించుచుండును. చాలా కొద్దిసూక్తులుమాత్రమే శక్తిమంతములును, ప్రతిభావంతములును నైనవి.

## రాణి మహాదేవి (About 1160 A. D.) :

ఈమె మోలిగె మారయ్య ధర్మపత్ని. ఈ భార్యాభర్త లిరువురును (ఈ రాజు, రాణి) రాజ్యమును త్యజించి, వీరశైవము నవలంబించి, ఆ కాలమున వీరశైవమతమున కాటపట్టయిన కళ్యాణి పట్టణమున ప్రవేశించిరని చెప్పబడుచున్నది.

సుమారు 69 వచనములు ఆమెవిగా చెప్పబడుచున్నవి. "ఎన్నయ ప్రియ ఇమ్మడి నిష్కళంక మల్లికార్జున" అను ముద్రను ప్రతిసూక్తి చివరను ఆమె ఉపయోగించినది. వీరశైవమతము నందున్న కొన్ని క్లిష్టసిద్ధాంతములను తన రచనలయందు వ్యాఖ్యానించుటచే తనకాలమందు ఆమె గొప్ప (వేదాంతినిగా) తత్త్వవేత్త్రిగా పేరుపొందినట్లు కన్పించుచున్నది. ఆరుదశల ప్రకృతిగూర్చియు, భక్తి, చైతన్యము, జ్ఞానములయొక్క స్వభావమును గూర్చియు, గురులింగ జంగములయెడ నుండవలసిన అచంచలమైన భక్తిని గూర్చియు, శివాద్వైతమునెడ అచంచలమైన విశ్వాసమును గూర్చియు, శివపూజావిధానము మొదలగు విషయములగూర్చియు ఆమె ప్రామాణిక రచనచేసెను. శివాద్వైత తత్త్వాదర్శమును గుర్తించుటయందు ఆమె తనభర్తకు సహాయముచేసినట్లుగా అనేకసాక్ష్యములు కాన్పించుచున్నవి.

అక్కమహాదేవి రచనలయందు భావావేశతీవ్రత మహాదేవి రచన సూక్తులయందు కాన్పింపదు. అక్కమహాదేవిది భక్తిమార్గముకాగా, రాణి సాధన జ్ఞానమార్గమున సాగినది. ఈవిధమైన సాధనయందు ఈమె ముక్తాయక్కను పోలియున్నది. ఏది యెట్లున్నను ముక్తాయక్క తార్కికురాలివలె వ్రాయగా రాణిమహాదేవి ద్రష్ట్రివలె రచన సాగించినది. కనుక భావావేశమే రచనలయందు చాలా తక్కువ. ఇది ఇట్లుండగా ఈమె గ్రంథములు బరువైన వేదాంతచర్చలతో నిండియుండును. ఈమె రచనలలోని కవిత్వ

ధర్మమంత ఉన్నతమైనది కాదు. అయినను ముఖ్యముగా మతసిద్ధాంతము లను బలపరచునిమిత్తమై వాడిన కొన్ని శబ్దార్థాలంకారముల పునరుక్తి మన హృదయములకు కొంత సంతృప్తినిచ్చును. ఆమె రచనయందు అనుకరణ విధానమును బాగుగా గుర్తింపవచ్చును. అయినను నూతనత్వము, ప్రత్యేకత, ఔచిత్యము, హాస్యము కన్పించును.

## అక్కమ్మ (About 1160 A. D.) :

ఈమె ధాన్యమును ఏరుకొని జీవించు మారయ్య భార్య. ఈతడు కడు బీదవాడు. అందువలన అతడు ప్రతిదినము శివభక్తుల యిండ్లకు వెళ్ళి అచ్చట వారి ఇండ్లలో నేలమీద చెల్లాచెదురుగా రాలిపోయిన ధాన్యమును ఏరుకొని వానితో భుక్తి గడుపుకొనెడివాడు. 'శూన్యసమ్పదనె' అను గ్రంథమునం దీమెవి 24 సూక్తులు కన్పించు చున్నవి. ఆ సూక్తులలో చివరి పాదము 'మారయ్య ప్రియ అమరేశ్వరలింగ' అను ముద్రగానున్నది.

శివానుభవము కొఱకై విధించబడిన ఆచారకాండ నామె చాలా నిష్కర్షగా అనుసరించెడిదని ఆమెసూక్తులనుబట్టి మనకు తెలియుచున్నది. ఆధ్యాత్మిక సాధనయం దంతగా పురోభివృద్ధి చెందని తన భర్తకు కూడ ఆమె సహాయముచేసినట్లు గోచరించుచున్నది. భర్తను విధ్యుక్త ధర్మప్రేరితుని చేయుట, శరీరక శ్రమయందు, స్వార్ధపరత్వము లేకుండుట, క్రమశిక్షణా పద్ధతి, భక్తియొక్క ప్రకృతి, మనఃపూర్వకమైన విధేయత, వైవాహిక జీవితాదర్శములు, జీవితమునందలి వైరాగ్యముల పవిత్ర భావన మొదలగు అంశము లీమె సూక్తులలో వర్ణింప బడినవి.

సాహిత్యదృష్టిని ఆమె సూక్తులంత గొప్పవి కాకపోయినను, మత దృష్టిని శ్లాఘింప దగినవే. సరళములును, మనోహరములును నైన దృష్టాంతాలంకారము లిందు విస్తృతముగా కలవు. కఠిన శైలికాక పోవుట చేతను, క్లిష్టమైన వేదాంత విషయముల నీమె వ్యాఖ్యానింపక పోవుట చేతను, ఈమె సూక్తులు సులభగ్రాహ్యములై చదువుటకు మిక్కిలి అనువైనవిగా నుండును.

## ముక్తాయక్క (About 1160 A. D.) :

ఈమె శివభక్తుడైన అజగన్న సోదరి. అజగన్న మరిణించిన పిదప ఈమె శోకసముద్రమున మునిగి శోకింపసాగెను. అట్టి సమయమున అల్లమ ప్రభువామెను కలిసికొని ఓదార్చుటకు ప్రయత్నించెను. ఆ ప్రేరణతో ఈమె రచన సాగెనేమో ?

సాడంబరమైన శయ్య, అలంకారముల విస్ఫూర్తి, కేవల భావావేశములకంటె, తార్కిక వాదమునందును, వేదాంత జ్ఞానమునందును ఆమెకు గల నైపుణ్యము ఆమె రచనలయందు ప్రముఖముగా కన్పించును. అంతియేగాక చదువరుల అభిరుచిని రేకెత్తించునట్లుగా నుండును. 'శూన్య సంపదనె' యందామెవి 24 సూక్తులు కలవు. (కర్ణాటక చరిత్రకారుడును అజగన్నది అని చెప్పబడు ఒకానొక సూక్తి ఈమెదేనని అభిప్రాయపడు చున్నాడు) ఆమె సూక్తుల యందలి చివరిపాదము (ఎన్న) అజగన్న అను ముద్రతోగాని (ఎన్న) అజగతండె అనుముద్రతో గాని యుండును. ఈమె ప్రతిభను అక్క మహాదేవి ప్రతిభతో పోల్చుటకు ప్రయత్నించిరి. కాని ఈమె రచనలయందు కవితా ధర్మము చాలా తక్కువగా నున్నది. ఒక అంశమును వాదించుట యందామె శక్తి సామర్థ్యములు సరియైన భావమునకు, అర్థమునకు తగిన పదముల నెన్నుకొనుట యందలి నేర్పు, భావ ప్రగాఢత చాలా ఉన్నత ప్రమాణములో నుండును. ఈమె సందర్భమునకు తగిన ఉదాహరణ నీయగలదు. ప్రధానముగా వేదాంతినియేగాని కవయిత్రి గాదు.

## సత్యక్క (About 1160 D.A.) :

షిమోగాజిల్లా యందలి షికారపుర తాలూకాలోని హిరెజమ్బూర్ ఈమె స్వస్థలము. శివభక్తుల ఇండ్లకు వెళ్ళి కసవూడ్చి ఆద్వారా ఆమె జీవనమును గడపుకొనెడిదని తెలియుచున్నది. భగవంతునియం దామెకు గల అచంచల విశ్వాసమును గూర్చి 'కథాసూత్ర రత్నాకర' అను గ్రంథమునం దొక కథ గలదు.

ఈమెవి ఇరువది నాలుగు సూక్తులు ముద్రింప బడినవి. ఆఖరి పాదము 'శంభుజక్కేశ్వర' ముద్రతో నుండును. ఈమె భావముల యందు, తద్వ్యక్తీకరణములయందు అక్కమహాదేవి (రచనల) ప్రభావము కన్పించుచుండును. అక్కమహాదేవి వలెనే ఈమె కూడ "భర్తరాలే భార్య, శివుడే భర్త." అను నాదర్శమును విశ్వసించి సాధన చేసెను. అంతియేకాక ఆమె శివునే తన భర్తగను, సర్వస్వముగను తలంచెను. తన ప్రభువైన శివునకిట్లామె తన్నుతా నంకితము చేసికొనినది. ఆమె ఆత్మ ఎంత పవిత్రమైనదియు ఈమె రచనలవలన మనకు విస్పష్టమగు చున్నది. మధ్యభాగమున ముఖ్యముగా శివస్తోత్రము చేసినను, తన ప్రభువైన శివుడామె నుపేక్షచేయుటచే ఆమె నిందించిన నిందలే ఈ సూక్తులలో ఎక్కువగా కన్పించును. ఆమె శైలి సరళమును ప్రభావపూరితమునై కొన్ని సందర్భములలో సాహితీ సౌందర్యమును ప్రదర్శించుచుండును.

## నీలలోచనె (About 1160 A. D.) :

ఈమె నీలమ్మ, నీలలోచనె యమ్మ, నీలాంబిక అను విభిన్న నామములతో పిలువబడినది. ఆమె బసవన్నకు రెండవభార్య 'సహస్ర గణనామములలో ఈమె పేరుకూడ చేర్చబడినది. కూడల సంగమమువద్ద బసవన్న లింగైక్యము చెందగనే, నీలాంబిక తన అరచేతిలోని లింగముతో నైక్యమును పొంది ఇహలోకమును వీడినట్లుగా 'శూన్యసంపదనె'లో చెప్పబడినది. శూన్య సమ్పదనె యందీమెవి 13 సూక్తులు కలవు. ఆఖరి పాదములు 'సంగయ్య' ముద్రాంకితమై యుండును. 'ప్రసాద సమ్పదనె', 'కాళజ్ఞాన' అను రెండు గ్రంథములను కూడ ఈమె వ్రాసినట్లు విశ్వసింపబడు చున్నది. ఏది ఎట్లున్నను, ఈ రచన లిప్పుడు లభించుట లేదు. "నీలమ్మన స్తోత్ర' 'నీలాంబికా పంచవింశతి', 'నీలమ్మనత్రివిధి' అనునవి ఆమెనుగూర్చి ప్రశంసా పూర్వకముగా వ్రాయబడినవని కర్ణాటకకవిచరితె చెప్పుచున్నది. అందు ఒక్కటికూడ ముద్రింపబడినట్లు కన్పించుట లేదు.

ఆమె సూక్తుల సారాంశము : బసవన్న ప్రథమ భార్యయగు నీలలోచనెకు అతడు తన లింగైక్యమునకు ముందుపంపిన సందేశము లింగైక్య

మును పొందగలనని నీలలోచనె అప్పన్నకు పంపిన సందేశము, బసవన్న మరణముపట్ల ఆమె దుఃఖము, చెన్నబసవన్నతో తారసిల్లిన తరువాత ఆమెయొక్క నిర్యాణము. ఇవియన్నియు హృదయమును కదలించి వేయును. సరళమైన శైలియమకములు, అనుప్రాసలు చాలా మనోహరముగా తీర్చిదిద్దబడినవి. అయినను ఈమె రచనలయం దంతగొప్ప సాహిత్య ధర్మము కానరాదు.

## అక్కనాగమ్మ (About 1160 A. D.) :

ఈమె నాగాయక్క, నాగలాంబికె, అక్కనాగలె అని వివిధనామములతో పిలువబడెను. ఈమె బసవన్న సోదరియు, చెన్నబసవన్న తల్లియును. ఈమె బసవన్నతోపాటు కళ్యాణి పట్టణమున నివసించెడిదని చెప్పబడుచున్నది. 'శూన్యసమ్పాదనె' యందు ఈమె సూక్తులు కొన్నికలవు. ఆఖరు పాదములు "బసవన్న ప్రియ చెన్నసంగయ్యా" అను ముద్రతోనున్నవి.

బసవన్న, చెన్నబసవన్న, అల్లమ ప్రభువుల యెడ ఈమెకు చాలా గౌరవము కలదు. ఈమె వచనములలో వారియెడ తన కృతజ్ఞతాభావమును కనబఱచినది. బసవన్న నిర్యాణసమయమున, ఆమె తీవ్రభావావేశమునకు లోనైనది. అప్పటి ఆమె భావములన్నియు ఆమె సూక్తులలో సరళముగను, సహజముగను వ్యక్తీకరింపబడినవి. కావున అవి హృదయమును చాలా గాఢముగా కదలించివేయును.

## గొగ్గవ్వె (About 1160 A. D.) :

ఈమెవి ఆరు సూక్తులు ప్రకటింపబడినవి. ఆఖరిపాదములు "నాస్తి నాథ (Nasti Nadha)" ముద్రతోనున్నవి. శివపూజావిధానమందలి క్రమశిక్షణ, భక్తుల జీవితచరిత్రలు; స్త్రీ పురుషులమధ్య అక్రమసంబంధమునకు దారితీయు ఆకర్షణలు ఇవియన్నియు ఆమె రచనయందలి విషయములు. భావవ్యక్తీకరణమునందు సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న ప్రభావము స్పష్టముగా కన్పించుచున్నది.

## రాయమ్మ (About 1160 A. D.):

ఈమె రాయసద మంచన్న భార్య. ఈమె బహుశః అముగిదేవుని శిష్యురాలు కావచ్చును. ఈమె సూక్తులు మూడు ముద్రింపబడినవి. ఆఖరి పాదములు "అముగేశ్వరలింగ" ముద్రాంకితముగా నున్నవి. లింగము శివునకు ప్రతికృతిగావున, లింగము ధరించినవారికి పునరుపదేశ మనవసరము. ఉపదేశము పామరులకు మాత్రమే. జ్ఞానప్రాధాన్యము, శరణార్థికిని శంకరునకు గల అనుబంధమును ఆమె సూక్తులలో ప్రతిబింబించుచుండును. ఆమె ఉదాహరణములు సూటిగను, హృదయమును స్పందించునవిగను, చమత్కారభరితముగను నుండును. ఆమె సూక్తులయందు సాహిత్యధర్మము చాలా గొప్పగానుండును.

## రెమ్మవ్వె (About 1160 A. D.):

ఈమెనుగూర్చి మనకంత ఎక్కువగా తెలియదు. ఈమె రచనలగు రెండుసూక్తులు మాత్రమే ముద్రింపబడినవి. చివరిపాదములు "ఆచారవె ప్రణవద రామేశ్వరలింగ" అను ముద్రతోనున్నవి. శైవమతానుయాయుల సదాచారము, నడవడికల గూర్చి యొకటియు, వంచనాప్రవృత్తిపై కఠిన విమర్శతో రెండవదియు రచియింపబడినవి. శైలి చాలా సరళముగను సులభగ్రాహ్యముగను నుండును

## బొంతలదేవి (About 1160 A. D.):

ఆమె నిజనామము నిజదేవి (Nijadevi). బొంతదేవి, బొంతలదేవి అని కూడ పిలువబడెడిది. తొలుదొల్త ఆమె యొకరాణియనియు, కాని కాలక్రమమున ఆధ్యాత్మిక తత్త్వముయొక్క విలువల ఘనతను అన్వేషించుటకై ఆమె రాణిపదవిని త్యజించి అక్కమహాదేవివలె శరీరచ్ఛాదనము లేకుండగనే కల్యాణి కేగెనని చెప్పబడుచున్నది. శైవవిప్లవానంతరము కూడ ఆమె కల్యాణిలోనే నివాసమేర్పరచుకొనినది. 'సహస్రగుణనామ' యందీమెపేరు వ్రాయబడినది. ఈమె సూక్తులు రెండు ముద్రింపబడినవి. చివరివాక్యములు "బీదది" ముద్రతో నున్నవి. భగవంతుడు మనల నను|గ

హించినపుడు కులభేదములు సమసిపోవునని ఒకసూక్తి చెప్పుచున్నది. భగవంతుడు మనకు జీవరాశి గూర్చి అంతయు సవివరముగా తెలుపునని రెండవసూక్తి తెలుపుచున్నది.

## కదిర కాయక్కగారి రెమ్మెవ్వె (About 1160 A. D.) (Remmevve of Kadira Kayakka):

బట్టలునేయుట ఈమె వృత్తి. ఈమె సూక్తులు మూడు కనుగొనబడినవి. రెండు మాత్రము అచ్చువేయబడినవి. ఆఖరిపాదములు "కదిర రెమ్మిరయొధేయ గుమ్మేశ్వరు" అను ముద్రతోనున్నవి. భక్తితో శివతాదాత్మ్యమును పొందుట ఒక్కొక్కపరి తన వృత్తికి కూడ ఆటంకము కలుగుచుండెడిదని ఆమె ఒకసూక్తిలో చెప్పుకొనినది. శివునకును శివశరణుల కును నడుమగల సంబంధమును రెండవదిగ తెల్పుచున్నది.

## వీరమ్మ (About 1160 A. D.):

ఈమె శైవసూక్తులు రచించిన దాసరయ్య భార్య. ఈమె సూక్తులు రెండు ముద్రింపబడినవి. ఆఖరి వాక్యములు "గురుశాంతేశ్వర" ముద్రతో నున్నవి. ఆచార కర్మకాండలను విసర్జించినవారితో వేరుగా ఉండవలసిన ఆవశ్యకతను గూర్చి ఒకసూక్తి తెలుపును. రెండవది పాదోదక ప్రసాదము యొక్క ప్రాముఖ్యమును గూర్చి తెల్పును.

## రేచవ్వె (About 1160 A.D.):

ఈమె కాలకూటయ్య ధర్మపత్ని. ఒకసూక్తి మాత్రమే ప్రచురింపబడినది. ఆఖరిపాదము "కుంభేశ్వర" ముద్రతో నున్నది. శైవాచరణ కర్మకాండలను విసర్జించినవారితో శైవమునందు విశ్వాసమున్నవారు కలియ కూడదని ఈమెసూక్తి హెచ్చరించును.

## కొట్టనాద సోమవ్వె (About 1160 A. D.):

ఈమెనుగూర్చి మన కెక్కువగా తెలియదు. వడ్లుదంచి జీవితమును గడుపుకొనెడిది. ఆమెది ఒక్కటే ఒక్కసూక్తి ముద్రింపబడినది. ఆమె

ముద్ర "నిర్లజ్జేశ్వర" శైవాచారములను త్యజించినవారితో యెవరునూ కలియరాదను అంశముపైననే ఈ సూక్తియందు ముఖ్యముగా వర్ణింపబడినది. భాష సరళమును, తిన్నని శైలిలోను ఉన్నది.

**లక్ష్మమ్మ (About 1160 A. D.) :**

ఈమె బిజ్జలుని ఆస్థానముననున్న కొండెయ మంచయ్య భార్య. ఆమెసూక్తి ఒకటి ప్రచురింపబడినది. ఆమెముద్ర "అజగేశ్వరలింగ". ఇందు శివపూజావిధానము వర్ణింపబడినది.

**ఇమ్మడి కాలవ్వ :**

సిద్ధబుద్ధయ్య భార్య. ఈమెది ఒక్క వచనముమాత్రమే అచ్చయినది. చివరిపంక్తిలో భీమేశ్వరుని నామము కలదు.

**కాలవ్వ :**

ఈమె వడ్రంగి బసవయ్య భార్య. ఈమె రాతినుండి పాలుపిండి శివార్పణము చేసినట్లుగా గాధకలదు. ఈమె వచనమొకటి అచ్చయినది. ఈమె ముద్ర "కర్మహరకాళేశ్వర". ఈ వచనము శివార్చన విసర్జించిన వారితో సాంగత్యము పనికిరాదని వ్రాసినది.

**ముమ్మడి కాలవ్వ (About 1180 A. D.) :**

సూక్తిరచయితయగు ఉరిలింగపెద్ది భార్య. ఈమెసూక్తులు రెండు అచ్చువేయబడినవి. చివరిపాదము "ఉరిలింగపెద్దిగలవాస" (Uri-Linga-Peddigalavasa) అను ముద్రతో నున్నవి. ఆచార కర్మకాండల ఆవశ్యకతలను గూర్చి ఒకటియు, భక్తిహీనుల లక్షణములనుగూర్చి రెండవదియు తెల్పును.

A (i) సూక్తిరచయిత్రుల నామములు (ఇంకను కనుగొనబడని సూక్తులు) ప్రతిసూక్తి చివరియందును వారువారుపయోగించిన ముద్రలు ఈ క్రింద నీయబడినవి. (కర్ణాటకకవి చరితెనుండి) :

(1) రేచమ్మ - అద్దములు తయారుచేయు వృత్తి - ముద్ర - 'సద్గురు సంగనిరంగలింగ'.

(2) గంగమ్మ - ముద్ర - 'గంగేశ్వరలింగ'.
(3) గంగాంబికె - (బసవన్న మొదటి భార్య) - ముద్ర - 'గంగప్రియ కూడల సంగమదేవ'.
(4) మహాదేవి - ముద్ర - 'మహాదేవి జ్యోతిర్లింగ'.
(5) సువర్ణాదేవి - ముద్ర - 'సువర్ణలింగ'.

(ii) (లింగావతార అమరకృతిగళు మధులింగ వంతకవిగళు నుండి)
(1) కదిరకాయ కాద కాలవ్వె - 'గుమ్మేశ్వర'.
(2) శాంభవీదేవి - 'శాంభవలింగ'.
(3) సుందరనాభి - '(శ్రీ) గురుసోమలింగ శర్వాణిసౌందరి'.
(4) కేతలదేవి - 'కురంగేశ్వరలింగ'.

B. కొన్నిసూక్తులు వాటి చివరిపాదములలో ఉట్టంకించబడినవారి పేర్లు కనుగొనబడినవి. కాని రచయిత్రుల నిజనామములు ఇప్పటికిని అజ్ఞాతముగనే యున్నవి. అట్లే చివరిపాదములలో వ్రాయబడినపేర్లు కొందరివి మాత్రమే తెలియుచున్నవి. కొన్నిచోట్ల సూక్తులు తద్రచయితలు గూడ అజ్ఞాతముగనే యున్నారు. ఈ రెండు తరగతులవారి యందునుగూడ స్త్రీ రచయితలు చేర్చబడిరో లేదో నిశ్చయముగా తేలవలెననునది ఇంకను పరిశీలనార్హమైన విషయము.

C. పాల్కురికి సోమనాథుని (About 1195 A. D.) సహస్రగణనామ, హరిహరుని లింగార్చనె రాగళె (About 1200 A. D.) బసవలింగని శివాధిక్యపురాణ (About 1611 A. D.) తోంటాదరాయుని పాల్కురికి సోమేశ్వర పురాణ మొదలగు కొన్ని రచనలయందు కొంతమంది శివశరణురాంద్ర నామములు వారియెడ గౌరవభావముతో చెప్పబడినవి. వారేమేమి వ్రాసిరి అను విషయము తెలిసికొనవలెనన్నచో ఇంకను జాగ్రత్తగా పరిశీలనలు జరుగవలెను.

D. బిజ్జలదేవి (About 1160 A. D.) :

ఈమె కొన్నిరచనలు చేసియుండునను భావముతో 'కర్ణాటక కవి

చరిత్ర' యందు (Vol. I P. 200) బిజ్జలదేవి పేరు ప్రఖ్యాతముగా వ్రాయబడినది. కాని ఆమెసూక్తి ఒక్కటియును ఉదాహరింపబడలేదు. బిజ్జలదేవి బిజ్జవ్వె, బిజ్జమహాదేవి అను నామములతో కూడ వ్యవహరింప బడెడిది. ఈమె కదిరకాయక్కగారి అమ్మవ్వెయే కావచ్చును.

13, 14 శతాబ్దములలో ఏ కవయిత్రిపేరును ఎవరును వెల్లడింపలేదు.

(15 వ శతాబ్దము)

## గుడ్డవ్వె (About 1430 A. D.) :

ఈమె బత్తలేశ్వరుని భార్య. ఆమెది ఒక సూక్తిమాత్రమే ఇప్పటికిని నిలచియున్నది. "నింబేశ్వర" ముద్రతో నున్నది. ఆచార కర్మకాండల శిక్షణయందుండవలసిన విశుద్ధ మనస్తత్వమునుగురించి ఇందు వివరింపబడినది.

## మసానమ్మ (About 1500 A. D.) :

ఎదెమతగారి నాగదేవుని భార్య. ఈ భార్యాభర్త లిర్వురును కృష్ణా నది యొడ్డుననున్న చిమ్మలాగిలో నివసించిరనియు, ఈ ఊరికివారు కంచి నుండి వలసవచ్చిరనియు చెప్పబడుచున్నది. వీరు నిజగుణేశ్వరుని శిష్యులు. మసానమ్మ వచనము రచించినది. కాని ఒక్కటి మాత్రమే ఇప్పుడు కన్పించుచున్నది. "నిజగుణేశ్వరలింగ" అను ముద్రతో ఆ వచనము అంత మగును. ఇందుశైవాచారముల నిర్వహణయందుండవలసిన ఉన్నతమైన క్రమశిక్షణను గూర్చి చాలా గొప్పగా స్తుతింపబడినది.

## రేకమ్మ (About 1500 A. D.) :

ఈమె రేవణసిద్దయ్య ధర్మపత్ని. ఒక్కవచనము మాత్రమే ఈ నాటికి నిలచియున్నది. "శ్రీగురు సిద్దేశ్వర" ముద్రతో రచనచేసినది. శైవాచారముల నిర్వహణవిధానమును ఇందు చాలా గొప్పగా వ్రాసినది.

## కలుకణ్ణి కాయమ్మ (About 1500 A. D.) :

ఈమె కూడ వచనములను వ్రాసినది. ఒకటి మాత్రమే అచ్చువేయ బడినది. "నిర్భితి నిజలింగదల్లి" అను ముద్రతో వచనము ముగియును.

ఇందుకూడ శివపూజావిధాన నిర్వహణయందలి నియమాదులే వ్రాయబడినవి.

పైన చెప్పబడిన రచయిత్రులందరును శివశరణురాండ్రే.

(16 వ శతాబ్దము)

### కాలజ్ఞాని నీలమ్మ (About 1543 A. D.) :

కాలజ్ఞానము కలిగిన నీలమ్మ ఎమ్మె బసవన్న సమకాలికురాలు. కాలజ్ఞానమును గూర్చి యొక గ్రంథము వ్రాసెను. భూమినుండి త్రవ్వి వెలికి తీయబడి ముద్రించినట్లు కన్పించుచున్నది. ముసల్మానులు 1565 విజయనగరమును ధ్వంసముచేసినపుడు నీమె కనులార చూచినదగుటచే తన గ్రంథమున ఆ సంఘటనను వర్ణించినది.

(17 వ శతాబ్దము)

### తమలపాకుల నమ్మకొను హొన్నమ్మ (About 1680 A.D.) :

ఈమె 1672 నుండి 1704 వఱకు మైసూరు రాజ్యమును పరిపాలించిన చిక్కదేవరాజ ఒడయర్ పరివారమున నొకతె. ఆమె జన్మస్థానము ఎలందూర్ అనియు, చతుర్థకులమునకు చెందినదనియు ఊహింపబడుచున్నది.

వేదవిద్య యందెక్కువ ప్రావీణ్యము గలిగినట్టియు, తత్త్వగురువును అయిన అలఘుసింగరార్య ఈమెకు ఆచార్యుడు. "మిత్రగోవింద" అను కన్నడ నాటకమునకు కర్తయగు సింగరార్యయే ఈ అలఘుసింగరార్యుడని చాలామంది పండితులు తలంచుచున్నారు. సింగరార్యుని తండ్రియైన ఈ నాటక కర్తపేరు అలఘు సింగారయ్య యనియు, ఆతడే హొన్నమ్మ గురువు అయియుండుననియు ఇంకొక ప్రథకలదు. హొన్నమ్మ విష్ణు భక్తురాలు. వైష్ణవ మతతత్త్వము నందు మంచి విజ్ఞానమును సంపాదించినది. హాది బదేయధర్మ అనుగ్రంథము ఆమె ఏకకరచన.

హొన్నమ్మ తన గ్రంథమున తనరాజును గూర్చియు, అతనియెడ తనకుగలభక్తి విశ్వాసములను గూర్చియు చాలా వివరములు తెల్పినది కాని

తన వ్యక్తిగత జీవితమునకు సంబంధించిన వివరములను ఏమియు చెప్పక దాచి యుంచినది. ఆమె కడు బీదరాలనియు, రాజాదరణ లభించిన తరువాత పైకి వచ్చినదనియు, అట్లామె ఒక స్థితికి వచ్చిన తరువాత బంధువులకును, స్నేహితులకును ఆర్థికముగాను, ఇతర విధములుగను కూడ సహాయపడు చుండెడిదనియు మాత్రమే మన మూహించుటకు వీలగు చున్నది. రాజకుటుంబము నెడ ఆమె, అత్యంతమైన గౌరవాభిమానములు, భక్తి విశ్వాసములు, ప్రేమ కలదగుటచే వారుకూడ ఆమెను ఎక్కువగా అభిమానించెడివారు. ఆమె శక్తి సామర్థ్యము లెట్టివైనను రాజకుటుంబము నకు విశ్వాసముతో సేవచేయుటయు తనయెడల అదరమునకు కృతజ్ఞతను చూపిందుటయు మాత్రమే తన అభీష్టమని ఆమె వ్యక్తీకరించినది.

హొన్నమ్మ గొప్ప విదుషీమణి. సారస్వతమున మచ్చుతునకలగు గ్రంథములను, కన్నడము నందును, సంస్కృతము నందును చదివినది. అంతేగాక వైజ్ఞానిక, చారిత్రక గ్రంథములను కూడ పఠించినది. ఆమెలోని సహజమైన ప్రజ్ఞ, ప్రాపంచికజ్ఞానానుభవము ఈ రెండును కవిత్వమున ఆమెకు శ్రద్ధాసక్తులను రేకెత్తించుటయేకాక తద్రచనా వ్యాసంగమునకు తోడ్పడినవి.

"ఉజ్జ్వల మనోహర సాహిత్యాధి దేవతగా Great Goddess of delightful Literature ఆమె గురువే రాజుముందు ఆమెను గూర్చి ప్రశంసించెను. ఈ మాటలు వినినతరువాత రాజునకు ఆమెశక్తి సామర్థ్యముల యెడ ఆనందాశ్చర్యములు కలుగగా అతడు ఆమెచే నొక కావ్యమును వ్రాయించుటకుగాను హొన్నమ్మను తమ ఆస్థానమునకు ఆహ్వానించ వలసినదిగా పట్టపురాణిని కోరెను. గొప్ప విదుషీమణియైనను, హొన్నమ్మ చాలా వినమ్ర స్వభావముగల మనిషి, కాని గుర్వాజ్ఞ వినినంతనే ఆమె గొప్ప కావ్యమును వ్రాయుటకు వెంటనే సిద్ధపడినది. హొన్నమ్మవంటి ఒక సామాన్య పరిచారిక యొక్క ప్రజ్ఞాన ప్రాభవములు వికసించుటకు చిక్క దేవరాయల ఆస్థానము బాగుగా ప్రోత్సాహ ప్రోద్బలములను నొసంగెననుట కన్నడ సారస్వతమున మరువరాని సుసంఘటన.

కావ్యమునకు ఇతివృత్తము నెన్నుకొనుటలో ఆమెయొక్క అద్వితీయమైన వ్యక్తిత్వము గోచరించునట్లుగా అపూర్వమును, భావనా భరితమునైన మార్గమును అవలంబించినది. గృహిణియొక్క విధులను వర్ణించుటయే ఆమెరచన యందలి ప్రధానోద్దేశ్యము, ఇహ లోకమున జీవితమును ఆనందమయము చేసికొని పరలోకమున ఉన్నత స్థానము సంపాదించుటకై గృహిణులను తమకు (విధింపబడిన విధులయెడ) విధ్యుక్త ధర్మములయెడ జాగరూకురాండ్రను చేయుటయే హొన్నమ్మ గ్రంథము నందున్న పరమోద్దేశము.

స్త్రీగా తనయొక్క దృక్పథములను ప్రాచీన హైందవ మహిళల ఆదర్శములను, విధులను విమర్శించుచు హొన్నమ్మ ఇంటియొద్దను, సమాజము నందును స్త్రీకిగల స్థానములను స్త్రీ విద్యావశ్యకత మొదలగు ఇతర విషయములను ఉపయోగకరమైన పద్ధతిలో చర్చించినది. హైందవ సాంప్రదాయము నందలి ఉత్తమ ధర్మములను, నీతులను అప్పటికే బహుళ ప్రచారములోనున్న కొన్ని ఆచారములతో మేళవింప జేసినది. అట్లు చేయుటలో ఆమె అనేక ప్రమాణములను చూపి తన ఉద్దేశములను యథేష్టముగా వివరించి వర్ణించినది. ఈ విషయములలో కొన్నింటికి ఆమె కచ్చితమైన విలువలతో కూడిన విమర్శ జేసినది.

ఆధునికులకు ఆమె అభిప్రాయములు కొన్ని, ప్రాతకాలపునాటివిగ నుండి రుచింపకపోవచ్చును. ఈ సందర్భమున సాహిత్య ప్రపంచము నందు ఈ కవయిత్రిని ముందునకు నెట్టిన కాలమునాటి సాంఘిక పరిస్థితులు (సారస్వతమున) ఆదర్శవాదము. సాంప్రదాయానుగుణ్యతలకుగల స్థానము మొదలగు ఇతర విషయములను మనము మరువకూడదు. ఆదర్శముల నన్నింటిని హొన్నమ్మ పుణికి పుచ్చుకొనినదను విషయమును కూడా మనము జ్ఞప్తి యందుంచు కొనవలయును. కావున ఆమెను విమర్శించుటలో మోతాదుగ నుండి ఆమె వచనములను నిష్పాక్షికముగ పరిశీలింపవలసి యున్నది స్త్రీలను గూర్చి యొసంగిన సాంప్రదాయ సిద్ధాభిప్రాయములను గూర్చిన తీక్ష్ణవిమర్శ హొన్నమ్మకూడ కావించెను.

ఆమె ఈ విషయముపై తన అభిప్రాయములను తెలియుగా తెలియ జేయుటయేగాక మూఢాచారములను తీవ్రముగా ఆక్షేపించినది. స్త్రీల విధ్యుక్త ధర్మములే ఇందు ప్రధానముగా వర్ణింపబడినను, స్త్రీలయెడ ఇతరుల కుండవలసిన అభిప్రాయములను, కూడ అపుడపుడు ఈమె చర్చించి నది. స్త్రీయెడ భర్త ధర్మములను క్లుప్తముగా యిందు చర్చించినది. ఇది సంక్షిప్తమే అయినను నిజముగా యీ గ్రంథము స్త్రీ ధర్మములను వివరించు గ్రంథమే అయి, స్త్రీ ప్రకృతిని అద్దములోవలె పట్టిచూపుచున్నది. కన్నడ సారస్వతమున నిదియొక చక్కని రచన మరియు ఆ సారస్వతమునకు అమూల్యమైన కానుకవంటిది. ఇప్పటివారు ఈ గ్రంథము నంతగొప్పగా తలంపకపోవుటలో ఆశ్చర్యమేమియునులేదు. క్లిష్ట సమస్యామయమైన ఆధునిక జీవితము, భౌతికవాదము ఒక వ్యక్తియొక్క భౌతిక సుఖసంపదలు కొఱకై ధర్మోపదేశములు చేయు భౌతికమైన, యాంత్రికమైన నాగరక జీవనము, ఇవి యన్నియు ఈ చక్కని గ్రంథమును ఉపేక్ష చేయుటకు కారణ భూతములైన వనిన ఆశ్చర్యములేదు.

హొన్నమ్మయొక్క వ్యక్తిగతజీవితము నందలి అనుభవములే ఈ గ్రంథ రూపమున వెల్వడినవాలేక ఈ విషయముపై ఈ గ్రంథము ఆమె యొక్క పాండిత్య ప్రకర్ష ఫలితమా అను విషయములను నిశితముగా పరిశీలించి విమర్శకులు ఆశ్చర్యచకితులైరి. చిక్క దేవరాయని అంతఃపుర పరిజనములో ఒక సభ్యురాలిగ నుండియు, ఆమె గృహిణిగా తన జీవితమును తీర్చిదిద్దు కొని యుండవచ్చునని డాక్టరు ఆర్. యస్. ముగలిగారు విశ్వసించు చున్నారు. ఈ విషయమునకు సంబంధించిన కొన్ని సూచనలు హొన్నమ్మ గ్రంథము నందలి ఉపోద్ఘాత సర్గమందే కన్పించుచున్నవి. కొంచెమటు ఇటుగా ఈ అభిప్రాయములే ఇదివరకు కూడ వ్యక్తీకరింప బడినవి. తరువాత ఈ పరిశీలన వ్యతిరేకింప బడినది. ఈ యంశమును గురించి పరిపూర్ణముగా చర్చించుటకిది ఏ మాత్రమును అదనుకాదు. కాని ఈ యంశముపై ఒకటి రెండు మాటలను చెప్పవలసియున్నది. హొన్నమ్మ చిక్క దేవరాయని

అంతఃపురమునకు చెందినదా లేదా అను విషయము ఆమె తన గ్రంథమున వ్రాసికొనిన విషయములను బట్టియే నిర్ణయించు కొనవలెను. ఒకవేళ నిదియే గనుక నిజమైనచో ఆమె ఏయే విషయములను తన గ్రంథమున చెప్పినది. వేటిని చెప్పకనే వదలినది అనునది తెలుసుకొనుట చాలాకష్ట తరము. ఇరు పక్షముల పండితులకును ఉపయోగపడిన అభిప్రాయములు తగినట్లుగా హొన్నమ్మ రచనలయందు కలవు. ఏది యెట్లున్నను ఈ సిద్ధాంతములను నిశితముగా పరిశీలించినచో ఇవి యన్నియు అస్పష్టములును, సందేహాస్పదములుగను ఉన్నవని గ్రహింతుము. మఱియు ఎవరికిని నిశ్చితాభి ప్రాయమును కలుగ జేయజాలవు. కావున ఆమె జీవిత మెట్టిదో నిజముగా తెలిసికొనుట చాలాకష్టము. (హొన్నమ్మ రాజాంతఃపురమునకు చెందినది కాదనియును ఆమె కేవలము ఒక ఉద్యోగిని అనియును నా అభిప్రాయము.)

కన్నడ రచయిత్రులలో హొన్నమ్మ ఉత్తమవ్యక్తి. నిస్సందేహముగా ఈమె మహిళా రచయిత్రుల సంఘమునకు సమర్థమైన ప్రతినిధిత్వమును వహించును. కన్నడ సారస్వత చరిత్ర యందు ఈమె నామము మఱువ రానిది. విషయ వివరణమునందు పరిపూర్ణమైన శక్తి సామర్థ్యములు, భావవ్యక్తీకరణము నందు చతురత ఇవి రెండును సమపాళములో మేళవింప బడియుండుట మనము కాంతుము. ఇతి వృత్తము అత్యంత గంభీరమైనను శైలి మాత్రము సులభముగను, సరళముగను నుండును. శ్లేషార్థములు గూఢార్థములు ఆశ్చర్యకరములుగ నుండును. ఇట్లే శబ్దము లన్నియు ధ్వనిని ప్రతిఫలింప చేయుచుండును. రూపకములు, ఉపమాలంకారములు వివేక వంతముగా ఉపయోగింప బడినవి. ఎక్కడైనను వాటి విషయమున స్వోపజ్ఞ ఏ మాత్రమును కన్పింపదు. కవిత్వ కళకు చెందిన ఇతరాలంకారము లిందు విస్తారముగా నున్నవి. కాని అవి కృత్రిమముగా వ్రాయబడినట్టివిగాక సహజముగ నుండును. శైలి సరళముగ నుండునే కాని ఎచటను అర్థము మఱుగుపడదు. వివేకము తోడను, నేర్పుతోడను ఉప

యోగించిన సంస్కృత, కన్నడ శబ్దజాలము రచనను సహజశోభతో తీర్చి దిద్దినవి. తార్కిక విషయ వ్యాఖ్యాన సందర్భముల యందును ఆవేశ భరిత మైన భావతీవ్రతను వ్యక్తము చేయుపట్లను విశుద్ధ కన్నడ పదజాలముల నుపయోగించుటలో హొన్నమ్మ అనితర సాధ్యమైన అసమానమైన ధైర్య సాహసములను ప్రదర్శించినది. పూర్వకాలమున ఎంతమంది కవులు ప్రియుల విరహబాధను వర్ణింపలేదు ? కాని హొన్నమ్మ వర్ణించిన ఈ విశ్వజనీన మైన రస భావసంపద కన్నడ సారత్వము నందొకింత అసమానమైనది. హొన్నమ్మ రచన అతిశయోక్తికి దూరముగా నుండి, భాషకు సహజమును, సామాన్యమునునైన జాతీయముల తోడను లయ తోడను కూడియుండును. మొత్తము మీద తేలిన సారాంశమేమనగా సున్నితమైన, మృదువైన స్త్రీల మనో భావములను ఈ గ్రంథము చక్కగా ప్రతి ఫలింప జేయును. అది ఎట్లన చదువరి వాస్తవ జీవితమున అనుభవించు తీవ్రవాస్తవిక భావముల వ్యక్తీకరణ విధానమున మిక్కిలి ఆశ్చర్యము పొందునంత నిష్కాపట్యముగా ఈ గ్రంథ రచన సాగినది. ఛందోబద్ధమైన రచన యందామెకు గలనేర్పు తగిన అలంకారములలో సరియైన పదములను ఎన్నుకొనుట యందామెకు గల తెలివి తేటలు గంభీరార్థములతో కూడి సరళములును సామాన్యము లునునైన పదములను ఎన్నుకొనుట యందలి నేర్పు ప్రశస్తమైన జాతీయ ముల యొక్క మాధుర్యము, ఇంకను ఇతి వృత్తమునందు అత్యంత తీవ్రతను కల్గించుట ఇవి యన్నియు ఈ గ్రంథమును ఆ కోవకు చెందిన వాటిలో ఉత్తమమైన దానినిగా చేయుచున్నవి.

హదిబదేయధర్మ :

ఇది సాంగత్య చ్ఛందస్సులో వ్రాయబడిన ఒక పద్యకావ్యము. ఇందు తొమ్మిది ఆశ్వాసములు, నాలుగువందల అరువది ఎనిమిది పద్యములు కలవు. ప్రతి ఆశ్వాసము నందలి ఇతివృత్తము ఈ క్రింది విధముగా నున్నది.

ఒకటవ ఆశ్వాసము : ఇష్టదైవ ప్రార్థన, మైసూరు మహారాజుల సంక్షిప్త చరిత్ర, తనపోషకులైన రాజ దంపతుల ప్రస్తుతి, ప్రస్తుత రచనకు గల ప్రేరేపణ, బాహ్యాత్వము నందలి శోభ.

2. వ. ఆశ్వాసము : గృహిణీ విధులను అవలంబించుట యందలి గొప్ప తనము, ఏకకపత్ని' అను కథమూలమున తద్విధుల నిరూపణము, వర్ణనము.

3. వ. ఆశ్వాసము : భర్తయెడ భార్యకుండ వలసిన సేవానిరతి, భక్తిభావములు, పూర్వకాలము నందలి ఆదర్శపత్నుల ప్రశంస.

4. వ. ఆశ్వాసము : పెద్దలయెడ గృహిణి నడచు కొనవలసిన విధి విధానములు, బిడ్డలను సంరక్షించుట యందలి పద్ధతులు, సజ్జనుల యెడను, ఇరుగు పొరుగు స్త్రీలను మిత్రములుగా చేసికొను విధానములు, దుష్టులను దూరముగా ఉంచుట.

5. వ. ఆశ్వాసము : స్త్రీత్వశోభ, కుమార్తెలయెడ తల్లిదండ్రుల విధి, కర్తవ్యము, తనకుమార్తె జీవితమును సుఖమయము చేయుటకు విధానములు.

6. వ. ఆశ్వాసము : సుఖప్రదమైన వైవాహిక జీవితమును నడుపు కొను మార్గములు.

7. వ ఆశ్వాసము : భార్యా, భర్త లిర్వురి ఎడబాటు వలన కలుగు విచారము.

8. వ. ఆశ్వాసము : స్త్రీ యొక్క అభివృద్ధికి తోడ్పడు దినచర్య.

9. వ. ఆశ్వాసము : స్త్రీలేమి చేయవలెను. సత్కార్యముల యందు క్రమబద్ధత, క్రమ శిక్షణ కలిగి యుండుట, భగవంతుని యందు భక్తిభావ ములు కలిగి యుండుట, ప్రాచీన వేదపురాణముల నుండి కథాశ్రవణము, ముగింపు.

## శృంగారమ్మ (1685 A. D.) :

శృంగారమ్మ శ్రీవైష్ణవ కవయిత్రి. ఆమె తండ్రి చింతామణి దేశి కేంద్రుడు ఆమె గురువు శ్రీనివాస దేశికులు లేక శ్రీనివాసా చార్యులు. మైసూరు ప్రభువగు చిక్క దేవరాయ ఒడయరు (1679-1704 A. D.) ప్రాపకములో నుండిన ఒకానొకకవి సంఘమునకు చెందినదని ఆమె తన

గ్రంథమున చెప్పుకొన్న దానిని బట్టి మనకు తెలియుచున్నది. ఆమె గ్రంథ నామము పద్మినీ వివాహము. ఇది సాంగత్య చ్ఛందస్సున వ్రాయబడినది. 189 పద్యములు కలవు. తిరుపతి ప్రభువైన శ్రీనివాసునికి పద్మినితో జరిగిన వివాహగాధ ఇందు వర్ణింప బడినది.

ఈ సమాచార మంతయు శ్రీ R. నరసింహాచారి గారిచే సమ కూర్చబడినది. ఈయన ఆమె బాల్యమును గురించిన వివరములను తెల్పుటకు ఆమె గ్రంథమునుండి రెండు పద్యములను దృష్టాంతములుగా ఉదాహ రించెను. కాని గ్రంథముగా గాని అచ్చు ప్రతిగాగాని వ్రాతప్రతిగా గాని మనకుఇంతవరకు కనబడ కున్నది.

(18 వ శతాబ్దము)

## చెల్వాంబె (ఇంచుమించు 1725 A. D) :

చెల్వాంబె తన గ్రంథమున చెల్వాజమ్మ, చెల్వాంబె అను వివిధ నామములతో తరచుగా వ్యవహరింప బడినది. మైసూరు మహారాజగు దొడ్డ కృష్ణరాజు యొక్క ధర్మపత్ని. దొడ్డేంద్ర సేనా నాయకుని కుమారు డైన యువరాజ కవిలె కాంతుని కుమార్తె; ఆమె రచనలు వరనంది వివాహము, వెంకటాచల మహత్త్వముపై (వెంకటాచల ప్రశస్తి) అలర్ మేల్ మంగప్రశస్తి, తులకావేరి యొక్క మహత్త్వముపై వాఖ్యానము, కృష్ణకర్ణామృత వ్యాఖ్యానము, వీటన్నిటి యందును మొదటి మూడును లభించినవి. కాని ఇంతవఱకింకను ముద్రింపబడలేదు. మిగిలినవి నశించినవో, పోయినవో తెలియదు. ఆమె గ్రంథము లన్నియు దొఱకి, ప్రకటింపబడి నపుడు మాత్రమే కన్నడ సాహిత్యము నందామెకు గల స్థానమును మనకు నిశితముగ పరిశీలించి చర్చించుటకు వీలగును. అపుడే ఆమె ఇతర కన్నడ కవయిత్రులతో సరితూగ గలదు.

శ్రీ R. నరసింహాచారిగారు ఆమె గ్రంథముల నుండి దొరకిన వివరములతో చదువరులకు పరిచయము కలుగజేసిరి. ఇంకను కొన్ని యంశములను మనమిట చేర్పవచ్చును.

**వరనంది వివాహము :** ఇది సాంగత్య చ్ఛందస్సులో నున్నది. ఇందు ఏడాశ్వాసములు 881 పద్యము లున్నవి. ఇది వర్ణక అనికూడ పిలువబడు చున్నది. ప్రారంభమున శ్రీ వేంకటేశ్వరస్వామి స్తుతియు, ఆమె గురువైన పరకాలగురుని ప్రస్తుతియుకలవు. తనభర్త ప్రోత్సాహము పైనను, కోరికపైనను ఈ రచన చేసితినని ఆమె చెప్పుకొనినది. తదుపరి ఆమె తన గుర్వాజ్ఞను శిరసావహించి మధురమైన కన్నడభాషలో ఈ గ్రంథ రచనను వర్ణక విధానమున రచించెననియు ఈ గ్రంథము అలర్ మేల్ మంగ శ్రీ వేంకటేశులకు అంకితము గావింపబడినదనియు చెప్పుకొన్నది. దీనిని బట్టి ఆమె అత్యంత భక్తి విశ్వాసములు గల శ్రీవైష్ణవ మతాను యాయిని యని మనకు తెలియుచున్నది. కథ క్రింది విధముగా సాగినది. ఢిల్లీ చక్రవర్తికి బిడ్డలులేరు. అందువలన అతని గృహము శోభను కోల్పో యెను. భగవదనుగ్రహము వలన సత్యభామయే వరనందిగా ఈతనియింట జన్మించినది. ఆ బాలిక అసాధారణ ప్రజ్ఞావంతురాలు. మాతృస్తన్యమునకు బదులుగా ఆమె నూనెను త్రాగెను. ఒకానొక సమయమున ఈమె భగవంతుని ధర్మపత్ని కాగలదనియు, అందువలన నీమె బ్రాహ్మణ స్త్రీల స్తన్యముచే పెంచబడ వలయుననియు ఆకాశవాణి తెలియజెప్పినది. తదుపరి వరనంది ఇతోధిక శ్రద్ధతో పెంచబడి పరిపూర్ణ యౌవనవతి ఆయెను. ఒకానొకప్పుడు చక్రవర్తి దక్షిణ దిగ్విజయమునకై దండయాత్ర వెడలిన సందర్భమున నాతడు కన్నడ దేశమునకుకూడ దండు వెడలెను. అప్పుడాతడు అందమైన చెన్నిగరాయుని విగ్రహమును, తనకొమార్తె కొరకు యదుగిరి నుండి దొంగతనముగా తీసికొనివచ్చెను. ఆమె ఆ విగ్రహ మును తన నాథునిగ నెంచెను. తదుపరి శ్రీ రామానుజాచార్యులు తన అసాధారణమైన దివ్యదృష్టిచే విగ్రహము ఢిల్లీలో నున్నదని కనుగొనెను. అపు డాతడు భక్తి ప్రపూరితులైన కొందఱు రాజులను, వారివారి సైన్యము లతో సహాతీసికొని ఢిల్లీకి వెళ్ళెను. ఇది యంతయు చూచి చక్రవర్తి భయకంపితుడై విగ్రహమునకు బదులుగా బంగారమును, ధనమును, రామానుజా చార్యుల వారికిచ్చెను. ఏమైనను సరే రామానుజుడు విగ్ర

హమునే కోరెను. కొన్ని అద్భుత చర్యలనుచేసి తుదకాతడు విగ్రహమును తిరిగి తీసికొనెను. వరనంది విశ్వస నీయమైన భార్యవలెనే తన నాధుని ననుసరించి వచ్చి చివరికా భగవంతునే వివాహమాడెను.

కధను సంక్షిప్తముగ చెప్పుటకై పద్యములు త్వరిత గమనమున సాగినవి. రచన యందలి దైవప్రేరిత జ్ఞానము, ఆవేశము, రచనా పద్ధతి అంతయు సంప్రదాయ బద్ధముగనే ఉన్నది.

అయినను ఆమెయొక్క ఆంతరంగికమైన లౌకికానుభవము మాత్రము చాల వఱకు పరిమితముగనే యుండును. వర్ణనాత్మక భాగములు అత్యంత మనోహరముగా నున్నవి. వరనంది బాల్యము, యౌవనము భర్తనుండి ఆమె పొందిన ఎడబాటు ఇవియన్నియు నందు వర్ణింపబడిన భాగములు. ఆయా భాగములు కవయిత్రి యొక్క స్వభావోక్తి వర్ణనమున కుదాహరణములు. (చెల్వాంబె చాలవరకు హొన్నమ్మచే ప్రభావితురాలైనదని హొన్నమ్మ గ్రంథము యొక్క పీఠికలో చెప్పబడినది.)

వేంకటాచల మహాత్మ్యము : ఇందు 203 పద్యములు కలవు. సూత మహాముని వేంకటాచలము యొక్క గొప్పతనమును తెల్పుకధను ఇతర మునులకు చెప్పినట్లుగా చెల్వాంబ గ్రంధ ప్రారంభమున వర్ణించినది. అట్లే విష్ణువుకూడ వరాహ రూపము ధరించి అదేకధను భూదేవికి చెప్పెను. వెంకటాచలమునకు సంబంధించిన వృషభాద్రి, శేషాద్రి మొదలగు పర్వత శిఖరములను గూర్చిన అనేక కధలు చెల్వాంబ గ్రంధమున గలవు.

ఈ పద్యములు రాగయుక్తముగా పాటలవలె పాడుకొనుటకు వీలగును. పద్యము నందలి నాలుగు పాదముల యందును ఆద్యంత ప్రాసములు గలవు. ఇందలి శబ్దప్రయోగము మిక్కిలి నేర్పుతో కావింపబడినది. మఱియు అందలి ధ్వని మాధుర్యము కావ్యమంతటను వ్యాపించిన లయ బద్ధత అన్నియు ఈ ఉత్తమ గ్రంథరచనకు మనోహరత్వమును, శోభను సమకూర్చినవి. వేదములనుండి గ్రహించిన ఉత్తమశ్రేణి కథ లిందుండుటచే స్త్రీలకీ గ్రంథము ఇంకను ఆకర్షకముగ నుండును.

అలర్ మేలు మంగస్తుతి : ఈ గ్రంథమున 35 పద్యములు గలవు. అలర్ మేలు మంగాదేవి యొక్క భౌతిక సౌందర్యమును గూర్చిన వర్ణన యిందు గలదు. దేవియొక్క సద్గుణముల పరిపూర్ణత్వమును గూర్చి కూడ వర్ణించును. లక్ష్మీదేవి యొక్క రూప సౌందర్య వర్ణన సాంప్రదాయాను సారముగా నున్నది. అందలి నిశితమేధా సంపత్తిని తెలియ పరచు పద్యములు కూడ కొన్ని గలవు.

తులకావేరీ మహత్త్వముపై వ్యాఖ్యానము : ఇది ప్రాచీనమైన అగ్ని పురాణమున సూచింపబడిన తులకావేరీ మహత్త్వముపై కన్నడ వ్యాఖ్యానము. ఇందు 30 అధ్యాయములు గలవు. ఈ గ్రంథము చెల్వాంబ యొనర్చిన పదక్రీడగా పరిగణింప బడునది మౌద్గల గోత్రీయుడైన వేంక టార్యుని కుమారుడు శ్రీనివాసుడే యీ గ్రంథమును వ్రాసినట్లుగా గ్రంథ ప్రారంభము నుండి తుదివరకు చదివినచో మనకు తెలియును.

కృష్ణాకర్ణామృతముపై వ్యాఖ్యానము : వివరములు యేమియు తెలియలేదు.

## హేలవనకట్టి గిరియమ్మ (About 1750 or 1718 A. D.) :

గిరియమ్మ బ్రాహ్మణ కవయిత్రి. క్రిపుల్సుబన్ద్ క్షేత్రము నందున్న రంగనాథుడు ఈమె కుటుంబ దైవము. మైసూరు రాష్ట్రమందలి హారిహార్ సమీపమున నున్న రాణీ చెన్నూరు ఈమె స్వస్థలము. బహుశః హారిహార్ సమీపమున నున్న కొమర్ అను గ్రామము నందు ఈమె తన బాల్యమును గడపి యుండవచ్చును. భిష్టప్ప ఆమె తండ్రి, తిప్పరస అనునాత డామె భర్త. వివాహితయైనను ఆమె వైరాగ్య జీవితమును గడపెను. మఱియు విష్ణుధ్యానము నందే తన్ను తానర్పించు కొనెను. ఆమె యొక్క గొప్ప వైరాగ్యవృత్తిని గూర్చియు, భగవత్సాక్షాత్కార మాధుర్యమును చవి చూచిన అద్భుతవ్యక్తి ఎట్లైనది అను విషయములను గూర్చియు వర్ణించు నట్టియు గాథలెన్నెన్నియో కలవు. ఆమె తన జీవితకాలమున నెన్నియో

అద్భుతములను గాంచినట్లు తెలియజేయు కథ లిప్పటికిని కూడ వ్యవహారమున నున్నవి.

ఈమె రచనలు : చంద్రహాసుని కథ. సీతా కల్యాణము, ఉద్దాలికుని కథ, పాటలు. స్తోత్రములు బ్రహ్మకోఅవంజి, గజేంద్ర మోక్షణము, గిరిపారిజాత అనునవి కూడ ఈమె వ్రాసినవే అనికొందరు పండితులందురు. ఆమె రచనలు మూడును, కొన్ని పాటలును వెలుగునకు తేబడినవి. సీతా కల్యాణము తప్ప మిగిలిన వన్నియు ముద్రింపబడినవి.

ఈమె పద్యము లన్నిటి యందును, క్రిపుల్స్బండ్ రంగనాథుని నామము పల్లవిగా చేర్చినట్లు కన్పించు చున్నది. ఈ కవయిత్రికి సక్రమ శిక్షణ యుండి యుండకపోవచ్చును. కాని ప్రాచీన సాహిత్య, మత సంబంధమైన మహా కావ్యజ్ఞానము ఆమె కున్నట్లు బాగుగా తెలియుచున్నది. ఆమె వరప్రసాదముగల కవయిత్రి. నీమె కావ్యము భాగవతకవులలో కుమార వ్యాసుని నామమును మన మనస్సునకు జ్ఞప్తికి తెచ్చును. సామాన్యమును, సరళమునునైన నైసర్గిక ప్రవృత్తి కన్నడ భాష యొక్క ముగ్ధ మనోహరత్వము, సూటియైన ఆవేశ పూరితశక్తి సామర్థ్యములు, ఆమె కావ్యమున మనము కాంతుము. ఈమె ప్రశంసా పాత్రమగు గుణసంపత్తి గల్గిన సాధు స్వభావము గల కవయిత్రి. విద్యావంతుల కొఱకును, పండితుల కొఱకును గాక సామాన్య స్త్రీ పురుషుల నుద్దేశించియే ఆమె రచన చేసినది. మోక్ష మార్గమును ప్రవేశించుటకు సహాయము నర్థించుటకు రేకెత్తించు సందేశములతో ఆమె రచనలు ముఖ్యముగా స్త్రీల నుద్దేశింపబడినవి. మఱియు అంతియేగాక ఈమె రచనలు కర్మ విముక్తి సాధనమును, భక్తి మార్గ ప్రబోధనము కల్గించు సందేశములు ఈమె కృతులయందు కలవు. మన కవయిత్రు లందరికిని ఈమె అగ్రభాగమున నిలుచున్నది.

చంద్రహాసేతిహాసము : 4 ఆశ్వాసములలో సాంగత్య చ్ఛందస్సులో వ్రాయబడిన 355 పద్యములు గల ఈ కావ్యము బహు ప్రశస్తి కెక్కినది. జైమినీ భారతము నందలి చంద్రహాసుని కథ ఈ కవయిత్రి అనుసరించిన

కథా భాగమునకు మూలము. మూలము నందలి జాతీయములనుఎత్తి ఈమె తనకన్నడ రచనయందు పదములను నిపుణముగా నుపయోగించి నది. ఇది సరళత్వమును. సౌలభ్యమును గల్గిన రచన. కథయొక్క ఇతి వృత్త ప్రణాళిక చాల సులభమైనది. మఱియు త్వరిత గమనము గల్గి యున్నది. వర్ణనలు సంక్షిప్తముగా నున్నను, చాలా గొప్పగానున్నవి. ఇతి వృత్తము మత సంబంధమైనదైనను. వ్యాఖ్యానము సారస్వత సంప్ర దాయము ననుసరించియే యున్నది. అర్థమెచటను మఱుగుపఱచబడలేదు. భాష మనోరంజకముగ నున్నది.

సంక్షిప్తముగా కథ ఈ క్రింది విధముగా నున్నది : చంద్రహాసుని తల్లి తండ్రులాతడు జన్మించిన వెంటనే మరణించిరి. ఒకదాది ఆతని పోషించినది. అచ్చటి స్త్రీలందరును ఆతనిపై దయను చూపిరి. తదుపరి ఈ యనాథ బాలుడు పెరిగి పెద్దవాడై ఏదో ఒకరోజున కుంతల రాజ్య పాలకుడుగా రావచ్చునని తెలిసికొనిన కుంతలరాజ్య మంత్రియగు దుష్టబుద్ధి ఆ చంద్ర హాసునిపై ఈర్ష్య బూనెను. అందువలన నాతడు బాలుని దూరముగా నుంచుటకై ప్రయత్నించెను. కాని దురదృష్టవశమున నాతని మాయో పాయము లన్నియు అదృష్టదేవతచే భంగపఱుబడెను. చివరకు దుష్టబుద్ధి తన కుమారుని పోగొట్టుకొనుటయే గాక తానుత్రవ్విన గోతిలో తానే పడినట్లుగా తన తంత్రముల మూలమున తానుకూడ ప్రాణములు పోగొట్టు కొనెను. దుష్టబుద్ధియు, ఆతని కుమారుడును తిర్గిజీవించుటకు ఎట్లైనను చంద్రహాసుని దయ, ఉపాసనలే కారణ భూతములైనవి. తదుపరి దుష్ట బుద్ధి చంద్రహాసుని సాంగత్యమున ప్రశాంతముగ జీవించుట నేర్చుకొనెను.

భగవద్భక్తియనెడు సద్గుణముల యొక్క మహత్త్వమును వివ రించుటయు, భగవంతునిశక్తి సామర్థ్యములను వర్ణించుటయు ఈ రచన యొక్క ముఖ్యోద్దేశము.

**ఉద్దాల కేతి హాసము :** సాంగత్య చ్ఛందస్సులో నున్న మఱియొక ప్రసిద్ధ రచన. ఇందు మొత్తము 447 పద్యములు కలవు. రామాయణకావ్య

మందలి చివరి ఆశ్వాసము ఈ కవయిత్రి మూలముగా గ్రహించినట్లు కన్పించుచున్నది. సుమారు ఇరువది ఏండ్లనాడు నాస్వస్థలము నందలి స్త్రీలందరును ఈ ఉద్దాలకుని కథను గుంపులు గుంపులుగా కూర్చొని వినుట నాకు బాగుగాజ్ఞాపకము. కాలక్షేపమునకు పుణ్యసంపాదనమునకును ఇది ఆనాటి వారికి ఉపయోగపడినది.

కన్నడ స్త్రీలకు ఏ కారణము వలననో ఉద్దాలకుని కథయనిన అభిరతిమెండు. ఈ కథ నర్థము చేసికొనుటయేమంత కష్టముగాదు. సుపరిచితములైన అనుభవము లనేకము లిందున్నవి.

సహజముగా శాంతస్వభావులును, దయాపరులును అయిన మన స్త్రీల హృదయములను హత్తుకొను నట్లుగా గృహ జీవితమున నిత్యము తారసిల్లు అనేక కష్టములు శక్తి మంతమైన శబ్దజాలముతో ఈమె వర్ణించినది. ఒక స్త్రీ కలిగియుండు సునిశిత భావ సంపదను ఈ కవయిత్రి ఇట్లు వెలిబుచ్చినది. అంతియేకాక నారీశీలము నందలి ఉత్తమత్వము యొక్క సారమును ఉన్నది ఉన్నట్లుగా ఈ గ్రంథమున చిత్రింప బడినది. చంద్రహాసుని కథయందలి పాత్రలకంటె ఇందలి పాత్ర లింకను సరళముగా చిత్రింప బడినవి. గ్రంథము నందలి సాహిత్య సౌందర్యము ఉన్నత శ్రేణిలో నున్నది. వర్ణనలు అతి ముచ్చటగా నున్నవి. గ్రంథము అనేకములగు మనోహర చిత్రములతో కూడుకొని యున్నది. సాంగత్య చ్ఛందస్సులో ఎంత ఉత్తమముగా రచించుటకు వీలుకలదో అంతసర్వోత్తమముగా నిది రచింప బడినది. గర్భిణీ స్త్రీ యొక్క సహజమైన కోర్కెలు, వనవాసము నందామె అనుభవించు దుఃఖము, ఆమె బిడ్డయొక్క ఉల్లాస భరితమైన ఆటపాటలు పరిహాస కృత్యములు, వివాహము నందుండు (ఉత్సుకత) ఉద్రేకము ఇవి యన్నియు చాలా మనోజ్ఞముగా వర్ణింపబడినవి. విశ్వజనీనమైన ఈ యనుభూతులను సరళమును, స్వాభావికమునునైన భాషలో వర్ణించుట యందు గిరియమ్మకుగల అసాధారణమైన శక్తి సామర్థ్యములు నీ గ్రంథము నిరూపించును. సంక్షిప్తముగా కథా భాగమిది.

రఘు మహారాజు అయోధ్యను పాలించెను. అతని రాజ్యమున ఉద్దాలకుడను బ్రాహ్మణుడు నివసించు చుండెడివాడు. ఆతడు బ్రహ్మచారి గనే యుండి కఠిన నియమముల నవలంబించెను. ఆతనికి సంతానము లేనందు వలన ఆతని పితరులు స్వర్గ ప్రవేశమున కనర్హులై నరకము (Dark world) నకు పోవలసి వచ్చెను. అందువలన ఉద్దాలకుడు వివాహమాడ దలచెను. కాని ఈ ముదుసలికెవరు పిల్ల నిచ్చుటకు సిద్ధపడుదురు? ఉద్దాలకుడు సత్య లోకమునకు వెళ్ళి బ్రహ్మను తనకు కాబోవు భార్యను గూర్చి తెలిసికొని తన సందేహము తీర్చుకొనెను. రఘు మహారాజు పుత్రికయగు చంద్రావతి భవిష్యత్తున తన భార్య యగుననియు. (సంతానము) కుమారుడు కలిగిన ఏడు సంవత్సరముల అనంతరము ఆమె ఉద్దాలకుని ఎదుట కన్పించుననియు ఆతడు తెలిసికొనెను.

ఒక రోజున చంద్రావతి తన చెలికత్తెలతో కలసి ఉద్దాలకుని కుటీరము నకు సమీపముచ నున్న సరస్సునకు వచ్చెను. అదే సమయమున స్వర్గ లోకముననున్న రంభ కన్పించెను. ఉద్దాలకుడా అప్సరసను చూచిన వెంటనే గాఢముగా కామ మోహితుడయ్యెను. విధియొక్క యుక్తివలన ఆతని వీర్యము తుదకు చంద్రావతి గర్భాశయమున ప్రవేశించెను. కొన్ని వారములు గడచిన పిమ్మట ఆమె తల్లికానున్నదని ఆమె తల్లి తండ్రులు కనిపెట్టిరి. అప్పుడువారు సమీపమున నున్న అరణ్యమునకు తీసుకొని వెళ్లి ఆమెను చంపవలసినదిగా ఆజ్ఞలనిచ్చి ఆమెను (చంద్రావతిని) తలవరులకు అప్ప చెప్పిరి. కాని ఆతలవరులకు ఆమెపై కనికరము కలుగుటనే ఆమెను చంప కయే విడచిపుచ్చిరి. దయాంతరంగుడగు ఒకానొకముని ఆమెను జాలి దలచి తన వద్ద ఆశ్రయమిచ్చెను. కొలది కాలమునకు ఆమె ఒక శిశువును ప్రసవించెను. ఆమె ఈ సంఘటనమునకు భయపడి బిడ్డను నదిలో వదలెను. విధి నిర్ణయాను సారముగా ఆ బిడ్డ నది కావలి గట్టున ఉన్న ఉద్దాలకునకు దొఱకెను. ఆతడా పిల్లవాడు తన కుమారుడే యని గ్రహించి పోషింప సాగెను. ఏడు సంవత్సరముల అనంతరము ఎన్నియో దేశములు తిరిగి

తిరిగి చంద్రావతి ఉద్దాలకుని కుటీరమునకు వచ్చెను. అచ్చట ఆమె తన కుమారుని గుర్తించి తిరిగి వారిర్వురు కలిసి కొన్నందుకు సంతసించెను. కాని ఆ పిల్లవాడు తండ్రి ఏమనునో అని భయపడి ఆమెకు తన కుటీరమున ఆశ్రయము నీయ నిచ్చగింపలేదు. తదుపరి ఉద్దాలకుడు తన కుమారుని వలన ఈ సంగతి యంతయువిన దానిని యితరమునులకు చెప్పెను. ఆ మునులు చంద్రావతి ననేక విధముల ప్రశ్నించిన పిదప ఆమె కథ ఉద్దాలకుడు చెప్పిన దానితో సరిపోయినదని తెలిసికొనిరి. వారి ప్రయత్న ముల ఫలితముగా రాజు, రాణి ఇర్వురును తమ రాజధాని నుండి ఉద్దాల కుని కడకు వచ్చి తమ కుమార్తెను గుర్తించిరి. అపుడు దేవతలు సాక్షా త్కరించి ఉద్దాలకుని దీర్ఘాయుష్మునిగను, చిరయౌవన వంతునిగను దీవించిరి. వారి వివాహ మత్యంత వైభవముగా జరుపబడెను. ఉద్దాలకుడు భార్యా పుత్రులతో సుఖ జీవనము గడపెను. పరలోకమున ఉత్తమ స్థానమును పొందవలెనన్నచో కుమారుడు తప్పక ఉండవలెనను హిందూ సాంప్రదా యాను సారముగా వచ్చుచున్న విశ్వాసమును ఋజువు చేయుటకే ఈ కథ ఉద్దేశింపబడినది.

సీతాకళ్యాణము : ఈ కావ్యమునందు 87 పద్యములు కలవు. ఒక పక్ష మునని పాటలని చెప్పవచ్చును. ప్రతిపద్యము "జయము, జయము" అను పదములతో పూర్తియగును. రామాయణ మందలి సీతారాముల కల్యాణ గాథను ఇది వర్ణించును. ఇందు శ్రద్ధాసక్తులను కలిగించున దేమనగా నాల్గు దినములు జరుగు వైవాహికాచార కాండ బాగుగా వర్ణింపబడినది. ఉదాహరణకు పెండ్లి కుమారుడైన రాముడు పెండ్లి కుమార్తె సీతకు పసుపు నూనె అంటుట అను ఒకానొక క్రతువును నిర్వహించుటయు రెండు పద్ధతులు : (1) రాముని పాదములకు సీతపసుపు నలదుట (2) ఈశుభ కార్యమును తిలకించుటకై కౌసల్యాదేవి అచ్చటి పేరంటాండ్రను ఆహ్వా నించుట. ఇవి అత్యంత ప్రభావ పూరితముగా వర్ణింపబడినవి. నిజముగా ఈ వర్ణనలు ఆధునికముగా నున్నవి. ఈ శుభ కార్యమును గురించిన

వివరములను విశేషములను వర్ణించుటలో గిరియమ్మ తనవ్యక్తిత్వాను భవములనే రచన యందు చొప్పించెనని మనమూహింప వచ్చును. ఇది గిరియమ్మ యొక్క గుణ విశేషము. ఇతివృత్త మేదియైనను వర్ణన యెట్టి దైనను ఆమె యొక్క ఆంతరంగికమైన వ్యక్తి గతానుభవములతో చదు వరులు తాము కూడా వాటిలో భాగస్వాములని తలంచి తాదాత్మ్యమును చెందునట్టి పరిస్థితిని ఆమె తీసుకొనిరాగలదు.

సాహిత్యము దృష్ట్యా ఎట్టి గొప్పదనమును మనము కాంచలేక పోయినను, గిరియమ్మ శాంత స్వరూపము గల వ్యక్తి త్వము మాత్రము రచన యందెల్లెడలను ప్రకాశించుచునే యుండును. భగవద్భక్తిచే ప్రేరితు రాలై గిరియమ్మ యీ పద్యములను కూర్చినది. "పండుగ దినముల యందు మన స్త్రీలు యీ పాటలను పాడుకొందురుగాక ! ఇతరులు వీటిని బాగుగా పాడు చున్నప్పుడు ఇతర స్త్రీలు విందురుగాక ! ఈ పాటలు ఔన్నత్య మును పొందుగాక ! ఇదియే కవయిత్రియొక్క సారస్వత ప్రాదుర్భావము యొక్క ముఖ్యోద్దేశమని చెప్పవచ్చును.

**పాటలు స్తోత్రములు :** గిరియమ్మ ఎన్ని పాటలను కూర్చినదో ఎన్ని స్తోత్రములను రచించినదో చెప్పుట కష్టము. కొన్ని యీమెవిగా గుర్తింపబడి ముద్రింపబడినవి కూడ అందు చాలా వఱకు ఆకస్మిక భావ ప్రేరేపణచే ఆశువుగా వ్రాయబడినట్లు కన్పించు చున్నవి. అవి రాగములు పెట్టి పాడుకొనుట కనువుగా నున్నవి. ఇతి వృత్తము (భగవంతుడైన విష్ణువు యెడ భక్తి ప్రపత్తులతో కూడినట్టిదే.) అక్కడక్కడ శివభక్తి కన్పరచు సందర్భములు కూడ గలవు. కుటుంబదైవమైన క్రిష్ణుల్సుబండ్ రంగనాథుని ఈమె సృష్టియందును, ప్రతి వస్తువునందును, చేతనా చేతన ములయందును ఎచ్చటనైనను చూడగలదు. సంపూర్ణముగా భగవంతునికి ఆత్మార్పణము గావించుకొనుట, ఆ పరమాత్మ సాక్షాత్కారమునందలి సంతోషాతిరేకము, ఆతని ప్రభావమును పునశ్చరణ గావించుకొనుట, ఆతని నామస్మరణ చేయుట, ఇవి ఆమె పాటలు, స్తోత్రములయందలి ముఖ్యాంశ

ములు. ఆయా సందర్భములపట్ల వ్యక్తిగత జీవితమునందలి సుఖదుఃఖముల వివరములను గూడ ఆమె వివరించును. ఒకానొకసందర్భమున యాత్రలను గూర్చి కొనియాడును. ఈమె ఆత్మసంతుష్టితోడను, ప్రపంచాభిమానము తోడను, సాధువుగను, ప్రశాంతముగను నుండి భగవద్విభూతిగానము ఈమె రచనలయందు మనము గాంచగలము. కొన్ని రచనలు రంగనాథుని నామముకాక ఇతర నామములతో నున్నవి. వాటిలో కొన్ని మేధా సంపత్తితోకూడ కూడుకొనియున్నవి.

## మహాలక్ష్మి (సుమారు 1750 A.D.):

ప్రప్రథమమున 1897 లోను తదుపరి 1924 సంవత్సరములోను ప్రచురింపబడిన శ్రీరామపట్టాభిషేక మను రచనయందు రచయితపేరు మహాలక్ష్మి అని చెప్పబడినది.

ఈ గ్రంథమును సవరించి ప్రచురించుటకు బాధ్యులైనవారు ఈ గ్రంథరచయిత స్త్రీయని తలంచుటచే వారీ విషయమును తమ పీఠిక యందు సూచించిరి. 'కర్ణాటకకవిచరితె' రచయితకూడ ఈ విధముగనే తలచి 18 వ శతాబ్దపు రచయితలపట్టికలో ఈమె పేరును కూడ చేర్చెను. తదుపరి యెట్లైననేమి 19 వ శతాబ్దికిచెందిన ముద్దన అను కవిచే నీగ్రంథము వ్రాయబడెననియు, ఆతడు తనతల్లి రచనగా దీనిని ప్రచారము గావించె ననియు తుదకు పరిశోధనలవలన తేలినది. ప్రస్తుత సందర్భమున కంతగా నిది పనికిరాదు గావున ఈ విషయములను లోతుగా తరచ నవసరములేదు.

(19 వ శతాబ్దము)

## సి ఆర్ చెల్లమ్మ (సుమారు 1900 A. D.):

చెల్లమ్మ బ్రాహ్మణ కవయిత్రి. ఈమె ఆంధ్రప్రదేశమునందలి కృష్ణా జిల్లాలోని ఇక్షుగ్రామము (చెరకుపల్లి) నకు చెందిన సీతమ్మ రామయ్యల పుత్రిక. వారు యల్లాప్రగడ వంశమునకుచెందిన ఆరువేల నియోగి బ్రాహ్మణులు. కవయిత్రి తండ్రియైన రామయ్య జీవనోపాధికై మైసూరునకు వచ్చెను. అచటనే చెల్లమ్మ జన్మించినది. తదుపరి కాలక్రమమున మైసూరు

మహారాణీ బాలికల పాఠశాలయందుపాధ్యాయురాలయ్యెను. హరికథామృతమును చవిచూచిన అనంతరము రుక్మిణీపరిణయమను కావ్యమును వ్రాసెను. ఇవి యన్నియు ఆమె స్వయముగా వ్రాసుకొనిన గ్రంథము నందలివే. ఆమె రచనలు రుక్మిణీపరిణయ, పారిజాతాపహరణ, రాజకళానిధి, వైరాగ్యమంజరి, ద్వాదశమంజరీ స్తోత్ర, గతికాలహరి. వీటన్నిటియందును మొదటి రెండు ప్రచురింపబడినవి. మిగిలిన గ్రంథము లేమైనవో మనకు తెలియదు.

రుక్మిణీపరిణయ : ఇది 5 ఆశ్వాసముల రచన. భామినీషట్పదీచ్ఛందస్సున వ్రాయబడినది. 1895 సంవత్సరమున మైసూరులో ప్రచురింపబడినది. రుక్మిణీ కృష్ణుల కల్యాణ మిందలి ఇతివృత్తము. కథ చిత్రాత్మకమైనది. వర్ణనలు, వ్యాఖ్యానములు సంప్రదాయానుసారముగను పూర్వుల ననుకరించినవిగను నున్నవి. కథాసంవిధానములు త్వరితగతిని సాగినవి. వర్ణనలు తీవ్రమైన ధ్వనితో కూడియున్నవి. కృష్ణునికొఱకై రుక్మిణి నిరీక్షను తెల్పువర్ణన హృదయమును స్పందింపజేయును. ఏది యెట్లున్నను ఆమె ఉపయోగించిన రూపకములు ఉత్ప్రేక్షలు అన్నిచోట్లను ఆనందదాయకములుగా లేవు. సందర్భములపట్ల శైలియందు సౌలభ్యముగల స్వాభావికత గోచరించును. శైలి ఆధునికరీతులతో సాగినది. ఛందస్సునందామెకు నేర్పు అంతగా లేకపోయినను, రచన అంత ఆకర్షకముగ లేకపోయినను, కొన్నిచోట్ల ప్రయత్నముపై వ్రాసినట్లు కాన్పించును. మొత్తముమీద శైలి సరళమును, మనోజ్ఞమునై యున్నది. కవయిత్రి కామె (రచనయందు) శక్తిసామర్థ్యములందు గర్వముకలదు. ఈ కావ్యము మైసూరునందలి శ్రీ చాముండేశ్వరీదేవికి అంకితము చేయబడినది.

పారిజాతాపహరణ : ఇది ఐదంకముల నాటకము. 1896 లో మైసూరులో ప్రచురింపబడినది. రుక్మిణీ-సత్యభామల నడుమ ప్రారంభమైన కలహ మిందలి యితివృత్తము. స్వర్గలోకమునుండి నారదుడు తీసుకొని వచ్చిన దివ్యపుష్పమగు పారిజాతము నిమిత్తముగా ప్రారంభమైన కలహ

మిది. వ్యాసుని హరివంశ మూలరచనకు యిది చెల్లమ్మ యథేచ్ఛానుసార మొనర్చిన అనువాదము.

నాటకకథాసంవిధానము, వ్యాఖ్యానముయొక్క పరిభాష ఆద్యంత ములు, అన్నియు ప్రాచీన సంస్కృతనాటకకర్తలచే ఏర్పరుపబడిన నమూ నాలనే అనుసరించినవి. నాటకమునందలి బసవప్పశాస్త్రి రచించిన కన్నడ శకుంతలను కొంతవరకు అనుసరించియుండును. పాటలు, పద్యములు సంగీత రీతులలో పెట్టుకొనవచ్చును. చాలా స్థలములయందు సంభాషణ పాటల లోనే నిర్వహింవబడియున్నది. వర్ణనలయందును, కొన్ని సందర్భముల యందును, సంభాషణలయందును స్వేపజ్ఞగాని, ప్రయత్నముగాని ఉన్నట్లు చెప్పజాలము.

## మేలుకోటె రాజమ్మ (సుమారు 1900 A.D.):

రాజమ్మ మధ్వతత్త్వమునకు చెందినది. ఈమె దూర్వాసచరిత్ర, అనంతపద్మనాభుని కథ అనువాటిని వ్రాసినట్లు చెప్పబడుచున్నది. ఏది యేమైనను ఈ రచనలు ఇంతవరకును బయలుపడలేదు, ప్రచురింపబడనూ లేదు.

## వేంకట లక్ష్మమ్మ (సుమారు 1900 A.D.):

ఈమె శ్రీవైష్ణవమతమునకు చెందినది. ఈమె జన్మస్థానము ఎన్నెహొళె కొప్పలు. 'కృష్ణపారిజాత' ఈమె రచన. ఏమైనను ఇంత వరకు ఇది కనుగొనబడలేదు.

## C. S. కామాక్షి అమ్మ (సుమారు 1900 A.D.):

ఈమెను గూర్చిగాని, ఈమె రచనలను గూర్చిగాని వివరము లేవియు తెలియలేదు. 'చంద్రావతీవిలాస నాటక' అనుదానిని ఈమె 1898 లో రచించినట్లు తెలియుచున్నది.

## Mrs. కాంప్‌బెల్ (సుమారు 1900 A.D.):

ఈమెనుగూర్చి గాని, ఈమె రచనలనుగూర్చిగాని వివరము లేవియు తెలియరాలేదు. దీనదరొట్టి (Dinada Rotti 1897) అను బిరుదము తప్ప ఇంకేవివరములు తెలియలేదు.

**కిబ్బేచల్ మంజమ్మ (1900 A.D.) :**

'వేదాంతతత్త్వసార' (1896) అను బిరుదము తప్ప ఈమెనుగూర్చి గాని, ఈమె రచనలనుగూర్చిగాని వివరము లేవియు తెలియరాలేదు.

**వెంకట సుబ్బమ్మ (సుమారు 1900 A.D.) :**

ఈమె కూర్గుకు చెందినది. ఈమె శూద్రకులస్థురాలు. ఈమె చాలా పాటలు వ్రాసినది. సిరిగన్నడ గ్రంథకర్త చరిత్రకోశమునందు ఈమెకు సంబంధించిన కొన్ని వివరము లీయబడినవి. దాని ననుసరించి ఈమె దక్షిణ కనరాలోని ఉడిపికి చెందినది. 1893 లో 'సుదర్శన' అను పత్రికయందు భగవంతుని స్తోత్రపరమైన పాట లనేకములు ప్రచురించినది. ఈ కవయిత్రి 1886 సం॥ జన్మించినది.

**శాంతీబాయి (సుమారు 1900 A.D.) :**

ఈమె ఉత్తర కెనరాకుచెందిన బ్రాహ్మణ కవయిత్రి. భగవంతుని గూర్చి అనేక గీతములు వ్రాసినది. (సిరిగన్నడయందు పుట 178) ఈమెకు చెందిన కొన్నివివరము లీయబడినవి. దాని ననుసరించి ఈమె షిమోగాలో జన్మించినది. ఈమె భర్త భక్తాళ్ నందు నివసించెను. లలితకళయందామెకు శ్రద్ధాసక్తులు గలవు. మతసంబంధమైన విషయములవైపామె మనస్సు మ్రొగ్గెను. ఆమె రచన - అభంగములు, గీతములు - 1928 లో ముద్రింపబడినవి.

(జననము 1860 - మరణము 1901.)

**హదిన రంగమ్మ (సుమారు 1900 A.D.) :**

ఈమె మైసూరునందలి నంజనగూడుకు చెందిన మధ్వమహిళ. అనేకము లగు పాటలు వ్రాసినది.

## కర్ణాటకమునకు చెందిన సంస్కృత కవయిత్రులు

**విజయాంబిక :**

(7, 10 A.D. శతాబ్దముల నడుమ ఏకాలమైనను కావచ్చును.) ఈ కవయిత్రి విజయ, విజయాంక, విజ్జిక, విద్య అను విభిన్ననామములతో పేర్కొనబడినది.

ఈమె రాజవంశమునకు చెందినదను విషయము ఈమె తననుగూర్చి వ్రాసికొనిన 'కర్ణాటరాజప్రియా' అనుదానిచే తెల్లమగును. ఈమె చాళుక్య వంశస్థుడైన చంద్రాదిత్యుని భార్య యనియు, ఇమ్మడి పులకేసి కోడ లనియు చారిత్రకవేత్త లభిప్రాయపడిరి. ఈవిషయమున చరిత్రపరిశోధకుల కేకాభిప్రాయము లేదు. ఆమె రచన లేవియు బయల్పడలేదు. 'కౌముదీ మహోత్సవము' అను నాటక మామెరచనగా పేర్కొనబడుచున్నది. అట్లే అనేకములగు సంస్కృత సుభాషితము లామెవిగా చెప్పబడుచున్నవి. కౌముదీమహోత్సవమున రాకుమారి కీర్తిమతి, పాటలీపుత్ర రాకుమారుడైన కల్యాణవర్మల మధురసమావేశగాథ వర్ణితమైనది.

## *1. గంగాదేవి :

గంగాదేవి, సంగమవంశజులును, విజయనగరపాలకులు నగు మొదటి బుక్కరాయ కుమారుడగు కంపరాయల ధర్మపత్ని. ఆమె రచన మధురా విజయము, లేక వీరకంపరాయ చరిత్రము అను కావ్యము. తన భర్తయగు కంపరాయని విజయగాథను వర్ణించు చారిత్రకేతి వృత్తముగల మనోహర కావ్య మిది.

## *2. తిరుమలాంబిక :

ఈమె విజయనగర తుళువరాజ వంశావళికి చెందిన అచ్యుతరాయ (1530–42) ల ధర్మపత్నిగా కన్పట్టును. ఈమె 'వరదాంబికా పరిణయ' మను చంపూప్రబంధమును రచియించెను. చంపూప్రబంధములను రచించిన కొద్దిమంది రచయిత్రులలో నీమె యొకతె కావచ్చును.

## రామాబాయి :

రామాబాయి స్వస్థలము మైసూరునందలి గంగమూల. ఆమె అంబా అనంతసూరి అను దంపతుల పుత్రిక. ఆమె రచనయగు లక్ష్మీశ్వర చంపూ

*1, 2 గంగాదేవి, తిరుమలాంబికలు ఆంధ్రమహారాజుల భార్యలు. వీరిని కన్నడ కవయిత్రులుగా పేర్కొనుట విచారణీయము.

— సంపాదకురాలు.

ప్రబంధము 1879-1880 లో ముద్రింపబడినది. ఈ రచనయందు అయిదు భాగములు కలవు.

## సుందరవల్లి :

ఈమె ఆధునిక కవయిత్రి. ఆమె నరసింహా అయ్యంగారి కుమార్తె. కస్తూరి రంగాచార్యులుగారి శిష్యురాలు. ఆమె రామాయణ చంపు అను ఆరాశ్వాసముల కావ్యమును రచించెను.

# కాశ్మీర కవయిత్రులు

మూలము :
ప్రొఫెసర్. జె. యల్. కీత్.
శ్రీనగరు.

అనువాదము :
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ.
బాపట్ల.

స్థూల దృష్టిని పరిశీలించినచో అతి ప్రాచీనకాలము నుండి క్రీ. శ. పదమూడవ శతాబ్దము వరకు కాశ్మీరదేశము నందలి స్త్రీలు అపేక్షణీయ మైన మహోన్నత జీవితమును గడపి యుండినట్లు తెలియుచున్నది. అందు వలన కాశ్మీర మహిళలు వివిధ సాంఘిక రంగముల యందు భారతదేశము నందలి ఇతరప్రాంత మహిళలకంటె విశిష్టమైన అవకాశములను పొంది యుండిరనికూడ చెప్పనగును. River of kings అను గ్రంథము (1935, P. xxx iii Indian press అలహాబాదు) నందు శ్రీ R. S. పండితుడు పేర్కొనినట్లు వారు సామాన్య గృహస్థ జీవితము నుండి రాజకీయ రంగమున ప్రవేశించి సర్వసత్వంత్రలై దక్షతతో గృహారామక్షేత్రాదిక మైన ఆస్తులపాలనమును స్వయముగ నిర్వహించుకొని, తమతమ సంస్థాన ములను తామే పరిపాలించుకొని రణరంగమున కురికి సర్వసైన్యాధ్యక్షు రాండ్రుగ కూడ నియమితురాండ్రై సేనలకాధిపత్యము వహించి యుద్ధము లొనర్చియుండిరి. బౌద్ధ యుగమునందు కాశ్మీర మహిళలు ఇంకను మహోన్నత స్వాతంత్ర్యము అనుభవించిరి. మధ్యయుగపు తొలిదశలో త్రిక వేదాంతమను పేరుకల శైవసిద్ధాంతమును కాశ్మీరదేశము సొంతముగ సృష్టించి నప్పుడు స్త్రీ దేవతారాధన, శక్త్యుపాసన ప్రబలుటతో కాశ్మీర మహిళలు ఇతోధిక ప్రాముఖ్యమును పొందిరి. త్రికవేదాంత పద్ధతికి చెందిన వాడును, ఆచార్యుడునైన అభినవగుప్తుడు శాస్త్రాధ్యయనము నందును, వేదాధ్యయనము నందును, యజ్ఞయాగాది కర్మకాండల యందును స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి కలదని యూదిపల్కెను. విద్యావతులు కానిచో స్త్రీలు సాంఘికముగా అనేక రంగములలో పురుషులతో పాటు

సమాన భాగస్వామినులుగా పాల్గొన లేకుండుట మన మెరింగిన విషయమే. ఇది యిట్లుండగా వేదకాలమునాటి స్త్రీలు-ముఖ్యముగా ఉన్నత శ్రేణికి చెందిన విద్యావతులైన స్త్రీలు వేదాంత చర్చల యందును, మిక్కిలి దుర్గ్రాహ్యములైన ఆత్మ విషయక గోష్ఠుల యందును, వాదవివాదముల యందును పురుషులతో సమానముగ పాల్గొనియున్నట్లు పవిత్రమైన వేద వాఙ్మయమే వాకొనుచున్నది. ఎనిమిదవ శతాబ్దమున ఆదిగురు శంకరాచార్యులు కాశ్మీరదేశమున సంచార మొనర్చుచు అనేకులగు బౌద్ధపండితులను జయించి యుండిరి. ఆ సమయమున పూజ్యుడైన శంకర భగవానుడు ఉత్కృష్టమైన వేదాంత చర్చకై కాశ్మీరలోయకు చెందిన మండన మిశ్రునితో సవాలు చేసియుండిరి. అపుడు మండన మిశ్రుడోడి పోయెననియు, విజ్ఞానవతియైన ఆతని భార్య *ఉభయ భారతి భర్తృ పక్షమున తాను వాదమునకు దిగి శంకరుల నధిగమించెననియు, ప్రజ్ఞావతియైన ఉభయ భారతి వాదమును పూర్వపక్ష మొనర్చుటకై ఆది గురువైన శంకర భగవానులు సమయాంతరమును గడువుగా కోరవలసిన వాడాయెననియు చెప్పు కథానక మొకటి కలదు.

అది యెట్లుండినను రాజ్యములను పరిపాలించిన యశోవతి, సుగంధ దేవి, డిడ్డ, కోటరాణి మున్నగు ప్రభ్వీణులును, చరిత్ర ప్రసిద్ధి పొందిన ఈశానదేవి, వాక్పుష, శ్రీలేఖ, పిల్ల, (శిల్ల) ఛద్ద మొదలైన సైన్యాధ్యక్షు రాండ్రకును, సేనాధి సతులకును, లచ్మా, హావురాగుల్ ఖాటూన్, మీరాముఖతీ. ఆదిగాగల మహామణులకును కాశ్మీరు ప్రసిద్ధి వహించినది. ఇంతేకాక గొప్పగొప్ప నట్టువరాండ్రకును, రాజ్యాంగ చతురలైన మహిళలకును ఇంకా అనేక రంగములలో ప్రశంసా పాత్రమైన ప్రజ్ఞను చూపిన మహారాజు జైనుల్లా అబ్దీన్ భార్య శ్రీఖాటూన్, శ్రీనగరమున షాహీహామదానులఖాన్ ఖాహాలను నిర్మించిన బేగం సాలిహారాణి, పాత

---

*ఉభయ భారతీ మండన మిశ్రులు రేవా (నర్మదా) తీరవాసులని శంకర విజయము. 'సంకలన కర్త్రి.'

శాలలను జమా మసీదుదగ్గర బాటసారుల యుపయోగార్థ మొక సత్రమును లఛ్మాఖుల్ అను పేరున బహుళ ధనవ్యయ సాధ్యమైన ఒక సేతుకుల్య (Equeduct) ఉదారశీలి మాలిక్ జిలాలుద్దీన్ భార్య లఛ్మా (Lachma) కాశ్మీరదేశ ప్రజలకు మిక్కిలి ప్రాపుగా నుండిన మహాయోగిని శిష్యు రాండ్రైన ఛాతేదీదీ (Thath ded-ਥਾਠਢਙ) వ్యాత్, దేహాత్ అనువారలను. ప్రార్. షరీఫ్ (Tsrar, shrif)కు సంబంధించిన షేకు నూరుద్దీన్ వారీ మున్నగు ప్రసిద్ధ మహిళ లందరకు కాశ్మీరు దేశమే మాతృభూమియై యున్నది.

కాశ్మీరదేశమున హైందవ రాజ్య వైభవదశ ఉచ్చస్థితి యందుండి నప్పటి సాంప్రదాయిక సంస్కృత భాషా వైభవము ముస్లిం యుగ ప్రారంభము నందలి సుల్తానుల పరిపాలనా కాలమున క్షీణస్థితి నొంద నారంభించెను. క్రమముగా హిందూ సమాజము విచ్ఛిన్నమైన కొలది సంస్కృతము ప్రభుత్వ పోషణమును, సామంత రాజుల ఆదరాభిమానము లను కోల్పోయినది. క్రమముగా ఆనాటి మహమ్మదీయ పాలనమున రాజ భాషయైన పర్షియా భాషతో ఈ సంస్కృత భాషను చేర్పనారంభించిరి. ఆనాటి సమాజముపై ప్రాచీన సాహితీ సాంప్రదాయ ప్రభావ ముద్ర సడలి నూతన సాహిత్య ప్రభావమింకను ప్రసరింప కుండిన ఈ సంధి యుగ మున కాశ్మీరీయుల దేశభాషయందె కవిత యావిర్భవించి వికాసము నొందెను.

## అవ్వాలల్ల :

కాశ్మీర ప్రజానీకముచే ప్రేమాదర పురస్సరముగా 'అవ్వాలల్ల' (Granny Lalla) అని పిలిపించుకొనిన లాల్ దీదీ (ਲਾਲ ਢਦ)కాశ్మీర కవితా ప్రారంభ యుగమునకేకాక, సమస్త కాశ్మీర కవితా యుగమునకును, కాశ్మీర వాఙ్మయమునకును, అలంకార ప్రాయమైన ప్రశస్త కవయిత్రియై యున్నది. క్రీ. శ. 1347 సంవత్సరమున సింహాసన మధిష్ఠించిన సుల్తాన్ అల్లాఉద్దీన్ కాలమున అనగా 14 శతాబ్ది మధ్యకాలమున ఈ కాశ్మీర

కవితా సామ్రాజ్యేశ్వరి జన్మించెను. ఈ మహనీయురాలి జనన మరణ కాలములను సరిగా చెప్పజాలిన ఆధారములు లభింపవు. కాని ఆమె చుట్టును అల్లిబిల్లిగ అల్లుకొని యున్న అసంఖ్యాకములైన కథానకముల సాయమున ఆమె మహిమలను ఆమె జీవిత సంఘటనా విశేషాదులను మనము బాగుగా తెలిసికొనగలము.

ఆమె జీవిత గాథ నుగ్గడించు ఈ క్రింది కథానక మొకటి కాశ్మీర మున ప్రబల వ్యాప్తి యందున్నది.

ఆమె తల్లిదండ్రులు శ్రీ నగరమునకు ఆగ్నేయదిశ యందున్న ఒక సమీప గ్రామవాస్తవ్యులైన సంపన్న కుటుంబీకులు. ఆ గ్రామముననే సిద్ధమోలు డనబడు సాధు సత్తముడు, మహా తపస్సంపన్నుడును నయిన సిద్ధునిచే బాల్యము నుండియు ఆమె ప్రభావితురాలైనది. తరువాత ఆ గ్రామము నకు సమీపమున వితస్తా (జీలమ్) నదీ దక్షిణతీరము నందున్న పాంపోర్ (पांपोर) గ్రామము నందలి ఒక బ్రాహ్మణ బాలునితో ఆమెకు వివాహము కావింపబడెను. వివాహానంతరము ఆమె అత్తవారింట కాపురము చేసిన కాలము గమనార్హమైనది. లోకమున బాగుగ ప్రసిద్ధి కెక్కియున్న అత్తగారి కాఠిన్యమునకు ఈమె లోనగుటయు తన్మూలమున పసితనము నుండియు ఆమె యందు అంతర్లీనముగా వృద్ధినొందుచున్న ఆధ్యాత్మిక భావము తీవ్రమై ఆత్మసంయమనరూపమున పరిణతినొందుటయు, అతి శీఘ్ర ముగ జరిగిపోయెను. కాని భావికాలమున మహాయోగిని కావలసియున్న లల్ల ఆ కోడంత్రికపు బాధల నన్నింటిని చాలకాలము వరకు ఎవరికిని తెలుపకయే మిక్కిలి ఓర్పుతో సహించెను. కొంచెము పరిశీలించినచో ఈ సహనశీలమె ప్రాపంచిక సంబంధముల యెడ ఆమెకు ఆంతరంగికముగా గురుతరమగు ఉదాసీన భావమును పెంపొందింప జేసి ఆమెకు అంతర్ము ఖత్వము ప్రసాదించి ఆత్మ ప్రజ్ఞకల దగుటకు తోడుపడినదని గ్రహించగలము.

ఒక నాడామె ఉదయముననే లేచి తనమామూలు వాడుక ప్రకా రము కడవ తీసుకొని నదికి నీరు తెచ్చుటకై పోగా అచ్చట నీలాటి రేవున

గుమిగూడిన ఇరుగుపొరుగు స్త్రీలందరును ఆనాడు లల్ల ఇంటియందు జరుగ బోవు విందును గూర్చి ప్రస్తావించి "ఓహో మీయింటి విందులో నీకు భలే పసందైన భోజనము దొరకును కాబోలు; ఆ తొందరలో మమ్ము విందున కాహ్వానించుట మరువకుము." అని యామె నుడికించిరి. వెంటనే లల్ల "ह्योङ मायंतन या कोन्ङ ललि नत्ववठ चलि न जाँह" పొట్టి చేపలో, పొట్టేళ్ళో తెగుగాక విందునకు; వట్టి ఱాళ్ళే ప్రాప్తించు నా ముఖమునకు" అని తడుము కొనకుండ ఛ్ఛందోమయముగ జవాబిచ్చెను. తరువాత నీ గేయము మిక్కిలి ప్రసిద్ధి కెక్కెను.

ఈ విషయమును ఆమె మామగారు వినుట తటస్థించి లల్లకు భోజనము వడ్డించినపుడు చాటుననుండి అంతయు గమనించెను. ఒక ఱాతి ముక్కపై ఒకగరిటెడు అన్నమును (ఱాయికనబడకుండ) కప్పి అత్త లల్లకు వడ్డన చేసెను. అంతకొద్దిపాటి అన్నమును లల్లనిర్వికారముగ తినివైచెను. ఆమె ముఖమున ఎట్టి క్రోధభావము కాని, తుదకు విషాద చ్ఛాయ కూడ కాన్పింప కుండుటకు మామగారు మిక్కిలి ఆశ్చర్యపడెను. నిజమునకు పాపము లల్ల ప్రతి దినమును తీసుకొను భోజనమంత మాత్రమే అనికూడ ఆయనకు క్రమముగా తెలియవచ్చెను.

అత్తపెట్టు చిత్రహింసలను గూర్చి ఆ యింట ఇతరులకు తెలియుట వలన నామె పరిస్థితి బాగుపడలేదు సరికదా మఱింత అధ్వాన్నమాయెను. లౌకిక విషయములపై ఆమెకు కల్గిన పవిత్రమగు ఈ ఉపేక్షా భావమును, పార లౌకికమైన అకలంక తాదాత్మ్య భావమును భర్తసరిగా అర్థము చేసికొన లేక తన యెడగల వైముఖ్యముచే ఆమె అట్లు నటించుచున్నట్లుగా పొరపడి ఆమెను హెచ్చుగాబాధించుచు, సమయము వచ్చినపుడెల్ల ఆమెపై నాతడు కసి దీర్చుకొను చుండెను.

ఒకనాడు నదికి పోయి ఆమె మామూలు వేళకు తిరిగిరాలేక పోయెను. ఆ వేళ జరిగిన ఆలస్యమునకు భర్త అపోహపడి ఆమెపై విప రీతముగా మండి పడెను. కాని పాపమామె యేమిచేయగలదు ? ఆనా

డామె నదీ తీరము చేరగనే విచిత్రమైన తన్మయస్థితికిలోనై స్మృతిని గోల్పోయెను. తరువాత కొంత వడికి తేరుకొని నీరు తీసికొని యింటికి చేరెను. ఇది తెలియక భర్త విపరీతముగా కోప వివశుడై కఱ్ఱతో నీటి కడవను కొట్టెను. కాని జరిగినదేమి ? విచిత్రము ! కుండ బ్రద్దలై పోయెను. నేలపై కుండముక్కలు చిందరవందరగా పడిపోయెను. కాని ఆ కడవ యందలి నీరు మాత్రము అట్లే కదలక మెదలక ఆమె తలపై చెక్కు చెదరక నిలిచియుండెను. ఇది చూచి ఆమె భర్తయును, అత్తగారును నిశ్చేష్టులైరి. క్రమక్రమముగా ఈ సంఘటన దేశమంతయు అల్లుకొని పోయెను. దూరదూర దేశములనుండి ఆ మహానుభావురాలిని జూచుటకై జనము రానారంభించిరి. ఆనాటినుండి వారు లల్లను బాధింపక ఆమె పాటికి ఆమెను విడిచిరి.

వైరాగ్య భావము తీవ్రమై లల్ల సర్వసంగపరిత్యాగము నొనర్ప నభిలషించు చుండెను. మెల్ల మెల్లగా ఆ దినము కూడ సమీపించెను. కడ కామె తన యింటిని విడిచి ప్రశాంతముగా దేశమును పర్యటింపజొచ్చెను. తన శరీరపోషణము విషయమైకాని, వస్త్ర ధారణమును గూర్చి కాని ఏ మాత్రము శ్రద్ధ వహింపక భగవదనుభవముతో పరవశురాలై అరణ్యము లలో తిరుగుచు, గుహలలో నివసించుచు ఆమె కాలము గడుప జొచ్చెను. ఈ సంచార సమయమున హిందూ ముస్లిం మతములలో పెక్కురు సన్యా సులను పకీర్లను తప్పక సందర్శించి యుండును. దాని వలన కులమత విచక్షణ లేకుండా ఆమె సర్వ జనులకును అతిశయ గౌరవ పాత్రురాలగుట తటస్థించినది. నేటికిని ఆమెకు గొప్ప ప్రజ్ఞావతియైన సన్యాసినిగను, ప్రబో ధకు రాలుగను ప్రవక్త్రిగాను హిందూ మహమ్మదీయులలో కూడ ప్రముఖ స్థానము కలదు.

"లల్లవాక్" అని దేశీయుల వాడుకలో ప్రచురముగా ప్రసిద్ధి పొందిన "లల్లవాక్యాని" (లల్ల వాక్యములు అనునది.) హిందువుల నెంతగా ప్రభావితులను చేసెనో మహమ్మదీయులను కూడ అంతగా

ప్రభావితుల నొనరించెను, కాశ్మీరుదేశమున పండిత పామర, భేద భావము లేకుండా, కులమత తారతమ్యము లేకుండ "లల్ల వాక్యములు" సర్వ ప్రజాహృదయములలో ఎంతగా చొచ్చుకొని పోయినవనిన ప్రస్తావ వశమున నెవ్వరైనను సంభాషించుకొనునెడ కుల మత విచక్షణ లేకుండ లల్ల వాక్యములను ఉదాహరించుచునే సంభాషించుకొందురు. ప్రజాహృదయము లలో లల్ల వేదాంతమే అంత గొప్పగా సర్వజనీనత నొందియున్నది. ఆనాటికే హిందూదేశమునందలి యితరప్రాంతములలో వలె కాశ్మీరమున కూడ ప్రారంభమైన వివిధసంస్కృతి సమ్మేళనము భావియందు ఇంకా హెచ్చుగా జరుగుననియు క్రమముగా ఆర్షమైన ఆధ్యాత్మిక సంస్కృతి సాంప్రదాయములును, నవీనమైన సూఫీ సాంప్రదాయములును సమైక్యము నొందగలవనియు ఆమె ఆనాడే సూచించియుండెను.

ఆమెనుగూర్చిన కథానకములవలనను, జనశ్రుతివలనను ఆమె జీవితమును గూర్చిన పూర్తివివరములు మనకు లభింపకపోయినను మహాసంస్కర్త్రియైన ఆమెచేతనే నూతనముగ ప్రతిపాదింపబడిన సిద్ధాంతము లనదగు "వాక్" అను పేరున ప్రసిద్ధిపొందిన ఛందోబద్ధమైన సూక్తులవలననే ఆమె ఆధ్యాత్మిక జీవితమును మనము బాగుగా తెలిసికొనగలము. ఈ లల్లవాక్యములు గుప్త యోగమునకుచెందినవై, నీతిదాయకముగాను, తత్త్వప్రతిపాదకములు గాను, గంభీరములుగానున్నవి. ఇవి సాధారణముగా నాల్గుపాదములు కల చిన్నచిన్న పద్యములుగను, పదములుగను ఉన్నవి. వీనియందు సాధారణ ముగా అంత్యప్రాసనియమము పాటింపబడియుండెను. కొన్నిటియం దీ నియమము కన్పడదు. కాని ఆమె రచనయందు తరచుగా 1, 2 (A B) పాదము లకు ఒక అంత్యప్రాస, మఱల పద్యముయొక్క ఉత్తరార్ధమునందలి 1, 2 (A B) పాదములకు (అనగా 3 - 4 పాదములకు అయియుండును) ఒక అంత్య ప్రాసమును కన్పట్టుచున్నవి. లేదా 1, 2, 3, 4 (A B C B) పాదములకును, లేక 1, 2 - 1, 3 (A B C B) పాదములకును అంత్యప్రాసనియమము కానంబడుచున్నది.

ఒక్కొకచో రససన్నివేశానుగుణమైన ఒదుగుబాటు కన్పించుచుండును. అంతేకాక ఆమెరచన అటు పర్షియన్ ఛందమునకుగాని, మాత్రాచ్ఛంద మునకు గాని కేవలము సంబంధింపక, కేవల స్వేచ్ఛామయమై ఉన్ముక్త వాతావరణమున పరుగులువారుచుండును. ఆమె కవితయందు ఏవో కొన్ని లోపములున్నను, ఆమె తన రచనయందు కనబఱచిన స్వచ్ఛమైన భావ గౌరవగుణము ఆ లోపముల నన్నింటిని కప్పివేయజాలినదై "లల్లవాక్య" ములకు ఒక విశిష్టతను చేకూర్చినది. ప్రతినిత్యము తనచుట్టును మసలుచున్న ప్రజాజీవిత చైతన్యవాహినియందు సుడులు తిరుగుచున్న జాతీయములతో ఆమె రచన సాగించినది. శక్తిమంతములైన జాతీయభావములకును, బిగువైన భావచిత్రణమునకును, తాదాత్మ్యమున విక్పృతవాతాయనమైన జీవాత్మను అనంతస్వర్గధామమును జేర్చగల్గు సంభ్రమావేశాశ్చర్యజనకమైన ఉత్కృష్టభావనాపదమునకును పెట్టినదిపేరై ఆమెరచన కాశ్మీర సారస్వత మున అద్వితీయస్థానము నలంకరించియున్నది.

తీవ్రభావసంచలనముకల ఆమె రచనలయందు ఆమె తన అంతరాత్మ ప్రబోధము నందుకొని ఆత్మసాధనలయందు ప్రాథమిక ప్రయత్నములు సలిపినపుడు ఆమె శక్తిసామర్థ్యము లింకను నిద్రాణములై యుండి ఆత్మ యింకను అపరిపక్వ స్థితియందున్నప్పటి అనుభవమును ఆమె చక్కగా వెలి బుచ్చెను.

"ఓ జీవా నేను నీకొఱకు, నీ నిజరూప మరయుటకొఱకు మిక్కిలి తపించుచున్నాను. కాని ఈ ప్రకృతిమాయ మిక్కిలి ప్రకాశ ముతో నిన్ను ఆవరించియున్నది. నిన్ను ప్రకృతిబద్ధుని జేయునట్టి ఇనుప లంగరైన ఈ వస్తుప్రపంచముయొక్క ఛాయకూడా తుదకు మిగలదు. అయినను నీవు ఎందులకై ఈ ప్రాకృతికావరణమును వీడకుంటివో తెలియదు."

"మిక్కిలి బాధాకరమైన ఈ కంఠజోలి మోసిమోసి నా వీపు పుండైనది. నా నడుము రెండుగా వంగిపోయినది. ప్రభూ! ఎంత

అభాగ్యను నేను; నా గురుని అనుగ్రహము నాకు విషాదప్రాయమే యైనది. గొఱ్ఱెలకాపరి లేకనా మందవిచ్చిపోయినది. ఓ ప్రభూ! ఎంత అభాగ్యను నేను!"

"ఐదు, పది, పదకొండు కలిసి కుండను బ్రద్దలుచేసిపోయెను. అన్నీకలిసి ఒక త్రాటను కట్టునుగాక, పదునొకండవదైన ఆవు పెడత్రోవల నేలపోవలెను?"

"పేననిత్రాటితో పడవనుగట్టి సముద్రమున విడిచితిని. నా మొఱ నాలకించి ఈ పడవను దరిజేర్చుటకు దైవమొకడే నాకుదిక్కు. పచ్చికుండలో పోసిన నీటివలె నాలోనికోర్కి విచ్చిపోయినది. కాని నేను నా నెలవు చేరగలను. నా కోర్కె విఫలముకాదు. దైవము తప్పక నా ప్రార్థన నాలించును."

భగవదన్వేషణ ప్రయత్నము చాల కఠినమైనది. (Siva Chhury Krooth) అయినను ఆమె అకుంఠిత దీక్షవలన ఆమె ప్రయత్నము ఫలవంతమైనది. ఈ విధమైన పరమాత్మ సాక్షాత్కారసాధనకు తోడ్పడుటకై ఆమె అవలంబించిన నైతికాధ్యాత్మిక సంయమనపద్ధతుల నామె రూపకాలంకార సమంచితమైన కవిత్వపద్ధతిలో స్పష్టముగ ప్రతిభాసమానమగునట్లు అద్వితీయముగా రచించినది.

"పరమేశు నన్వేషణయందు నేను లల్లను మిగులవలసిపోయితి అయినను నాశక్తికిమించియైనను ఆతనిని కనుగొనుటకే యత్నింతును. పరమేశ్వరుని భవనద్వారములు మూసియుండుట నేను చూచితిని. అంత మాత్రమున నిరాశపడి నా యత్నము మానుకొందునా! లేదు. నా కోర్కె మఱింత తీవ్రమై పెరుగునే కాని తరుగదు. సంపూర్ణమగు తద్దర్శనాకాంక్షతో ఎచ్చటనుంటినో అచ్చటనే నిలిచి మరల యత్నించెదను. నాలోని మాలిన్యములతో నేను కాలిపోయితిని. నా హృదయమును పొడిచి వైచితిని. ఆ పరమేశ్వరుని అనుగ్రహానిరీక్షణమున నేను నిర్మలనై ధన్యురాలనైతి."

"శరీరమను నా మందిరద్వారముల నన్నింటిని బిగించివైచితిని. లోపలిదొంగను పట్టుకొనినట్లు నా ప్రాణవాయువులను పట్టుకొంటిని. (ప్రాణాయామము నొనర్చి శ్వాసను ధారణమొనర్చితిని.) అతిశీఘ్రముగ నా హృదయ గుహాయందు వానిని కట్టి ఓంకారమను త్రాటితో మథించితిని."

"అంతరాత్మ జ్యోతి ప్రకాశించి సత్యమును కన్గొనువఱకు (సత్యము బయల్పడువఱకు) తిత్తులను ఒత్తిఒత్తి ఊదితిని. అంతలోన బయట నొకటిగా నా సత్యతత్త్వము వెలింగెను. చీకటిలో దాగిన వానిని (ఆ పరతత్త్వమును) వెదకి ఎక్కడకును పోకుండ పట్టి యుంచితిని."

"ఆరు అడవులను గూల్చితిని, ఆరు విభాగములను (చక్రములను) మేల్కొలిపితిని. నా యోగధారణ బలమున ప్రకృతిని స్తంభింపజేసి ప్రణయాగ్నియందు నా హృదయమును దగ్ధమొనర్చి నా ప్రభువును (పరమాత్మను) గాంచితిని."

"ఆహా! నా మనస్సు రజతదర్పణమువలె నిర్మలమైనది. అపుడు నేను భగవంతుని యథార్థజ్ఞానము నొందితిని. నా నిజేశ్వరుం డంతటను నిండి తానయై కనిపించెను. అంత నే నదృశ్యనైతిని."

"బహుముఖమైన సృష్టి వానియందె ఐక్యమందెను. వస్తు ప్రపంచము శూన్యమున కలిసిపోయెను ఆ శూన్యముకూడ నష్ట మయ్యెను. ఇక మిగిలినది ఆ పరమాత్మ ఒకడె. గుణమయ ప్రకృతి యొక్క ధర్మములన్నియు విడిచినంత ఆ పరమాత్మానుభవము కల్గును. భట్ట! దీనిని నీవు మార్గదర్శకముగా తెలిసికొనుము."

"అక్కడ వాక్కు తలపును లేవు. ఇక్కడ మనస్సును లేదు. అక్కడ ఉచ్చస్థితిలేదు. ఇచ్చట నీచస్థితిలేదు. నిశ్శబ్దముకాని, నిగూఢ ప్రవృత్తులుకాని యిట చొరలేవు. అచట తుదకు శివుడునులేడు. ఇచట శక్తియును లేదు. నీవుమాత్రమే తెలిసికొనగల్గు ఒకానొక అతీతశక్తి కలదు."

"ఎపుడు మనసు నిజతత్త్వముయొక్క యథార్థప్రకృతిని కనుగొనగలదో, అపుడు వ్యక్తమంతయు అవ్యక్తమున కలిసిపోయి అదృశ్యమగును. అపు డచట రాత్రియు, పగలును లేవు, భూమియును, ఆకసమును లేవు. సర్వము నాశనముచేయుశక్తియు నాశనమగును. జీవాత్మయందు పరమాత్మ ప్రకాశమును గనుటే నిజమగు శివారాధనము."

హిందూ మహమ్మదీయ తారతమ్యము కాని, పండిత పామర విచక్షణ కాని లేకుండ కాశ్మీరదేశమున లాల్‌దీదీ సకల ప్రజాదరము బడసిన మహాకవయిత్రి యైనది. ఆమె యిట్టి ప్రజాదరణము నొందుటకు గాని, ఆమె కవిత్వమునందలి విశ్వమానవ ప్రబోధపూర్ణమైన విశిష్ట శక్తి సామర్థ్యములను దేశమునందలి సర్వమానవులును గ్రహించుటకుగాని కాశ్మీరదేశమున వ్యాప్తియందున్న దుర్గ్రిహాద్వైత పరబ్రహ్మోపాసనా రూపమగు శైవమతమును ఆమె ప్రాణాయామయోగ సాధనాదికమును కారణముకావు. ఆత్మానుభవపూర్ణమైన సరళతయు, ఆమె కవిత్వమందలి విశిష్టగుణమైన రూపకాలంకారమునందలి బంధుర భావోద్దీప్తియం దుద్దీప్తమగు నామె ప్రగాఢ భగద్విశ్వాసమును, కపటవంచనా ప్రవృత్తులపై, బాహ్యాడంబరప్రదర్శకములగు ఆనాటి సనాతనాచార కర్మకాండపై, అట్టి వాని సంకుచిత స్వార్థదురభిమానాదులపై ఆమెకుగల అసహ్యాభావము, తర్కసహములుకాని పిడివాదమున కొప్పని ఆమె సహేతుక దృక్పథము, భగవదనుభవమునెడ ఆమెకుగల తీవ్రమైన సంభ్రమోత్సుకత మొదలుగా గల ఆమె ఉత్తమగుణములే కాశ్మీర ప్రజాహృదయపీఠమునందును, కాశ్మీర సారస్వతమునందును ఆమెకు ప్రీతిపురస్సరమైన మహోన్నతస్థానము నిచ్చి ఆమెను గౌరవాస్పదురాలి నొనర్చినవి.

"విగ్రహము కేవలము శిల. గుడియును శిలయే. రెండును ఒక వస్తువుచేత తయారుచేయబడినవే. ఓ తెలివిగల పండితుడ! దేనిని నీవు ఆరాధించెదవు? యోగధారణచే నీ మనస్సును లగ్నమొనర్చి ధ్యానము చేయుము."

"గొఱ్ఱెలిచ్చు ఉన్నితో నీవు మానసంరక్షణ గావించుకొందువు. ఆ ఉన్నియే నిన్ను చలినుండి కాపాడును. పాప మా గొఱ్ఱె పచ్చిక బీళ్లలో మేసి పడియ నీరుద్రాగును. ఓ మూఢ బ్రాహ్మణ, నిర్జీవమగు శిలకొఱకు సజీవమగు గొఱ్ఱెను చంపుమని నీ కెవడు బోధించెను?"

"ప్రవహించునీటి నాపుటయు ఎగయుచున్న మంటల నార్పుటయు, పాదములతో ఆకాశమంతయు పరిభ్రమించుటయు, కొయ్యగోవునుండి పాలు దీయుటయు ననునివియన్నియు ఇంద్రజాలవిద్యలే, మఱేమియు కావు."

ఈవిధమైన ఈమె భావములనుబట్టి మూర్తి పూజనమన్నను జంతు బలులతోడి యజ్ఞయాగాది కర్మకలాపములన్నను ల్లకు విశ్వాసములేదని తెలియును. కేవలము కర్మకాండకాని, తీర్థయాత్రలుకాని, కేవల బాహ్యాడంబర ప్రధానములగు పూజలుకాని మానవునకు ఉపకరింపవు. కామము, మోహము, అహంకారము అను జీవితయాత్రయందలి ఈ ముగ్గురు దోపిడి కాండ్రను పొడువగల్గినబంటే నిజమగు భగవత్సాక్షాత్కారము నందగలడు నిజముగా తత్త్వాన్వేషియగువాడు తన సౌజన్యముచేతను, వినమ్రతచేతను. ప్రేమభావముచేతను సర్వులకు దాసభావమున వర్తించువాడై వ్యర్థచింతలను విడనాడి సస్వరూపానుసంధానమున మనస్సు లగ్నముచేయును. కాని నిజమున కివి ఆచరణసాధ్యముకాని ఒక దుష్కరకార్యము అట్లు చేసినవారు కూడ అరుదు. ఎందువల్లననగా కేవల ప్రశమనస్థితి (వైరాగ్యము) వలనగాని, కేవలము ఆత్మదమనము (శరీరకార్శ్యము, శరీరహింస) వలనగాని, వట్టి ప్రభుసందర్శనాకాంక్ష వలనగాని ఆత్మలాభము కలుగదు. లల్ల ఏ విధానము నవలంబించి ఆత్మలాభము నొందెనో దాని కామెయే సాక్షిణి. సర్వోత్కృష్టమైన భగవదనుభవము నొందుటకై ఎట్టివిధానము నవలంబించెనో, ఎన్నిపాట్లు పడవలసివచ్చెనో, ఆ తన అనుభవము లన్నింటిని ప్రత్యక్షరూప చిత్రణవలె శోభించు రూపకాలంకార పరంపలో చక్కగా ఉగ్గడించి యుండెను.

"క్రొత్తగా కోయబడిన ప్రత్తిపూవు ప్రత్తినిడుచువాడు శుభ్ర పఱచుట మొదలుపెట్టినది మొదలు, దూదేకులవానిచే అటు నిటు పడ ద్రోయబడి, ఏకబడి, దారము వడుకబడి, వస్త్రముగా నేయబడి, రాళ్లపై ఉదుకబడి, కుట్టుపనివానిచే కత్తెరవేట్లుపడి, కుట్టబడి దుస్తుగా తయారగునంతవఱకు ఎన్నిపాట్లుబడునో అట్లే భగవదనుభవము కోరు వారు అన్నిపాట్లు పడవలసియున్న"దని ఆమె చెప్పియున్నది.

"ఏకమేవాద్వైతం బ్రహ్మ" అను నద్వైత సిద్ధాంతమును లల్ల గాఢముగా విశ్వసించునది. ఎవరు బ్రహ్మమునందు సర్వమును, సర్వము నందా పరబ్రహ్మమును గాంచెదరో, వైయష్టికాత్మయు, సమష్టి విశ్వా త్మయు నెట్లో అట్లే పరబ్రహ్మమును, ప్రకృతియు నొకటిగా నెవరికి కాననగునో-అనగా "సర్వం ఖల్విదం బ్రహ్మ"యని ఎవరు భావింపగలరో-వారే నిజమగు తత్త్వవేత్తలని యామె వాకొనియుండెను.

"ప్రభు పరమేశ్వరుడగువాని నెవ్వరు గాంచగల్గుదురో, అతడు ద్వంద్వములనుండి విముక్తుడగును. అతడు పగలు రాత్రిలో నైక్య మగునో తెలిసికొనును. అంతయును నేకమైనదానినిగా గాంచును."

"ప్రభూ, నేనే నీవనియు, నీవే నేననియు, ఒకటే రెండగు ననియు, రెండే ఒకటగుననియు నే నెరుగను. 'ఎవరు ఈ నేను?' ఇది సంశయములలోకెల్ల గొప్ప సంశయము. అట్లే 'ఎవరు ఈ నీవు?' ఇది యును ఒక తెగనిసమస్యయే. ఇది తెలియుటయే మన నూతన జన్మకు కారణమగును."

మంచుగడ్డయు, మంచు, నీరు ఇవి యన్నియు వేరుగా గన్పట్టినను తత్త్వమున నొక్కవస్తువే. అట్లే పరమాత్మయు శివునియందును, ప్రపంచ మందును, ఆత్మలయందును నిమిడియుండును. పేరులతో ఆమెకు పట్టింపు లేదు. హిందువుల సర్వసమత్వభావ మామెయందు సంపూర్ణముగా భాసించెను. ఏపేరున తలచినను వస్తు వొకటియేకదా?

" शिब वा केशवाव जिन वा
कलमज नाथ नाम दार्यन युस "

"శివుడనికాని, కేశవుడనికాని, బుద్ధుడని, బ్రహ్మయని మనమెట్టి విధమున సంభావించినను నా పరమాత్మ యొక్కడే."

"ఈ జగతియంతయు శివునిచే తతమయ్యెను. అపుడు హిందువును లేడు, ముస్లిమును లేడని తెలిసికొనుము. నీవు ఎఱుక కలవాడ వగుచో నీ నిజతత్త్వము నెఱుంగుము. అదియే నీకు భగవదను భవమును కలిగించును."

సారాంశమేమన ఆత్మేశునకు నిలయమగు బ్రహ్మరంధ్రము నెఱుంగుటయు, అనాతంకమును, అనిష్కంపమునగు అనాహత నాదమును శ్రుతి విషయ మొనరించుకొనగల్గుటయే సమ్యగ్వివేక శక్తితో కూడిన సమ్యఙ్మార్గము.

ఈ విధముగా కాశ్మీరభావ సాంప్రదాయమును సాహిత్యమును సుసంపన్న మొనర్చినది లల్లయే. ఇంతియేకాక లల్ల ఇంకను ప్రశంసనీయ మగు పనిచేసి యుండెను. తన తల్లి గడ్డయగు కాశ్మీరము నందలి వివిధ మతములను సమన్వయ మొనర్చి తన మాతృభూమికి సేవ యొనర్చెను.

హోబాఖాటూన్ :

ప్రసిద్ధురాలైన లాల్ దీదీ తరువాత మఱల అంతటి ప్రతిభావంతురాలైన మరియొక కవయిత్రి హోబాఖాటూన్‌ను బడయుటకు కాశ్మీర మింకొక రెండువందల వత్సరములు వేచియుండ వలసి వచ్చెను. హోబాఖాటూన్ జీవిత చరిత్ర శృంగార రసపూర్ణమైనది. ఒక పల్లెటూరి పిల్లగా, ఒక రైతు బిడ్డగా పుట్టిన హోబాఖాటూన్, ప్రఖ్యాత కాశ్మీర కవితా ప్రవీణిగా గొప్ప పేరు బొందెను. ఆమె పాంపోరు గ్రామమునకు ఆగ్నేయముగా రెండు మైళ్ళలోనున్న చాంద్‌హారోర్ గ్రామమున జన్మించెను. ప్రపంచమున కంతటికిని కుంకుమపువ్వు పంటకు మిక్కిలి ప్రసిద్ధిపొందిన ఈ చాంద్‌హారోరు గ్రామము శ్రీనగరు జమ్మూరోడ్డు నానుకొని శ్రీనగరునకు ఎనిమిది మైళ్ల దూరమున నున్నది. విశాలమైన క్రంతలతోను, అతి విశాలమైన ఆ కుంకుమ క్షేత్రములను విభాగ మొనర్చుచు మనోహరదృశ్యములను కల్పించు ఎత్తు

పల్లముల కారకములగు పెద్దలోయలతో నిండి ప్రేమికుల ఏకాంతరమణీయ సంకేత స్థలముగా పేరుపొందిన ఎత్తైన కుంకుమ పూవు పొలముల అంక సీమ నొదిగియున్న చాంద్‌హోర్ గ్రామము చూపరుల కెపుడును కను పండువు సేయుచుండును. ఇట్టి మనోహరగ్రామ సీమయందు హోబాఖా టూను పుట్టి పెరిగెను. బాల్యమున నామె తండ్రి అబ్దుల్లారాథర్ ఆమెను ఖొరాను పఠనము నేర్చుకొనుటకై ఒక ముల్లాచేత నడుపబడు పాఠ శాలకు పంపెను. అనతి కాలమునందే ఆ బాలిక అచ్చట వినువారి మనస్సు హత్తుకొనులాగున మృదు మధురముగా ఖొరాను చదువ నేర్చి మంచి తెలివి తేటలు గలదనియు, ఆశావహమైన భవిష్యత్తు కలదనియు ఆ గ్రామమున పేరు బడసెను. విద్యాగంధ మెఱుగని ఆ పల్లెవాసులలో స్త్రీ పురుష భేదము లేక జనులందరును ఆమెప్రజ్ఞకు ముగ్ధులగుట కెంతో కాలము పట్ట లేదు, సరికదా ! త్వరితముగా ఆమె ఖొరాను నేర్చుట ముగించుటే కాక, ఆనాటి ప్రాథమిక విద్యయగు షేక్‌సాదీ కరీమా గులిస్తాఁ, బోస్తాను లతో కూడియున్న విద్యా పద్ధతియందు కూడ అచిరకాలముననే ప్రవీణత నొందెను.

అంతటి కుగ్రామమునందు ఆ గ్రామ పరిస్థితికి మించిన గొప్ప పేరు ప్రఖ్యాతులను గడించుట వలన కొన్ని నష్టములు కలుగుట కూడ అసంభవము కాదు. నిజముగా హోబాఖాటూను విషయమున ఇంతే జరిగెను. ఆ గ్రామము నందలి ప్రతివారి నోటను ఈ బాలిక ప్రజ్ఞాధిక్యమే విశేష ప్రస్తావనను పొంది అందర చేతను ఆమెయే వ్రేలెత్తి చూపబడుట జరిగెను. ఆమె వయస్సునకు మించిన ఆమె అసాధారణ ప్రజ్ఞకును ప్రతి విషయము నందును ముందంజవేయు ఆమె చొరవకును సాహిత్య ప్రోత్సాహములకును, తండ్రి మిక్కిలి ఆశ్చర్యపడుటయే కాక ఆనాటి సంఘ పరిస్థితులను బట్టి ముందు ముందు ఎట్టి పరిణామము కలుగునోయని విపరీతముగా భయపడి, తొందరపడి ఆమె కెందును సరిపోలనట్టియు, విద్యాగంధ మెరుగనట్టియు, ఊహాపోహలు లేనట్టి ఒక సామాన్యరైతు బాలునకిచ్చి పెండ్లిచేసి వైచెను. భర్తయైన హాజీజ్‌రాథర్ గృహమున అత్యంత ప్రతిభావంతురాలైన

హాబాఖాటూనుకు సౌఖ్యముగగన కుసుమసదృశమాయెను. మహోన్నతము లైన సంగీత సాహిత్యకళలే జీవనాడులుగా పరమేశ్వరునిచే ఆశీర్వదింపబడిన ఆ కవయిత్రీమణి ప్రతిభను భర్తయైన అజీజ్ కాని, అత్తగారు కాని గ్రహింప లేక పోవుటయేకాక కనీసపక్షము ఆమెను ప్రశంసింపను లేక పోయిరి. పొలము పనులలో భర్తకు సహాయకారిణిగా నుండి పొలము కాచుచు కైల్ (ఆ దేశమువారు తినుకూర) మళ్ళకు నీరుపెట్టి కలుపు మొక్కలుతీసి పాటు పడవలసియున్న పేదయిల్లాలికి గల ఈ అసదృశ కళానైపుణ్యము వారి ముందు నిరుపయోగమైన ప్రతిభగాక వేరేమి కాగలదు ? ఆమె నిత్య జీవితము నందలి పరస్పర విరుద్ధమైన ఈ సంఘర్షణ వలన సంభవించిన బాధ తోడి పుట్టినింటి అభిమానస్మృతులే ప్రత్యేకలక్షణముగా గల ఒకా నొక విశిష్ట కవిత్వ పద్ధతికి దారి తీసెను. ఆనాటి నుండియు నీరీతి కవితయే కాశ్మీరు సారస్వతమున ప్రాచుర్యము నొందుట ఇటగమనార్హము.

హాబాఖాటూనుకు రెండువందల సంవత్సరముల పూర్వపు కవయిత్రి యైన లాల్‌దీదీయొక్క ఆధ్యాత్మిక (కవితయైన) 'వాక్' పద్ధతికి వ్యతిరేకమైనట్టియు, కేవల మానవ ప్రేమ భావాభివ్యంజక మగునట్టియు, నూతన కవితా పద్ధతియైనట్టియు, ఈ కాశ్మీరు దేశభావగేయ కవితా మార్గమునకు హాబాఖాటూనే ప్రప్రథమురాలు ! మార్గ దర్శకురాలు.

ఇదియే కాశ్మీర దేశమున "లోల్‌లిరిక్ (Lollyric) అనబడినది. ఇది ఒకే భావమును వెలిబుచ్చు చిన్నఖండ కావ్యము. ఇందు సామాన్య ముగా పల్లవితో సహా ఆరులేక పది చరణము లుండును. అపుడపుడు ఈ చరణ సంఖ్య మించుట కూడా కద్దు. ఈ రచన యందు విషయ ప్రాధాన్యము కంటె, మనస్సున హత్తుకొన జేయు సంగీతమునకు ప్రాధా న్యము హెచ్చుగానున్నట్లుండును. కాశ్మీరు భాషయందు 'లోల్' అని చెప్పబడు ప్రక్రియ యందు రచయిత తన లోలుపతను చిత్రించును. ఇది కేవలము సంగీత రచన. ఇందు హృదయంగమమైన సంగీతమునకు ప్రాధాన్య ముండును. ఇందు సంగీత శాస్త్ర సంబంధములైన, ఆదిమ మధ్యమాను

ప్రాసములును, పల్లవుల బహుళాను వృత్తులును నుండును. ఒత్తక్షరములు, పరుషాక్షరములు, కంఠ్యములు మున్నగునవి హెచ్చుగా ఉచ్చారణ యందు లేని కాశ్మీరు భాషకు సహజమైన ఒకే అచ్చుతో కూడిన హల్లుల పునరుక్తితో (ఒక విధమైన యమకముతో బోలినది.) కూడిన పదములతో నిండి యుండును. ఇందు అనుప్రాస నియమము కవిస్వేచ్ఛకు వదలివేయ బడును. వస్తు బాహుళ్యమున కంటె ఒక విధముగా ఊతమునకు ప్రాధాన్యము కన్పట్టు చుండును. క్లిష్టమైన, విభిన్నమైన ఈ విరిక్కులలో భావము నభివ్యక్తము జేయుటకు ఈ ఊతమే ఆ ఛందమున కెక్కువగా తోడ్ప డును. గాయకులు, సంగీత ప్రియులు పాడు పాటలుగనే ఈ రచనలు మొత్తము మనకు అందినవి. కాశ్మీరదేశమున మాత్రమే ప్రత్యేకముగా వాడుకలోనున్న సాజ్ సాంతూర్, నాట్ టుంబక్ నూరు అను వాద్యముల సహాయముతో ఇవి పాడబడు చుండును.

ఈలోక లిరిక్ రచన పాండిత్య ప్రధానమైనది కాదు. మొత్తముపై (*ఆంధ్రుల పల పద మువంటిది కావచ్చును) గాలి విసురు రాగాలాపనతో కూడిన భావము వస్తువు పాట జాతికి చెందినది. మనోహరమైన సంగీతము నుండి విడదీయ సాధ్యము కానివిగా నుండును.

"ప్రణయ సింహాసనమైన యెదల
ప్రతి ధ్వనులు స్పృశియించు నటుల"

ఆమె ఈ గీతములను రచించెను. ఈ రచనలో ఆధ్యాత్మికమైన, నైతికమైన, ధార్మికమైన భావవిశేషము కానరాదు. కేవలము శారీరక మైన ఐహికమైన లోలుపతా ప్రదర్శనము మాత్రమే యిందు కాననగును. అంతేకాక కేవల బాధాను భవము తప్ప విశుద్ధమైన ప్రేమౌన్నత్యాను అనంతానందానుభవము, ఉన్నతమైన ఆదర్శములును ఇందు అంతగా కానరావు. నిస్పృహా, నిరాశా, బాధానుభవము నందలి అతివాస్తవికత, విషాదము ప్రతిఫలాపేక్షా రహితమైన ప్రేమయునిందు చిత్రితమైనవి. ఇక

*సంకలనకర్త్రి

హాబాఖాటూన్ రచనయందు మిక్కిలి బాహాటమైన రోదనను, అతిగాధ విషాద సన్నివేశ చిత్రణము, బాహిరమైన ఇంద్రియ లోలుపతయు అతి మాత్రముగా కనబడు చుండును.

నిజమునకు పాపము హాబాఖాటూన్ అత్తవారి యింటియందు అమిత కష్టముల పాలాయెను. తన స్వభావమునకు పూర్తిగా వ్యతిరేకమైన ఆ వాతావరణమున, నెట్టి సానుభూతియులేని పరిస్థితులలో, ఆ అత్తవారి యింట ఆమె తనకు సాధ్యమైనంత వరకు సర్దుకొనుటకే చాలగా ప్రయత్నించెను. భగవద్దత్తమైన, కళా ప్రతిభావంతములైన ఆమె పాటా, పద్యము, ఆమె భర్తను అత్తగారిని చాలా రెచ్చగొట్టెను. వారామెను ఎప్పుడును బెదరించి, గద్దించి, హింసించుటే గాని కొంచెమైనను సౌజన్యము చూపి ఆదరించెడువారు కారు. పాపము అసహాయురాలైన హాబాఖాటూన్ ఇటు తన గృహ జీవిత పరిస్థితి కనుగుణముగా మసలి అప్పటికి ప్రాప్తమైన ఆ జీవితమును బాగుపరచు కొనుటకై మామూలు స్త్రీలవలె పనిపాట్లు చేసి కొనుచు శాంతియుతముగా కాలము గడుపలేక పోయినది. అటు సహజముగా తన నుండి ప్రాదుర్భవించుచున్న గేయ కవితా వాహికను నిరోధింప జాలకను పోయినది. ఇట్లు రెండు విధముల ఆమె నరకయాతన ననుభవించినది.

ఆకు కూరలు డేన్డిలియన్, ఆకుడు కూరలు మొక్కలు మున్నగునవి తెచ్చుటకై సమీపము నందున్న కట్టలకు పొలములకు పంపబడినపుడామె తన యిరుగుపొరుగు పిల్లలతో కలిసి వెళ్లుచు స్వేచ్ఛా వాతావరణమున, ఉన్మత్త కంఠముతో, ఆశువుగా మధురప్రేమ గీతములను ఆలపించు తన్మయావస్థలో గాలిలో ఎగిరిపోవు చున్నట్లుండెడిది.

"నేస్తము లార రండు పొలము గట్లకు తోటలకును వెళ్ళి వచ్చ డెండివియన్ పూలను తెచ్చుకొందమురండు"

"నిశ్శబ్దముగా, ముందు హెచ్చరికనైనను చేయకుండ అతడు నన్ను దోచుకొని పోయెను."

"ప్రియుడారమ్ము రమ్ము-వారందరకును ఇది తెలియును లెమ్ము" విధి కూర్చిన ఈ చిక్కు అల్లిక విడిపోవునంతవరకు ప్రస్తావ వశముగాను. అపవాదులుగాను జనము నన్నుగూర్చి ఏమేమియో చెప్పుకొందురుగాక ప్రియుడారమ్ము - రమ్ము.

ఆమె గీతపద్ధతి ఈ విధముగా నుండును.

కాలము పర్విడి పోయెను. ఒకనాడు ఒక మెట్ట పొలమున ఆమె డెన్‌డివియన్, క్రెస్‌కూరలు కోయుచు ఎలుగెత్తి పాటలు పాడుకొను చుండగా ఒక విచిత్ర సంఘటన జరిగెను. అది ఆమె జీవితమునే మార్చి వైచిన మహత్తర సంఘటన! అందముగా అలంకరింపబడిన గుఱ్ఱముపై స్వారి చేయుచు శ్రీమంతుడైన యువకుడొక డచటికివచ్చెను. బాధామయములైన ఆమె గీతములను ఆసక్తితో వినుచు తన్మయతతో నిశ్చలుడై, ప్రేమ భరాలసములైన దృక్కులతో ఆమెను గాంచుచు అతడు పరవశు డయ్యెను. తనకతి సమీపమున నున్న ఆ యువకుని చూచుట తోడనే హాబాఖాటూన్ కూడ ప్రేమ వివశురాలయ్యెను. కాని ఆ యువకుడు కాశ్మీర సింహాసనమునకు వారసుడును, యువరాజునైన రాకుమారుడైన యూసఫ్‌షా అనిపాపమామెకు తెలియదు. అనతి కాలముననే యువరాజు హాబాఖాటూన్‌చే విడాకు లిప్పించి,ఆమెను తాను పెండ్లాడెను.

ఇది జరుగుటకు ముందు కొద్ది రోజుల క్రితము జరిగిన సంఘటన అప్పటి కామెకు బాగుగా గుర్తుండి యుండును. ఆమె తన అత్తవారింట అసౌఖ్యముతో, చింతతో కాలము పుచ్చుచు, ఆనాడు యోగ సిద్ధుడుగా, విఖ్యాతుడైన పాంపోరు నివాసి ఖ్వాజామసూద్ దగ్గరకు వెళ్ళి తన కష్టములు చెప్పుకొని విలపించెను. ఆయన సాదరముగా ఆమె నోదార్చి ఈ కష్టముల నుండి గట్టెక్కు శుభసమయము చాలా సన్నిహితముగానే ఉన్నదని చెప్పుటయే కాక ఆయన ఆమె జన్మనామమైన జూన్, (చందమామ) అను పేరును "హాబాఖాటూన్" గా మార్చివైచెను. తరువాత ఆనామమె శాశ్వత ప్రసిద్ధి నొందినది.

యూసఫ్‌షా 1579 లో సింహాసనమధిష్ఠించి నపుడు హాబాఖాటూన్ కాశ్మీర సామ్రాజ్ఞి యయ్యేను. రాణిగా ఆమె తన జన్మభూమి యైన కాశ్మీరదేశ కళలను పోషించుటయే కాక, కవి, పండిత గాయకులను రావించి ఆదరముతో గోష్ఠి సమావేశములను నెఱపెడిది. అంతతో ఆమె తన కర్తవ్యము ముగిసినట్లు భావింపలేదు. కాశ్మీర సంస్థానము నకు కష్టము లావరించిన సమయమున, వ్యసనములకు జిక్కి, వినోద కాలక్షేపములతో గుడు గుడు గుంచము లాడుచు. విపత్సమయములందును ఎట్టి నిశ్చయముల కును రాజాలని దుస్థితిలోనున్న భర్త కన్ని విధముల అండగా నిలబడి తన ప్రజ్ఞా బలముతో కడు చాకచక్యముగా రాచ కార్యములను నిర్వహించి కాశ్మీరు సంస్థాన రాజకీయముల కొక నిర్దిష్ట రూపరేఖల నిచ్చెను.

మహారాణి యైనప్పటికిని ఈ నాటికిని ఆమె మహారాణిగా కాక కవయిత్రిగా 'లోల్' గాయనిగా కీర్తింపబడు చున్నది. ప్రేమ యొక్క వివిధ స్వరూప స్వభావముల నామె చక్కగా గాన మొనర్చెను. తీవ్ర మైన వాంఛ, అత్యానందముతో కూడిన, సస్పృహమైన నిరీక్ష, ప్రయో జన రహితమగు ప్రణయతత్త్వము నందలి విషణ్ణభావము, ఉద్విగ్నత, నిరాశానిస్పృహాలచే ఉదయించు సంశయస్థితి, దాని పరిణామమైన ఒకా నొక విధమగు ఆత్మ పృచ్ఛకావస్థ! మున్నగు అనేక ప్రణయ దశలపై స్వానుభవ పూర్ణములగు మనోహార గేయముల నెన్నింటినో విరచించెను.

తీవ్రవాంఛకు :

"దూరముననున్న పచ్చికబయళ్లు వికసించియున్నవి
నీకు నా వేడికోలు వినిపింపలేదు
కొండలపై చెరువులలో పూవులు వికసించినవి
రమ్ము ; మన మచట కేగుదము రమ్ము
దూరాటవులలో 'లీలాక్' పూవులు వికసించినవి
నీవు నా విన్నపము నాలింపవా,"

"నీ అన్వేషణలో నేను కొండకాలువలన్నియు తిరుగుదును
నిన్ను వెదకుటకునై అడవిమల్లెల పొద లన్నియు తిరుగుదును

ప్రియుడా, నిన్ను మరల నే నొక్కపరి కలిసికొనలేనా ?
అడవిగులాబి చక్కగా వికసించినది
నీ సన్నిధిని సౌందర్య సంపదయంతయు వికసించును
ప్రియుడా నిన్ను నేను మఱొక్కసారి కాంచలేనా ?''

"నా కన్బొమలనుండి ముత్యములవలె మధువు చిందుచున్నది
నా ప్రియునికొరకు వయలెట్ పూలను సేకరించుచున్నాను
'షాలి' మారున మధుపాత్రలను నింపుచున్నాను
నాప్రియు నెదుర్కొనుటకై ఆనందమున గంతులు వేయుదును
(నాట్యమాడెదను)
ప్రియునికొఱకు నేను హారము లల్లుచుంటిని
'ఇషబారు' న సురాపాత్రలను నింపుచున్నాను
ప్రియుడు నాకడ కేతెంచునని చేతులు చాచియుంటిని
ప్రియునికొరకు నేను హారముల నల్లుచుంటిని.''

ప్రేమనిరీక్షణకు :

"నీవులేక నేను ప్రొద్దెట్లు గడుపగలను ?
నీ విరహమును నేనెట్లు సైపగలను ?
నా చేతులను 'హెనా' తో రంగువేసితిని
నీవు నాదగ్గఱ కెప్పు డేతెంతువు ?
ప్రియుడా రమ్ము - నీ రాకను నేనెంత కాంక్షించుచుంటినో
చూడుము నీ విరహబాధ నాకెంత మరణసదృశముగా నున్నదో.''

నెచ్చలీ నీవుపోయి ముందేగి ప్రియుని పిలిచిరమ్ము. పూలహారములతో ఇచ్చట వానికై నేను సిద్ధముగానుంటిని. అంచులనుండి పొర్లిపోవుసారాయమును సిద్ధపరచితిని. కాని అతడేలకో అడవుల ౘక్రుమ్మరుచున్నాడు. వేరెవతెకడ నాతడు సారాయము ౘద్రాగెనో ఆతని వియోగమున వాడిన మల్లియవలె నా స్థితి తారుమారగుచున్నది. సఖి ముందేగి ఆతనిని పిలిచిరమ్ము.

ఈవిధమైన హోబాఖాటూన్ సుఖస్వప్నములు, ప్రేమానందాతిశయ భాగమును అంతరించుకాలము దాపురించినది. కాశ్మీరుదేశము నేలిన చాకుసుల్తానులలో కడపటివాడైన ఈ 'యూసఫ్‌షాచాక్' యుద్ధమున అక్బరుచక్రవర్తిచే ఓడింపబడి పదవీభ్రష్టుడు కావింపబడుటయే కాక జన్మభూమియైన కాశ్మీరమునుండి వెళ్లగొట్టబడి దేశభ్రష్టుడు కూడ నయ్యెను. పాప మా సమయమున నాతడు తన ప్రియురాలైన హోబాఖాటూన్‌ను కూడ విడువవలసివచ్చెను. అట్టి విషాదావస్థలో కూడ ఆమె తన భగ్న ప్రణయమునుగూర్చి పరిచితరూపకాలంకారములతో ఆనాటి విషాదకర రాచకీయపరిస్థితులను ధ్వనించు గేయముల నల్లెను.

"నెచ్చెలీ, విధి మరల యెపుడు నాపై కరుణచూపునో
నా ప్రియుడు మరల యెపుడు నాసన్నిధికి వచ్చునో చెప్పవే
నేను, ఓర్పుతో, చిరకాలము వేచియుంటిని
ఆశ నిరాశకాగా నా హృదయము దిమ్మరవోయెను
ప్రణయక్రియాకలాపము ఎంతయో తియ్యనైనది.
భూషణములతో నాగళము నలంకరించుకొందును.
హెన్నాతో ఆతని కరములకు రంగువేసెదను
చుంబనపరిమళములతో ఆతని శరీరమును పులిమివేయుదును
బంగారుపాత్రలతో ఆతనికి సుర నందింతును
నా హృదయసరోవరమున ప్రేమారవిందము వికసించును
నెచ్చలీ పలుకవే విధి మరల యెపుడు నన్ను కరుణించునో
( च़ कम्य खाति‍न म्यानि ब्रम दिय न्यून खो
च क्याजि गपी म्योन्य द्रुय )
ఎవతె నా ప్రణయ రాశిని
నానుండి వంచించి కొంపోయెనో
ఏల తన ప్రేమ ద్వేషమై
నాయెడ ఇపుడు విషమించెనో.

ఈ తుదిగీతి కాశ్మీరమున మొదటి ఘజలు. ఇదియే కాశ్మీరభాషలో పర్షియన్ సాంప్రదాయసిద్ధమైన మొదటి ఘజలు, విజ్ఞులచే ఇదివకే చెప్ప

బడినట్లు హాబాఖాటూన్ అదివరకు అమలులో ఉన్న సాంప్రదాయ గేయ పద్ధతిని మార్చి నూతనగీతా సృష్టిగావించిన ప్రప్రథమురాలు. అంతేకాక ఇండో, ఇరానీ యను సంగీతమున కొక అపూర్వమగు కానుక అనదగిన రస్తె - ఇ - కాశ్మీర్ అను ముకాము రాగమును సృష్టించినది కూడ హాబాఖాటూనే.

హాబాఖాటూన్ జీవితము అసాధారణ పరిణామములకు లోనైన ఒక విచిత్రగాథ. అమాయికానందముతో, చీకూ చింతా లేక సుఖముగా గడుపదగిన బాల్యమునుండి వయస్సుమించిన తెలివితేటలు కనబరచిన యౌవనదశవరకుకూడ, మూర్ఖుడును అజ్ఞానియునైన మొదటిభర్తతో నెఱపిన సంసారమునందామె అంతరాత్మ కొడిగట్టి జీవితము మసిపారి పోయినది. తరువాత ఆమె జీవితమున హఠాత్పరిణామము కల్గినది. యువ రాజునకు ప్రేమాస్పదురాలగు భార్యగానున్నప్పుడును, అటుపిమ్మట పదు నారు వర్షములు మహారాణిగా ఉండి సంగీతాది కళలను పోషించినపుడును, ఆమె ప్రేమజీవితకుసుమము వికసించి సౌరభములు వెదజల్లెను. రాజ్యభ్రష్టు డైన తన స్వామితో వియోగము సంభవించినపుడు ఆమె జీవితమందలి చివరి యిరవై యేండ్లు మరల ఒక విషాదగీతికయై పోయినది. మహారాణిగా ప్రాభవములందిన హాబాఖాటూన్ మఱల నల్గురినోటిలో నానవలసిన దుస్థి తికి వచ్చెను. ఆ అంత్యదశలో ఆమె వీధులలో పాటలు పాడుకొనుచు బిచ్చమెత్తు ఫకీరుగా ఏకాకిజీవితమును గడపెను. ఆ చరమస్థితియందు ఆమెయె రచించుకొన్న ఈ సమాధిగీతమును వినుడు, ఇది ఆమె సమాధిపై వ్రాయుట కుద్దేశించెనా! యనిపించును.

"నేను గొప్పవంశమునుండి వచ్చితిని -
హాబాఖాటూన్ అని పేరుపొందితిని
మేలి ముసుగును క్రిందకు లాగుకొనుచు
మబ్బులనడుమనుండి పయనించితిని
జనులు నన్నుచూచుటకై గుమిగూడెడివారు

అడవులలో మునులుకూడ నా
ఒక్క చిరునవ్వుకొరకు వెంటబడెడివారు
క్రీడకై ఒకపుడు నేను నాయింటిని విడచితిని
కాని పగలు పడమట మునిగిపోయినను
నేను తిరిగి రాలేదు.

రూపభవాని :

కాశ్మీర మహిళా రచయిత్రులను గూర్చి ఒక వ్యాసము వ్రాయు నపుడు రూఫ్ (సంస్కృతమున రూప) భవానిని గూర్చి కొలది ప్రస్తావన చేయదగును. ఆమె క్రీ. శ. 1625 లో జన్మించెను. ఆమె తండ్రి పండిత మాధవధార్. తత్త్వవేత్తలన్నను, సన్న్యాసులన్నను ఈయనకు గౌరవము మెండు. ఎపుడును వారి సాంగత్యమునే అభిలషించుచు సాధు జీవితమును గడపెను. తరువాత తరువాత రాహ్‌బాబా షాహెబ్ అను ఫకీరుతో వీరికి సంబంధ మెక్కువయ్యెను. కుటుంబ సాంప్రదాయమును బట్టి రూప చిన్నవయసునందే ఆధ్యాత్మిక విషయముల యొక్కయు, యోగ సాధనల యొక్కయు మూల తత్త్వమును తెలిసికొన గల్గెను. ఆనాటి సంఘాచారమును బట్టి రూపకు చిన్నవయసుననే పెండ్లి కావింపబడి ఆమె సప్రూ కుటుంబమునకు కోడలయ్యెను. అత్త వారియింట రూపకు సౌఖ్యము కఱవయ్యెను. ఆమెకు అచట హింసలే ఎదురగుటయు, ఆ హింసా కాండ వలన ఆమె యందలి ఆత్మపరిశోధన వృద్ధి యగుటయు, తత్ఫలితముగా ఆధ్యాత్మిక ప్రవృత్తి అధికమగుటయు సహజముగా సంభవించెను. కొన్నాళ్ళకు ఇంటిబాధలు భరింపరానివి కాగా రూపభవాని సంసారమును త్యజించి హైందవ వర్ణాశ్రమావసాన ధర్మమైన సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. కాశ్మీరమున ఆమె ఆధ్యాత్మి కాన్వేషణలచేతను, యోగ సాధనలచేతను పవిత్రమైన ప్రదేశము లనేకములు కలవు. చష్మాసాహిబీ, ఉత్సాన్, మానిగామ్ (లార్) వితస్తా (జీలం) నదికి దక్షిణ తీరమున నున్న (నేటి సంబల్‌కు సమీపము నందలి) వాసకూర్ మున్నగు ప్రదేశము

లిప్పటికిని ఈ విధముగాం ఆమె పవిత్రస్మృతిని చాటు చున్నవి. ఆమెకు ఈ ఆధ్యాత్మిక సంచారమున "షాసాదిక్ కాలందర్" అను మహమ్మదీయ యోగితో పరిచయము కలిగినట్లును, తరువాత ఆ పరిచయము జీవితాంతము కొనసాగినట్లును తెలియుచున్నది. ఈ సంచారము ముగిసిన వెనుక ఆమె 96 సంవత్సరముల వయస్సు వరకు వాసకూరు నందే స్థిరపడి తన జీవితాంతము అక్కడనే గడపెను.

రూపభవాని రచనలు చాలా భాగము లభింపవు. 'వాక్' (సంస్కృత కావ్యములు) అను పేర ప్రసిద్ధములై లభించిన కొద్ది రచనలు మిక్కిలి దుర్గ్రాహ్యములుగా నున్నవి. ఆమె ఒకానొక నిగూఢమైన తత్త్వార్థమును ప్రతి పాదించుచు, ఇప్పుడు వాడుకలో లేని ఒక విధమైన జటిల పౌరాణిక భాషలో రచించినది.

కవయిత్రిగానే కాక సంఘ సంస్కర్త్రిగాకూడ ఆమె తన జన్మభూమి కఖండ సేవ కావించెను. సంఘ ప్రయోజనకరములగు ఉత్తమ సాంఘిక సంస్కరణములను, మద్య నిషేధమును, జంతు బలి నిరాసనమును, బహు, భార్యా నిషేధమును ఉద్ధృతముగా ప్రచారము కావించుటే కాక, తాయెతులు, రక్షరేకులు, అవసర సన్యాసమును తీవ్రముగ నిరసించుచు కూడ దేశమున ప్రబోధ మొనర్చెను. దేశము నందలి విభిన్న మతములకు అతీతురాలై భిన్న భిన్న మతములన్నియు భగవత్సాక్షాత్కారమును కల్గించు భిన్న మార్గములే యనియు, ఆమె ప్రబోధము చేసెను. రూపభవాని యోగ సిద్ధిని పొందిన తర్వాత "అలకేశ్వరి సాహిబా" యను పేరిట ప్రఖ్యాతి నొందెను. ఇప్పటికిని ఆమె అనుచరులు తత్సంబంధ కార్య కలాపముగా ఆమె వార్షికోత్సవములను నిర్వహించు చుందురు.

## అర్నిమాల్ :

ఇంచుమించు హాబాఖాటూనుకు తరువాత రెండు వందల సంవత్సరములకు పిదప 18 వ శతాబ్దము నందు జన్మించిన 'అర్నిమాల్' హాబాఖాటూన్ కవిత్వ సాంప్రదాయమును పునరుద్ధరించెను. అర్నిమాల్ యొక్క

"లోల్ లిరిక్కు" (Lol lyric) రచన హాబాఖాటూన్ రచనకంటె విషాద భరితమైనదిగను, తీవ్రవాంఛా వ్యాకులితమైనదిగను దుఃఖ వేదనా పూరిత మైనది గను సుఖ సంతోష శూన్య మైనదిగను కనబడు చుండును. కాశ్మీరదేశమున మిక్కిలి ప్రసిద్ధి పొందిన కవయిత్రులు ముప్వురును రెండేసి వందల యేండ్ల వ్యవధిలో జన్మించుటయు తమ తమ అత్తవారి యిండ్లలో ఒకే విధముగా హింసల పాలగుటయు నిజముగా విచిత్ర సంఘటనమే.

"కవితా డోలల నూగిరి పొఱపాటుగ
కష్టము నేర్చిన దానిని పల్కిరి పాటగ"

ఆర్నిమల్ గేయములు తీవ్రబాధానుభవద్యోతకములై కరుణరస మున జాలువారు చుండును. నిస్పృహ, నిస్సహాయత, సుఖవిరహితత్వ మును అందుండి తొంగి చూచు చుండును. కాని ఆగేయములందు ద్వేషా సూయాది భావములేమియు కాన్పింపవు సరికదా; వితంతువుగా గాని దుఃఖభాగినియైన గృహిణిగా గాని బాగుగా హింసింపబడిన ఒక హిందూ స్త్రీ యందు కాన్పించెడు మన స్థైర్యము తోడి విశిష్ట వ్యక్తిత్వము యొక్క అంతః ప్రేరణ ఆ పాటలయందు కానగును. జనశ్రుతిని బట్టియు ఆమె పాటల యందు విస్పష్టముగా కాన్పించు అంతర సాక్ష్యమును బట్టియు ఆమెకు భర్త వలననేదో కొంత కష్టము వాటిల్లినట్లు తెలియును. "బహార్-ఇ-తవీల్" అను భగవత్స్తుతి పరమైన పర్షియన్ గ్రంథమును రచించి మిక్కిలి ప్రసిద్ధి కెక్కిన మున్షీభవానీదాస్ కచ్రూ ఆమె భర్త. ఆమె భర్తచే అవమానింపబడి, పరిత్యజింప బడి తండ్రి యిల్లు చేరి అచట రాట్నము వడకుచు పవిత్ర జీవితముతో కాలము వెళ్ళబుచ్చినట్లు తెలియు చున్నది.

"రాట్న చక్రమా గొణగకుము - నీ గడ్డి చెవులకు నేను నూనె వేసెదను పచ్చికనుండి" హాయాసింత్" లేచినట్లు నీ ఆకృతినిటా రుగ లేచి నిలువ బడెను. సురను నింపిన పాత్రలతో ఒక్క చూపుకొఱకై ఇచట 'నార్సికస్' లేచియున్నది. ఒక మాఱు వాడినమల్లె మరల వికసింపదు సుమా" !

లాల్ దీదీయును, హాబాఖాటూను పల్లెసీమల జన్మించి, పల్లెలలో సహజవైభవముతో తాండవించు ప్రకృతిరామణీయకమును అనుభవించి ముగ్ధురాండ్రైనవారు. కాని ఆర్నిమాల్ అట్లుగాక కాశ్మీరదేశ రాజధానియైన శ్రీనగరు పట్టణమున జన్మించి రైనా వారి పరిసర ప్రాంతములలోని ఒక ప్రదేశమున గల కుటుంబమున కోడలుగా అడుగు పెట్టెను. కాశ్మీరమున మిక్కిలి ప్రసిద్ధి పొందిన లేక్ సరస్సునకు దగ్గరగా ఉండుట వలనను, రైనావారిలో ఆనాడు జనాభా చాలా తక్కువగా ఉండుట వలనను, ఆ చెరువులోనికి ప్రవహించు సెలయేళ్లవలన వీధులన్నియు పచ్చిక బయళ్ళవలె మనోహరముగా ఉండుటవలనను రైనా వారి ఆనాడు ఇప్పటికంటే సుందరమైన ప్రదేశముగా నుండియుండును. అందువలననే కాబోలు ఆర్నిమాల్ పాటలలో పల్లెసీమలయందలి వినిర్మల వాయు తరంగములయందలి అప్పటమైన క్రొత్తదనము కన్పించునే కాని చరమ దశయందు వ్రాసిన గేయములలో నైనను గ్రంథ చౌర్యముగాని, ఎరువు భావములుగాని కానరావు. తరువాత కాశ్మీర కవిత్వమునందు పొడగాన వచ్చిన క్షీణదశలోనున్న అరబ్బు కవిత్వ లక్షణములైన దురభిమానిత కాని, కృత్రిమాలంకార భూయిష్ఠతగాని ఆమె రచనయందు కానరావు.

"తిరిగేపిల్ల కాలువలలో నడయాడే కుకిలుబాతువలె నీవును తిరిగెదవు. అదియే నామనసును చెదర గొట్టును. ప్రియతమా, యౌవన సఖా ఏదియో ప్రేమాహ్వానమును పొంది, నీవే పిలుచుచుంటి వని మోజుపడితిని."

"పిల్లకాలువల గట్లపై వికసించి ప్రల్లదనముతో
పోరాటము సాగించు ఈ (కజ్జాకోరు) పువ్వులను చూడుము
నీ కొరకు నేను నిరీక్షించు సమయమిదియె.
ఒక్కమాఱు నీవు వచ్చినాకు నీ దర్శన భాగ్యమీయవా ?
ప్రియతమా, యౌవన సఖా
నీ కొఱకు నా జీవితము నర్పించెదను."

"ప్రియతమా ! ఓమల్లియల ధనమా
నీ కొఱకు వేచియుంటిని
రమ్మ, రమ్మ
నీ దర్శన భాగ్య మొసంగుము
నేను మిక్కిలి దురవస్థలో నున్నాను - బాల్యము నుండి
నిన్నే నమ్ముకొని యున్నాను
ఏల నా విశ్వాసమును బ్రద్దలు చేసెదవు ?
ఓ ప్రియా, ఓ ఇష్టసఖా
నీ కొరకు వేచియుంటిని"

అర్నిమల్ కవిత్వమున నాదగతమైన, భావగతమైన సంగీతమునకు అర్థమునకుగల సంపూర్ణమైన సమ్మేళనము మనకు కాననగును. చౌకబారు బూరానుండి వెలువడు తియ్యని వేదనాకలితమగు గానమును మనము వినగలము.

"ఓ నా ప్రియా, ఓ నామల్లియల ధనమా రమ్మ నాకు కాన్పింపుము. నిన్నే కోరితిని రమ్మ. బాల్యము నుండియు నిన్నే కోరితినని ఖరారు చేయుదును. ఇదియె సవాలు - నీవేల నా సవాలును భగ్నము చేసెదవు ? ఓ మధుర హృదయమా రమ్మ - నిన్నే కోరితిని రమ్మ రమ్మ"

భర్తృవిరహా వేదనా దోధూయమాన హృదయ యగు నీమె రచనలయందు కొన్ని మనకు మిక్కిలి జాలిగల్గించుచు అత్యంత విషాదచ్ఛాయా వృతములుగా నుండుటే కాక కొన్ని మిక్కిలి తీవ్రముగా కూడ ఉన్నవి. తన యౌవన నిష్ఫలస్థితిని ప్రణయము పట్ల ఆమెకు గల్గిన అవిశ్వాస వైరాస్యము లనునవి బాగుగా వ్యక్తము చేయును.

"ఈనా యౌవన తీవ్రతను ఏది ఆపగలదు ?
అడవుల బట్టి తిరుగుచు అతడు నాకు దూరమగును
నా గూడునేనల్లుకొనుచు నేను 'కుకిలు' బాతువలె పడియుంటిని
వసంత సమయము వచ్చి పువ్వులన్నియు వికసించినపుడు

ఆతనిస్మృతి - వేదనయై నాలో ఒక మంటను రేపెను
ఆతని ప్రణయ బంధపు వలపులు
నన్ను ప్రేమ సుడిగుండములలో ఇరికించి త్రిప్పిత్రిప్పి కొట్టెను.
ఈనా యౌవన తీవ్రత నాపగలవారెవ్వరు ? ''
''నన్ను చూచి నవ్వకుమో చెలీ
నావలె ఇంత దురవస్థలపాలైన వారెవరుందురు ?
తన ప్రియునిచే తిరస్కరింపబడి
యౌవనోద్రేక సమయమున ప్రేమ బాధతో
నావలె తపించు వారెవరుందురు ?
ఆతడు ఇంకెవరిపైననో మనసుంచెను.
ఆతనికై నిరీక్షించుచు నే నిచట పడియుంటిని
సరిగా నా యింటి ముందుభాగమున
ఎవరో కిటికీ కొట్టిన చప్పుడు వింటిని
ఆతడు నా గృహాంగణమున నడుగుపెట్టెనని నేను తలంచితిని
కాని కాదు ! ఆతడు కాదు
నాతో నా హృదయమును ఒక్కపరి మునిగిపోయెను''
''సరిగా నేను తరుణాస్పదనై గంధపు నీట స్నాన మాడు
సమయమునకు నెచ్చెలీ నా ప్రియుడు ఎచటకో ఎగిరిపోయెను
నా స్వామి నా ప్రభువు కొఱకు వేచియుండుటయే నా అభిమతము
మల్లెలతో నతనికి కిరీట మలంకరింతును
నా ప్రియుడు నా నుండి తప్పించుకొని ఎచటకో
వెళ్ళి పోయినప్పటికిని నా హృదయా రామమున ఒకవింత పువ్వు
వికసించియుండెను''
''ప్రేమ కొఱకు ఆశించు పద్మినిని నేను
ఆతడు నాకడ కెప్పుడు వచ్చునో !
నా కన్నీరు మున్నీరుగా ప్రవహించు చున్నది
నా వాంఛ చాలా నిశితమైనది

నా వేదన ప్రగాఢమైనది
ఎప్పటికైనను నేను ఈ త్రీవవేదన నెట్లు మఱువగలను ?
ప్రేమ ముందుకు దుముకు తన అగ్ని జ్వాలతో
దావాగ్నివలె నాలోని వికాసమును దహించి వేయుచున్నది.
నా దుఃఖము అంతమెఱుగదు
నా కన్నీటికి ఎడము లేదు''

ఆర్నిమాల్ పేరు సారస్వతమున పాలిపోయిన పచ్చ గులాబి అను నర్థము వచ్చు "ఆర్నిగులాబీమాల'' అని ప్రసిద్ధి పొందినది. ఆమె తన పేరును గూర్చి కూడా భావ గర్భితముగ తన రచనలలో నటనట నిట్లు వర్ణించి యున్నది.

''నేను ఒకప్పుడు గ్రీష్మమున సంపూర్ణముగ వికసించిన
గులాబీని - కాని ఇప్పుడో ఆతని వలన పాలి
పోయిన అడవి పచ్చ గులాబీగా మారి పోయితిని
సఖీ, నాప్రియుడు నా దగ్గరకు మరల యెప్పుడు వచ్చునో చెప్పవే''

కాని అతడు రాడు; రానేరాడు. ఆమె నిరీక్షణమంతయు వ్యర్థమైనది. ఆమె విధికెదురు తిరిగి పోరాడి పోరాడి ఓడి, అలసి, సొమ్మసిలి పోయినది ! పాపము ! విధికరుణింపలేదు. కష్టములే ఆమెకు మిగిలినవి. ఓర్పుతో ఆమె కష్టములనే సహింప వలసి యుండెను.

''నా తండ్రి యింట పువ్వులు వికసించెను. కాని నీవు రాలేదు
నేను ఒంటరి తనముతో బాధపడితిని
అందఱ ఆక్షేపణములకు, ఆగ్రహములకు గురియైతి
విధి చెయ్దమున కెదురు తిరిగి పోరాడి పోరాడి అలసితిని.
విధికి ఎదురు తిరిగి ఎవరు జయింపగలరు?
ఆహా ! విధి నా కొఱకింకను ఏమి దాచియుంచెనో''

నా తండ్రి యింట మల్లియ వికసించినది. కాని నీవు రాలేదు నా నిరీక్షణ వ్యర్థమైనది.

ఆమె ఆశాభగ్నస్థితి ఎప్పటికిని భర్తయెడ నిష్ఠుర భావముగా పరిణమింపలేదు. ప్రేమవైఫల్యానుభవము నొందిన హాబాఖాటూనను ఈమెతో పోల్చి చూచినచో హాబాఖాటూను ప్రణయము కూడా ఇంద్రియ సంబంధమైనదే అయినను ఎక్కువ ఆవేశ పూరితమైనది. హాబాఖాటూన్ ప్రణయము పట్ల ఆశయున్నంత వరకు ఆనందము కనబఱచగలదు. అట్లు కాక ప్రణయ విఫలతచే నిరాశ ఏర్పడినప్పుడు కోపముతో రేగి శపింపను గలదు.

(तिमन ति म्योन त्य गछे) "నేను బాధపడినట్లు వారుకూడ బాధ పడుదురు గాక" యని పల్కియుండెను. కాని ఆర్నిమాల్ తనయెడ కేవల ప్రేమ ద్రోహ మొనర్చి, ఒక విధముగా తన మంచితనము నెడ కృతఘ్నుడుగా నుండిన ప్రియుని పట్ల ఏ మాత్రమును కోపగింపక సదా అతని అభ్యుదయమునే కాంక్షించుచు, అభ్యర్థనా భావమునే ప్రదర్శించి యుండెను.

నేస్తమా నేనేమని చెప్పుకొందును ? అతడు నాతో చాలా కాలము నుండి మాట్లాడడని అతని చెలులునన్ను చూచినవ్వు చున్నారు. అయినను అతడు దీర్ఘాయువై తన ఆ ప్రియురాంద్రకే ఆనందమును కల్గించుచు సుఖింపనిమ్ము ఆతడు సుఖముగా నున్నాడను వార్తయే నాకు ముదావహము.

"ప్రియా! నీ కొఱకు ఇల్లువిడిచి నేను పరువిడి వచ్చితిని. కాని నీవు నీ కన్నొమలు ముడిచివైచి నా ప్రేమను తిరస్కరించితివి. అయి నను నీవు చిరకాలము సుఖముగా జీవించి వర్ధిల్లుటే నాప్రార్థన"

"పచ్చికబయళ్ళలోను పర్వతపు లోయలలో నా మధుర
భావన ఆతనిని వెంటాడును. కాని అయ్యో ఆతడు లేడి
వలె తెంచుకొని పోయెను. వెళ్లుము చెలీ, నా ప్రియుని పిలుచు
కొని రమ్ము"

ఆర్నిమాల్ రచన ఇట్టిభావములతోనే కొనసాగినది.

19 వ శతాబ్దమున కాశ్మీర సారస్వతమున విపరీత సృష్టి జరిగెను. కాని ఆ శతాబ్దమున కంతకు కూడా ఒక కవయిత్రియైనను ఉన్నట్లు కాన్పింపదు. 1753 సంవత్సరమున అహ్మద్‌షా అబ్దాలీ యాజమాన్యమున కాశ్మీరమున ఆఫ్ఘనుల పరిపాలన వచ్చుట దీనికి కారణముకావచ్చును. ఆ సమయమున కాశ్మీర సంస్థాన మంతయు అల్లకల్లోల మయ్యెను. సంస్థాన వ్యవహారములన్నియు దెబ్బతిని పోయెను. స్త్రీలు తమ విద్యా వివేకములను, స్వతంత్ర ప్రతిపత్తిని కోల్పోయిరి. ఏవో కొన్ని చిన్న చిన్న బడులలో చదువుకొనుటతో వారి విద్య పూర్తియగు చుండెను. ఆ సమయమున విద్యావతియగు మహిళయే ఉన్నట్లు కనబడదు. ఈ పరిస్థితియే ఇరువదవ శతాబ్దము వచ్చిన వెనుక కూడ ఇరువది, ముప్పది యేండ్ల వరకు కొనసాగినది.

స్వాతంత్ర్యము వచ్చిన వెనుక బాలికా పాఠశాలలు, స్త్రీల కళా శాలలు నెలకొల్పబడిన వెనుక స్త్రీ విద్య అంచె లంచెలుగా అంగలు వేయుచు దేశమంతట వ్యాపించెను. స్త్రీ విద్య కింత వ్యాప్తికల్గినను కాన్వెంటు పాఠశాలలలో ఇంగ్లీషు మీడియంతో విద్యాబోధన జరుగు చుండుటచేతను, ఇతర విద్యాలయములలో ఉర్దూ, హిందీ భాషలలో బోధన జరుగు చుండుట వలనను కాశ్మీరు భాషలో రచనచేయు రచ యిత్రులే లేరని చెప్పవచ్చును.

చాలా కొద్ది మంది స్త్రీలు రేడియో ప్రసంగముల కొఱకు వ్యాస ములను, కథలను, చిన్న చిన్న గల్పికలను, రూపకములను వ్రాయుట, పాఠశాలలు కళాశాలల సంచికలకు వ్యాసములకు వ్రాయుట మొదలైన చిన్న చిన్న వ్రాతపనులను నిర్వహించు చున్నారే కాని చెప్పదగిన రచనా వ్యాసంగము గల స్త్రీలు కాన్పించుటలేదు.

కాని ఒకటి రెండు కథానికలను కాశ్మీర భాషలో రచించిన 'తాజ్ బేగమ్' అనువారు ఒక్కరు మాత్రము ప్రస్తుతము రచయిత్రిగా కనబడు చున్నారు. ఇంతకు మించి ప్రస్తుతము కవయిత్రి అని చెప్పదగిన స్త్రీలే కాశ్మీరమున నేడుకానరారు.

# గుజరాతీ కవయిత్రులు


మూలము :
శ్రీమతి సుస్మిత పి. మేధి,
B.A., P.HD., B.COM.
అహమ్మదాబాదు.

అనువాదము :
ఊ. సుహాసినీదేవి, M.A.,
బాపట్ల.


"ధన్యమగుగాక మాన్య ఘూర్జర దేశమ్ము
మాన్యమగు మాదు ఘూర్జర దేశమ్ము ధన్యమగు గాక."

అని ఒక కవి వరేణ్యుడు ప్రశంసించినట్లు గుజరాతు దేశము ఎన్నో విధముల ధన్యమైనది; మాన్యమైనది.

ఘూర్జరదేశము పారిశ్రామిక వాణిజ్య రంగముల యందలి ఘన విజయములకే కాక శ్రీకృష్ణపరమాత్మ యొక్కయు, పూజ్యుడగు మహాత్మాగాంధీ యొక్కయు జన్మలచే మిక్కిలి పవిత్రమైనదిగా ప్రసిద్ధి నొందెను. కువలయమాలా రచయిత ఈ ప్రజలను మిక్కిలి ఉచితముగా నిట్లు వర్ణించి యుండెను.

"धय लोणिय पुंङ्गगे धम्मपरें संधिविग्गाहे निहुणे।
नरुरे ललरु भणिरे अङ्क पेच्छह्र गुज्जरे अपरे"॥

ఒక రాష్ట్ర ప్రజల యొక్క జీవితము ఆ రాష్ట్రము యొక్క భౌగోళిక రాజకీయ, ఆర్థిక పరిస్థితులపై నాధార పడియుండును. ఆ దేశ సారస్వతము ఆ ప్రజల జీవితమును ప్రతిబింబించును. సారస్వతము ఆ దేశ జనుల ప్రతిభావంతమైన జీవితమునకు పిండీకృతమగు సారమగుటచే నందు ఆ జనుల ఆశలు, ఆశయములు, సంతోషములు, దుఃఖములు, భావములు, అభిప్రాయములు మొదలైన మానవ స్వభావగుణము లన్నియు ప్రతిబింబించును. గుజరాతు కవయిత్రులను గూర్చి వ్రాయుటకు ముందు గుజరాతు దేశ ప్రజల జీవితమును గూర్చి మన మొకింత తెలిసికొన వలసి యున్నది.

ఆ రాష్ట్రమునకు చుట్టును బలసియున్న పెద్ద పెద్ద సముద్రముల సాన్నిహిత్యము ఆ రాష్ట్ర ప్రజలలో వాణిజ్య వృత్తి యందును నౌకాయానాది సాహస కార్యము లొనర్చుట యందును సహజమగు ఆసక్తిని కల్గించి వారిని ప్రోత్సహించెను, సాహసిమైన గుజరాతు దేశీయుడు వర్తక వ్యాపారము లొనరింపని ప్రదేశము ప్రపంచములో నెక్కడను కాన్పింపదు. గుజరాతు నౌకాశ్రయములును, సముద్ర వ్యాపారమును ఏనాటి నుండియో అంతర్జాతీయ గౌరవ ప్రతిష్ఠలను కలిగియున్నవి. ఈ కారణము చేతనే, గుజరాతీ జానపద సాహిత్యము వర్తకుల జీవితగాథలతోను నావికుల జీవిత గాథలతోను నిండియుండును. అట్లె విరహిణులయొక్క మనోభావములే గుజరాతు కవిత్వమునకు జీవమై యుండుటయు సంభవించెను. ఈ కారణముల వలన గుజరాతు దేశీయులు ఒక వంక వ్యాపార దక్షతను, వేరొక వంక లౌకిక ప్రతిభా నైపుణ్యములను ప్రదర్శింపగల సమర్థులై యున్నారు. గుజరాతు దేశము నందలి ప్రజల ముఖ్యవృత్తి వ్యవసాయము. ఇది ఆ దేశీయుల శాంతి ప్రియత్వమును సూచించును. వారు సాహసులు, చురుకైన వారేకాక మూఢ విశ్వాసములు లేని విశాల హృదయులు. ఆదేశ ప్రజలు ఐశ్వర్య వంతులగుటచే అచటి ప్రజలు చేతిపని కనిష్టము చూపెదరు. ఈ విధమైన గుజరాతు ప్రజాజీవితమునంతను గుజరాతు సాహిత్యము బాగుగా ప్రతిబింబించును. ఇచ్చటి యీ భౌగోళిక పరిస్థితులే ఈ సారస్వతము యొక్క విశిష్ట స్వభావగుణములకు మూలము. ఇంతకంటె ఎక్కువగా ఈ దేశముయొక్క సాంఘిక రాజకీయ పరిస్థితులు కూడ ఈ దేశ సారస్వతాభివృద్ధికి తగినంతగా సహాయ మొనర్చినవి. గుజరాతీ భాషయందు సారస్వతము ఒక వేయేండ్ల క్రితము నుండి లభించును. అంతకు ముందు భారతదేశము నందున్న అన్ని ప్రాంతముల యందును దాదాపుగా సంస్కృతము నందే సాహిత్య సృష్టి కావింపబడు చుండెడిది. తరువాత భారతదేశము నందలి యన్ని దేశభాషలును ఒకే మారుగా వృద్ధిపొందినవి. 11 వ శతాబ్దాంత్యభాగము మొదలుకొని 12 వ శతాబ్ద మధ్యభాగము

వఱకును గుజరాతీయుల సారస్వతము సంస్కృత భాషయందే యుండెను. ఘూర్జరదేశ భాష శౌరసేని అపభ్రంశము - కవుల దృక్పథము నను సరించియు, వివిధ సాహిత్య ప్రక్రియా ధర్మములను బట్టియు, రచనా క్రమమును బట్టియు ఈ సారస్వతమును రెండు విధములుగా విభజింప వచ్చును. 12 వ శతాబ్దము నుండి 19 వ శతాబ్దము వరకు అనగా హేమ చంద్రుని నుండి దయారాము వఱకు - గల సారస్వతమును మధ్యయుగ సారస్వతమనియు 1850 మొదలు ఉత్పన్నమైన సారస్వతమును ఆధునిక సారస్వతమనియు రెండు విధములుగా ఈ విభజనను గుర్తింప వచ్చును. చారిత్రక దృష్టిని పరిశీలించినచో ముస్లిం యుగము నందలి సాహిత్యమును మధ్యయుగమనియు, బ్రిటిషు పరిపాలన యందలి సాహిత్యమును ఆధునిక మనియు పేర్కొన వచ్చును. గుజరాతీ సాహిత్యము యొక్క సాంఘిక రాజకీయ భూమికను గూర్చి ముచ్చటించుట మిగుల ఆసక్తి కరమైన అంశము.

1299 వ సంవత్సరమున గుజరాతు దేశమున మహమ్మదీయ పరి పాలన ఆరంభమయ్యెను. అంతకు ముందు దేశమున గల కళాకారులను హిందూ ప్రభువులు బాగుగా పోషించి యుండిరి. తమ మతాచారముల యెడ మూఢ విశ్వాసము కల మహమ్మదీయ ప్రభువురాకతో హిందూ దేవాలయములను, విగ్రహములను బ్రద్దలు కొట్టుట బలవంతపు మతాంతరీ కరణములు, హిందూస్త్రీలను చెఱబట్టుట మున్నగు ఉపద్రవ కార్యము లెన్నియో జరిగెను. దీనితో ప్రజా సామాన్యము పల్లెలకు వలస పోవుటయు, వారితోబాటు గుజరాతీ కళాకారులును పల్లెలకేగుటయు సంభవించెను. ఈ వలస గుజరాతు సాహిత్యమునకు ప్రయోజనకారిగానే పరిణమించినదని చెప్పవచ్చును. రచయితలు సంస్కృతమును వదలి తమ దేశభాషయగు అప భ్రంశమునందే రచింప గడంగిరి. మహ్మదీయ సంబంధముచే ఏర్పడిన అప భ్రంశ పారసీ భాషల మేళనము వలన ఒక విధమైన క్రొత్తభాష యూ విర్భవించెను. అందలి సారస్వతముకూడ సామాన్య మానవుని అభిరుచు

లకును అభిప్రాయములకును అనుగుణముగా విభిన్నరూపముల నభివృద్ధి నొందం మొదలిడెను. ఈ సందర్భమున పేర్కొనదగిన ముఖ్యాంశ మేమనగా 13 వ శతాబ్దమునుండి 15 వ శతాబ్దము వఱకు సృష్టింపబడిన సారస్వత మంతయు జైన సాధువుల సృష్టియే యనునది. ఆ కాలమున హిందువుల రచనలు లేవనియే చెప్పవచ్చును. తమ పరిస్థితులు భద్రముగా లేక పోవుటచే వారు రచన కావింపలేక పోయిరని మనమూహించుకొనవచ్చును. ఒకవేళ వారు రచించి యున్నను వారి రచనలు భద్రపరుపబడి యుండలేదనియైన మన మూహింప వచ్చును. జైనుల వసతుల యందు మాత్రము ఈ పరిస్థితికి కేవలము వ్యతిరేక స్థితి కనబడు చున్నది. జైన మఠములు మిక్కిలి ప్రశాంతములుగాను, శాంతి కేంద్రములుగాను నుండెడివి. అంతేకాక వారు తమ మత ధర్మములను ప్రజలలో ప్రచారము కావించుటకై ప్రజల కర్థమగు సులభ భాషలో రచించెడువారు. రాస్, ప్రబంధ, ఫాగూ పద్యములు బాలావబోధ్ పద్యకథలతో కూడిన జైన సారస్వత మంతయు ఉపాశ్రయముల యొక్క నేల మాళిగలలో నిక్షిప్తము చేయబడి భద్రపరుపబడెను.

ముస్లిం ప్రభువులకు భయపడి వలసవెళ్లిన హిందువుల పరిస్థితియు నిరాశా నిస్పృహలకులోనై పెక్కిడుములపాలై నానాటికి క్షీణింప నారంభించెను. పైనుండి ముస్లీముల దండయాత్రలు, లోపల లోపల విచిత్ర కల్లోలములు దురాచారములు వీనితో సమాజము అస్తవ్యస్త మయ్యెను. సమాజము ఎంత అస్తవ్యస్తముగా నున్నను, సమాజమున వినోదాపేక్ష పూర్తిగా నశింపలేదు. కత్‌పుతలీ బొమ్మలాట తాడునృత్యము మొదలైన అద్భుత విద్యలు, భావాయికథలు, అద్భుత గాథలు పామరజనమును రంజింప చేయుచునే యుండెను. శ్రీ వల్లభాచార్యుల వైష్ణవ మతము, స్వామి నారాయణుల సాంప్రదాయము జైనమతమును గుజరాతు ప్రజల మత దృక్పథమును పెంపొందించి అది వారి నిత్యానుష్ఠానమున సరిగా నిర్వహింప బడుటకు తగినంతగా తోడ్పడినవి.

మధ్య యుగమునాటి సారస్వతము ఆనాడు ముద్రణా సౌకర్యము లేకుండుటచే చేతి వ్రాతలోనే యుండెను. వ్రాతకూడ లేని కొంత సారస్వతము హృద్గతముగ వల్లెవేసి ఒక తరమునుండి ఒక తరము వారికి అందించుట ద్వారా నిలిచియుండెను. ఈ సారస్వతము నందుగల ఇంకొక ప్రత్యేకత ఏమనగా అది పద్య చ్ఛందస్సుగా నుండుటయే కాక హెచ్చుగా మత ప్రమాణ గ్రంథజాతికి చెందియుండెను.

నరసింహా మెహతా కాలమునుండి భక్తిమార్గ సాంప్రదాయిక సారస్వతము మిక్కిలి త్వరితముగా వ్యాప్తిచెంది అభివృద్ధి చెందెను. ఆనాటి సారస్వతము పౌరాణిక పద్య కావ్యముల రూపమునను ప్రబోధాత్మక ముగను, నీతి దాయకముగను, మతాధారముగను నుండి శివశక్త్యారాధన రూపమున వాడుకలోనికి వచ్చెను. ఈ సారస్వతము నందు ప్రకృతి సౌందర్య చిత్రణము కాని, జీవితము నందలి ప్రణయానంద పారవశ్యము కాని ఏమాత్రము వర్ణితము కాలేదు.

## మధ్య యుగ రచయిత్రులు - భక్తి

మధ్యయుగ రచయిత్రులు కూడ ఆనాడు సమాజమున వ్యాపించి యున్న సామాన్య స్థితిగతులకు లోనైన వారే. వారి రచనా విషయము కూడా మతసంబంధమే. భక్తి భావ వికాసము మతమున కభిన్నమైనదని గ్రహింప గల్గుట ప్రశంసా పాత్రమగు విషయము. 11, 12 శతాబ్దములలో ఇట్టి భక్తి మార్గము భారతదేశమును ఉప్పెనవలె ముంచి వేసెను. మధ్య యుగ సారస్వతమును పరిశీలించినచో ఈ భక్తి భావ ముద్రదానిపై సంపూర్ణముగ కాన్పించును. ఆ కాలము నందలి భక్తకవుల సంచారము వలనను; తీర్థయాత్రల వలనను, గుజరాతు దేశము, ఆదేశ సారస్వతము కూడ మిక్కిలి ప్రభావితములైనవి. అంతేకాక గుజరాతు దేశము నరసింహా మెహతా, *మీరాబాయి మున్నగు భక్త కవులకు జన్మభూమి కూడనై యున్నది.

---

*మీరాబాయి రాజస్థాన కవయిత్రియని బహుధా విశ్రుతము. వీరిట్లు వ్రాయుటకు కారణమేమో ?

— సంపాదకురాలు.

**మీరాబాయి :**

మీరాబాయి కవయిత్రులలోనే కాక సమస్త గుజరాతు సారస్వత క్షేత్రమున గల కవిశేఖరులలో నొకర్తుక. గుజరాతు సాహిత్యమునకే కాదు; అఖిల భారత సారస్వత క్షేత్రము నందును ఆమె గేయములకు కలస్థానము అద్వితీయము. హిందీ గుజరాతు సాహిత్యములు రెండును సమముగ మీరా బాయి సారస్వతముపై తమ హక్కును ప్రకటించు కొనును. మీరాబాయి కవితను గూర్చి ప్రస్తావించుచు డా. టెస్సిటరీ ఆమె ప్రాచీన పశ్చిమ రాజ స్థానీ భాషయందు కైతనల్లెనని పేర్కొని యుండెను. కాని మీరాబాయి తనంతతానై ఏ భాషయందును వ్రాసియుండకపోవచ్చును. కాని ఆమె గేయములు పద్యములు ఏభాష వారు పాడిన నా భాషలో నున్నవి.

ఆ పాటలను ఎప్పటికప్పుడు వ్రాసికొనిన లేఖకులు తమతమ భాషల లోనికి, లిపులలోనికిని తెచ్చియుందురు. కాలము గడచిన కొలది గుజరాతీ రాజస్థాను దేశీయు లిర్వురును ఆమె గేయములను తమ తమ భాషలలోనికి వ్రాసి కొనిరి.

అందువలన మీరాబాయి రాజస్థానమునందలి మేవాడుకు చెందినదై నను ఆమె రచనలపై గుజరాతీ సారస్వతమునకే సంపూర్ణమగు హక్కు కలదు. దీనికి తోడు మీరా తన చరమ జీవితమును గుజరాతులోనే గడ పెను. ఆమె తాను గుజరాతులో ఉన్నపుడే పద్యరచన చేసి యుండవచ్చును. ఆమె గుజరాతు దేశమునకు చాలా పరిచయస్థురాలగుట వలన గుజరాతు ప్రజలు ఆమె రచనలను గుజరాతు భాషలోని కనువదించుకొని యుండ వచ్చును. ఈ విషయములన్నియు పరిశీలించినచో ఆమె రచనలకు హిందీ సారస్వతము నందున్నట్లే విశిష్టమైన ఒక నిశ్చల స్థానము గుజరాతు భాష యందు కలదనుట నిర్వివాదాంశముగ తేలగలదు.

మీరాబాయి రాజపుటానా యందలి చిన్న సంస్థానమైన మెడ్ టాకు ప్రధానిదైన రావుదుదాజీ మనుమరాలు. ఆమె 1499లో జన్మించెను, ఆమె తాతగారు గొప్ప కృష్ణభక్తులు. తమ యింటికి తఱచుగ నేతెంచు

భక్తులయొక్క, సాధువులయొక్క, సన్యాసులయొక్క నిత్య సందర్శనము మీరాబాయిపై గొప్ప ప్రభావము కల్గించి బాల్యము నుండియు ఆమెను కృష్ణ భక్తురాలుగా నొనర్చెను. మీరా హృదయము భాగవత భక్తి సిద్ధాంతములచే ఆకృష్ట మయ్యెను. ఆ దినములలో చైతన్యస్వామి, వల్లభా చార్యులచే వ్యాప్తి గావింపబడిన భక్త్యారాధనకు బృందావనము ప్రధాన కేంద్రమై యుండెను. ఈ ఆరాధనపద్ధతి అటనుండి గుజరాతు రాజస్థానము లకు వ్యాపించెను. ఇట్టి వాతావరణము నందు మీరాబాయి పెరిగెను. ఈ భౌతికాభివృద్ధితో బాటు ఆమె ఆంతరంగిక ప్రవృత్తి కూడా భక్తి వాతావరణములోనే నానాటికి పెంపొందెను. చితోడు రాణాసంగు కుమారుడగు భోజరాజుతో ఈమెకు పెండ్లియాయెను. కాని అతడు క్రీ. శ. 1517లో మరణించెను. ఇట్టి దురవస్థ ప్రాప్తించిన తర్వాత బాల్య దశ యందే ఆమె హృదయమును కేంద్రముగా .చేసికొని అంకురముగా ఆమె యందు అణగియున్న భక్తి ప్రభావముచే ఆమె అంత కంతకు మత విషయక వ్యాసంగమును వృద్ధిగావించుకొన జొచ్చెను. క్రమ క్రమముగా ఆమె యొక్క ఈ భక్తి తత్పరత బాగుగా పెరిగి ఐహికములైన వాంఛా ప్రవృత్తులను సంపూర్ణముగా త్యజించునంత ఉన్నత స్థితికి వచ్చెను. ఆమె ఆంతరంగిక మానసిక స్థితిని గూర్చి ఆమెయే ఈ క్రింది విధముగా తన రచనల యందు చక్కగా చిత్రించి యుండెను.

"గిరిధర గోపాలుడు నావాడు. నావాడు మాత్రమే. ఇతర విషయ ముల యందు నాకు ఆసక్తి యేమాత్రమును లేదు." ఆమె ఈ ప్రాపంచిక జీవితమును అసత్యమనియు, మిథ్యయనియు సంభావించెను. ఆమె దృష్టి యందు నిజప్రపంచమనగా కృష్ణపరమైన సంకీర్తన, సంస్తుతి మాత్రమే. ముఖ్య వ్యాసంగముగా గల కృష్ణప్రేమ, కృష్ణభక్తి ప్రపంచమే ప్రపంచము. భోజరాణా చిన్న తమ్ముడైన విక్రమాదిత్యరాణా ఆమె వైఖరిని ఆమోదింపక పోవుటయే కాక అది తమ కుటుంబమునకు అప్రతిష్ఠాకర మని కూడ అతడు భావించెను. తన వదినగారైన మీరాబాయినిదిద్దుటకై

అతడు శక్తి వంచన లేకుండ, సర్వ విధముల, సర్వ మార్గముల యత్నించెను. ఆమె నా మార్గము విడువుమని బలవంతము చేసెను. ఒక విధముగా లోభపఱచెను. కాని అదంతయు నిష్ఫల మయ్యెను.

మీరాబాయియే ఈ సందర్భమును గూర్చియిట్లు చెప్పియుండెను.

"अब तो बात फैल गई जाने सब कोई ।
दास मीरा लाल गिरिधर होनी होई ॥"

"ఇపుడు ఈ సంగతులంతయు బాగా వ్యాపించి పోయెను. అందరకును తెలిసిపోయెను. అయినదేదో అగుగాక. మీరా గిరిధర ప్రభుని బంధన యందు మాత్రమే ఉన్నది."

ప్రపంచ పద్ధతియు, యోగుల పద్ధతియు పరస్పర వ్యతిరేకముగా నుండును. గుజరాతు దేశమున బాగుగా వ్యాప్తమైయున్న కథను బట్టి రాణా విక్రమాదిత్యుడు మీరా ఉసురులను గొనుటకు మూడు మార్లు యత్నించెననియు, మూడు మార్లును శ్రీకృష్ణభగవానుడు వచ్చి ఆమెను రక్షించెనని తెలియుచున్నది.

రాణా మూర్ఖత్వముచే మీరా పెక్కు ఇడుముల పాలయ్యెను. ఆమె శాశ్వతముగా చితోడును విడిచి ప్రశాంతముగా నిర్విఘ్నముగా కృష్ణపూజన మొనర్చుకొనుటకె "మేడ్టా" చేరెను. కాని అచట కూడ ఆమెకు శాంతి లభింపక పోయెను. అందువలన అక్కడ నుండి బయలుదేరి ఆమె బృందావనము చేరెను. అక్కడ నుండి ఆమె మఱల గుజరాతులోని ద్వారక చేరెను. అచ్చట ప్రశాంత చిత్తయై, భక్తి తత్పరురాలై ఆమె తన చరమదశ నంతను అక్కడనే గడపెను. ఇంచుమించు 1547 సం॥ ప్రాంతములలో ఆ మహానుభావురాలు భౌతిక కాయమును విసర్జించి వైచెను. తన జీవిత విధానమును గూర్చి ప్రస్తావించిన ఒక పదమునందు "గోవిందుడు నా ఆత్మ" ప్రపంచము నన్ను తిరస్కరించినది. నేను నా రాముని ప్రేమింతును. నేనన్య మెఱుగను. హరి భక్తులు మీరా భజన మందిరమున నుందురు. భగవానుడు మోసగాంఢ్ర నుండి తప్పించుకొని

నిత్యము నా మిత్రులైన యోగుల సజ్జనివసించును.'' అని రచించెను. మీరా అను నీ పేరు ఆమెకు నిజ నామము కాదని కొందఱందురు. రామానందశిష్యుడైన రాయిదాసు ఆమె గురువు. ఈ విషయమును ఆమె కొన్ని పదములలో ఉదాహరించెను. అంతేకాక రాయిదాసు పదములకును, మీరా పదములకును గొంత సారూప్యము కూడా కన్పట్టు చున్నది.

" प्रभु जी तुम चंदन हम पानी " ప్రభూ నీవు చందనము నేను నీరునై యున్నాను.

వలపు బంధము త్రెంచెదవే ప్రియా
ఇది నీకు తగును
కలుపనే కాని త్రెంపంగ
నేను తగను తగను
నీదు సంగము త్రెంచి ప్రియా
పరి సంగమ్ము పెంచగలను.

మీరాబాయి గేయములపై ఏదో కొంత వల్లభ చైతన్యుల యొక్కయు వారి శిష్యుల యొక్క అభిప్రాయ మత ప్రభావము కనబడును. కాని మొత్తముపై ఆమె గేయము లన్నియు నామె సహజో పజ్ఞా కలితములు సహజ సుందరములు. కథానికల వంటి రెండు మూడు కావ్య భాగములు తప్ప మీరాబాయి యొక్క తక్కిన రచన యంతయు భావోద్రిక్తమగు చిన్న గేయములుగానే యుండును. 'సద్భమను, రుసను' "నరసింహా చమరయేరా'' అనునవి ఆమె కథా కావ్యములు కాని ఆమె కవిత్వ వైభవ మంతయు చిన్న గేయములందే నిహితమై యుండెను. శ్రీ విజయరాయ్ వైద్య మోరెక్లీ ''అను ఒక గుజరాతీ విమర్శకులు ఆమె కవిత్వమును గూర్చి'' నిజముగా (ఈమె రచన) అద్భుతమైనది. నిజముగా ధైర్యసాహసములతో కూడినది అని ప్రశంసించెను. నిజముగా ఆమె కవిత్వ మట్టిదే. ఎందువల్లననగా ఆమె ప్రదర్శించిన కృష్ణ భక్తి యందు మనకు అద్భుతతావహమైన, సౌందర్య శృంగార కల్పన కన్పట్టును. ఆమె భక్త్యనుసరణ మొనర్చి ప్రపంచము నుజ్జగించునపుడు స్వ

ధైన మేవాడు శౌర్య సాహసము లందు ప్రతి బింబించెను. ప్రాపంచిక బంధముల యెడ గల్గిన వైముఖ్యముచే ఉత్పన్నమైన అకలంక భావముతో నొనర్పబడిన శ్రీ కృష్ణ ప్రభువుని ప్రేమ సంకీర్తన గానముచే ఆమె తన సంకల్ప భావములను అమర మొనర్చెను. విషయాసక్తిని విషయ బంధములను, ఇంద్రియ వశ్యతను త్యజించుటయే కాక తన సర్వ సంగ ములను, తన సకల బంధములను శ్రీకృష్ణాన్వేషణమున కల్పించుకొని అత్యంతానంద పారవశ్యముల ననుభవించు చుండెడిది. "మోహాన నీ ముఖ సౌందర్యముచే మోహితనై ఆ కృష్టనైతిని ఓ శ్యామల నీవే నాకలం కారము. నీవే నా సౌందర్యము, నీవే నాధనము. నా సర్వస్వము." స్త్రీలకు అత్యంత ప్రీతి పాత్రములైనవి అలంకారములు. మీరాకు శోభనాలంకార ప్రియుడైనవాడు మాత్రము శ్రీకృష్ణుడే. వితంతు స్త్రీయొక్క కష్టము లను, దుఃఖాతిరేకమును కూడ ఆమె తన గీతికలలో వెలిబుచ్చెను. చిత్ర విచిత్ర వర్ణములుకల వస్త్రములను నేను ధరించుచో నేమైన మాలిన్య మంటవచ్చును. నల్లని వస్త్రములనే ధరించుచుచో మాలిన్యమే యుండదు. లేక లౌకిక ప్రవృత్తికల సామాన్య మానవునకు సుఖము చాల తక్కువ. వైవాహిక జీవితమున ఎల్లప్పుడును లోపము లుండుటచే ఎప్పుడును తాపమే కలుగు చుండును.

ఆమె కవిత యొక్క ముఖ్య ఇతివృత్తము కృష్ణప్రేమ ఒక్కటియే శాశ్వతము. ఆమె ఈ అభిప్రాయమును అతి మనోహరముగ కళా నైపుణ్య ముట్టిపడునట్లు వివిధరీతులలో వెలువరించును. ఈ కళానైపుణ్యమే ఆమె కవితకు ప్రధానమైన చైతన్యావేశ వైవిధ్యముల నొసంగ గల్గును. ఆమె గీతముల యందు శాశ్వతుడైన కృష్ణుని యెడ రూపొందిన మానవా కాంక్షను హృద్యముగను, సరళముగను అభివర్ణించెను.

శ్రీకృష్ణ ముఖారవింద సందర్శన భాగ్యము కొఱకైన తహతహ పాటు సుకుమారమైన చిత్తోన్మాదము తోడిబాధాను భవము ఆమె గీతము లలో ధ్వనించు చుండును.

ఉన్మత్తనైతి నీదర్శనోత్కంఠతో
ఒరుల కెఱుకయే గాదు ఈ బాధ అది యెట్టిదో
"నిఖిల సుఖముల త్యజియింప
అఖిల నాయక తగునె మురిపింప"

"కృష్ణ ఈవె నా జీవన్మరణ సఖివి
ఈవె నా బ్రదుకు నైదోడు! అవల నీవె"

"తృష్ణ ద్యజియించితిన్ బవలు రేలు
నిన్ను విడువంగజాలను పవలు రేలు"

"కంటి పాపకు కాంతి రేఖవగుచు
కంటి వెలుగుగ నుంటివోహోహో కృష్ణ
బ్రదుకు శూన్యమ్ము శూన్యమ్ము ప్రభువు లేక"
"గాయపడిన వారి స్థితి గాయపడిన వారికే తెలియును"

మీరా తన వియోగ దుఃఖమును వర్ణించిన ఇట్టి గేయము లెన్నియో కలవు. ఈ వియోగ బాధను వర్ణించినపుడే మఱల ఆమె కృష్ణ ప్రభునకును తనకును నడుమ గల అవినా భావము. అద్వైవిధీ భావమును గూర్చి కూడ ఒత్తి పలుకును. రెండు వియోగ హృదయముల యందలి అభిరతిని బాధను, కాంతును విచారమును అభివర్ణించుచు ఆమె దాదాపు 250 గీతములను వ్రాసియుండెను. తాను గాఢముగా వలచి వలపించు కొన్న శ్రీకృష్ణ ప్రభుని సంగతిని, దాని వలన కలుగు ఆనందమును వర్ణించిన గేయములు చాలా కొద్దిగా మాత్రమే ఉన్నవి. శ్రీకృష్ణుని కొఱకు తాను పడిన బాధా వేదనలను వర్ణించిన గేయములలో పదజాలము చాలా సరళము గను సూటిగను ఉండియుండెను. ఇంతేకాక శ్రీకృష్ణస్వామితో తాను పొందిన అనుభవైక వేద్యమగు తల్లీనావస్థ వర్ణించుట కామెకు పద జాలము చాలక పోయినది. ఆమె, తన సాధనయం దధిగమించిన ఆనంద పారవశ్యమును వర్ణించిన గేయము గుండెలను జలదరింప జేసినది. శ్రీకృష్ణ

భగవానుడామె గృహమున కేతెంచి ఆమెతో ఆడి పాడినటు లూహించి ఆమెకు కల్గిన అతీయమైన ఆనందానుభూతిని కూడ ఆమె కొన్ని పదములలో వర్ణించి యుండెను. ఆమె తన బాధలను, కాంక్షను తెలుపుకొనిన పద్యముల యందలి భావనా శక్తి చూచినచో ఆమె రచించిన యీ పదముల యందు కానరావు. కృష్ణపరమాత్మ కొఱకు ఆమె యనుభవించిన వ్యధను వర్ణించు నామె పద్యముల యందు ఉత్తమమైన భావకవితా సౌందర్య శోభయంతయు ప్రదర్శింపబడెను. ఆమె యీ కావ్యమును చదువువారు ఒక గోపి వ్రజకులము నుండి బయలుదేరి శ్రీకృష్ణ మార్గాన్వేషణమున తిరుగాడు చున్నదా యను తలంపునకు లోనగుదురు. కృష్ణలీలలను, గోపికా కృష్ణుల పరమ శృంగారమును వర్ణించిన పట్టులతిలోకములై హృదయమును స్పందింప జేయుచుండును. ఆమె గీతము నందలి కిశోరుని.

"నల్లనయ్యా - రావయ్యా
నందబాలక - రావయ్యా
నాదు కనుల నిన్ను నిలుపుకొంచు
నాదరించెదనయ్యా నల్లనయ్యా"

ఇంకొక గేయమున మీరా తానొక వ్రజనారియై మాధవుని అమ్ముటకై బేరగాండ్రను పిల్చుచు అరచుచున్నట్లు వర్ణించినది.

"పనులు లేవె మాయింట గోపాలబాల
ఏల చీరేమ - రాలేను - నందబాల"

"కృష్ణదేవున కీబాధ తెలియదనుచు
తృష్ణ తీరక చేతుల నలుపుకొనియె గోపి"

ఇట్టి పద్యములను చదివిన మీరా మూర్తీభవించిన రాధ యని తోచక మానదు. ఒక్కొక్కచో మీరా తాను శ్రీకృష్ణుని తల్లియగు యశోద పాత్ర ధరించి "తీసికొనుము గొంగళి, కట్ట తీసికొనుము। మేలుకొల్పుము జగతిని మురళినూది, ముగ్ధ మోహన రాగాబ్ధి ముద్ర తేలి। మోహముం

బాయి లోకమ్ము ముద్దుగుఱ్ఱు" అని కృష్ణుని హెచ్చరించును. ఒకప్పుడు తనకు ప్రియమైన కృష్ణుని ముగ్ధ మోహనాకృతిని, చిలిపిచేష్టలను ఈ విధముగా భావించి తనలోతానే మురిసిపోవును.

"ప్రియు చకోరిక కూయిడె; పింఛమెత్తి
నెమలి క్రేంకార మొనరించె నెమ్మితోడ
ముద్దు కోయిలపాడెను హద్దుమీరి (ముద్దుగులుక)
మెఱసె సౌదామినీ ప్రభమింట రాధ
ఉరుము లురిమెను నన్భీతు నురిమిచూచి
పిల్లగాలు లీ యులివుల నెల్ల మోసె
పిల్లతుంపురు సాగెను మెల్ల - మెల్ల
నీదు భ్రుకుటియె కొనితెచ్చె నిటకునన్ను
కొంగు తడసెను కాంచవే కోమలాంగి
అనుచు రాధను బులిపించు నందగాడు
మనసు హరియించు నెప్పుడు గొనబు గులుక"

మీరా కొన్ని నీతిబోధకములైన పద్యములనురచించెను. ఒక్కొక్కమాఱు ఆమె రచన అతిశయ కరుణరసముతో నిండియుండును.

మీరా విశ్వమోహనుడైన కృష్ణదేవుని దివ్యసౌందర్యమును మధుర వంశీరవమును మనోహరముగా చిత్రించెను. శ్రీమతి లీలావతీమున్షీ మీరా కవిత్వమునుగూర్చి చెప్పినట్లు ఆమె ఒకే ఒక విషయమునుగూర్చి చెప్పియుండుటచే ఆమె కావ్యవస్తువుయొక్క పరిధి నియమితమైనది. ఆమె రచనయందు వైవిధ్యముకంటె మాధుర్యము, సౌకుమార్యమును హెచ్చుగా కాన్పించును. మీరా తన ప్రతిభనుగూర్చి ఎక్కడను చెప్పుకొనలేదు. కేవల భావప్రగాఢదీప్తియే యందు ద్యోతకమగుచుండును. ఆమె కవిత యందు మితిమీరిన శృంగారముకాని, మించిన గూఢభావముకాని కాన్పింపవు. మీరా రచనలయందు కొంచెమైనను శారీరకమైన వాంఛ కాన్పింపదు. ఆమె సమకాలికములైన కొన్ని గుజరాతీరచనలయందును,

కొన్ని పర్షియను సూఫీరచనలయందును ఒక్కొక్కచో ఇంద్రియ సంబంధమైన ప్రేమ, ఒక్కొక్కచో అసభ్య శృంగారమును సూచించు భావములు ప్రదర్శింపబడినవి. కాని మీరా రచనలయందుకూడ అంతటను శృంగార రసము దాగుడుమూత లాడినను స్త్రీ సహజమైన లజ్జాశీలమును, నాజూకుతనమును ఆమె యెంతమాత్రమును విడువలేదు.

"ఒక గోపిక తీసికొనివెళ్ళుచున్న పెరుగుకుండను (ఉరగశయనుడైన) శ్రీకృష్ణుడు పగులకొట్టెను. దానితోబాటు (శ్రీకృష్ణుడు) ప్రేమ మర్యాదనుకూడ భగ్నమొనర్చెను."

"महिनी मटकी फोडी प्रीतनी रीत सद तोडी"

ఆమె కవితయందు ఇంతకుమించిన అనౌచిత్యము కానరాదు వయసుమళ్లినతర్వాత ఆమెవ్రాసిన కవిత్వమునందు, ఒకవిధమైన స్థిమితత్వము, ప్రశాంతత, గంభీరత కాననగును. వర్ష ఋతువుపోయి శరదృతువు వచ్చునప్పటికి నదులు, చెఱువులు ఉరవడితగ్గి ప్రశాంతస్థితికి వచ్చినట్లు మీరా కవితయందు ప్రౌఢ వయోనిర్భరత కానసగును. రొదతో గంతులువేయు భావావేశపు పొంగులుతగ్గి మెల్ల మెల్లగా ప్రశాంతస్థితి ఏర్పడుట మనము కాంచగలము.

"ఈ దేవమందిరము పాతదై శిథిలమై పోవుచుండెను
కాని యిందలి హంసమాత్రము ఇంకా తరుణముగానేయుండెను"

"जूनूं तो थंथुरे देवल, जूनूं तो थंथु मारो हँसलो नानों ने देवल जूनूं तो थंथुरे ।"

ఇది ఆమెయొక్క సరళమైన వేదాంతతత్త్వమును ప్రతిబింబించును. ఒకానొక భావవికృతి, సౌకుమార్యము, మాధుర్యము, అనుకంప మున్నగు లక్షణము లెన్నియో ఆమె కవితయందు ప్రస్ఫుటమగుచుండును. ఆమె రచన సకలమానవ హృదయములను స్పందింపచేయునట్టియు, మర్మస్పర్శముగా చొచ్చుకొనిపోవునట్టి మాధుర్యాది గుణములతోకూడిన ఆమె కవిత్వకళ విశిష్టమైనది. నిరాడంబరశైలియే ఆమె కవిత్వమునందలి కళా

నైపుణ్యము, అని మున్షీ మహానీయుడు ప్రశంసించియుండెను. ఒక మహా రాజపుత్రికయై జన్మించి, మహారాజ్ఞీమణియై వెలుగొందిన మీరాబాయి తీవ్ర వైరాగ్యప్రవృత్తికల యోగినిగా పరిణామమొందుట అనునట్టిది చరిత్రయందే అసదృశమైన సంఘటనము, సామ్రాజ్ఞియైన కవయిత్రి మీరా అఖిలభారతదేశమునకే ఒక అమూల్యాభరణము. ఆమె రచనము కేవల గుజరాతీ, రాజస్థాన సాహిత్యముల కమూల్యసంపదలగుటయేకాక అఖిల భారత సారస్వతములయం దద్వితీయస్థానము నలంకరించెను. మీరాబాయి గుజరాతు సంస్కృతియొక్క అమూల్యనిధి (సంపద). ఈ కవయిత్రీమణి గుజరాతు వాఙ్మయాంబరమున అద్వితీయ కాంతిసంపదతో వెలుగొందిన దివ్యతార !

ఇంద్రావతి :

మీరాబాయి తర్వాత కాలమునుబట్టి ఇంద్రావతియను కవయిత్రిని పేర్కొననగును. ఈమె 17వ శతాబ్ద్యాదిని ఉన్న కవయిత్రియని సులభ ముగా భావింపవచ్చును. పైన చర్చించినట్లుగా ఈకాలమునందలి సార స్వతము మతముతో మేళవించియుండెను. దీనికితోడు ఆనాటి సాహిత్య కారులకు వారికి తమకళనుగూర్చి స్పష్టమైన భావములులేనట్లు కన్పించు చున్నది. అందుచే ఆనాటి రచయితల జీవితవివరములు అంత సులభముగా తెలియకున్నవి. ఇంద్రావతి జీవితచరిత్రకూడ ఈ తరగతికిచెందినదే. ఆమె కొన్ని రచనలనుబట్టి ఆమెనేతమ్ పూరీకి చెందినట్లును, ఆనాడు ప్రసిద్ధి వహించిన సిద్ధుడు కిదరుజీ శిష్యురాలైనట్లును, ప్రణామి సంస్కృతి ననుష్ఠించునది అనియును, ఆమెరచనలు కొన్నిటివలన తెలియవచ్చును. భగ్నప్రేమికుని ఆవేదనను వర్ణించిన ఈమెకావ్యము (ఈమెయొక్క వ్రాత ప్రతి) (1792) 18వ శతాబ్దియందలి ఒక రాజస్థానీలేఖకుడు వ్రాసినట్లు కనబడును. దీని రచనా నిర్మాణమును, ఆకృతియు పూర్ణముగా గుజరాతీయే. కాని ఇందు హిందీ ఛాయ, స్వభావమును కనబడుచున్నవి.

అముద్రితమైన ఆమె ఒక ఖండకావ్య సంపుటియందు ఆమె వైష్ణవ

ధర్మసంప్రదాయమునకు చెందినదని తెల్పుట కాధారమైన శ్రీనాధజీ ఆభరణముల వర్ణన కానవగును. ఈ శ్రీనాధజీని ఈమె 'శ్రీజీ' అని తన రచనయందు వాడుటయే దీనికి నిదర్శనము. ఇది ఒక్కటితప్ప ఆమె కవిత్వమునందు పుష్టిమార్గ (వైష్ణవమత) చిహ్నములు కాన్పింపవు. శ్రీ కె. కె. శాస్త్రిగారి అభిప్రాయమేమనగా ఆమె రాధావల్లభి సాంప్రదాయమునకు చెందినదని అట్లే యైనచో ఆమె 16వ శతాబ్దికి చెందినదని, అట్లేయైనచో ఆమె 16వ శతాబ్దికి తరువాత జీవించియుండియుండును. ఆమెరచనలు (పద్యములు) బారమాసీ (बारमासी) పద్ధతికి చెందినవి. ఈ పద్ధతి కవిత్వమంతయు విరహతాపవర్ణనతో నిండియుండును. ఇంద్రావతి కవిత్వములో ఈ సంప్రదాయము చాలాకాలమునకు పిమ్మట పునరుద్ధరింపబడినది. ఇంద్రావతి ఒకకావ్యమునందు సంవత్సరమునందలి ఆరు ఋతువుల యందును విప్రలంభ ప్రేమతాపముతో బాధపడు తరుణియొక్క విభిన్నములైన అనుభవములను చాల సుందరముగా వర్ణించెను. ఆమె ఆరు ఋతువుల యందలి ప్రకృతిశోభను చాల రమణీయముగ వర్ణించెను. కాని అందలి ప్రధానోద్దేశ్యము తనకు ఎడముగానున్న ప్రియునికొఱకైన కాంక్షయే. ఆమె శరదృతువునందు తనసంగతిని వీడియున్న తనప్రేమికుని కొఱకైన ఆకాంక్షను వర్ణించెను. భాద్రపదమున వర్షములు పడనారంభించెను. ఇంకను ప్రియుడు తిరిగిరాడాయెను. ఆశ్వయుజ శుక్లపక్షము దరిసెను. అయినను ఆతడు వ్రజమునకు రాడాయెను. ఒక్కొకపుడు ప్రియుని ఇట్లుబ్రతిమలాడును. "ప్రియూరమ్మా ఒకసారిరమ్మా, నాతోటను చూడు, పూర్ణిమచంద్రుడు ప్రకాశించుచున్నాడు, పచ్చని పచ్చికబయళ్లు ఎంతో మనోహరముగానున్నవి. ఆహ్లాదకరమైన ఈ సమయమున నానుండి తప్పించుకొని (నన్నువిడనాడి) ఎక్కడకు వెళ్లితివి?"

హేమంతమునుగూర్చి ఆమె యిట్లు వర్ణించెను. "ప్రియా కార్తిక మాసపు చలి కొరికివేయుచున్నది. అయినను నీమీదిప్రేమ నాకు వెచ్చదనమే కల్గించుచున్నది. నాహృదయమునందు నీవుదగ్గరలేవను విచారము

తప్ప ఇంకొక భావములేదు. దేవాలయము నాకు శ్మశానమువలెకన్పట్టును" శిశిరము వచ్చినది, చలి మఱింతముదిరినది. ప్రియుడు తిరిగిరానేలేదు. "మిక్కిలి చలిరోజులువచ్చినవి-కాని ప్రియుడు నాకడలేని యీ సమయమున ప్రతినిముషమును నూరేండ్లుగా పెరుగుచున్నది." వేసగినిగూర్చి ఆమె యిట్లువ్రాసెను "వైశాఖము విరియబూచినది, చెట్లన్నియు పరిమళభరితములై వాసించుచున్నవి. త్రాగి మత్తిలినవారివలె తుమ్మెదలు రొదచేయుచు పాడుచున్నవి. పక్షులు సుఖముగా ఆనందనర్తనము చేయుచున్నవి. నీ వెపుడువత్తువాయని, ఆనందప్రదమైన ఆ శుభముహూర్తము కొఱకు వేయికన్నుల వేచియుంటిని." "నవ వర్షాగమవేళ రానేవచ్చినది. మబ్బునీడలు భూమినిక్రమ్మివేయుచున్నవి. ఆకాశము ఉరుములు, మెఱపులతో నిండిపోయెను. భూమియంతయు తీవ్ర వాయుతాడితమగుచున్నది. ప్రియుడు నాకడ లేకపోవుటచే ఇదియంతయు నాకు బాధకే కారణమయ్యెను" శ్రీకృష్ణుడు గోపికా ప్రేమగీతమునువిని ఉద్ధవునిచే సందేశమంపిన ఘట్టమునువర్ణించుటతో ఈ విప్రలంభ శృంగారకావ్యము పతాకదశనందినది. ఈ కావ్యమంతయు పూర్తిగా ప్రేమవర్ణన కావ్యము. దీని ముగింపు భాగవతములోని సంఘటనను పోలియున్నది. ఇంద్రావతి రచించిన మఱియొక బారామాసీ కావ్యము కలదు. ఇదికూడ షడృతు వర్ణనమే. ఇందు ఐహికవర్ణనలకంటె ఆధ్యాత్మిక భావప్రాధాన్యము కనబడును. ఇందు వివిధఋతువులు వివిధరాగములలో వర్ణింపబడెను. శరదృతువు 'రాగసమేరి'రాగమునందును, హేమంతము 'సింధుద'రాగమునందును, శిశిరము 'ధనశ్రీ' రాగమునందును, వసంతము 'వసంత' రాగమునందును నున్నవి. కొన్నిచోట్ల వర్ణింపబడిన రాగభావమునకు పొందిక కుదురలేదు. ఉపనిషత్తులలోని భావములతో సాదృశ్యముకల వర్ణనలతో ఈ కావ్యము ముగిసినది.

द्वा सुपर्णा सयुजा सखाया सामानं वृक्षं परिषस्वजाते

ఇంద్రావతి రచించినది స్వల్పమేయైనను, గమనార్హముగానే ఉన్నది.

సుందరాబాయి :

ఇంద్రావతి తనరచనలలో ఉదాహరించినదానినిబట్టి ఆమెస్నేహితురాలైన సుందరాబాయి అనునామెకూడ ఈ సాంప్రదాయమునకుచెందిన కవయిత్రిగా కనబడుచున్నది. ఈమె రచనలలో రెండుమూడు పద్యములు మాత్రమే కాననగును. ఈమె రచనలలో చాలా కొద్దిపాటి కవితా శిల్పరామణీయకము కన్పట్టుచున్నది. సుందరాబాయి ఇంద్రావతి సమకాలీనురాలనియు ఆమెకూడా పద్యకవిత్వమల్ల నేర్చినదనియు తెలుసుకొనుట చాలును.

వదతీబాయి :

ఆ సమయమునందే 'ఆరతి'యను ప్రార్థనగీతమును వ్రాసిన వదతీబాయి అనునొకకవయిత్రి కన్పట్టుచున్నది. ఆనాటి సామాన్యాభిప్రాయములామెకవితలో ప్రతిబింబించెను. కాని కవితాప్రతిభ చాలా సామాన్యముగా నున్నది. ఆమె రచించిన శివస్తోత్రమునందు లయసౌందర్యము కాననగును.

రాణీ సూరద :

శ్రీరామునిపై స్తోత్రములువ్రాసిన రాణీ సూరద అనునామె ఒక కవయిత్రిగా కన్పట్టుచున్నది. ఆమెనుగూర్చిన వివరములు తెలియకున్నవి. ఈమె రచనలలో కవితాశిల్పము కన్పడదు. ఈమె రాబోవు భగవంతుని అవతారము కురంగావతారమని జోస్యముచెప్పెను. 17వ శతాబ్దమునందు ఇంద్రావతి కావ్యములుదప్ప ఇక చెప్పదగిన కవయిత్రులులేరు.

## 18 వ శతాబ్దపు కవయిత్రులు

ననీబాయి :

ఈమె 17 వ శతాబ్దపు గుజరాతీకవియైన ప్రేమానందుడను కవియొక్క కావ్యమైన "వివేకవంజారో" నుండి ప్రధానముగా విషయమును తీసుకొని ఒకకావ్యమును రచించెను. ననీబాయి సూరత్ జిల్లాలోని "అర్పద్'' అనే గ్రామమునకు చెందినదనియు, అనావిల్, లేక

మోటాలీ బ్రాహ్మణశాఖకు చెందినదనియు తెలియును. ఎందువల్ల ననగా ఆమెయే తనరచనలలో ఒకచోట తనది అయాచక (अजाचीक) బ్రాహ్మణకులమని చెప్పుకొనినది. ఆమె రచనలైన రెండు భక్తిగీతములు ప్రశంసాపాత్రములుగానున్నవి. "నేను మాధవుని (శ్రీకృష్ణుని) గణకు (లెక్కవ్రాయసకత్తె) రాలను. నేను మాధవునికి లెక్కలువ్రాయు చున్నాను. మన సర్వస్వమును త్యజించి మాధవునియం దర్పణచేసినగాని మన కర్మకలాపము విజయోపేతము కాజాలదు. మనము భగవానుని కొఱకు కష్టించిపనిచేసినచో ఆయననుండి మనకు మంచికూలిగిట్టుబాటగును. మన అన్నిలెక్కలను ఆయనకు మనఃపూర్వకముగా అప్పగించినచో ఆయన మనపాపములను క్షాళనమొనర్చును, అని వ్రాసెను.

గౌరీబాయి :

గిరిపూర్ అను నామాంతరముకల దుంగాపురమున నివసించిన నాగర (నగర) కులజురాలు గౌరీబాయి అనునామె ఒకరు. 1815లో కన్పించుచున్నారు. ఆమె అయిదారు సంవత్సరముల ప్రాయముననే వివాహితయయ్యెను. అచిరకాలముననే వితంతువాయెను. తరువాత ఆమె తన యావజ్జీవితమును భక్తిజ్ఞానాన్వేషణయందే గడపెను. ఆమె దీక్షతో చదువను, వ్రాయను, అధ్యయనముచేయను నేర్చుకొని తుదకు ఉత్తమ జ్ఞానమైన వేదాంతజ్ఞానమునుకూడ స్వాధీనము చేసుకొనెను. ఆమె యోగాభ్యాసముకూడ నొనరించి సమాధ్యవస్థనుకూడ పొందెను. ఆమె అగాధమైన జ్ఞానమును, వైరాగ్యభావమును, గిరిపూర్, జైపూర్, వారణాసి ప్రభుల గౌరవమునకు ఆమెను పాత్రురాలుగా నొనర్చెను. ఇంతవేదాంతినియయ్యును ఆమె మూర్త్యారాధన మొనర్చెడిది. దీనినిబట్టి గుజరాతుదేశమునందు వైష్ణవధర్మము ఎంత గాఢముగా వ్రేళ్లు దన్నుకొని పోయెనో తెలియుచున్నది.

"కీర్తనమాల" అను పేరున ముద్రితమైనగ్రంథమున 612 పద్యములు కలవు. ఈ గ్రంథముయొక్క వ్రాతప్రతియందు 652 పద్యములు కలవు.

కొన్ని శ్రీకృష్ణుని కిశోరలీలలును, శివుని స్తోత్రములునుదప్ప తక్కిన వన్నియు బ్రహ్మతత్త్వ నిరూపకములు. మధ్యయుగ కవయిత్రులలో వైదాంతిక కవయిత్రిగా గౌరిబాయికి గొప్ప పేరుకలదు. ఆమె యొనర్చిన శంకరాచార్య సిద్ధాంతమునకు చెందిన కేవలాద్వైత వివరణ 'అక్క' (Akha) (17వ శతాబ్దమునకు చెందిన ఒక ప్రసిద్ధ గుజరాతుకవి) వేదాంతమునకు సమానముగనుండును - ఆమె భాష నిర్దుష్టమైనది. (Direct) సరళమైనది. వేదాంతపరమగుటచే కాబోలు ఈమె కవితయందు గేయ ధర్మము తక్కువగానుండును. ఆధ్యాత్మికరంగముల సంబంధమును వర్ణింప వలసినపట్ల ఆమె రచనయందు అతివేలమైన కవితా ప్రతిభాప్రదర్శన మగ పడును. అట్టిచోటుల నామె నిపుణములైన రూపకాలంకారముతో మిక్కిలి శోభావంతముగా తీర్చిదిద్దెను. ఆమె రచనలు హిందీ, గుజరాతీ రెండుభాషలయందును కలవు. ఆమెకావ్యమున వేదాంత తత్త్వము సంగ్రథితమయ్యెను. (సోహంబ్రహ్మ) నేను నీవుగా యున్నాను. (सोहं सोहं ब्रह्म अे भुजे) "నీవు బంధితుడవుకావు. సూక్ష్మరూపివికావు. గౌరి బ్రహ్మ స్వతంత్రుడనును" ("नहीं तुं बंध्य, नहीं तुं सूक्ष्म गवरी स्वतंत्र ब्रह्म") అట్టి తాత్త్వికభావములు, సరళ కవిత్వధోరణిలో రచింపబడెను. నీవు చంద్రునియందు కాంతివి. సూర్యునియందు తేజమునై యున్నావు. (चंद्र में चैतन्य सूरज में तू तेज) పుష్పములలో సౌరభమువలె నీవు అఖిలాండ బ్రహ్మాండ వ్యాపకుడైన బ్రహ్మవై సమస్తమునందును నిండి యున్నావు అని వర్ణించెను. ఇంకొకచో "గంగానది సముద్రమున గలిసినట్లు గౌరిశాశ్వతుడైన బ్రహ్మమును కలియును. (गवरी भेंटी ब्रह्म सनातन, जेसा सागरमां गंगा) ఇట్టి రూపకములు ఆమె రచనలయందు చాలా ఆకర్షణీయము గాను, చమత్కారముగాను ఉండెను. ఆమె భక్తిగీతములనుకూడ వ్రాసెను.

సరిగా ఆ కాలముననే ఇదేపేరుతో (అనగా గౌరిబాయి పేరుతో) ఈ కాలమునకేచెందిన ఇంకొక కవయిత్రి కలదు. శ్రీ కె. కె. శాస్త్రిగారు

కవిచరిత్ర చతుర్థాధ్యాయమున ఈమె వైష్ణవ సాంప్రదాయమునకు చెందినదనియు, ఈమె భాష సున్నితమైనది, నిర్దుష్టమైనదనియు పేర్కొని యుండిరి. ఏమైనను ఆమెకవితకు సామాన్యస్థానముకలదు.

జానీబాయి :

కాలమును బట్టి తరువాతి కవయిత్రి జానీబాయి. జానీబాయి అను నీ పేరు ఆమె నిజనామమౌనో, లేఖినీ నామమో చెప్పుట దుస్తరము. ఆమె పద్యములయందు ఆమె జీవితమునుగూర్చిన సూచన ఏమియులేదు. కాని ఆమె తన గురువు, శిక్షకుడు (బోధకుడు) నైన మిధూనుగూర్చిన వివరములను విశదీకరించి యిచ్చెను. ఆమె గురువుల జన్మాదికవివరములచే ఆమె జన్మస్థలము, కాలము మున్నగు ఆమె జీవితవిషయములు తెలియ గలవు. ఆయనకడ ఎప్పుడును శిష్యు లనేకులుండెడివారు. వారిలో జానీబాయి ఒకతె. ఆమె గురువుగారి మరణకాలమైన 1847వ సంవత్సర మును బట్టి జానీబాయి ఇంచుమించు 1827వ సంవత్సరమున జన్మించి యుండవచ్చునని నిస్సందేహముగా చెప్పవచ్చును. 1858వ సంవత్సరమున "నవనాయికావరణ" అను నొక కథానికా కావ్యమును ఆమె రచించెను. 1860లో ఆమెకు భగవంతుడు అర్ధనారీ (స్త్రీ, పురుశ్వర) రూపమున కన్పించెను. 1868లో దేవీస్వరూపమున కన్పించెను. ఆమె ఈ సంవత్సరము ననే మరణించెను. తన గురు సాంప్రదాయమును అభివృద్ధిని, వ్యాప్తిని గూర్చి చాల విస్తృతముగా, హెచ్చుగా వర్ణించెను. ఆమె రచనలు నిష్కర్షయైన చారిత్రక సత్యముల నుగ్గడించెడివి. ఆరోజులయందున్న గుజరాతు రచయిత్రులలో చాలా తక్కువమందిమాత్రమే అంత హెచ్చుగా చారిత్రక వివరము లీయగల్గినవారు. ఆమెయొక్క "నాథజీ ప్రాగత్య" అను కావ్యము ప్రశంసార్హమైనది, కాని ఈ రచన ప్రచురణకాలేదు. వారి సాంప్రదాయమునుబట్టి గురువు ప్రియుడుగా ఎంచబడును భక్త్యారాధన పేరిట చెలామణియగుచున్న శక్త్యుపాసకులయందుగల అవినీతి కళంక మును ఈమె రచనయందు కానవచ్చును. ఏమైనను ఆమెకు కవితాప్రతిభ

కలదు. ఆమె రచనయందు మనోజ్ఞమైన భక్తిజ్ఞానముల సమ్మేళనము కానగును.

## దివాలీబాయి :

దివాలీబాయియొక్క రచనలనుబట్టి ఆమె జీవితవివరములు బాగుగా తెలిసికొనగలము. దక్షిణ గుజరాతునందు నర్మదాతీరమున నున్న 'దాభోయి' గ్రామమున నొక పేదబ్రాహ్మణులనింట ఆమె జన్మించెను. ఆమె బాల్యముననే వితంతువై తరువాత తండ్రియింటనే పెరిగెను. ఒకప్పుడు సంభవించిన కరువుఇబ్బందులలో ఆమెతండ్రి ఆమెను ఒకముసలి సన్యాసికి అప్పగించెను. ఆయనను దివాలీబాయి "దాదా గురు" అని పిల్చెడిది. దివాలీబాయి ముసలిసాధువుతో బరోడా వచ్చెను. తన గురువు గారికి శ్రీరామోపాసనయందుకల విశ్వాసము ఆమెమనస్సునకు మిక్కిలి హత్తుకొనెను. ఆమె తన గురువుతో చాలామార్లు అయోధ్యాయాత్రను సేవించుకొనివచ్చెను. క్రమముగ ఆమె గొప్ప శ్రీరామభక్తురాలాయెను. సుమారు 500 పద్యములుగల ఆమెకావ్యము శ్రీరామచంద్రుని జీవిత సంఘటనా వర్ణనకు సంబంధించినది. ఆనాటి గుజరాతిప్రజల జీవితమును యథాతథముగ చిత్రించుట ఆమె కవిత్వ ప్రత్యేకగుణములలో నొకటి. శ్రీరామ చరితమునందలి శ్రీరామ జననము, బాల్యమునందలి ఆనంద నర్తనము, పట్టాభిషేక మహోత్సవము మున్నగు ఘట్టములను వర్ణించుచు ప్రాపంచిక జీవితములయందలి భావములను, ఆవేశములను, సుఖములను దుఃఖములను చిత్రించెను. శ్రీరామ పట్టాభిషేక సమయమున సీత ఏరంగు చీరను ధరించవలెనో నిశ్చయించుకొనలేకపోయినది అని వర్ణించిన పద్యమొకటి కలదు. "రేపు నేను ఏచీర ధరింపవలయును? నలుపురంగు ధరింపరాదుగదా! నాకు ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగులు ఇష్టములేదు. పాటల వర్ణముగల చీరను ధరింతునా రామా" అని సీత రామునడిగెనట. ఇండ్లలో ఏదైన శుభకార్యము జరుగుటకుముందు సామాన్యస్త్రీల మనోవృత్తు లెట్లుండునో ఈ వర్ణన సరిగా చిత్రించినది.

స్త్రీ సహజమైన కోమలప్రవృత్తిచే ఆమె రామాయణమునందలి హృదయ విదారక ఘట్టములలో నొకటియైన శ్రీరామపట్టాభిషేకము జరుగవలసిన దినముననే వనవాసమునకు వెళ్లవలసిన ఘట్టమును వదలివైచెను.

ఇందు ఆమెవాడినభాష అచ్చమైన గుజరాతీ. ఆమె శ్రీరామునితో ఒక విశిష్టమైన తాదాత్మ్యమును పొందెను. అంతేకాక తాను వితంతు వగుటచేతనే శ్రీరామచంద్రుని అంత గాఢభక్తితో ఆరాధింపగల్గితినని కూడ ఆమె చెప్పియుండెను. తాను స్వయముగ అనుభవపూర్వకముగ గ్రహించుటయేకాక భగవంతుడు పుష్పములు, దీపారాధన మున్నగు గురు పూజోపకరణములను కోరడనియు, కేవల నిస్వార్థభక్తినే అభిలషించు ననియు నామె బోధించెను దివాలీబాయి కవిత్వము స్వచ్ఛమై, సరళమై, సున్నితమై (సుకుమారమై) భక్తిభావభరితమై ఆమెయొక్క సరళమైన పవిత్రమైన జీవితమును ప్రతిబింబింపజేయునదై యున్నది.

రాధాబాయి :

రాధాబాయి బరోడాయందు నివసించు మహారాష్ట్ర బ్రాహ్మణి. ఇంచుమించు 1890వ సంవత్సర ప్రాంతమున అవధూతనాధుడను యోగితో ఆమెకు పరిచయముకలిగెను. ఆమె ఆయన శిష్యురాలాయెను. ఆమె కవిత్వమునందలి విశిష్టత ఏమనగా గుజరాతీ, హిందీ, మహారాష్ట్ర భాషల నుండి తగిన పదముల నెంచుకొని ఆమె రచనసాగించెను. ఇట్టి యీ రచన ఆమెను సుప్రసిద్ధురాలి నొనర్చెను. దీనికితోడు ఆమె కంఠము మిగుల కోమలమైనది. మధురమైనది. ఆమెపాట అనిన ప్రజలు మూగెడివారు. ఆమె హెచ్చుగా కృష్ణదేవునిపై వ్రాసియుండెను. అంతేకాక విఠోబా, జ్ఞానేశ్వర్, తుకారామ్, మీరాబాయి మున్నగు సాధువుల జీవితముల కావ్యగత మొనర్చెను. ఆమె కవిత్వమున వైవిధ్యము గేయకవితావేశమును కలవు. ఆమెకు ప్రాసమనిన చాలాయిష్టము. ఆ ప్రాసను పాటించుటకై, ఆమె సరియైన అంత్యప్రాసము కుదురుటకై ఆమె పదముల మెలియబెట్టుటకైనను వెనుదీసెడిదికాదు.

కృష్ణాబాయి :

కృష్ణాబాయి జీవితమునుగూర్చి మనకు తెలిసినది చాల తక్కువ గుజరాతుదేశమున నాగరికతకల నాగరకులమునకు చెందినదని తెలియుచున్నది. ఆమె రెండు ప్రసిద్ధకావ్యములను రచించెను. ఒకటి శ్రీకృష్ణునిపై జోలపాటలు, సీతమ్మ కంచుకము. 'సీతానీ కాంచలి' (కాంచాలి) దీని వ్రాతప్రతి 1892వ సంవత్సరమునాటిది. దీనినిబట్టి ఆమె అంతకంటె పూర్వురాలని చెప్పవచ్చును. రామాయణమునందలి బంగారులేడిని వెదకు ఘట్టమును వర్ణించుటలో స్త్రీ స్వభావసిద్ధమగు మొండిపట్టుదలను స్పష్టముగా వర్ణించెను. సీతారాములమధ్య నడిచిన ఊహా సంభాషణద్వారా ఆమె ఆనాటి దంపతులమధ్య నుండెడు సంబంధమును చిత్రించుటకు యత్నించెను. నిజమునకు సీతారాములపట్ల సామాన్య మానవప్రవృత్తులను మానవకతను వర్ణించుటచే సీతారాముల మానవాతీత సత్యమును వర్ణించుట విడచినదాయెను. ఆమె కవిత్వము ఆనాటి సంఘమున బహుళ ప్రచారమునంది జనాదరణ పొందియుండెను. దానికి ఆమె సీతారామలక్ష్మణుల ప్రవృత్తులను వర్ణించునెడల అనుసరించిన వాస్తవికవిధానమును మానవతాదృష్టియు కారణములై యుండవచ్చును.

## 19వ శతాబ్దపు కవయిత్రులు

మన్‌బాయి :

"నవీన్ కావ్య దోహా" (Navina Kavya Dohaw) లో ప్రచురింపబడిన ఒక్క పద్యముమాత్రము ఈమెదిగా కన్పించుచున్నది. ఆమె జీవితమునుగూర్చికాని ఇతర రచనలనుగూర్చికాని వివరములు తెలియవు. కాని పైన ప్రస్తావింపబడిన పద్యమునుబట్టి ఆమె భక్తిభావముతో కవిత్వరచన చేసిన ఒక కవయిత్రియని తెలియుచున్నది. ఒక గురువు ప్రభావమువలన ఆమెమనస్సు రామభక్తియందు కుదురుకొనెను. ఆమెశైలినిబట్టి, భాషనుబట్టి ఆమె 19వ శతాబ్దమునందు జీవించియుండెనని తెలియుచున్నది.

జేబాయి :

1837, 1892వ సంవత్సరకాలమున జీవించిన 'మోతీరాము' అను కవివరుని శిష్యురాలైన జేబాయి అనునామె కవయిత్రిగా కనబడుచున్నది. జేబాయి ప్రార్థనాగీతములను రచించెను. ఆమె జీవిత వివరములు తెలియకున్నవి. కాని ఆమె గురువుకాలమునుబట్టి ఆమె 19వ శతాబ్దమున జీవించెనని చెప్పవచ్చును. ఆమె యుపయోగించిన పదములనుబట్టి, పద్యభావములనుబట్టియు నామె ఏ ఒక్క సాంప్రదాయమునకును అంటుకొనియుండలేదని తెలియుచున్నది. ఆమెకు కర్మకాండపై విశ్వాసములేదనియు తెలియుచున్నది. ఆమెకు కర్మకాండపై విశ్వాసములేదు, కాని తాత్త్వికచింతతో కూడిన హృదయభావములను వెలిబుచ్చెను. గూఢవాదమునకు చెందిన గుజరాతు కవయిత్రులలో నీమె యొకతె.

పూరీబాయి :

ఈ కాలమునాటి తక్కిన చాలామంది కవయిత్రులవలె పూరీబాయి జీవితచరిత్రకూడా తెలియదు. ఆమె రచించిన 'సీతామంగల్' అను ఖండకావ్యమునందు సీతావివాహమునుగూర్చి వివరముగా వర్ణించెను సీతారాముల ఈ వివాహోవకాశమును పురస్కరించుకొని ఆమె గుజరాతు దేశమునందు వ్యాపించియున్న వివాహపద్ధతులను వర్ణించెను. ఆ సందర్భముగా గుజరాతులో వివిధ ప్రాంతములయందున్న ఉత్పత్తిదారుల సామగ్రినంతను వర్ణించెను.

రతన్‌బాయి :

ఇచట రతన్‌బాయి అను కవయిత్రినిగూర్చి తప్పక ప్రస్తావించవలసియున్నది. మధ్యయుగ కవయిత్రుల కోవకుచెందినది కాక ఈమె తన కవితావస్తువుచే ఒక విశిష్టస్థానమునొందినది. ఆమె భక్తినిగూర్చికాని ప్రేమనుగూర్చికాని, వేదాంతమునుగూర్చికాని కవితాగాన మొనర్పక ఆమె చరఖానుగూర్చి కవిత్వమల్లి వాస్తవిక కవిత్వమును చెప్పుటతో ఉపజ్ఞను ప్రదర్శించెను. ఆమె తన తండ్రిచేత, భర్తచేతకూడ విసర్జింప

బడెను. చరఖామీద వచ్చే ఆదాయముతో తనజీవితమును గడపుకొను చుండెడిది. దీని నామె తన కవితావస్తువుగ గైకొని సహజమధురముగ చిత్రించెను :

> "అల్పమా హరించియు మన కధికలాభ
> మొసగు నీ రాట్నలక్ష్మి దా నుచితరీతి
> అబలపాలిటి సురధేనువగుచు మనదు
> జీవనోపాధి గడపును చింతలేక"

రతన్‌బాయి జైనధర్మావలంబిని మధ్యయుగ కవయిత్రుల ప్రసక్తిని సంభావించుటలో ఇతర ధర్మావలంబినులగు ఇర్వురు కవయిత్రులను తడవక విడిచిన నీ యుగచరిత్ర సంపూర్ణముకాదు. అందు పీర్‌కయాముద్దీన్ బావాఖిస్టీ సాంప్రదాయమునకు చెంది, హిందూ సాంప్రదాయ భక్తి భావములను వెలిబుచ్చుచు కల్మాలను రచన గావించిన రతన్‌బాయి అను ముస్లింయువతి ఒకర్తుక.

లైన్‌బాయి :

కబీరు సాంప్రదాయానుసారిణియైన లీలాన్‌బాయికూడ పెక్కు భక్తిగీతములు రచించెను. ఇంతేకాక గ్రామీణ జనసముదాయమున మిక్కిలి ప్రచారములోఉండి వారిచే పాడబడుచుండెడి భజనగీతములను రచించిన రాణీ రూపాండే, తోరల్, లోయన్, గంగాసతి మున్నగువారుకూడ ఇట స్మరింపదగినవారే. స్త్రీలచే రచింపబడిన జానపదగేయ వాఙ్మయము చాలాకలదు. కాని తత్కర్త్రీలగు మహిళలనుగూర్చి తెలిసినది చాలా తక్కువ. జానపదగేయములు, పద్యములు, జోలపాటలు, నీతికథల పాటలు, మృతులనుగూర్చి విచారించుచు పాడెడు పాటలు, పెండ్లిపాటలు మున్నగువాఙ్మయమును సృష్టించుటలో వారిపాత్రకూడ ఉండియుండును. ఈ వాఙ్మయము నెవరు సృష్టించినది, ఊహింపదగినదేకాని ఊహాకు నిర్ణయింప నలవికాదు. భక్తి, ధర్మములకు తమ రచనల నర్పించినస్త్రీలు ఈ జానపద వాఙ్మయరచనలో అంతగా ఉన్నతస్థాయికి వచ్చి ఉండక పోవచ్చును.

మధ్యయుగమందలి మహిళా వాఙ్మయము పౌరాణిక సంఘటనలతో కూడి భక్త్యాత్మకమగు కవిత్వతమునందో లేక కథానిక కావ్యరచనయందో కేంద్రీకృతమైయున్నట్లు కనబడును.

ఈ సారస్వత చరిత్ర పరిశోధనచేసినపుడు 1300 మొదలు 1800 వఱకు ప్రజల హృదయములు భక్త్యావేశ తరంగితములైనట్లు కనబడును. దీని ఫలితముగా మతము, ధర్మము, గుడులయందును, మఠములయందును బంధింపబడియుండు స్థితిపోయి సామాన్యజనుల అందుబాటులోనికి వచ్చుటయే కాక ప్రజల నిత్యజీవితమున చొఱుచుకొనిపోవుట సంభవించెను. ఋగ్వేదకాలము తరువాత భారతీయ తాత్విక (సాంప్రదాయములు, సిద్ధాంతములు) గ్రామసీమలలోవ్యాపించి అనేకరీతులుగా 1850 వఱకును రచనలయందు ప్రవర్తిల్లినవి.

తరువాత పాశ్చాత్య విద్యానాగరికతల ప్రభావముచే గుజరాతీ సారస్వతము గొప్ప మార్పునకు లోనయ్యెను.

గూఢతత్త్వ సిద్ధాంతములును, ఉత్సాహమును మహిళా రచయిత్రుల హృదయములను భక్తిభావములను ప్రేరేపించెను. వారికవిత్వమున అసాధారణావేశముగాని, అతి సౌందర్యముకాని లేకుండెను. ఈ సారస్వతము ఆనాడు వ్యాప్తిలోనున్న సంఘభావములను సంపూర్ణముగా ప్రతిబింబించును. ఈ సారస్వతము భర్తృవిహీనలకు దుఃఖోపశమనమును, ప్రజలకు విపత్తుల నెదుర్కొనగల బలమును నొసంగెను. ఇది మన సంస్కృతిని పోషించెను. నాశనముకాకుండ పరిరక్షించెను. అంతేకాకుండ కొన్ని సమయములలో మతోద్దీప్తిని కొంత మందకొడిగాకూడ గావించినది. ఒక్కొక్కసమయమున ప్రకాశవంతముగా రగుల్కొలుపజేసినదికూడ.

మీరాబాయి సాహిత్యముదప్ప తక్కిన మహిళాసారస్వతమంతటిని పోల్చిచూచినచో పురుషుల సారస్వతము ఇంతకంటె గుణాధికముగ కన్పట్టును. అయితే ఈ సారస్వత ధర్మమునుగూర్చి ఆలోచించినచో ఇది ప్రజాసామాన్యమున కంతకును మిక్కిలి ఉపస్మరణీయమై, హిందూ

సంస్కృతి సజీవమై, బహుళవ్యాప్తినొందునట్లు కాపాడుటకు ఉపయోగపడ గల్గినది, ఈ మహిళా సారస్వతమేనని చెప్పనగును.

ఈ విధమైన సారస్వతము 20 వ శతాబ్దమువఱకు కొనసాగెను. శ్రీ సాధక సాంప్రదాయానుసారమైన రచయిత్రుల భజనలు చారిత్రక దృష్ట్యా మిక్కిలి గమనార్హములైనవి. ఈ మధ్యయుగ రచనయందు ఒకటి రెండు తప్ప తక్కినవానియందు స్వచ్ఛమగు భక్త్యుద్దీపనము కాని, మహోన్నతి, భావ గంభీరత (Sound) కాని కాన్పింపవు. కాని జ్ఞానమును ప్రదర్శింపవలెననెడు ఒక బలహీనమగు అభిలాషయు, (స్వల్పమైన పాండిత్య ప్రకర్ష) నిర్జీవమైన తత్త్వ ప్రదర్శనా ప్రకర్షయు కాన్పించును. మొత్తముపై నీ మధ్యయుగ మహిళాసారస్వతము అటనట ఒయాసిస్సులతో కూడిన శుష్కమైన ఎడారివలె నున్నదనవచ్చును. ఇందలి కవిత ఉత్తమావేశరహితము. ఇందలి భావములు ఆధారరహితములు.

1850 తర్వాత వచ్చిన సాహిత్యమునందు ఆకృతియందును వస్తువునందును గమనింపదగిన భేదము కనబడును. గుజరాతీ సారస్వతము ఎప్పుడును రాజకీయ ప్రభావమునకు లోనై యున్నట్లే కనబడును. పాశ్చాత్య నాగరికతా సంసర్గము కల్గినవెనుక గుజరాతీసాహిత్యము ఆకృతియందును, భావప్రదర్శనమునందును, వస్తువునందును మార్పుగోచరించును. మొఘలు సామ్రాజ్యము క్షీణించి పతనమైన కాలమునుండి ఈస్టిండియా కంపెనీ ప్రాబల్యము మనదేశమున కుదురుకొను నడిమికాలమునందు చాలా అల్లరి, అక్రమత్వము, అవినీతి చాలా హెచ్చెను. ఈస్టిండియా కంపెనీవారు మనదేశమునకు పాలనకు వచ్చుచునే శాంతిని క్రమపద్ధతిని పునఃప్రతిష్ఠాపన మొనర్చిరి. 1820లో మిషను పాఠశాలలను స్థాపించిరి. ఆ నాటికి మన దేశమున వ్యాప్తిలోనున్న సాంఘికవ్యవస్థయందును, ఆచార వ్యవహారముల యందును మనదేశీయులు సంస్కరణావసరమును గుర్తించిరి. పాశ్చాత్య దేశమునందలి కుటుంబ విధానము సమాజమున స్త్రీలయెడ చూపు గౌరవము, మత ధర్మములయెడ ఐకమత్యభావము, పరిశ్రమపై

గౌరవము మున్నగు జాతీయగుణములను మనదేశస్థులు గ్రహించి, మెచ్చు కొనుట మొదలిడిరి. సమాజమునందలి అన్ని అంతస్థులవారును మత విషయక, సాంఘిక, విద్యాపద్ధతులను మిక్కిలిశ్రద్ధతో దీక్షతో సంస్కరించు కొన మొదలిడిరి. 1850 ప్రారంభమున వ్రాయబడిన సారస్వతము ఈ అభిప్రాయములతో నిండియుండెను. ఈ విధమగు సంస్కరణాభిప్రాయ ములు కవితారూపమున నుండ నేరవుకదా !

ఇది సారస్వతమున వచన రచనా కృషికి పురికొల్పెను. ఈ క్రొత్త సారస్వత రూపమునకు ముద్రణాయంత్రము అత్యంత సహాయకారి యయ్యెను.

దీని ఫలితముగా వ్యాసరచన, నవలారచన, జీవిత చరిత్రోల్లేఖనము, స్వీయచరిత్ర లేఖనము, విమర్శ పత్రికారచనము మున్నగు నూతన ప్రక్రియలతో సాహిత్యముఒక్కమారుగా ప్రవాహరూపమున పొంగిపొర్లెను. కవిత్వముకూడ రచనాపద్ధతియందును, వస్తువునందును ఆకృతి మారెను. ప్రేమ, ప్రకృతి, దేశభక్తి మున్నగు మకుటములలో వస్తువును సమకూర్చు కొనుటయు, స్వానుభవ నివేదనము, వీరస్మృతి, ఇతిహాసము. ఘజల్ ఖండకావ్యాదుల రూపమున ఆకృతియు మారెను. విశ్వవిద్యాలయ విద్యాస్నాతులైన సాహిత్య కళాకారులు పైవిధముగానే విమర్శనా పద్ధతులను, కావ్యరచనా సంవిధానమును స్వీకరించిరి. 1880, 1890వ సంవత్సరముల నడుమ సృజింపబడిన పద్యము, గద్యమును కళామయమైన రూపముతో నావిర్భవించెను.

ఈ యుగమునందలి సారస్వతరీతి మానసిక పరిణామము నొందిన వారిచే సృజియింపబడినది. పైన చెప్పబడిన నవీన సారస్వతమునకుకూడ మహిళలు తమరచనలచే ప్రాభవము నొసంగలేకపోయిరి. దీనికికారణము ఆనాటి మహిళలు విద్యావిషయకముగా వెనుకబడినవారగుటయే. దీనికి తోడు మధ్యయుగము తరువాత సారస్వతము అనేకపరిస్థితులచే అనేకము లగు మార్పులకు లోనైనను కవిత్వమునందు మతసంబంధమగు వస్తువు సంపూర్ణముగా నిర్మూలింపలేకపోవు టొక కారణము.

గుజరాతున శ్రీ నరసింహాచార్యుల అనుయాయులు 'శ్రీసుధాకరకర్' అను పేరున ప్రార్థనాగీతమంజరి నొకదానిని ప్రచురించిరి. ఇందు దేవిబెన్, ప్రమీలాబెన్, చాందూబెన్, విమలాగౌరి, షిప్‌గౌరి, ఢాన్‌గౌరి, బాజీగౌరి, జాన్‌దీబెన్ అను వారలచే రచింపబడిన 24 రచనలు కలవు. ఈ రచనలయం దేమంత రసోపేతమైన శిల్పసౌందర్యము కానరాదు. 1850 మొదలు 1900 వఱకు పరిశీలించినచో గుజరాతుమహిళలు గుజరాతు సారస్వతమున కొనర్చిన సేవ ఇంచుమించుగ ఏమియు లేదనియే చెప్పవచ్చును. 20వ శతాబ్దమున మహిళాలోకము విద్యా ప్రకాశితమైన వెనుక స్త్రీలు మఱింత అధికముగా పూనుకొని గుజరాతు సారస్వతమును తమ రచనలచే శోభాయమానము చేసిరి.

"లేడీ" విద్యాగౌరి :

కీ. శే. శ్రీమతి విద్యాగౌరి రమణ్‌భాయి, నీలకంఠ్ శ్రీమతి శారదాగౌరి, సుమన్తభాయి మెహతా అను స్త్రీ లిద్దఱును బొంబాయి విశ్వవిద్యాలయమునకు చెందిన ప్రప్రథమ గుజరాతీ పట్టభద్రురాండ్రు. ఈ యిర్వురు స్త్రీలును ఒకవంక సంఘ సంస్కారోద్యమమునందును, వేరొకవంక సాహిత్య సృజనమునందును తమ శక్తి సామర్థ్యములను ప్రదర్శించి గుజరాతు సారస్వతము నుద్దీపనము గావించిరి కీ॥ శే॥ శ్రీమతి విద్యాగౌరి 1876లో ప్రస్తుత గుజరాతు రాజధానియైన అహ్మదాబాద్ నందు జన్మించెను. ఆమె తనభర్త సహాయ సహకారములతో పట్టభద్రురాలైన తరువాత సాహిత్య వ్యాసంగమును ప్రారంభించెను. ఆమె భర్తయైన శ్రీ రమణ్‌భాయి గొప్ప సాహితీవేత్త యగుటయేకాక "జ్ఞానసుధ" అను నొక మాసపత్రికను ప్రారంభించియుండిరి. శ్రీమతి విద్యాగౌరి ఈ మాస పత్రికయందు వ్రాయుట కారంభించి 1896 వఱకు తన రచనలను ఇందు ప్రచురించెను. ఆమె స్త్రీలకు, సంఘమునకు సంబంధించిన అనేక విషయములపై రచన గావించెను. గుజరాతీ సారస్వత తృతీయ మహాసభయందు ఆమె "మధ్యయుగ రచయిత్రులు" అను నొక వ్యాసమును వ్రాసి

చదివెను. అంతేకాక "బుద్ధిప్రకాశ" "వసంత" అను మాసపత్రికలందామె వ్యాసములు ప్రచురింపబడెను. ఈ వ్యాసములే కాక ఆమె 'నారీకుంజ్', 'జ్ఞానసుధ', 'హాస్యమందిర్', సుధాహాసిని', 'హిందూ సమాజమున స్త్రీల పరిస్థితి', 'ఫోరమ్' (పరిమళము) అను గ్రంథములను రచించెను. 'నారీకుంజ్, జ్ఞానసుధ' అను గ్రంథములు సాంఘికసమస్యలను గూర్చిన వ్యాసములు, హాస్యమందిరము అనునది హాస్యరచనలతో కూడినది. ఇది ఆమె భర్త సహాయముతో వ్రాసినది. ఈ గ్రంథమున అతుకుల జీవితముల బ్రతుకులపై తేలికయైన సున్నితమైన, జాలితోకూడిన ఎగతాళి కనబడును. సుధాహాసిని అనునది ఆమె తన సోదరితో కలసి అనువదించిన ఒకనవల "ఫోరమ్" అను గ్రంథమున ఆమెయొక్క అత్యుత్తమ సారస్వత ప్రజ్ఞ కాననగును. ఈ గ్రంథము ఆమె యొక్క సమకాలీనులయొక్కయు. ఆనాటి సంఘముల యొక్కయు, ఆనాటి సంఘటనల యొక్కయు, వ్యక్తిత్వములను, విశిష్టతను స్పష్టముగా చక్కగా ప్రదర్శించెను. శ్రీమతి విద్యాగౌరి 15వ గుజరాతీ సాహిత్య పరిషత్తున కధ్యక్షురాలు. ఆమెచే స్థాపింపబడిన గుజరాతీ విద్యాసభకు 1958 వఱకు, అనగా ఆమె జీవితాంతము వఱకు అధ్యక్షురాలుగా నుండెను. కీ. శే. శ్రీమతి విద్యాగౌరి తన జీవితమునంతను సాంఘిక సంస్కరణమునకును స్త్రీలయొక్కయు, స్త్రీ విద్యయొక్క అభివృద్ధికిని అంకితమొనర్చెను. అంతేకాక దీనితోబాటు తన గృహస్థ ధర్మమునకును, గృహ కార్యకలాపములకును తనపిల్లల విద్యాభివృద్ధులకును ఆటంకము కలుగకుండగనే ఆమె అన్నిరంగముల యందును ఎక్కువ శ్రద్ధాసక్తులను కనబఱచెను. ఈమె జీవితచరిత్ర తర్వాత తన రచనద్వారా గుజరాతీ సాహిత్యసేవ కావించిన ఈమె కుమార్తె జీవితమునుగూర్చి తర్వాత తెలుసుకొందుము.

## శ్రీమతి శారదా మెహతా :

శ్రీమతి శారదా మెహతా 1892వ సంవత్సరమున జన్మించెను. తన సోదరివలె నామెకూడ బొంబాయి విశ్వవిద్యాలయ పట్టభద్ర. ఆమె

స్వయముగ సాంఘిక సంస్కారణములకు తన్నంకిత మొనర్చుకొనెను. అట్లు సంఘసంస్కారణోద్యమమున పరిశ్రమించుచునే ఆమె పెక్కు విషయములపై గ్రంథరచన కావించెను. ఆమె రచనలు ఈ క్రిందివిధముగ నున్నవి: (బాలురకు) పురాణకథలు, ఫ్లారెన్సు నైటింగేలు జీవితచరిత్ర, గృహ వ్యవస్థ, సుధాహాసిని (తన సోదరి విద్యాగౌరితో కలసి అనువదించినది), హిందూ సంఘమునందలి స్త్రీలస్థితి ఇవికాక 'జీవితసంభరణ' అను మకుట మున తన స్వీయచరిత్రనుకూడ ఆమె రచించెను. ఇందు ఆనాటి గుజరాతీ దేశమునందలి సాంఘిక జీవనమును చక్కగా చిత్రించెను. లేడీ విద్యా గౌరియు, శ్రీమతి శారదాబెన్ తమ సమయమునంతను హెచ్చుగా స్త్రీల అభ్యున్నతికి వినియోగించుటచే సారస్వత రంగమున చేయగల్గినంత సేవ చేయలేకపోయిరి.

## శ్రీమతి జర్బాను :

శ్రీమతి జర్బాను మెహర్వాంజీకొత్వాలా 1881వ సంవత్సరమున జన్మించెను. పారశీక కుటుంబ జీవితమును చిత్రించు నవలా రచనముతో సారస్వత సేవనొనర్చెను. 'ఖోర్శెద్' (Khorshed), 'అగలాజన్మనోఫిల్సుఫ్' (Agala Janmano philsuf) 'షా అక్బరు నోజమాన్' (Shah Akbarno Jamano) 'రఫీకే ఖుదా' (Rafike Khuda) 'సత్య యుగ్ని శోధ్' (Satya Yugni Shodh) 'మోటాఘార్ని మాంక్' (Mota Gharni Manck) అనునవి ఈమె రచించిన నవలలు. 20వ శతాబ్దాది కాలమున గుజరాతునందు ఫారసీ సాంఘిక నవలల కెక్కువ ఆదరణముండెను. నవలారచనము ప్రాథమికస్థితిలోనున్న ఆనాడు శ్రీమతి కొత్వాలాసతియే నవలారచనమున ప్రప్రథమురాలు. ఆమె చాలా నవలలు రచించినను, కథలోని అల్లిక సముచితపాత్ర చిత్రణ రచనా సంవిధానమును సామాన్య ముగా నుండెను. ఆమె భాష గుజరాతీ ఫారసీభాషకు ఒక మచ్చుతునక.

'దీపక్ బా దేశాయి', 'సవితా లక్ష్మీహరిరాయిబుచ్', 'సుభద్రా ప్రహ్లాద జీధ్రు' అను నీ ముప్వురును భక్తికావ్యములను, మధ్యయుగమునకు

ప్రత్యేకమైన గర్బా (Garbis) రచనల నొనరించిరి. దీపక్ దేశాయి పౌరాణిక సంఘటనా సంకలనాత్మకమైన ఖండకావ్యమును రచించెను. ఆమె యొక్క ఈ తొలిప్రయత్నము గుజరాతీ సాహిత్యమున కామె చూపిన యొక క్రొత్తపోకడగా ప్రసిద్ధినొందెను. ఆమె శైలి నిపుణమైనది. బరోడా సంస్థానము గుజరాతు సాహిత్యమున కామె యొనర్చిన సేవ నభినందించుచు 'రాజరత్న' బిరుదముతో ఆమెను సన్మానించెను. ఆమె 'స్తవన్ మంజరి' అను పేర ఒక భజనగీత సంకలన గ్రంథమును ప్రచురించెను.

సవితాలక్ష్మి :

సవితాలక్ష్మి 1885 లో సౌరాష్ట్రమున జన్మించెను. ఆనాటికి సౌరాష్ట్ర సంఘ వాతావరణ మింకను వికాసముచెందక సంకుచిత స్థితిలోనే యుండెను. అయినప్పటికిని ఆమె కుటుంబముమాత్రము విజ్ఞానసంపన్నమై, సంస్కృతికలదై యుండెను. ఆమెను ఒక పత్రికారచయితకిచ్చి పెండ్లి చేసిరి. ఆమె సాహిత్య ప్రజ్ఞ కీ సంఘటనము పూర్తిగా అవకాశము కల్పించెను. ఈమెకూడా సాంఘికరంగమున పనిచేసెను. తక్కినసమయము నం దామె పద్యరచన చేసెడిది. గర్బా కవిత్వమును కూడ రచించెను. 'ఘూఢ్ గిర్ నారి' (Ghadh Girnari) అను గేయ కావ్య సంపుటి, ఆమె మరణానన్తరము ప్రచురింపబడెను. అందు సుఖప్రదమైన కుటుంబజీవితము మహిళల భావుకత (Emotions) ప్రకృతి సౌందర్యాభిరతి (Love towards Nature) దేశభక్తి మున్నగు వివిధవిషయములకు సంబంధించిన ఖండకావ్యములు కలవు. ఆమె కవిత్వమందలి లిరిక్ సాంప్రదాయ ధర్మము మిక్కిలి ఉత్తమశ్రేణికి చెందినది.

శ్రీమతి సుభద్రా బెన్ ప్రహ్లాదజీధ్రు మధ్యయుగ కవిత్వమును ఆధునిక యుగ కవిత్వమును కలుపు సేతువువంటిది. ఆమె రచనయైన 'అంజలి' అను పద్యరచన తత్త్వ సాంప్రదాయమునకు, భక్తి సాంప్రదాయ మునకును సంబంధించినది.

శ్రీమతి లక్ష్మీ బెన్‌దోసాని :

అసలైన గుజరాతీ భాషయందు ప్రప్రథమ నవల రచించిన ఖ్యాతి ఈమెదేయని చెప్పవచ్చును. "హుమ్ బంధ ఖోర్ కెమ్ బానీ ?" (Why I became a revolutionary) ఈ నవల హిందూసమాజమున గౌరవ హీనమగు దుస్థితిలోనున్న ఒక రచయిత్రియొక్క ప్రతీకారచర్యగా కన్పట్టును. ఈ ఒక నవలను రచించుటచేతమాత్రమే ఈమె తక్కినస్త్రీలకు నవలారచనమున మార్గమునుచూపి, వారికి రచనాక్షేత్రమున, నడుగిడు సాహసమును కల్గించెను.

శ్రీమతి విమలాబెన్ సెతల్వాడ్ కూడ తన యథాశక్తిని సారస్వత సేవయొనర్చెను.

శ్రీమతి హన్సాబెన్ మెహతా :

ఈ కాలమునందలి పెక్కురు రచయిత్రులు పాశ్చాత్య సాహిత్య ప్రభావితలై ఆంగ్ల సారస్వతాను వాదములకును, ఆంగ్ల సాహిత్యాను కృతికిని కడంగ దొడంగిరి. శ్రీమతి హన్సాబెన్ మెహతా ఈ పద్ధతి రచనయందు ప్రయోగము సల్పుటయందు తొలిమహిళ. ఈమె "గలీవర్స ట్రావెల్సు" (Guliver's Travels) ను గుజరాతీ భాషలోని కనువదించెను. అట్లే Hamlet, Merchant of Vennis ను మోలియర్ యొక్క రెండునాటికలను అనువదించెను. Alice in Wonder land ను అనుసరించుచు ఆమె పిల్లల వాఙ్మయమును సృష్టించెను. ఆమె సంస్కృత రచనలనుండికూడా కొంత అనువదించెను. ఆమె యొక్క బాలకాండ అనువాదము, వాల్మీకి రామాయణానుకరణమును ప్రశంసార్హమైనవి. అంతేకాక ఆమె "బాల్ వార్తావళి, కిశోర్ వార్తావళి" అను పేరపిల్లలకు ఉపదేశాత్మకమైనట్టియు, ఆహ్లాదకరమైనట్టియు, ఆసక్తిని పుట్టించునట్టియు సాహిత్యమునుకూడ సృష్టించెను.

ఈమె మూడు అంకముల నాటకములను, ఏకాంకికలను స్వయముగ కూడ రచించెను. స్వయంసృష్టము, అనుకృతి, అనువాదముల రూపమున

మూడు విధములుగానున్న శ్రీమతి మెహతా సాహిత్యము ఆమెయొక్క అద్వితీయ సాహిత్య చైతన్యమును, ఉత్తమ సంస్కృతిని చక్కగా తెలుపును. ఆమెయొనర్చిన సంఘసేవ వలనను, బరోడా M.S. యూనివర్సిటీకి వైస్‌ఛాన్సిలర్‌గా పనిచేసి యున్నందువలనను ఏ రంగములోనైనను పురుషులకంటె స్త్రీలు శక్తిసామర్ధ్యములలో ఏ విధముగను తక్కువవారు కారను వాదమును ధ్రువపరచెను. ఆమె యింగ్లీషులోకూడ పుస్తకములను, కరపత్రములను "హిందూ వివాహ చట్టము వారసత్వ చట్టము స్త్రీలు యుద్ధానంతర పునర్నిర్మాణము, పేర హక్కులపై ఒక గ్రంథమును "విక్రమాదిత్యుని సాహసగాథలు" అను పేరున ఒకగ్రంథమును రచించెను.

ఇందు మొదటి రెండును కరపత్రములు. గుజరాతునందు పత్రికా రచనము చాలా ప్రాథమికస్థితిలో నున్నపుడు మహిళా రచయిత్రులకు ఆ రంగము అపరిచితమైయున్న స్థితిలో శ్రీమతి హంసాబెన్ మెహతా పత్రికా రచయిత్రిగా తన రచనాజీవితము నారంభించెను. శ్రీమతి హన్సాబెన్ మెహతా రచయిత్రు మండలమునకే ఉత్తమస్థాన మలంకరించిన మహిళామణి.

ఇరువదవ శతాబ్ది ప్రథమ రెండు దశాబ్దములయందును "హృదయ జరన్" మున్నగు తన రచనలచే ప్రముఖరచయిత్రిగా ప్రసిద్ధిబడసిన శ్రీమతి సుమతీ మెహతా చెప్పదగిన సారస్వత సేవచేసెను. ఆమె యొక్క ఖండకావ్య సంపుటి "హృదయ జరన్" అను గ్రంథమును, ఒక ఆంగ్లనాటకానుకృతియు, చిన్నకథలును ఆమెప్రఖ్యాతికి దగినవి. దురదృష్ట వశమున ఆమె మధ్యవయస్సునందే మరణించెను. ఆమెకేకనుక భగవంతుడు సంపూర్ణాయుర్దాయము నొసంగియుండెనేని ఆమె తనసారస్వత సేవచే గుజరాతీ సాహిత్యమును సౌభాగ్యవంతముగా నొనర్చియుండెడిది.

## శ్రీమతి విజయగౌరి త్రివేది :

శ్రీమతి విజయగౌరి త్రివేదికూడ కావ్యములను రచించెను. ఆమె రచనలయందు ఒక కళాహృదయుని ప్రతిభోన్మేషయు, సౌందర్యదృష్టియు

కానంబడును. ఆమె అకాలమరణముతో గుజరాతుదేశము ఒక వర్ధిష్ణు రచయిత్రిని కోల్పోయెను.

1920 వ సంవత్సర ప్రాంతమునందలి గుజరాతీ సాహిత్యముపై మహాకవియైన నానాలాల్ ప్రభావప్రసారము అధికముగాకన్పట్టును. రాస, గర్భ - మున్నగునవి పునరుద్ధరింపబడెను. 1894లో జన్మించిన శ్రీమతి శాంతిబెన్ చున్నిలాల్ బర్ఫీవాలా "రాసకుంజ్" అను పేరున ప్రాతవి క్రొత్తవి అయిన 'రాస' రచనలనన్నింటిని ప్రోగుచేసి ప్రచురించెను. ఆమె వీనికి కొద్దిగా స్వరములనుకూడ యిచ్చెను. ఈ ప్రచురణచే "రాస" రచనలు, ఎక్కువగా వాడుకలోనికి వచ్చెను.

1898లో జన్మించిన శ్రీమతి సరోజినీ మెహతా సంఘ సేవకురాలుగాను, రచయిత్రిగాను పేరుపొందెను. విద్యా, విజ్ఞాన సంస్కృతి రంగములలో మిక్కిలి ఉన్నత కుటుంబమైన 'సర్' రమణ్ భాయి, 'లేడీ' విద్యాగౌరీ నీలకంఠ కుటుంబమునకు చెందినది. ఆమె ప్రజ్ఞావంతులైన తన తల్లిదండ్రుల అడుగుజాడల ననుసరించుట కెంతోకాలము పట్టలేదు.

"గుజరాతీ లగ్నవ్యవస్థ, కుటుంబ సంస్థ ఏకాదశి (కథానికలు) 'అమరవేల్' (నవల) 'సంసారరంగ' సమాజముపై ఊహాచిత్రణములు, చార్ పథరాణీ,మా' (కథానికలు) మొదలగునవి ఆమె ప్రసిద్ధరచనలు "వలతాపానీ" అను కథానికా సంపుటమొక్కటి త్వరలో ప్రచురింపబడనున్నది. ఆమె తన రచనలలో హిందూ సంఘమునందలి లోపములపై తిరుగుబాటును ప్రదర్శించెను. వ్యక్తిపరమైనట్టియు, సంఘటనాత్మకములైనట్టియు ఘటనా చిత్రణములను, వ్యక్తి చిత్రణములలో ఆమెరచన నిరాఘాటముగ సాగినది. ఆమె చాలాయేండ్లనుండి భగినీ సమాజ పత్రికకు సంపాదకురాలుగా నున్నది.

శ్రీమతి లీలావతీమున్షీ 1899లో జన్మించెను. శ్రీమతి సరోజినీ మెహతా సమాజము విప్లవాత్మకముగ రచించినదానిని ఈమె ఆచరణలో పెట్టెను. ఆమె ఈ తత్త్వమును తన రచనలలోకూడ చూపెను. ఆమె

"గుజరాత్" మాసపత్రిక సంపాదకవర్గములో నొకతెగా నుండెను. అంతేకాక ఆమె రేఖాచిత్రణములు స్కెచెస్, వ్యాసములు, చిన్నకథలు, నాటకములు మున్నగువాని నెన్నింటినో రచించెను. 'కుమారదేవి' (నాటకము) రేఖాచిత్రోజున - నవ 'జీవన్ముక్తిజదేలి' (కథానికలు) మున్నగునవి ఆమె ప్రచురణలయందు ముఖ్యమైనవి. చాలామంది ఇతర రచయిత్రులలో సామాన్యముగా కనబడని శక్తి పటుత్వము, సౌకుమార్య మును, ఆమె శైలిలో మనకు లభింపగలవు. ఆమె రాజకీయములలో ప్రవేశించి M. P. గా ఎన్నుకోబడినతర్వాత గుజరాతీ సారస్వతము ఆమె సేవలకు నోచుకొనలేకపోయెను.

గుజరాతీ సాహిత్య ప్రథమదశనుండియు స్త్రీలు హెచ్చుసంఖ్య యందే సారస్వతసేవకు పూనుకొనిరి. కాని నిజమైన మేధావిశేషము, ప్రజ్ఞాపాటవము కల మహిళా రచయిత్రులు కొద్దిమందిమాత్రమే కనబడు చున్నారు. గుజరాతీ సాహిత్యాంబరమున మినుకుమినుకుమను రచయిత్రీ తారాగణము ఎంతో కలదు. కాని మిక్కిలి తేజోవంతములైన నక్షత్ర ములు కొన్నిమాత్రమే. గుజరాతీ రచయిత్రుల సాహిత్యసేవ సంఖ్య యందు చాలా విస్తారముగానే కన్పట్టును. కాని గుణాధిక్యమున చాలా పరిమితము. సాంఘికాచారములయందలి పరిణామముల స్థితియు, మహిళా లోకమున అంతకంతకు అధికమగుచున్న విద్యావ్యాప్తియు గుజరాతీ సాహిత్యమున అత్యంత ప్రతిభావంతమైన రచయిత్రిగౌరవము పాదుకొలుప బడగలదు. గుజరాతు దేశమునందలి స్త్రీలయొక్క దినదినాభివృద్ధియు అగ్రగామిత్వమును (ముందంజయు) గుజరాతీ సాహిత్యమునకును అట్లే గుజరాతీ రచయిత్రీలోకమునకును గొప్ప పురోభివృద్ధికలదను నంశమును సూచించుచున్నవి.

గుజరాతీ సాహిత్యము గొప్ప ఔన్నత్యదశనందును గాక - గొప్ప భాషలలో నొకటిగా గుజరాతీ భాషాస్థాయి అతిశయించునుగాక.

అత్యంత ప్రాచీనకాలముననే తమిళనాడున మూడు సంగములు వర్ధిల్లెననియు, ఆ మూడు సంగములలోను చాలమంది కవులు, కవయిత్రులును, రచనలెన్నో వెలయించిరనియు తమిళపండితులు విశ్వసించుచున్నారు. కాని నేడు ఆ రచనలలో ముక్కాలు మువ్వీసము నామమాత్రమైయున్నవి. అయినను, లభించిన కృతులలో కవయిత్రులు కొందరు చెప్పిన పద్యములు కొన్ని కానవచ్చుచుండుట గమనింపదగు విషయము.

అగనానూఱు-పుఱనానూఱు :

'కడసంగ' కాలమున వెలసిన సంకలన గ్రంథములలో అగనానూఱు, పుఱనానూఱు అనునవి పేర్కొనదగినవి. వీనిలో ఒక్కొక్కదానియందును నాల్గువందల పద్యములు గలవు. అగనానూఱు ప్రణయగీతికా సంపుటమైనచో, పుఱనానూఱు వీరగీతముల సంపుట మనవచ్చును. ఈ రెండు కృతులలోను, ఆనాటి తమిళ సంఘమునకును, మహిళలకును సంబంధించిన విషయము లనేకములు ఉదాహరింపబడినవి. కాగా, తమిళుల యభిరుచులు, ఆచార వ్యవహారములు మొదలగువానిని తెలిసికొనుటకీ కావ్యద్వయము బహుధా తోడ్పడుచున్నదనుట నిర్వివాదాంశము.

సంగకాలమున పురుషులతోపాటు సతులుకూడ విద్యాభ్యాసము చేయుచుండిరనియు, పలువురు స్త్రీలు విదుషీమణులై యుండిరనియు, వారికి సంఘమున విశేషగౌరవము ఉండెననియు సువిదిత మగుచున్నది. సంగీత సాహిత్యములందే కాక యితర శాస్త్రములందును, కళలయందును మహిళలు కొందరు ప్రావీణ్యము సంపాదించియుండిరి. సంగకాలమున రమారమి యేబదిమంది కవయిత్రులు వర్ధిల్లినట్లు తెలియుచున్నది.

పుఱనానూఱులో ఒక పద్యమున ఒక వీరనారీ వృత్తాంతము ఇటుల పేర్కొనబడినది.

"ఆమె తండ్రి మొన్నజరిగిన యుద్ధములో శత్రువుల యేనుగు నొకదానిని హతమార్చి, యుద్ధభూమిలోనే వీరస్వర్గము నలంకరించెను. ఆమె

భర్తకూడ యుద్ధవీరుడే. శత్రువీరుల యధీనమున నున్న ఆలమందలను తనవశము చేసుకొని, అతడు నిన్న జరిగినయుద్ధములో అసువులు గోల్పోయెను. హృదయవిదారకములయిన యా రెండు వార్తలును ఆమె చెవినిపడెను. కాని ఆమె కంటతడిపెట్టలేదు. ధైర్యమును విడనాడలేదు. నేడు రణభేరి మ్రోగినది. అది ఆమెకు శ్రవణగోచరమయ్యెను. తోడనే ఆమె తన కన్నకుమారుని దగ్గరికితీసుకొని, నూనెరాసి తలదువ్వి, జుట్టును ముడివేసినది. అతనికి తెల్లనిగుడ్డలుకైసేసెను. చేతనొక ఖడ్గము నుంచెను. కడపట, ఆ వీరనారి 'యుద్ధమునకు పొమ్ము' అనును. అతనిని యుద్ధ భూమికి పంపెను. ఆమె ప్రదర్శించిన ధైర్యసాహసములు, ఆమె గుండె దిటవు మున్నగునవి కొండాడదగినవిగదా ! ''

మాశాత్తియార్ :

ధైర్యసాహసములు రూపుగట్టిన యీ వీరగాథను పద్యరూపమున చిత్రించిన కవయిత్రి మాశాత్తియార్ అనునొక విదుషీమణి! ఇట్టి యుదంతములు పుఱనానూఱులో పెక్కులు గలవు.

జైన బౌద్ధ వాఙ్మయము :

సంగకాలమునకు తరువాతిదగు జైన బౌద్ధుల కాలమునందు వెలుగులోనికి వచ్చిన తమిళకావ్యములందు మణిపూసలనదగిన సిలప్పదికారం (మంజీర మహిమ), మణిమేకలై (మణిమేఖల) మున్నగువానిలోకూడ తమిళవనితలనుగురించి యెన్నో విషయములు పేర్కొనబడినవి. సిలప్పదికారం మణిమేకలై కావ్యములు తమిళ్ కావ్య పంచకమున చోటుచేసికొనిన కావ్యరాజములు.

సిలప్పదికారములో కణ్ణకి యను కులకాంత నాయిక. ఆమె పవిత్ర జీవితవృత్తాంతము తమిళ వేదకర్తఅయిన తిరువళ్లువరు చెప్పిన :

"పరదైవములవీడి పతిగొల్చు చాన
కురియుమన్నంతనే కురియదే వాన"

అనుకుఅళునకు లత్యుప్రాయమై ప్రతిభాసించుచున్నది. తరువాతి కాల మున ఆమె సతీదేవి అని వినుతికెక్కెను. పాతివ్రత్యమునకు నామాంతర మనదగిన కణ్ణకి నేటికిని తమిళుల భక్త్యంజలులను స్వీకరించుచున్నది. ఆమె జీవితము నభివర్ణించుచున్న సిలప్పదికారము తమిళుల జాతీయ కావ్యముగా కొనియాడబడుచున్నది.

ఇక, మణిమేకలై కావ్యమునందు వేశ్యాగృహమున ప్రభవమందిన మణిమేఖల యను ముద్దుగుమ్మ జీవితము కడుమనోహరముగా అభివర్ణింప బడినది. కనుకనే యీ కావ్యమునకు 'మణిమేఖలా సన్న్యాస' మను నామాంతర మేర్పడినది.

ఈ రసవత్కావ్యద్వయమును స్థూలముగా పరిశీలించినను, ఆనాటి తమిళసంఘమున మహిళల కెట్టి గౌరవప్రపత్తులుండెడివో ఆ యంశము స్పష్టముకాగలదు.

ఆనాళ్లలో వెలకాంతలు నృత్తగీతాది కళలను బాగుగా అభ్యసించి యుండిరి. కాని కులకాంతలు లలితకళలను అభ్యసించినట్లు తెలియ వచ్చుటలేదు. స్త్రీలుకూడ, పురుషులవలె, సన్న్యాసాశ్రమము స్వీకరించు చుండిరి. వారికి పాతివ్రత్యమే ప్రధానధర్మముగా నిర్దేశింపబడియుండెను. మహిళలకు సంబంధించిన యిట్టివిషయము లనేకములు ఆ కావ్యములనుండి గ్రహింపనగును.

సంగకాలమున విలసిల్లిన తమిళ కవయిత్రులలో కాక్కైపాడిని యార్, నన్ముల్లైయార్, ళిఅుకాక్కైపాడినియార్, నచ్చెళ్లైయార్' ముడత్తామ క్కణ్ణియార్ అవ్వైయార్ ప్రభృతులు ప్రసిద్ధలు.

## అవ్వైయ్యార్ :

వీరందరిలోను పూజ్యురాలను అర్థమొసగుచున్న అవ్వైయ్యారే కడు ప్రసిద్ధురాలనదగును కాని యీమె నిజ నామధేయమేమో నేటికిని స్పష్టముగా తెలియరాలేదు. ఈమె కాలమునుగురించికూడ అభిప్రాయ భేదములు గలవు. ఈమెకంటె పూర్వుడైన తిరువళ్ళువర్ రచించిన

తిరువళ్లువర్ కవికాలము 7, 8, 10 శతాబ్దములు అను అభిప్రాయభేదములు కలవు. అందువలన అవ్వయ్యార్ కాలమునుగూర్చి ఏమియు నిర్ణయించ జాలము. అవ్వై పేరుగల కవయిత్రులు వేర్వేరు కాలముల పలువు రున్నను, ముప్వురు ప్రధానముగా కానవచ్చుచున్నారు. సంగ కాలము నందును, మధ్యకాలమునందును ఆ తరువాతి కాలమునందును వారు వర్ధిల్లినట్లు భావింపబడు చున్నది.

సంగకాలమున వర్ధిల్లిన రచయిత్రులలో కాక్కైపాడినియార్, శిఱు (చిన్న) కాక్కైపాడినియార్ అనువారిని తొలుదొలుత పేర్కొన వలెను. వీరిరువురును లక్షణశాస్త్రమునందు ఘటికులనియు, ఛంద శ్శాస్త్రమునకు సంబంధించిన రచనలు చేసినట్లును తెలియుచున్నది. ఈ రచ నలు నేటికిని అలభ్యములుకాని వీనిలోని సూత్రములు కొన్ని యాప్పరుంగల వృత్తి, యాప్పరుంగలక్కారికై అనుఛందో గ్రంథములకు సంతరింపబడిన వ్యాఖ్యాన గ్రంథములలో ఉదాహృతములయినవి.

అళ్లూర్ నన్ ముల్లైయార్ అనునామె సంగకాలపు కవయిత్రులలో ఒకర్తె. అళ్లూర్ అను గ్రామమున జన్మించుటచే ఈమె కీపేరు కలిగెను. ముల్లై యనునది ఒక పుష్పనామము (మొల్ల) ప్రకృతి రామణీయకమును చిత్రించుటలో ఈమెకు మక్కువ యెక్కువ అని నుడువదగును. ఆమె యభిప్రాయమున, కోడవలి తొండ వీపువలె నుండునట! చిలుకముక్కున నున్న వేపపండును చూచుసరికి, బంగారు తీగెలో గుండ్రని కాసులు దూర్చుటకుగాను తన రెండువేళ్లనడుమ నొక కాసునుంచుకొన్న అగసాలి ఆమెకు గుర్తుకు వచ్చినాడు. మఱియొక పద్యమునందు కృతఘ్నులను గురించి నుడువుచు ఇట్లనెను. "ఉపకారము పొందుచున్నపుడు కృతఘ్నుడు మంచివాడుగానే కనబడును. కాని తుద కతడు అపకారము తలపెట్టును. తొలుదొలుత గడ్డిపూవు చూచుటకు అందముగా కనిపించును. కాని అది యెండిపోయినచో, అప్పు డందలి ముండ్లు బయటపడును." మరొక కవయిత్రి ఒక్కూర్ మాశాత్తియార్. ఒక్కూరను గ్రామము ఈమె

జన్మస్థలము. ఈమె ఒక పద్యములో ఒక సేనాధిపతిని గురించి నుడువుచు ఇట్లు పేర్కొనెను. ఈ పద్యము అనగా నూఱులోగలదు.

"రాజాజ్ఞను తలదాల్చి ఒక సేనాధిపతి యుద్ధమునకు వెళ్లెను. యుద్ధము ముగిసినపిమ్మట అతడు రథములో గృహోన్ముఖుడయ్యెను. తన అర్ధాంగిని ఎపుడెపుడు కలసికొందునా అని ఆతడు తహతహలాడ సాగెను. రథములో ఎక్కి కూర్చున్నదే అతనికి తెలియును. కొంతసేపటి కా యరదము సేనాధిపతి యింటిముందు ఆగెను. అప్పు డతడు సంతోషముకొలది రథచోదకుని చూచి "యుద్ధము ముగిసెనన్న సంతోషముతో నేను రథమునెక్కితిని. ఎక్కిన విషయము మాత్రము నాకు తెలియును. కాని యిప్పుడు నే నెటుల గృహము చేరగలిగితినో నాకు తెలియదు. 'దిగుడు' అని నీ వనినంతవరకు నా కేమియు తెలియదు. నీ శక్తిని నే నేమని కొనియాడగలను? వాయుదేవుని సహాయముతో రథమును నడిపితివో లేక నీ మనస్సునే గుఱ్ఱముగాచేసి నడిపితివో - నే నెఱుగను" అనెను.

భార్యనుచూచిన సంతోషములోకూడ రథచోదకుని విస్మరింపని ఆ సేనాధిపతిని కొండాడక తప్పదు. నిజమునకు సేనాధిపతికా యంతులేని సంతోషమును చేకూర్చినవాడు రథచోదకుడు !

సంగకాలపు అవ్వైయారునకు సంబంధించిన పెక్కు కథలు నేటికిని ప్రచారమున నున్నవి. ఈమె చెప్పినట్లు భావింపబడుచున్న అరువది పద్యములు మాత్రమే లభించినవి. ఒకటి రెండు కథలను పరికింతము.

అవ్వైయారు ఒకసారి ఒక రాజాస్థానమునకు వెడలియుండెను. అత డామెను బహుధా ఆదరించుటయే కాక అంతఃపురము, ఆయుధశాల మొదలగువానిని స్వయముగా చూపించెను. తన ఆధిక్యమును, ప్రాభవమును తెలియజేయు తలంపుతో అతడు వానిని చూపించెను. అది గ్రహించకపోలేదు అవ్వైయారు. అతడు ఆయుధశాలను చూపుచు "ఎట్లున్నదో చూచితిరా?" అని యడిగెను. అందులకు అవ్వైయారు

నవ్వుచు ''ఆహా! ఆయుధములు చూడ ముచ్చటగొలుపుచున్నవి. శుభ్ర ముగా తుడిచి, అలంకరించి వాటిని జాగ్రత్త చేయుచున్నందుకు చాల సంతోషము. కాని, మా మహారాజుగారి ఆయుధములు ఇటుల ఉండనే యుండవు. అతని కరవాలము శత్రుసంహార మొనర్చుటచే వంకరపోయి నెత్తుటిచారలతో కమ్మరివానిదగ్గర నున్నది'' అనెను. అవ్వైవ్వ పలికిన యీ పలుకులలో కానవచ్చు పరిహాస ధోరణిని వివరింపనక్కరలేదు.

అవ్వైవ్వ పద్యములలో ఒకదానియందు ఒక వదాన్యశేఖరుని గురించి యిటుల పేర్కొనబడినది. సమ్మానముపొందిన ఒక సామాన్య గృహస్థు చెప్పినట్లుగా ఈ పద్యము చెప్పబడినది. "ఒక దాతగలడు అర్థించినవారి కతడు ఏనుగులను దానముచేయుచుండెడివాడు 'మాయింట బియ్యము నిండుకొన్నవి. బియ్యము కావలెనని వెళ్లి అడుగగా అతడు కొండవంటి యొక యేనుగు నిచ్చినాడు. దీనితో నే నేమిచేయను? అతడేమో తనస్వి సంపదల కనుగుణముగా దానధర్మములు చేయుచున్నాడు.

ఈనాడు అవ్వైవ్వ పేరుమీద వ్యవహృతములగుచున్న రచనలు నాలుగు. అవి అత్తిచూడి, కొండ్రై వేండన్, వాక్కుండామ్, నల్వాళి. ఈమె తరువాతికాలపు అవ్వైవ్వయారు కావచ్చును. ఈ రచనలు నాలుగును నీత్యుద్బోధకములు. బాలబాలికల నుద్దేశించి యివి సంతరింపబడినను వీనిలోని సుభాషితములు మాత్రము చిరస్మరణీయము లనదగును. పెద్దలకు గూడ ఇవి మార్గదర్శకములనుటలో సందేహములేదు. నేటికిని ఇవి తమిళుల జిహ్వాగ్రముల నిలిచియుండుట హర్షింపదగు నంశము.

అత్తిచూడిలోనివి చాల చిన్నవాక్యములు. వీనియందలి వాక్య నిర్మాణము సూత్ర రచనా విధానమును స్ఫురణకు తెచ్చుచుండును. కొండ్రై వేండన్‌లోని వాక్యములు అత్తిచూడిలోని వాక్యములకంటె కొంచెము పెద్దవి. వాక్కుండామ్‌లో ముప్పది పద్యములు గలవు. వీనియందలి శైలి సులభసుందరము. జీవితమున అవలంబింపవలసిన మార్గము లను తెలియజేయు రచనమే నల్వాళి. నల్వాళి అనగా సన్మార్గము అని

అర్థము. ఇందులో తాత్త్వికరహస్యములుగూడ చోటుచేసుకొనినవి. ఇక ఈ రచనలలో తెలియజేయబడిన కొన్ని సుభాషితములను పరిశీలింతము.

మాతా పితరులే ప్రత్యక్ష దైవతములు
ఊరివారితో కలహించువాడు సమూలముగా నాశనముచెందును
సంఖ్యాక్షరములే నేత్రము లనదగును
చేయదగు పనులను బిచ్చమెత్తియైనను చేయుము
మానవుని శీలము ఆతని మాటలలోనే అణగియుండును
శీల రక్షణమే స్త్రీల కలంకారము
అందని దానిని అప్పుడే మరచిపొమ్ము
తప్పులెన్నుచో చుట్టరికము సున్న
చెప్పుడుమాటలు వినుట అగ్నికి వాయువు తోడయినట్లు ఉండును.
తండ్రిమాటను మించిన మంత్రము మఱొకటిలేదు
తల్లినిమించిన ఆలయ మేదియు లేదు
అలలకడలిని దాటియైనను ధనమార్జింపుము
దేశము సుభిక్షముగా నున్నచో ముప్పు వాటిల్లదు
జలవసతిగల ఊరిలో నివసింపుము
పండిన పంటలో చేసిన పుణ్యము ప్రతిఫలించును
బిచ్చమడుగనివారే బలముగలవారు
విజ్ఞతగల సంతానమే తలిదండ్రులకు దివ్యౌషధము

(తల్లిదండ్రుల సహాయము లేకయే తనయులు తమ పనిపాటలను చక్కబెట్టుకొన్నచో, తల్లిదండ్రులు చీకుచింతలులేక నిత్యయౌవనులుగా నుందురని భావము.)

నల్వళిలోని కొన్ని సూక్తులనుకూడ పరికింతము :

1. మానవులారా ! మీయొద్దనున్న ధనము నిలుకడలేనిది. నదీప్రవాహము వలన ఏర్పడు మిట్టపల్లములవంటిది ధనము. కనుక ధనమున్నప్పుడే అన్నములేనివారికి అన్నమిడుడు. ఈ అన్నదానమే

మీకు అండదండగా ఉండగలదు; దీనివలన మీకు చిత్తశుద్ధియు ఏర్పడగలదు.

2. ఏనుగును బాధించునట్టి శరము మెత్తని పత్తిని బాధింపజాలదు. అటులనే కటూక్తులు మృదూక్తులను బాధింపజాలవు.

3. ధనవంతుడైనచో చాలును, ఆతడు చదువు సందెలు లేనివాడైనను సరే, లోక మాతనిని గౌరవించును. చదువుసందెలు నేర్చినవాడు ధనహీనుడైనచో, ఆతనిని ఆతని యిల్లాలుకూడ గౌరవింపదు. కన్న తల్లిదండ్రులను గౌరవింపరు. తుదకు ఆతని నోటిమాటకుకూడ గౌరవముండదు.

4. తప్పులతడకగా నుండు పద్యముకంటె, వట్టిమాటలే చాల మంచివి. గొప్ప వంశముకంటె సౌశీల్యమే మంచిది. యుద్ధములో అవమానము చెందుటకంటె, తీరని వ్యాధితో బాధపడుటయే మంచిది. లోకనిందకు భయపడని స్త్రీతో కాపురము చేయుటకంటే ఒంటరిబ్రతుకే చాల మంచిది.

5. విభూతిధారణవలన నుదుగు, నేయివలన భోజనము, నదివలన గ్రామము, తోడబుట్టినవారివలన శరీరము, గృహిణివలన గృహము శోభస్కరము లగును.

6. పక్షపాతబుద్ధితో న్యాయమును నిర్ణయము చేయునతడు సమూలముగా నాశనము చెందును. అతడు నివసించు గృహములో దయ్యములు నివసింప మొదలిడును. జిల్లేళ్లు పెరుగును 'పాతాళమూలి' అనెడు తీగె అల్లుకొనును. శనిదేవత ప్రవేశించును. పాములుకూడ ప్రవేశించును.

7. కష్టపడి సంపాదించిన ధనమును నేలలో దాచియుండెడి మూర్ఖ మానవులార! మీ మరణానంతరము ఆ ధనమును అనుభవించువారెవరు? (డబ్బుగల దినములలో దానధర్మము లొనర్చుట శ్రేయస్కరము. తాము అనుభవింపకయు, ఇతరులు అనుభవింపకయు ఆ ధనము నిష్ప్రయోజనమగుచున్నదని భావము.)

8. వంచన చేయనివారికి ఆకలుములయింతి ఆయురారోగ్య సంపదలు, పేరుపెంపులు మున్నగువానిని ప్రసాదించును.

9. ఆకలిబాధను పోకార్చుటకై ఒక పడి (సేరున్నర) బియ్యము నాశించి యితరులను యాచించుచున్నాము; సేవించుచున్నాము, కీర్తించు చున్నాము. అలల సముద్రమునుగూడ దాటుచున్నాము. ఈ విధ ముగా శరీరమును వ్యర్థము చేసుకొనుచున్నాము.

10. శివాయనమః అనువారికి ఆపద లేర్పడవు. ఇదియే తరణోపాయము అననివారికి ఆపదలు తప్పవు.

11. ఏటియొడ్డుననుండు చెట్టుచేమలు నశింపక తప్పవు. రాజుతో సరి సమానముగ జీవింప నభిలషించునతడు నాశనమగును. కాని నేలను దున్ని జీవించువానికా యే భయమును లేదు. (అనగా, సేద్యమును మించిన వృత్తి మఱొకటిలేదని భావము.)

12. పండ్లతరబడి యేడ్చినను, మరణించినవారు తిరిగి రారు. పైగా మరణము తప్పదు. కనుక ఒకరికిపెట్టి మనము తిని జీవయాత్ర చేయుదముగాక !

గొప్ప భావమునుకూడ తక్కువమాటలలో సంగ్రహముగా చెప్పుట తమిళ కవయిత్రులకు వెన్నతోపెట్టిన విద్యగా కనబడుచున్నది. ముఖ్య ముగా ఈ విద్యలో అవ్వై అందెవేసినచేయి అనవచ్చును. ఇంత సంగ్రహ ముగా నుడివినను, చెప్పదలచిన భావము అస్పష్టముగా నుండకపోవుట ఈ సుభాషితములలోని ఒక విశేషము. ఈ క్రిందివానిని పరికింపుడు.

| | |
|---|---|
| అఱణ్ చెయ విరుంబు | (ధర్మముచేయ నభిలషింపుము) |
| అఱువదుసినమ్ | (తగ్గవలసినది కోపము) |
| ఈవదు విలక్కేల్ | (ధర్మమునకు అడ్డుతగలకుము) |
| ఐయ మిట్టుణ్ | (ఒకరికిపెట్టి ఆవల తినుము) |
| శని నీరాడు | (శనివారమునాడు తలంటు పోసికొనుము) |

| | |
|---|---|
| నన్ఱి మఱవేల్ | (చేసినమేలును మఱువవలదు) |
| తన్దై తాయ్ప్పేణ్ | (తల్లితండ్రులను కాపాడుము) |
| అరవ మాట్టేల్ | (పాముల నాడింపకుము) |
| ఇళమైయిల్ కల్ | (చిన్నతనముననే అభ్యసింపుము) |
| అఱనై మఱవేల్ | (విధ్యుక్తధర్మమును విస్మరింపకుము) |
| అనన్దలాడేల్ | (ఎక్కువ నిద్ర పనికిరాదు) |
| దెయ్వమికళేల్ | (దైవనింద చేయకుము) |
| నూల్ పలకల్ | (పెక్కు గ్రంథములు పఠింపుము) |
| మూర్కరోడిణంగేల్ | (మూర్ఖుల చెలిమి చేయకుము) |
| మెల్లెనప్పేసు | (మెల్లగ మాటాడుము) |

అవ్వైయ్యారు చెప్పిన వాక్యము లన్నియు ఇటులనే యున్నవి.

'అవ్వమాట అమృతతుల్యము' అనునట్లుగా ఆమెచేసిన రచనము లన్నియు అమృతతుల్యములై జీవితమున కుపకరించునవిగా నున్నవి. ఆమె సుధామయోక్తులు కొన్నిటిని బహుభాషావేత్తలు, కీర్తిశేషులునగు శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారు అవ్వగారి మవ్వపు సూక్తులను పేరున తెలుగు చేసియుండుట ఎంతేని హర్షింపదగు నంశము. తమిళ వేద (తిరుక్కురళు) కర్తయగు తిరువళ్ళువరునకు అవ్వైయారు సోదరియని కొందరందురు. బహుశః ఈమె సంగకాలపు అవ్వైయారు కావచ్చును.

కాక్కైప్పాడినియార్ నచ్చెళ్ళెయార్, ముడత్తా మక్కణ్ణియారులు రచియించినట్లుగా చెప్పబడు పద్యములు కొన్ని లభించినను, అవ్వైయారు రచనలకు లభించినంత ప్రచారము వానికి లభింపలేదు. అప్తుల రాకను తెలియజేయుటకో అన్నట్లుగా కా కా అని అరచెడి కాకినిగురించి ఒక పద్యమును చెప్పుటచే కాక్కైప్పాడినియార్ అను పేరు వచ్చియుండనోపు నని విశ్వసించుచున్నారు. వీరుకాక యింకను మరికొందరు కవయిత్రులు ప్రాచీనకాలమున వర్ధిల్లిరి. వీరిలో అన్నిజాతులవారును గలరు. రాజవంశ ములకు చెందిన కవయిత్రులుకూడ కొందరు వర్ధిల్లినట్లు తెలియుచున్నది.

ఆండాళ్ :

పన్నిద్దరాళ్వారులలో ఒకర్తెయు, మధుర భక్తిచిప్పిలు ముప్పది పాశురములు వెలయించిన భక్తురాలు నగు ఆండాళ్ (గోదాదేవి) కూడ ప్రాచీనులలో పేర్కొనదగిన కవయిత్రియే. ఈమె క్రీస్తుశకము ఎనిమిదవ శతాబ్దమున జీవించినట్లు పండితులు కొందరు తలచుచున్నారు. ఈమె తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అను రెండు రచనలు చేసెను. ఈ రెంటిలోను మధురభక్తి జాలువారుచున్నదనుట చర్వితచర్వణమే కాగలదు.

ఆండాళ్ పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) కుమార్తె పెరియాళ్వారు కూడ పన్నిద్దరాళ్వారులలో ఒకడు. ఈతనికి ఆండాళ్ తులసివనమున దొరికినట్లు ఐతిహ్యము. బాల్యమునుండియు ఆమె శ్రీమన్నారాయణుని యందే చిత్తమును లగ్నమొనరించి, తుదకా భగవంతుని పరిణయమాడిన ధన్యచరిత ! శ్రీకృష్ణదేవరాయలవారి ఆముక్తమాల్యదా ప్రబంధమును చదివినవారి కెల్లరకు ఈమె దివ్యచారిత్రము సుపరిచితమే.

ఆండాళ్ తిరుప్పావై ఆంధ్ర వైష్ణవులలోకూడ ప్రచారము గడించినది. మార్గశిర మాసమున నోము నోచుకొనెడి ద్రవిడాంగనలెల్లరు ఈ ముప్పది పాశురములు పాడి ఆనందపారవశ్యము చెందుచుందురు. ద్రావిడ వేద మనబడు నాలాయిర ప్రబంధమునందలి ఒకభాగముగా ఈ పాశురములు వ్యవహృతమగుచున్నవి. వీనిని ముద్దుపళని యింకను మఱికొందరు తెలుగు చేసినారు. ముద్దుపళని 'సప్తపదిపదంబుగా' తిరుప్పావును అనువదించెను. కాని ఆ తెలుగు సేతలోని పదిపాశురములు మాత్రమే లభించుట మన దురదృష్టము. నోమునోచుకొందము, చెలులారా ! రండు, రండు. ఆ నందనందనుని సేవించి పాపజాలమును పోగొట్టు కొందము, అను నీ మధురభావమే ప్రతిపాశురమునందును ప్రధానముగ గోచరించుచుండును. తిరుప్పావైలోని యీ తొలిపాశురమును చవి చూడుడు.

"మాసములకు నెల్ల మంచి మార్గశిరము పర్వమహాహా
యాస గలిగినట్టి చెలులు డాసి రారే
మంచి వగల మించి కులము నెంచి యవతరించినట్టి
చంచలాక్షులెల్లఁ గూడఁ జనఁగ రారే
న్యాయశాలియైన నంద నందనుండు తోయజాక్షి
శ్రీ యశోద కనిన సింహ శిశువుగాఁడ చే
నల్లమబ్బుచాయ మేనిఁ దెల్లఁ జేయుడాలు గల్గు
ఫుల్ల పుండరీక నయన పురుషవర్యుఁడే!
కీరవాణులార! హరినిగోరి చేరి తేరి సకల
పురుషార్థములను దృప్తి పొందరారే!"

(ముద్దుపళని తెలుగుసేత)

చవీ చక్కన గల యీ పాశురము లన్నియు గానానుకూలములై యుండుట ఒక విశేషము. అందువలన వీనికి ప్రచుర ప్రచారము లభించినది.

"హంసలు నడయాడెడి చేలుగల శ్రీ విల్లిపుత్తూరిలో జననమందిన ఆండాళును, శ్రీరంగనాధునకు పాశురముల పూర్వకముగా సమర్పించిన దానిని, పాశురముల మాలిక యనెడు సుమహారమును తొలుత తానుకై సేసికొని పిమ్మట దానిని భగవంతున కలంకరించిన ఆ సాధ్విని స్తుతింతము గాక!" అని భక్తుడొకడు గోదాదేవిని స్తుతించియున్నాడు.

పండిత ప్రభాకరులు మహామహోపాధ్యాయ, దాక్షిణాత్యకళానిధి, డాక్టరు ఉ. వే. స్వామినాధయ్యరుగా రనినట్లు "ఆమె అలంకరించిన ఆ సుమహారము ఆనాళ్లలో వెన్నునికే ఉపయోగపడినది. కాని ఆమె ప్రసాదించిన పాశురముల మాలికయో యెన్నోయేండ్లు గడచినను వాడక, వాసనచెడక అందరకు ఉపయోగపడుచున్నది." ఇది సత్యసంపూర్ణము. కనుక ఆండాళ్ వెలయించిన యీ పాశురములకు తమిళ వాఙ్మయమున ఎంత విలువగలదో గ్రహించుటకు అయ్యరుగారి పయివాక్యములు ప్రబల సాక్ష్యము!

ఆండాళ్ పాశురములు వైష్ణవుల కెంత ప్రీతిపాత్రములో, అటులనే శైవమతానుయాయులకు కారైక్కాల్ అమ్మగారి పాశురములు అంత ప్రీతిపాత్రములని నుడువవగును. శైవుల పవిత్ర గ్రంథములకు తిరుముఱై అని పేరు. కారైక్కార్ అమ్మగారి పాశురములు పదునొకండవ తిరుముఱైలో చేర్చబడినవి. శైవసమయాచార్యులలో ప్రముఖుడగు తిరుజ్ఞానసంబంధమూర్తి ఈమెను ప్రశంసించియున్నాడు. అరువదిమువ్వురు నాయన్మారులలో (శివభక్తులు) కారైక్కాల్ అమ్మగారు ఒకనాయనారు!

అమ్మైచ్చి :

కాంచీపురములో అమ్మైచ్చి అను నొక విదుషీమణి యుండెడిది. ఆమెకు తమిళమున మంచి పాండిత్యము గలదు. కంచి వరదరాజస్వామి వారి రథము పోవు వీధులలో నొకదానియందు ఆమె నివసించుచుండెను. రథము అనాయాసముగా పోవుటకుగాను కొందరు నిర్దయులై ఆమె నివసించుచున్న యింటిని బ్రద్దలుకొట్టిరి. అందుల కామె దుఃఖించినది. కాని యెవరితో చెప్పుకొనును, తన దుఃఖమును ? అప్పుడు కంచివరదుని ఉద్దేశించి ఆమె రెండు పద్యములు చెప్పెను. వానియందలి భావమిది : "ఓ కచ్చి (కంచి) వరదరాజా ! పాము, కోతి మొదలగువానిని సైన్యముగా చేసికొంటివా ? ఈ అమ్మైచ్చి నివసించు గృహమును లంకాపట్టణమని తలంచితివా ? తన గృహమును ధ్వంసమొనర్చినవారిని పాములుగాను, కోతులుగాను ఆమె పేర్కొనెననుట స్పష్టము.

సంగయుగము, జైనబౌద్ధులయుగము, శైవవైష్ణవాచార్యుల యుగము, కవిత్రయ యుగము, మఠాధిపతుల యుగము, ఆధునిక యుగము - అని తమిళపండితులు కొందఱు తమ వాఙ్మయమును యుగ విభజన మొనర్చిరని మొదట చెప్పియుంటిని. మరికొందఱు పండితులు సంగయుగము, సంగమునకు తరువాతి యుగము, పల్లవులకాలము, చోళుల కాలము, నాయకరాజులకాలము, ఐరోపీయులకాలము, ఆధునికయుగము- అని యుగ విభజనమొనర్చిరి. ఎటుల యుగ విభజన మొనర్చినను ప్రతి

యుగమునందును వెలుగులోనికి వచ్చిన తమిళ సారస్వతములో మత ప్రభావము గోచరించకపోదు. నిజమునకు, ఒక్క తమిళములోనేకాదు ప్రతి భాషలోను వెలువడిన ప్రాచీన వాఙ్మయమునకు మతమే వెన్నె ముకగా నుండెడిదనుట సత్యసన్నిహితము.

జైన బౌద్ధుల కాలములో జైన బౌద్ధముల ప్రాబల్యమును, ఆ తరు వాత కాలములందు శైవ వైష్ణవ మతముల ప్రభావమును మనము తమిళ సారస్వతమునందు కనుగొనవచ్చును. మహమ్మదీయ క్రైస్తవ మత సిద్ధాంతముల నాధారముగా చేసుకొని తమిళమున కొన్ని కావ్యములు సంతరింపబడెను. సిలప్పదిగారము జైనమతాచారముల విశిష్టతను తెలియ జేయు కావ్యము. మణిమేకలై కావ్యమున బౌద్ధమత ప్రాశస్త్యము ప్రవ్యక్తము చేయబడినది. తమిళవేదమని కొండాడబడు తిరుక్కుఱళునందు జైనమత ప్రభావము కానవచ్చుచున్నదని పండిత విమర్శకులు కొందఱు తలచుచున్నారు. ఇక శైవ వైష్ణవ కవులు సంతరించిన రచనములలో శైవ వైష్ణవముల ప్రశస్తి మిక్కుటముగా గోచరించుచున్నది. ఇందులో ఆశ్చర్యములేదు. దేశ కాల పరిస్థితులలో కాలక్రమముగ ఏర్పడు మార్పు లీవిధముగ తమిళ వాఙ్మయమున కనబడుచున్నవి.

తమిళవాఙ్మయ చరిత్రను పరిశీలించుచో, రచయిత్రుల సంఖ్య చాల తక్కువగ నున్నట్లు తెలియకపోదు. అందులోను, ప్రాచీన వాఙ్మయము నందు రచయిత్రుల సంఖ్య అత్యల్పమని నుడువక తప్పదు. ఆ ఉన్న వారిలో కొందఱు మాత్రమే చిరయశస్సు గడించిరి. పైపెచ్చు, వారు సంతరించిన రచనములు సమగ్రముగా లభింపకపోవుట మన దురదృష్టము. అయినను, ఆ నాటి తమిళ రచయిత్రులు కొందఱు వివిధ శాస్త్రము లందును పాండిత్యము గడించినట్లు సుస్పష్టమగుచున్నది. మత సంబంధము లగు చర్చలలోకూడ పాల్గొని ప్రత్యర్థులను పరాభవించిన మహిళలుకూడ కానవచ్చుచున్నారు.

పూర్వము అన్ని భాషలలోను రచయిత్రులనగా కవయిత్రులనియే వ్యవహారము. వచనమునకుగాని తత్సంబంధములగు రచనములను గాని

ప్రచారములేని ఆ దినములలో, కవిత చెప్పగలిగినవారే కవులుగానో కవయిత్రులుగానో పరిగణింపబడిరి. అందువలన, సాహిత్యోపాసకు లెల్లరు కావ్యములనే వెలయింపసాగిరి. అట్టి వారికే సంఘమున గౌరవము లభించుచుండెడిది. వచనశాఖకు బహుళ ప్రచారము లభించిన యీనాళ్లలో కూడ, కవితకు గల విశేష గౌరవమును పురస్కరించుకొని చూచినచో, ఆ నాళ్లలో కావ్యమున కెంత ప్రచార ముండెడిదో మనము అనాయాస ముగా గ్రహింపవచ్చును.

కాని కాలము మాఱుటతో, మన అభిరుచులలోను, విలువలలోను మార్పులు పెక్కు లేర్పడినవి. ముఖ్యముగా వాఙ్మయ రంగమునందు వచనములకును తత్సంబంధములగు శాఖలకును ప్రచురప్రచారము లభించెను. మఱి, యీ నాళ్లలో పద్యరచనములకంటె వచన రచనములకే యెక్కుడు ప్రచారము లభించుచున్నదను విషయము సర్వవిదితము. పద్యమునకు బదులుగా వచనము ప్రచుర ప్రచారములోనికి వచ్చుట జటిలమగు శైలికి మారుగా సరళమయిన శైలి యేర్పడుట, వీలయినంతవఱకు ఇతివృత్తము సామాజిక జీవన విధానమునకు సన్నిహితముగా నుండునట్లు చూచుట, సామాన్యమానవుని సుఖదుఃఖములను యథాతథముగా చిత్రించుటకు ప్రయత్నించుట మొదలగునవి కాలక్రమమున తమిళ వాఙ్మయమున ఏర్పడిన మార్పులు. పాశ్చాత్యులతోడి సంపర్కము, ఆంగ్ల భాషాభ్యసనము మున్నగునవి యీమార్పులకు కొంతవరకు కారణములయినవి. తత్ఫలితముగా, మహాకవి సుబ్రహ్మణ్యభారతి, వ.వే.సు. అయ్యరు ప్రభృతులు తమిళ సాహిత్యోద్యానమున క్రొత్తమొక్కలు నాటి వానిని పెంచుటకు పాటుపడిరి. వారి కృషి వారి కులములోనే కొంతవరకు ఫలించినది.

ఆధునిక తమిళవాఙ్మయమునందు కథలు, కథానికలు, నవలలు, చిన్ననవలలు అనేకములు వెలుగులోనికి వచ్చినవి. ఇది కథానికా యుగ మన్నను సాహసము కాజాలదు. సుబ్రహ్మణ్య భారతి వ్యావహారిక భాషావాదియగుటచే, ఆయన అనుయాయులుకూడ తమ రచనమును

వ్యావహారిక భాషలోనే సాగించుచున్నారు. ఇక కథలు, నవలలు మొదలగు వానిలో వ్యావహారిక భాషకే అగ్రతాంబూలము లభించినది. ఈ విషయమున తమిళ పత్రికలు ఎక్కడలేని ప్రోత్సాహము నొసగుచున్నవి. ముఖ్యముగా కల్కి సుప్రసిద్ధ రచయితయగురా, కృష్ణమూర్తి స్థాపించిన పత్రిక, ఆనందవికటన్ వంటి ప్రముఖపత్రికలు వ్యావహారిక భాషావాదమునకు అండగా నిలబడుటయే కాక చక్కని కథల నెన్నిటినో ప్రచురించినవి. కలైమగళ్ కూడ కమ్మని కథానికలు, ఉత్తమ నవలలు మొదలగువానిని ప్రకటించి ఆధునిక తమిళవాఙ్మయమును సుసంపన్న మొనర్చినది. రచయిత్రులు కొందరు మాండలిక భాషనుకూడ వాడుచున్నారు. కథాగత సన్నివేశములందును మార్పులెన్నో గోచరించుచున్నవి. ఈ నాడు వెలువడుచున్న పెక్కు కథానికలలోను నవలలలోను ఉదాత్తత లోపించుచున్నదనియు, శిల్పముకూడ లోపించుచున్నదనియు, అవి కేవలము ఉబుసుపోకకు రచింపబడినవిగా కనబడుచున్నవనియు విమర్శకులు పేర్కొనుచున్నారు. కాని వేయి కథానికలు వెలువడినచో వానిలో ఒక పదియైనను ఉత్తమరచనలై యుండవచ్చునని నుడువనగును.

ఆధునిక తమిళవాఙ్మయమున రచయిత్రులనగానే తొలుదొలుత కీ. శే. వై. ము. కోదైనాయకి అమ్మాళ్ పేరు స్ఫురణకు వచ్చును. ఈమె నవలలు, కథానికలు ఎన్నో వెలయించి తమిళవాఙ్మయమున శాశ్వతస్థానము సంపాదించినది. తొలినాళ్లలో వెలువడిన నవలలందు అతి దీర్ఘములయిన వర్ణనలు, దీర్ఘములయిన సంభాషణలు, సందేశములు మొదలగునవి కానవచ్చును. కోదైనాయకి రచనములలోకూడ ఈ లక్షణములు గోచరించుచుండును. ఇందులో ఆశ్చర్యమేమియు లేదు. ఇది ఆ కాలపు రచనావిధానము. ఆ కాలపు సమాజమును సజీవముగ అభివర్ణించుటకు ఆమె యత్నించి కృతకృత్యురాలయినది. కనుక కోదైనాయకి కథానికలందును, నవలలందును ఆ నాటి సమస్యలు, జీవనవిధానము కొట్టవచ్చినట్లు కనబడుచుండును. ఈమె చేసిన రచనములను పురస్కరించుకొని

చెప్పులుకుట్టువారు, కసాయివారు మున్నగు సామాన్యజనము రచించిన మహావాక్యములుకూడ ఆ గ్రంథమున సేకరింపబడినవి. కాని స్త్రీల రచనలుమాత్రము అందు కానరావు.

ఇంత భావుకత, శౌర్యము, ప్రేమ, ఆధ్యాత్మిక సాంప్రదాయమును కల ఈ జాతియందు కవయిత్రు లెవలును జన్మింపకపోవుట చాల ఆశ్చర్య కరముగానే కన్పింపవచ్చును. కాని పంజాబీదేశ చరిత్రను పరీక్షించినచో ఇదేమంత ఆశ్చర్యముగ కన్పట్టదు. పంజాబీయులు అలెగ్జాండరుకాలము నుండియు పరదేశస్థుల దాడులకు గురియగుటవలన వారి కొక నిర్ణీతమగు భాషకాని, పాలనా పద్ధతికాని లేక పోయెను. ప్రతి ఒక్క దండయాత్ర తోను అంతకుముందు ఉన్న వ్యవస్థయంతయు తారుమారగుచుండెడిది.

స్వాతంత్ర్యము వచ్చువఱకు విద్యావంతుల పిల్లలు తమ గృహము లలో పంజాబీ మాట్లాడుచుండిరి. ప్రాథమికపాఠశాలలలో ఉర్దూ నేర్చుకొను చుండిరి. విశ్వవిద్యాలయములలో ఆంగ్లము బోధనాభాషగ నుండెను. ఇన్నివిధముల భాషల మార్పుకూడ స్త్రీలకు సరియైన విద్యావకాశము లేకపోవుటలో నొక కారణము కావచ్చును.

పంజాబీభాష హిందీకంటె చాలా ప్రాచీనభాషయైనను పాలనా భాషగా ఎప్పుడును పరిగణింపబడలేదు. 19 వ శతాబ్ది ప్రథమభాగమున, పంజాబును పాలించిన గొప్ప సమ్రాట్టు రంజిత్‌సింగ్ కాలమునకూడ ఇది ప్రభుత్వభాషగా పరిగణింపబడలేదు.

స్వాతంత్రము వచ్చినతరువాతనే ఆ భాష అధికారభాషగా గుర్తింప బడినది.

ప్రస్తుతము పంజాబీ వాఙ్మయమున ఎంతోమంది కవయిత్రులు కలరు. కొందఱ రచనలు ఇతరభాషలలోనికి అనువదింపబడి యావద్భారత ప్రఖ్యాతికూడ పొందియున్నవి.

ఈ రచనలు పంజాబీయుల నిష్కాపట్యమును, దార్ఢ్యమును నిరూపించును. పంజాబీ సంస్కృతియందు స్త్రీలపాత్రకు ఈ రచనలు చిహ్నములుకూడ నై యున్నవి.

అమృతప్రీతమ్ :

పంజాబీ పద్యకవిత్వమున 'అమృతప్రీతమ్' చాలా వినుతికెక్కినది. ఈమె S. కర్తార్ సింగ్ హిట్ కారీ అను ఒక కవిపండితుని కుమార్తె. చిన్నవయస్సుననే 1936 నందే రచనమొదలిడి అనతికాలముననే తన రచనా పాటవముచే ప్రజల కాశ్చర్యముగొల్పినది. తరువాత అచిరకాలముననే ప్రేమగేయ రచయిత్రిగా పేరుగాంచినది.

ఈమె తన నాలుగవపడిలో వ్రాసిన "హిమస్నాత ప్రసూనములు", "మబ్బుల ఒడిలో", "సూర్యాస్తమయము" అను కావ్యములు బహు జనాదరణ నొందినవి. ఈమె తనరచనలకు ప్రకృతిని, ప్రేమను, ఎడబాటును కావ్యవస్తువుగా ఎన్నుకొని వానిని శృంగారాత్మకముగా మలచెను. నిత్యజీవితమునకు సన్నిహితముగా నుండు కవిత్వమును వ్రాసినవారిలో ఈమె ప్రథమురాలు.

ఈమె హిందూ సమాజమునందలి భార్యాభర్తల బాంధవ్యమును, స్త్రీలపై పురుషులునెఱపు అధికారమును, ప్రస్తుత వివాహసూత్రములపై, సాంఘికాచారములపై తన ప్రతిఘటనమును తన కవిత్వమున ప్రతిబింబింప జేసి హిందూవనితల బాధలను చక్కగా ఎత్తిచూపినది. ఈమె కవిత్వమున ఒక తిరుగుబాటుతత్త్వము సుడులుతిరుగుచు కాన్పించును.

1936 లో ప్రచురింపబడిన "అమృత్ లెహిరాన్" అనునది ఈమె ప్రథమ ప్రచురణము. పదమూడు సంపుటముల ఖండకావ్యములు, నాలుగు నవలలు, మూడు కథానికల పుస్తకములను, రెండు జానపద గేయ సంపుటములు, పంజాబీ సారస్వతముపై ఒక గ్రంథము, ఒక పుస్తకము జీవితచరిత్రలు - అనునవి పంజాబీభాషలో ఈమె ప్రచురణములు.

ఇవికాక హిందీలో మూడు నవలలను, కథానికల సంపుటమును వ్రాసెను. ఉర్దూలో రెండు సంపుటముల ఖండకావ్యములను, ఒక చిన్న కథల పుస్తకమును రచించెను. గుజరాతీలోకూడ ఈమె ఒక నవలను రచించెను.

ఈమె 1919 - 31 - ఆగస్టున జన్మించినది. పంజాబునందలి గుజరన్ వాలా ఈమె జన్మస్థానము.

పాకిస్థాన్ విభజనము ఈమె సుకుమార కవితాహృదయమున కొక పెద్ద అశనిఘాతమైనది. ఈమె భర్త ఒక సంపన్న వర్తకుడు. విభజన కాగానే ఆమె తన యింటినివిడిచి ఢిల్లీ వచ్చివేసినది. ఆమె ఢిల్లీలో ఒక చిన్నయింటిలో నివసించుచు, నేల అలుకుకొనుట, వంట చేసుకొనుట మున్నగు కష్టతరమైన గృహావిధులను నెఱవేర్చుకొనుచు, కష్టపడి పని చేయుచు కొంతకాలము జీవితము గడపెను. ఢిల్లీలో రేడియో కేంద్రమున 'ఎనౌన్సర్' (Announcer) గా ఉండి తన శ్రావ్యమైన కంఠధ్వనితో శ్రోతలను ముగ్ధులనొనర్చెను. ఢిల్లీలోని అనేకములగు పంజాబీ కార్యక్రమము లీమె మూలమున చాలా విజయవంతమైనవి. ఈ రోజులయందే ఈమెలోని కవితాశక్తులు వికసించెను.

ఈమె కవిత్వమున నిరీక్షణ, వాంఛ, వంచితస్త్రీ క్షుభిత హృదయావేదన, వియోగజనిత దుఃఖము, సంయోగ వియోగముల యందలి విషాదము మొదలగు భావములు చక్కగా ప్రతిబింబితములైనవి. పంజాబు విభజనతర్వాత ఈమె రచించిన గేయములలో పంజాబు విభజనవలన బాధితులైన ప్రజల హృదయాక్రోశమే బహుధానినదించినది. ఈ గేయములు అనేకములగు దేశభాషలలోని కనువదింపబడి భారతదేశమందంతటను ప్రఖ్యాతిగాంచినవి.

శ్రీ హార్బాన్‌సింగుగారిచే ఆంగ్లమున కనువదింపబడిన (The Scar of a Wound' (గాయపు మచ్చ) అను మకుటమున దేశవిభజన ఫలితముగ పరజాతివారిచే ఎత్తుకొనిపోబడిన ఒక తల్లియొక్క కుమారుని ఆవేదనను శ్రీమతి అమృతప్రీతమ్ ఎంత హృదయవిదారకముగా వర్ణించినదో కాంచుడు :

"కాలము మారునప్పుడు, (విపరీతములు సంభవించినపుడు) మా అమ్మ నుదుటికి తగిలిన గాయపుబాధకు నే నొక చిహ్నమును-హఠాత్తుగా

కల్గిన ఆ ఆపదకు నే నొక రూపాన్ని - నరుని నెత్తిపై నేటి దినమున నిలిచిన శాపపు రూపమును; నేను - చుక్కలురాలుచు, సూర్యు డారి పోవుచు, చంద్రుడు మసకబారుచు ఉండెడు దుర్దినమున నేను పుట్టితిని. నేను ఆ ఆపద గాయపుమచ్చను."

"నా తల్లి నెలలతరబడి గత్యంతరములేక, నిస్సహాయయై భరించిన అమానుష భారమును; నేను!" ఈ దౌర్భాగ్యుని (నా యొక్క) పిండపు వాసన (గర్భములో ఉన్నపుడు) మా తల్లి ముకుపుటములలో మంటలు రేపెను. శరీరమును కొఱకివేయు బాధతో, ఎముకలను కాల్చివేయు ఆవేదనతో, తన గర్భగోళమున, ఈ దుర్భర జీవిని మా అమ్మ సాకి భరించుట, ఎంత దుర్భరమో ఊహించుటకైనను తరముకానిది.

"దేశ స్వాతంత్ర్యము బాగుగా విరిసిన ఆ కష్టపు దినములలో పండిన ఫలమును నేను."

ఈమె సంకలనముచేసిన 'సందేశములు' అను గ్రంథమునకు సాహిత్య ఎకాడమీవారి బహుమతి లభించినది. దానివలన ఆమెకు 'పంజాబీ వాణి' అను బిరుదము వచ్చినది. ఈమె ఊహాశక్తి అప్పటమైనదిగాను, అద్భుతముగాను ఉండును. ఒక కావ్యములో ఆకాశమును కొబ్బరిచెట్టుగాను, బాలచంద్రుని కొబ్బరిముక్కగాను పోల్చియున్నది.

ఈమె వ్రాసిన పదునవలలలో 'పింజారి' (అస్థిపంజరము) అను నవల ఇంగ్లీషు, హిందీ మున్నగు పలుభాషలలోని కనువదించిరి. కలహాములతో జీర్ణమైన పంజాబుదేశమునందలి, పరస్పర ద్వేషములతో నిండియున్న ఒక సమాజములోని వ్యక్తుల గాథయే ఈ నవలకు కథావస్తువు.

'Voice of Punjab' అను పేరున ఈమె రచించిన అనేక గేయములకు హరీంద్రనాథు, హర్బాన్‌సింగు, మాచ్వ్యా మున్నగు సుప్రసిద్ధులొనర్చిన ఆంగ్లానువాదములు కల కావ్యమొకటి ఈమె ప్రతిభకు ఉక్ప్రదర్శనము.

ఆమె జీవితమునందువలె, కవిత్వమునందు కూడా విషాదము ధ్వనించుచుండును. ఈమె వ్రాసిన కావ్యములలో చైనీయుల దురా

క్రమణపై వ్రాసిన 'గేయము' అను నదియును, ఆవేశపూరితమైన జీవితముయొక్క అస్థిరత్వమును చూపు 'రోజుకూలి' అను గేయమును, కవయిత్రి హృదయమున గూడుకట్టుకొనియున్న బాధ నంతటిని లోకమునకు తెలుపు 'మౌనము' అను గేయమును ఈమె రచనలలో చెప్పుకొనదగినవి. ఈమె రచించిన బాలవాఙ్మయము, జానపద గేయములు, పద్యకథలు, అనువాదములును ఈమె కెంతో పేరుతెచ్చినవి. తన కవిత్వమువలెనే, తన జీవనమును గడుపుకొనగల్గిన కవయిత్రి ఈమె ఒక్కతెయె.

ప్రభుజోత్‌కౌర్ :

ప్రభుజోత్ కౌర్ ప్రస్తుతము పశ్చిమ పాకిస్థానమున నున్న 'లంగరియత్' అను గ్రామమున 1927 లో జన్మించెను. ఆమె తండ్రి నిధాన్‌సింగ్ భారత ప్రభుత్వమున మిలిటరీ ఫారక్సుశాఖలో గొప్ప అధికారి. ఆమె తండ్రిగారితోబాటు దేశదేశములను చూచుటతో బాల్యమునుండియే ఆమె హృదయమున ఒక జాతీయభావము చక్కగా ప్రవృద్ధమయ్యెను. ఆమె తన పదియవయేట తన ప్రథమరచనము నొనర్చెను.

అప్పటినుండియు అవిరామముగ ఆమె సారస్వత క్షేత్రమున కృషిసల్పుచునేయుండెను. పదునాల్గు సంపుటములు ఆమె రచనాప్రశస్తికి తార్కాణములుగ వెలువడియున్నవి. ఆమె ప్రథమకావ్య సంపుటి 'లాత్ లాత్ జోత్ జాగే' (Intensly Burns the Undying Flame) అనునది 1942 వ సంవత్సరమున నామె పదునెనిమిదేండ్ల ప్రాయమున లాహోరు ఖాల్సా కళాశాలా విద్యార్థినిగా నున్నపుడు ప్రచురింపబడెను.

పంజాబు నవలా రచయితగా పేరుపొందిన 'నరేంద్రపాల్‌సింగ్' అను వారు 1948 లో ఈమెను వివాహమాడిరి. నరేంద్రపాల్‌సింగు లెఫ్టినెంట్ కర్నల్. ప్రస్తుతము రాష్ట్రపతి భవనమునకు ముఖ్యపర్యవేక్షకులుగా నున్నారు.

1956 వ సంవత్సరమున ప్రచురింపబడిన 'పంఖేరూ' (Birds) అను కావ్యముతో ప్రభుజోత్ కౌర్ పంజాబీయందు అగ్రేసరురాలగు కవయిత్రిగా పేరుపొందెను.

ఈమె రచనలు కొన్ని విదేశీయ భాషలలోనికి కూడా అనువదింప బడినవి. రష్యను, ఇంగ్లీషు, ఫ్రెంచి, పర్షియను, ఇరానియన్, ఇటాలియన్ భాషలలోని కీమె రచనలు అనూదితములగుట ప్రశంసార్హమగు విషయము.

ఈమె కావ్యములయందు దేశభక్తి, జీవితమునందలి వైభవము, ఓజఃపూర్ణముగ ప్రదర్శింపబడినవి. ఈమె యొక్క ప్రథమ రచనా పుష్పమైన 'లాత్ లాత్ జోత్ జాగే' అను కావ్యము మొదటి యుద్ధ సమయమున రచింపబడినది. ఇది అంతయు దేశభక్తి ప్రపూర్ణమైనది. ఈమె ప్రచురించిన పది సంపుటముల కావ్యములలో స్వేచ్ఛ, ప్రేమ, వాంఛ, సౌఖ్యము మున్నగు దైనందిన జీవిత సంఘటనలవంటి అన్ని విషయములపైనను వర్ణనలు కలవు. ఈమె 'ఎస్కైలస్' రచించిన 'ఛోప్రా' అను కావ్యమును పద్యకావ్యముగాను, శ్రీ రాష్ట్రపతి రాధాకృష్ణ పండితులు రచించిన "సత్యాన్వేషణము" అను గ్రంథమును అనువదించెను. ఈమె చాలా విస్తృతముగా దేశమంతయు పర్యటించినది.

మృదువైన భావుకత, రమణీయమైన సన్నివేశ కల్పన కల్గిన ఈ కవయిత్రి "ఒక్కసారి" అను గేయమును గాంచుడు :

"వెలిగించు జ్యోతులను జ్యోతులను నా దారి కిరుప్రక్కలా,
నా బాట పొడవునా వెలిగింపు మొక్కసారి, ఆ జ్యోతులు
తమ కాంతి పుంజములతో చీకటిని కరిగించి,
కదలించి వేయును. వెలిగించు సుస్థిరాశాజ్యోతులను,
నిత్యాకాంక్షా జ్యోతులను వెలిగింపుము."
"ఓ ఆశా కిరణమా, ఓ అనంత ప్రకాశమా,
ఈ జిలిబిలి పెదవులను చుంబించుటకు సాగిరమ్ము,
ఈ నా పెదవిని స్పృశించుటకు ఈ రాత్రియే సాగిరమ్ము."

ఈ జీవితమున ఒక్కసారి వెలుగు నిండింపుము. ఈ జీవన క్షేత్ర వాటికలో ఒక్కసారి కలిమి పండింపుము. అంతరాత్మను మేల్కొలుపుము. భావజ్యోతిని కొడిగట్టనీయక ప్రోదిచేయుము. నా చషకమును నిండైన కాంతితో నింపివేయుము....

ఈమె ఇటీవలరచించిన 'పబి' (ప్లేటో)చే ఆమె ప్రస్తుత మనఃపరిస్థితి అర్థమగును. ఇందీమె జీవితమునందలి లోతులను, ఎత్తులను, నీడలను చక్కగా పరికించెను. ఇందు ప్రణయ మర్మముల ఆకర్షణ సన్నగిల్లినది.

## కథానికారచన

చిన్న కథలను వ్రాయుచున్న యువకవయిత్రు లింకెందఱో కలరు. **'దిలీప్‌కౌర్‌తివానా'** ఆరు సంపుటముల కథలను ప్రచురించినది. అందు మొదటిది 'పర్బత్‌వేహా' (ఉద్ధత ప్రవాహము) అనునది. చివరిది 'సాధన' అనునది. ఈమె పంజాబు విశ్వవిద్యాలయమున అధ్యాపకురాలు. సన్నని శరీరము, నిడుపాటి విగ్రహముకల ఈమెయందు తీవ్రమైన రచనాకాంక్ష కలదు. ఈమె క్లిష్టమైన భార్యాభర్తల సంబంధమును వర్ణించెను. వారి ప్రేమను అస్పష్టపు పొరలలో నుండివలె చూచును. ఈమె పాత్రలలో అన్ని భావములకు ప్రాతినిధ్యముకలదు. కాని, ప్రేమ కంత ప్రాధాన్యము లేదు. ఇది ఆమెకు గల ఒకానొక నిగ్రహశక్తి యొక్క ఫలితము. ఈమె భావ ప్రపంచమున ముందుకు పరుగిడుచునే, మధ్యతరగతి నీతులు సమకూర్చు భద్రతాస్థితికై వెనుకకు తిరిగి చూచుచుండును. ఈ ద్వైవిధ్యము వలననే తన భావములను సరిగా వ్యక్తము చేయలేక పోవుచున్నది. ఇటీవలి ఆమె రచనమున కొంత పురోగమనము కాననగుచున్నది.

### సురేందర్‌జిత్‌బ్రార్ :

ఈమె ఒక నవలా రచయిత్రి. ఈమె వ్రాసిన రెండు నవలలు 'దావానల్', 'మృక్షా' (ఎండమావులు) అను వానిలోని కథావస్తువులు గమనార్హమైనవి. మొదటి నవలకు అత్తాకోడళ్ల సంబంధము కథావస్తువు; వీ రిద్దఱి సంఘర్షణ ఈ దావానలమునకు మూలము. రెండవ నవల మానవుని ఎడతెగని తృష్ణను వర్ణించును.

### ఊర్మిళాఆనంద్ :

గంభీర విషయములపై వ్యాసములను వ్రాయుటలో ఈమె దిట్ట. ఈమె తండ్రి గురుభక్ష్‌సింగ్ పంజాబులో గొప్ప గద్య రచయిత. ఈయన

"ప్రీర్ లార్" అను పత్రికకు సంపాదకుడుగా పనిచేసెను. ఊర్మిళాఆనంద్ చిన్ననాటి నుండియు తన తండ్రియొద్ద రచనాశక్తిని పెంపొందించుకొనెను.

ప్రస్తుతము ఈమె 'జీవితమున స్త్రీలపాత్ర', 'గృహము', భావ సమానత్వము', 'సాంఘిక రాజకీయ జీవితము', గృహాంతర్భాగాలంకరణము' మున్నగు సమస్యలపై వ్రాయుచున్నది.

ఈమె తన వ్యాససంపుటిలో నిశీథము, సంయోగ వియోగములు, డాల్ సరస్సు మున్నగువానిని వర్ణించును. ఇవి శృంగార రసాత్మకముగా నుండును.

అజిత్‌కౌర్ :

ఈమె ఒక సాహసికురాలైన రచయిత్రి. ఈమె చిన్న కథలన్నియు 'గుల్‌బనో' అను పేరున ఒక సంపుటముగా వెలువడినవి. ఇవి అన్నియును స్త్రీలయొక్క గాఢతర మనోభావములను వర్ణించును. ఇవి ఏమంత భావ గర్భితములు కావు.

రాజేందర్‌కౌర్ :

ఈమె కూడా కథానికా రచయిత్రియే. ఈమె స్త్రీల భౌతిక, మానసికావస్థలనుకూడ వర్ణించెను.

రాజ్‌బేడీ :

రాజ్‌బేడీ అను నొక అధ్యాపకురాలుకూడ కొన్ని చిన్న కథలను వ్రాసెను. కాని 'బాలాజీ తులసి' అను నామె తప్ప ఇంకెవఱును మత సంబంధ రచనలు చేసిన స్త్రీలు లేరు. ఈ రచనములైనను సూఫీతత్త్వమునకు అనుసృతులే.

ఈ యువ కవయిత్రుల రచనలలో నేటి పంజాబుయొక్క తిరుగుబాటు దృక్పథము కనబడును. ప్రాచీన కాలమున సేనలను నడిపి, యుద్ధములొనర్చి, శత్రువుల నోడించిన మహానాయకురాండ్ర వీర రక్తమిప్పటికిని వీరిలో ఉరకలు వేయుచున్నదా యనిపించును.

# మళయాళ కవయిత్రులు

మూలము :
శ్రీమతి యన్. బాలమణియమ్మ,
కొజికోడు (కేరళ)

అనువాదము :
ఊ. సుహాసినీదేవి, M.A.,
బాపట్ల.

ఇతర భారతీయ భాషలయందలి కవయిత్రుల సంఖ్యతో పోల్చి చూచినచో మళయాళ భాషయందు కవయిత్రుల సంఖ్య చాలా స్వల్పముగా నున్నది. ప్రాచీనకాలమున సామాన్య కుటుంబములయందు బాలికలను చాలా స్వల్పముగా చదివించెడివారు. ఆ చదువైనను వృద్ధి గావించుకొనుటకు తరువాత అవకాశము లుండెడివి కావు. మహిళల విజ్ఞానాభివృద్ధి కిది యొక ఆటంకము గావచ్చును. ఈ నాడు విద్యావతి యైన మహిళకూడ విరామములేని దినకృత్య నిర్వహణమున శ్రద్ధవహించుట యందే నిమగ్నురాలై కళాసాహిత్యాభివృద్ధికి తనకాలమును వినియోగింపలేక పోవుచున్నది.

ఈ పరిస్థితులవలన మన అతి ప్రాచీన కవయిత్రు లందరును సంపన్న కుటుంబములలోని వారే అయియుండుటలో వింత యేమియును లేదు. ఎందువల్లననగా ఆ నాడు రాజకుటుంబములలో సంస్కృతముద్వారానే సాహిత్యము విజ్ఞానమును నరనారులచే సమానముగా అభ్యసింపబడు చుండెడిది. ఈ సంపన్న గృహములయందు కొల్లలుగా నౌకరులును, వారి నజమాయిషీ చేయుటకుకూడ తగిన అధికారోద్యోగులును ఉండుట చేత రాజవంశములయందలి యీ స్త్రీలకు ఇంటిపనుల యొత్తిడి యుండెడిది కాదు. అందువలన వారు సాహిత్యాత్మకమైన చైతన్యముకలవారై, సాహిత్య వాతావరణముననే జీవించెడివారు. కవిపండితుల సాన్నిహిత్యమున వారి సాహిత్య జీవితము నిత్య వికాసముతో అలరారుచుండెడిది. వారి రచనలపై సంస్కృత ప్రభావముద్ర సంపూర్ణముగ కన్పించుటయే కాక, ఆనువంశికమైన ప్రతిభా సంస్కృతులు అందు కన్పట్టుచుండెడివి.

### మనోరమతంపురాట్టి (1759-1828) :

మళయాళభాష క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దమున మాత్రమే సాహిత్య భాషగా రూపొందినది. అంతకుముందు కేరళ రచయితలు తమ అభిప్రాయ ప్రకటనార్థము తమిళమునుగాని సంస్కృతమునుగాని ఉపయోగించెడి వారు. క్రమముగా తమిళము ఆ వ్యవహారమునుండి తొలగిపోయెను. కాని కవులు చాలాకాలమువఱకు పట్టుదలతో సంస్కృతమునందే తమ రచనలను కొనసాగించిరి. ప్రఖ్యాతులైన జామరినుల వంశ సంతతికిచెందిన మనోరమతంపురాట్టియే కేరళమున అతి ప్రాచీన కవయిత్రిగా ఎంచబడు చున్నది. (1759-1828) హైదరాలి టిప్పుసుల్తానుల యొక్కయు వారి అనుయాయుల యొక్కయు దాడులతో స్థానిక రాజవంశములకును, వారి దళాధిపతులకును నడుమ అడపాదడపా యుద్ధములు జరుగుచు కేరళము సంక్షుభితమై మిక్కిలి జటిలదశలోనున్న సంధికాలమున ఆమె జీవించియుండెను అయినను సాహిత్యము మాత్రము అలక్ష్యము చేయబడ లేదు. యుద్ధవిరామసమయములయందలి శాంతికాలములయందేమాత్రము తీరికచిక్కినను సాహిత్య విహార (విలాస) ములతోను, సాంస్కృతిక గోష్ఠులతోను కాలక్షేపము చేయు మహారాజు లప్పుడుండిరి. ధర్మరాజు అను పేరున ప్రఖ్యాతినొందిన తిరువాన్కూరు మహారాజు అట్టివారిలో మిక్కిలి ప్రసిద్ధుడు. ఆయన స్వయముగ కవియై, పండితుడై దేశమునందలి అన్నిప్రాంతములయందలి చాలామంది పండితులను ఆదరించి పోషించెను. ఆ కాలమున కవులు పండితులు సామాన్యముగా కొందరు మహారాజుల యొక్కయు, ప్రధానుల యొక్కయు ప్రాపకమున నుండెడివారు. (కథాకలి నృత్యముకొఱకు రచింపబడిన) అట్టక్కథ రచనలు మెల్లగా ప్రచారము నందుచుండెను. కాని 'పాటపట్టు' (యుద్ధగీతములు) వంటి ఏవో కొద్ది తమిళచ్ఛందస్సులు, ఆనాటి ప్రభావ ముద్రితములైన రచనలు కొన్ని కాననగును.

మనోరమతంపురాట్టి చాలా చిన్నవయస్సుననే తన తల్లిని కోల్పో యెను. తంపురాట్టి తల్లి మరణించిన కొద్దికాలమునకే హైదరాలీ దాడి

జరుపుటచే తంపురాట్టి పుట్టిన, కాలికట్టును విడిచి వారికుటుంబము పౌనానీ చేరుకొనెను. పౌనానీలో తంపురాట్టి తన మేనమామ పర్యవేక్షణయందు సంస్కృతవిద్య నభ్యసించెను. ఆమె తన 12వ యేటికే ప్రసిద్ధ వ్యాకరణమైన సిద్ధాంత కౌముదికి చేయబడిన కఠిన వ్యాఖ్యానమైన "మనోరమ" యందు నిష్ణాత్మక ప్రజ్ఞకలదయ్యెను. బాల్యముననే "మనోరమ" వ్యాఖ్యానము నవగతము చేసుకొనినదగుటచే నాటినుండి "మనోరమ" యను పేరున పిలువబడినదని కొందరందురు.

రాజవంశమునకు చెందిన ఆమె ప్రథమభర్త బాల్యముననే మరణించెను. బ్రాహ్మణ కులజుడైన పక్కాట్ భట్టత్తిరిపాద్ తో మఱల ఈమెకు ద్వితీయవివాహము జరిగినపు డీమె వయస్సు 19 ఏండ్లు. అత్యంత ప్రజ్ఞావతియైన మనోరమకు ఈ భట్టాద్రిపాద్ సరియైన జోడు కాకపోవుటచే వారి వైవాహిక జీవితము ఇడుములకే కారణమాయెను.

ఆమె హృదయమునుండి పొంగులువారు హాస్యధోరణి ఆమె కావ్యములలో స్థానము కల్పించుకొనెను. ఈ బాల కవయిత్రినిగూర్చి ఒక కథ కలదు. వారి భవనమునకు తరచుగా ఏతెంచు కవిపండితులలో చెలపురంపు నంబూద్రి అను వృద్ధకవి యొకడుండెను. మనోరమ పదమూడు, పందొమ్మిదేండ్ల నడిమి వయస్సుననున్నకాలమున ఒక దినమున ఆమె వ్యాకరణ పాఠమును చదువుకొనుచుండగా చెలపరాంపు ఆమెకు ముందు తెలియపరచకుండగనే లోపలకు వచ్చి ఒక అద్దమునెదుట కూర్చొని ఆశువుగా ఈ క్రింది శ్లోకమును చదివెను.

"పలితాని శశాంక రోచిషాం
శకలా నీతి వితర్కయా మహే"

ఆ వృద్ధకవి ఆశ్చర్యపడునట్లుగా మనోరమ వెంటనే ఆ శ్లోకము నిట్లు పూరించెను.

"అతయేవ నిమీలితేతరాం
వనితాలోచన వారిజంపురా" అని.

టిప్పుసుల్తాను మలబారుపై 1788 లో దాడి జరిపినపుడు మనోరమ తన భర్తతోను, పిల్లలతోను తిరువేంద్రమునకు శరణార్థిగా చేరెను అచట ఆమె ప్రజ్ఞాసామర్థ్యములు మహారాజువరకు ప్రాకి, మహారాజుచే ప్రశంసింప బడుటయేకాక మహారాజుచే ఆ కవయిత్రికి విలువయైన బహుమానములు కూడ ఒసంగబడెను. అంతేకాక మహారాజా ధర్మరాజులు సంస్థానమునకు కేరళదేశమునందలి యనేక ప్రాంతములనుండి శరణార్థులుగ వచ్చిన అనేకులగు కవిపండితులతో పరిచయభాగ్యమును పొందు అవకాశము కూడ ఆమెకు లభించెను. ఆమె యొక్క మేధాసంపదచేతను, సౌజన్యముచేతను, స్నేహదృక్కులచేతను, సంభాషణా చాతుర్యముచేతను మనోరమ ఆ పండిత సంఘమున సరస్వతియొక్క అపరావతారముగ పరిగణింపబడెను. మనోరమకు అచట పెక్కురు యోగ్యులగు శిష్యులుకూడ సమకూడిరి. మనోరమ (వ్యాకరణ వ్యాఖ్యాన గ్రంథము) ను రఘువంశమును పాఠము చెప్పుట యనగా ఆమె కెంతయో మిక్కిలి ప్రీతికరమగు విషయము. తిరువనంతపురమున గడపిన ఈ సంవత్సరములే బహుశః ఆమె జీవితమున కంతకును సౌఖ్యావహమైన కాలము కావచ్చును. మలబారునందు బ్రిటిషుప్రభుత్వము సుప్రతిష్ఠితమైనవెనుక 1799 లో మఠంల వారి కుటుంబము పొనానీకి వెళ్ళి అచట స్థిరపడిపోయెను.

మనోరమ చాలా కావ్యములను రచించెను. ముఖ్యముగా ఆమె సంస్కృతమున *ముక్తకములను రచించెను. ఆ రచనలు చాలావరకు నష్టమైయుండును.

ఆ యా సమయసందర్భముల కనుగుణముగా ఆమె చాలా శ్లోకములను రచించి భద్రపరచుటయందు శ్రద్ధవహింపలేదేమో. ఉపలబ్ధములైన శ్లోకములనుబట్టి చూచినచో తోడి యితరకవులకంటె యీామె రచన, భావుకత భిన్నముగ నుండును. అందు వివిధ దేవతా ప్రార్థనములు లేవు. పౌరాణిక గాథల పునరావృత్తులు లేవు. రాజుల వైభవ ప్రాభవము

* ముక్తకమనగా ఏ శ్లోకమున కా శ్లోకమున భావము ముగిసిపోవుట.

సంకీర్తనము చేయలేదు. ప్రాచీన సాహిత్యపరుల ప్రత్యేకలక్షణమైన దైవ, మత సంబంధమగు ప్రవృత్తి యామెకు లేదని మన మూహింపవచ్చును. ఆమె తన భావములవలకు స్వయంవ్యక్తియు, అభ్యుదయవాదినియునై కన్పట్టును.

"స్త్రీ పుం సత్వా వలంబీ జగతి ఖలు నృణాంద్వంద్వ ధర్మాభిలాషా,
రాగసోపాధి కోసావపి విభవముఖై రంగకైః షడ్భిరంగీ
తేష్వేకం....నిజవిషయం ప్రేమమాన్దం ప్రవాదా
ద్దోషా దోషం వృథానః కథయతి విదుషే హా న్తతస్మై నమోఽస్తు॥

## ఉమాదేవితంపురాట్టి, అంబాదేవితంపురాట్టి :

18 వ శతాబ్దమున కుంచనొ నంబియార్ అను కవి తుల్లాల్ప్పట్టు (Thullalppattu) (తుల్లాల్ అను ఒక్కరే చేయు నాట్యమున ఉపయోగింప బడు పాట)ను ఎక్కువగా ప్రచారములోనికి తెచ్చెను. ఇది సరళమగు మళయాళ భాషలో కూర్చబడి, ఎక్కువగా ప్రాసతోకూడి అపహాస్యపు ధోరణిలో రచింపబడును. ఈ పాటలు ప్రజానీకమున హెచ్చుగా మెచ్చుకొనబడెను. ఈ రీతి గేయకవితను చేయుటకు మొదలిడిన ప్రథమ కవయిత్రి కిలిమానూరు భవనమునందలి ఉమాదేవితంపురాట్టి (1796-1835) అయి యున్నది. ఆమె రచనయగు "విష్ణుమాయా చరితము" సాహిత్యపరముగా చక్కని కావ్యము. కిలిమానూరుకు చెందిన అంబాదేవితంపురాట్టి: (1831-1886) ప్రఖ్యాత చిత్రకారుడైన రాజా రవివర్మ తల్లి. ఈమె కూడ ఒక గొప్ప చిత్రకారిణి. అంతేకాక తుల్లాల్ వాఙ్మయ పద్ధతిలో పార్వతీ పరిణయమును రచించెను.

## కుట్టికుంజుతంకచ్చి (1821-1905) :

కేరళదేశమున చాలాభాగము బ్రిటిషు ప్రభుత్వము స్థిరపడినవెనుక చిరకాలమునుండి సాగుచున్న అంతర్యుద్ధములు సమసిపోయెను. కత్తుల రాపిడివలన జనియించు మెరమెరలు, తుపాకుల చప్పుడుల మారుమ్రోతలు (మర్మరధ్వనులు)ను కొబ్బరిచెట్ల వరుసలతో, దట్టమైన ఆ సముద్రతీరమున

అంతరించిపోయెను. సంగీత సాహిత్యములయం దత్యధిక ప్రతిభావంతు డును, స్వయముగ కవియు, గాయకుడును నైన స్వాతి తిరుణాళ్ మహారాజు తిరువాన్కూరున ప్రభువగుటతో నూతన శకారంభమునకు అంకురార్పణ జరిగెను. * 1 ముద్రణా యంత్ర స్థాపనమును, విద్యా సౌకర్యములును అతి శీఘ్రగతిని జరుపబడి మళయాళ దేశచరిత్రయం దద్భుతమగు మార్పులను గొనితెచ్చెను. సాహిత్యమున 'అట్టక్కథ' పాటలు హెచ్చయ్యెను. వాంచిప్పట్టు (పదవపాట) వంటి ద్రావిడ చ్ఛందస్సులును, కురాతిప్పట్టు (జిప్సీపాటలు), (కొరవంజిపాటలు) మొదలగు నవి కవులచే బహుళముగా సృజింపబడుచుండెను. కుట్టికుంజు ఆ కాలము నాటిది. కేరళ సాహిత్యమున జరిగిన ఈ అతిశీఘ్ర పురోభివృద్ధికి కుట్టికుంజు జీవితమంతయు ఒక సాక్ష్య మనవచ్చును. ప్రసిద్ధిపొందిన అనేకములగు 'అట్టక్కథ' లను రచించిన రవివర్మ (ఇరాయిమ్మన్) తంపి, * 2 తంకచ్చి తండ్రి. ఈ రవివర్మ; స్వాతితిరుణాళ్ పాలనాకాలమున కేరళ కవిసార్వ భౌముడై యుండెను. తంకచ్చి బాల్యమునుండియు విశేషముగా తెలివి తేటలు గలది. మిక్కిలి చురుకైనది. రెండేండ్ల కాలపరిమితియందె ఆమె తమిళమునందును. మళయాళమునందును, గణితమునందును మిక్కిలి ప్రావీణ్యమును పొందెను. తరువాత ఆమె సంస్కృతము, సాహిత్యము, న్యాయశాస్త్రము, వ్యాకరణమును అభ్యసింప నారంభించెను. ఆమె తన పదునాల్గవయేట తన మేనత్తకుమారుడైన కున్హాన్ తంపన్‌ను పెండ్లి యాడెను. ఆ సంవత్సరముననే ఆమె సాహిత్యజీవితము నారంభించెను. ఆ బాలిక మళయాళమునందును సంస్కృతమునందును, ముత్యముల కోవ వంటి వ్రాతతో శ్లోకములపై శ్లోకములను, కోకొల్లలుగ పాటలును రచించి పుటలు పుటలు నింపివేసెను. కాని ఆమె తండ్రియైన రవివర్మతంపి

* 1. భారతదేశమునకు మొదట వచ్చిన మిషనరీలచే భారతదేశమున ప్రప్రథమ ముద్రణా యంత్రము కేరళదేశమున నెలకొల్పబడెను.

* 2. తిరువాన్కూరునందలి గొప్ప కుటుంబపుస్త్రీలకు ఒసంగబడు బిరుదము తంకచ్చి.

తాను గొప్ప కవియయ్యెను తక్కిన విద్యావ్యాసంగము పొడగునను భయ మున తనకుమార్తె కభిరుచికరమైన (అభిమానపాత్రమైన) కవితా వ్యాసంగ మును ఆమోదింపకపోవుటయే కాక, ఆమెను అందుండి నిరుత్సాహ పరచెను, తంకచ్చి తన తండ్రిని ఎదిరించలేక తన అభీష్టమునే అణచివేసెను. కాని తరువాత రహస్యముగా తన అభీష్టమును నెరవేర్చుకొనెను.

రవివర్మతంపి హఠాత్తుగా ఒకప్పుడు తంకచ్చి వ్రాతప్రతులను చూచుట తటస్థించెను. అవి చూచిన వెనుక తన కుమార్తె ప్రజ్ఞాపాటవ ములు తనకు గర్వకారణములని గ్రహించి తనకు అన్ని విధముల సహాయ కుడును, ఆంతరంగిక మిత్రుడునునైన ప్రభువు దగ్గరకు తీసుకొని వెళ్ళి చూపెను. మహారాజు ఆమె రచనలకు చాలా సంతోషించి వెంటనే అనేక బహుమానముల నొసగి ఆమెను సన్మానించెను. అప్పటినుండి తంకచ్చి తన తండ్రి ఆశీర్వాదముతో తన అభీష్ట పథమున నిరాటంకముగా సాగి పోయెను.

ఆమె అట్టక్కథల యందొకటియైన "శ్రీమతీ స్వయంవరము"ను ఆమె తండ్రి అభిప్రాయముల ననుసరించి రచించెను. కాని అది రవివర్మ మరణానన్తరము కాని సంపూర్ణము కాకపోయెను. ఇట్లు జరిగినందుల కామె మిగుల పశ్చాత్తాపపడెను. కాని తరువాత కొన్ని సంవత్సరములకు ఆమె దానిని మహారాజునకు చూపగా మహారాజు చాలా సంతోషించి కథాకళీ నిపుణులచే ఆ "అట్టక్కథ" ను తన సమక్షమున ప్రదర్శింపజేసెను. ఒక మహిళా కవయిత్రి రచనను రంగముపై ప్రదర్శించుట కిదియే ప్రథమము.

ముప్పది రెండు సంవత్సరముల ప్రాయముననే ఆమెకు నయము కాని నేత్రవ్యాధి కలిగి ఆమె చదువుట నాపివేయవలసి వచ్చెను. ఆమె తన రచనలను తానుగా చెప్పి ఇంకొకరిచే ఉక్త లేఖనము (వ్రాయింప) చేయింపవలసి వచ్చెను. అయినప్పటికిని తంకచ్చి తన సాహిత్య వ్యాసంగ మును కొనసాగించుచునే యుండెను. మూడు అట్టక్కథలు, అయిదు

కొఅవంజి పాటలు (ఎఱుకల నృత్యము పాటలు) అనేకమైన భగవత్సంస్తుతి కీర్తనలు, ప్రార్థనలు, వివిధములగు కావ్యములు, ముక్తకములు మున్నగునవి మొత్తముపై ఆమె బృహత్సంఖ్య గల రచనములనే కావించెను. సంస్కృత నాటక పద్ధతిని రచించిన ఆమె "అజ్ఞాతవాసము" అను నాటకము ఒక విశ్రుత రచన. మహారాజా ఆయిల్యమ్ తిరునాళ్ బాలుడుగా నున్నపుడు కావించిన తీర్థయాత్రను గూర్చి వర్ణించు "గంగా స్నానము" మున్నగు కావ్యములను రచించుటద్వారా ఆమె తనకును తన తండ్రికిని నిత్యసంబంధము కలిగినట్టియు తనకు తమ కుటుంబమునకు మహోపకారులైనట్టియు తన ప్రభువులకు కృతజ్ఞతాపూర్వకమైన తన విస్రమసేవలను అర్పించెను. ఈ కవయిత్రి తన జీవితమున నలుగురు మహారాజుల పాలనమును చూచెను. ఆ నల్వురను ఆమె తన రచనలతో సంభావించి మఱల వారిచే సంభావింపబడెను. ఆమె తన రాజకుటుంబసేవలకై యావజ్జీవితమును అర్పించెను.

ఆమె కవిత్వము మిక్కిలి ఉన్నతమైన యమకానుప్రాసల కాటపట్టై సంగీతాత్మకమై యున్నది. సంస్కృత పదములను ఆమె చాలా స్వేచ్ఛగా ఉపయోగించినను స్పష్టతకు భంగమురాకుండ వాడెను. పురాణములను ఆమె బాగుగా చదువుటయేకాక తన రచనలకు పురాణముల నుండియే యెప్పుడును వస్తువును స్వీకరించెడిది. ఆమె పాటలలో "కిరాతమ్" అనునది చాలా ప్రాచుర్యమునందెను. ఆమె స్తోత్రములు భక్తి మధురములై తరచు ప్రాసపూర్ణములై యున్నవి.

వ్యక్తిగత జీవితమున తంకచ్చి కచ్చితమైన హైందవాంగన. ఆమె తన భర్తను గౌరవించెను. ఎనమండుగురు పిల్లలను ప్రేమమయి అయిన తల్లిగా పెంచెను. గృహిణిగా గృహాసంబంధమైన, మతసంబంధమైన విధులను నిష్కర్షగా పాటించెను. అంతేకాక హాస్యమయముగా ఆనందావహ సంభాషణలను గావించుటలో కడు చతుర. ఆమె ఆ శతాబ్దపు మహాకవయిత్రి అయినను సామాన్య ప్రజానీక మామెను తేజఃపూర్ణమైన

మోముదమ్మిత్తో విరాజిల్లు ఒక సామాన్య వనితగాను, ఉపకారపరురాలు గాను తలంచెను.

వృద్ధాప్యమున నామె భర్తృవిహీనయయ్యెను. ఆమె చరమ సమయము చాలా ప్రశాంతముగా మత విధినిర్వహణముతోను, ప్రార్థనలతోను గడచిపోయెను. 1962 వ సం॥లో కేరళ సాహిత్య ఎకాడమీ ఆమె చిత్రమును ఎకాడమీ భవనమున ఆవిష్కరించి ఈ మహాకవయిత్రి స్మృతిని గౌరవించెను. ఆమె కుమారులలో ఒకడైన పద్మనాభతంపి చిత్రకారుడుగా ప్రసిద్ధినొందెను. ఆతడు కవికూడ.

ఎలమనకల్యాణిఅమ్మ :

1830 ఆ ప్రాంతమున బ్రాహ్మణ కవులచే "వెన్మణి ప్రస్థానమ్" అను ఉద్యమము బయలుదేరదీయబడెను. పూన్‌తోట్టమ్, వేన్మణియును ఆతని కుమారుడు నాదువమ్ మొదలగువారును కోడుంగల్లూరు రాకుమారులైన ఇద్దరు ప్రసిద్ధకవులచే అనుసరింపబడిరి. కాని మనోరమతంపురాట్టి సమకాలీనుడైన చెలపరాంపు ప్రకీర్ణక కావ్యములయందే దీనికి బీజములు కలవు. ఈ ఉద్యమము సాహిత్యభాషను వ్యావహారికభాషకు చాలా సన్నిహితముగా తీసికొనివచ్చెను. ఈ పరిణామము కేవలము ద్రావిడ చ్ఛందస్సులతోనే ఆగక సంస్కృత శ్లోకములవఱకును వచ్చెను. పద్యము నందలి ప్రతి పాదముయొక్క రెండవ అక్షరమును ప్రాసగా పరిగణించుట అనునది, ఒకే ధ్వనియొక్క పౌనఃపున్యోచ్చారణచే సిద్ధించు మాధుర్య ప్రాధాన్యముకొఱకై అంతటను విస్తారముగా పాటింపబడెను. శబ్దనిర్మాణము పైననే ఊతము పాటింపబడుచుండెను; కాని తద్గతభావముపై కాదు. ఈ ఉద్యమము బలముగా నాటుకొనుకొలది అదివరకు కవిత్వమును గూర్చి వ్యాప్తియందున్న భావములపై ప్రశ్నలువచ్చెను. అదివరకు సంస్కృతమున పండితుడైననాడే మళయాళమున కవిత్వము చేయ నర్హత గల్గినవాడు అను నభిప్రాయముండెడిది. కాని యిపుడు సాహిత్య వాతావరణమున తీవ్రతతగ్గి సరళమైన, పరిచితమైన వస్తువును ఇముడ్చుకొనిన చిన్ని

కావ్యములు, పద్యరూపమగు ఉత్తర ప్రత్యుత్తరములు ప్రచారములోనికి వచ్చినవి. ఆశుకవిత్వము, సమస్యాపూరణము అభిమానపాత్రములైనవి.

త్రిపునితురా వాస్తవ్యురాలైన ఎలమనకల్యాణియమ్మ స్వేచ్ఛగా ఈ విధమైన కవితా కాలక్షేపము నొనర్చినది. ఆమె 1831 లో పుట్టినది. కొచ్చిను రాజభవనమున ఇక్కుతంపురాట్టి సన్నిధిని జరుగు సాహిత్య సమావేశములకు ఆమె సాధారణముగా హాజరగుచుండెడిది. ఆమె తన మిత్రులకు పద్యములతోనే ఉత్తరములు వ్రాసెడిది. ఈమె యెన్నో కావ్యములు రచించెననియు, కాని ఆమె ఆ కావ్యములను భద్రపరచిన పేటికను చెదపురుగులు పాడుచేసెననియు చెప్పుదురు. ఆమె ప్రతిభకు సాక్ష్యములనదగు కొలది పద్యములు మాత్రమే మన కిప్పుడు మిగిలినవి. కల్యాణిఅమ్మ కుమార్తె ఒక కొచ్చినుమహారాజు భార్యయయ్యెను. చాలా మంది ఇతర సాహిత్యాభిరుచికల స్త్రీలవలె ఈమెకూడ మతాభినివేశము కలది. త్రిపునితురాయందలి దేవాలయమునకేగి దైవదర్శనము చేయనిదే ఆమె ఒక్క దినమైన గడపెడిదికాదు.

## కళ్యాణికుట్టి * అమ్మచ్చి (1838-1909) :

తిరువాన్కూరు మహారాజైన ఆయిల్యమ్‌తిరుఖాళ్ ప్రభువు మళయాళ సాహిత్యాభివృద్ధి కెక్కువ ఆసక్తి చూపెను. ఆయన ఆంగ్లవిద్య నేర్చెను. మన భాషలకు మంచి వచనకావ్యములు చాలా అవసరమని ఆయన గ్రహించి తదనుసారముగా మళయాళ సాహితిని పటిష్ఠమొనర్చుటకు కొన్ని వచనగ్రంథములను వ్రాసెను. కాని ఆ ప్రభుని భార్య కళ్యాణిఅమ్మచ్చి మాత్రము పద్యకవితనే అభిమానించెను.

ఈమె కొచ్చిన్ సంస్థాన చరిత్రయందు సుప్రసిద్ధ వ్యక్తియైన C. కున్హికృష్ణమీనన్ కొమరిత. మహారాజుతో ఆమెకు పరిణయమగు నప్పటికే సంస్కృత సాహిత్యమునందును, గానమునందును పరిపూర్ణ ప్రజ్ఞకలదై యుండెను. పెండ్లిఅయిన వెనుక తమిళమును, ఆంగ్లమును

* తిరువాన్కూరు మహారాజపత్నులను అమ్మచ్చిఅందురు.

అభ్యసించెను. విద్యావంతుడైన తన భర్తతో ఆమె భారతదేశమునందలి అనేక పవిత్ర స్థలములను సేవించు నుద్దేశ్యముతో తీర్థయాత్రల కేగెను. మహారాజు మరణించినవెనుక ఆమె ఆరోగ్యము క్షీణించెను. సంతాన విరహితగా, ఆనందవిరహితగా ఆమె డెబ్బది యేండ్లవరకు ఉసూరుమనుచు కాలము గడపెను.

అమ్మచ్చి మిక్కిలి కరుణాళువు. ఉదారస్వభావముతో దానధర్మము లొనర్చిన నారీరత్నము. భర్తృసేవాతత్పరత తోడనే కాలముగడపిన ధన్యురాలు. ఆమె కవిత్వము నిర్మాణమునందును, భావమునందును చాలా మనోహరముగా నుండును. అందు భక్తిగుణము మిక్కిలి ప్రముఖముగా కనబట్టును. ఆ కావ్యములయందు పవిత్రతనుగూర్చిన అయిదుపద్యములు మిక్కిలి ప్రశంసింపబడినవి. దేవతాపూజయు, కఠిన నియమాచరణమును, తీర్థయాత్రలును స్త్రీకి ముఖ్యములు కావనియు, నిజేశుని సంసేవనమే స్త్రీకి కర్తవ్యమనియు ఆమె యిం దుద్బోధించెను :

"గొప్పదనము నౌదలవాంచు గౌరవమున
సుందరత్వము కనవూడ్చు బాటలందు
కీర్తి బంగారు ఛత్రమ్ము చేబూని నడచువెంట
విభుతయు నైశ్వర్యమున్ నాజ్ఞకై కైమోడ్చి నిలుచు
మహిత మహిళాసామ్రాజ్య పథమునందు
అతుల పాతివ్రత్యంపు రారాణి నడచువేళ."

సుభద్రాతంపురాట్టి :

కుట్టికుంజుతంకచ్చి తరువాత సంపన్న మహిళలు సాహిత్యాంగణమున ప్రవేశించిరి. వారందరును సంస్కృతమున ప్రవీణురాండ్రే. వారు పెరిగిన ఆచార కర్మకాండల వాతావరణము వారి రచనలయందును గుప్పుమని గుబాళించుచుండును. కొచ్చిను సంస్థాన రాకుమార్తె అయిన "ఇక్కు" అను నామాంతరముగల సుభద్రాతంపురాట్టి (1843-1920) గొప్ప ప్రజ్ఞావంతురాలైన కవయిత్రి. సంస్కృత, మళయాళ భాషలు రెండిటి

యందును కల ఆమె రచనలు ఉదాత్త పాండిత్య శోభితములై శైలి సౌందర్యముతో విరాజిల్లుచుండును. ఆమె సంస్కృతరచన లెక్కువగా స్తోత్రములు. ఆ రచనలలో వారి కులదైవమును సంబోధించుచు వ్రాసిన "పూర్ణత్రయీశ" అను కావ్యమున మహాభాగవత కథనంతను నలుబది పద్యములలో సంక్షేపించెను. మళయాళమున ఆమె కావ్యములు మిక్కిలి సరళములుగను, మధుర ప్రవాహములుగను నుండును. ఆమె కావ్యము లలో మిక్కిలి విశ్రుతిచెందినది రామాయణమునందలి యుద్ధకాండ యొకటి. కొన్ని సంవత్సరముల క్రిత మామె జనకసోదరులొకరు సుందర కాండ వరకు గేయముగా వ్రాసి రామాయణము పూర్తికాకమును పే చనిపోవుటచే వారి రచన కిది పూరణరచనము. దీనిని పూరించుటకై సుభద్రాతంపురాట్టి రచించిన యుద్ధకాండ ఆమె రచనలలో మేలితునక 'ధర్మనిర్ణయ', 'అష్టమ రోహిణి', 'గజేంద్రమోక్షు', 'విశ్వరూపదర్శన' మొదలగునవి ఆమె యితర రచనలు. కావ్యములన్నియు మతసంబంధము లైనవే కాక నైతికోద్బోధనా విస్ఫురితములు.

సుభద్రాతంపురాట్టి గొప్ప పండితుడైన కూతాలత్తుపురమ్ నంబూద్రిపాదు కుమార్తె. మిక్కిలి విద్యావంతుడైన చెన్నాస్ నంబూద్రి పాదున కిచ్చి యామెను పెండ్లిగావించిరి. ఆమె అనురూపవతియైన భార్య. ఆత్మసంస్కారముకల తల్లి. ఆమె సంతానము మిక్కిలి బాధ్య తతో శిక్షితులైరి. ఆమె సంతానమే కొచ్చిను సంస్థానమున ప్రథమముగా ఆంగ్లమున పట్టభద్రులైనవారు. ఈ కవయిత్రి ప్రభాతవేళలలో ప్రశాంత ముగా పవిత్ర మతవిధులను నిర్వహించుటలో చాలా ప్రొద్దుగడపి మధ్యాహ్నకాలమున తన ప్రభు కుటుంబమునందలి బిడ్డలకు పాఠములు చెప్పుటలో గడపెడిది.

పూజ్యులగు వేన్మణి, నాదువమ్, క్రాంగనూరు భవన రాజకుమారు లును ఆమె సమకాలీనులును, మిత్రులునునై యుండిరి. అప్పుడప్పుడు ఆమె వారితో జరుపు ఉత్తరప్రత్యుత్తరములను పద్యములతోనే వ్రాసెడిది.

సంస్కృతమున ఉన్నత ప్రమాణముగల గ్రంథములు చదువుట ఆమె అభిమానకలాపము.

సుభద్రాతంపురాట్టి సునిశితమైన భావములు కల్గిన పల్చని విగ్రహయష్టి కల్గిన సంపన్నమహిళ. స్వభావముచే ఆమె స్వయం వ్యక్తిత్వము కలదగుటయే కాక తాను ఎంచుకొనిన పథమునుండి ఎన్నడును తొలగుటెరుగని విశిష్టవ్యక్తి. ఏ విధమైన దుర్గుణమున్నను సహించెడిదికాదు.

ఆమె వార్ధకదశ ప్రశాంతముగ గడువలేదు. ఆమె పెద్దకుమారుని యొక్కయు నలుగురు సోదరులయొక్కయు మృతి యామె జీవితమును మఱింత విషాదమయమొనర్చెను. భక్తిపూర్వకమగు క్రియాకలాపమున నామె ప్రశాంతతను అనుభవించు మరణమును ఆతురతతో నిరీక్షించి సహజముగ ఆహ్వానించెను.

## లక్ష్మీరాణి (1844-1909) :

కదత్తనాడు రాజవంశమునకు చెందిన లక్ష్మీరాణి జన్మింపగనే జ్యోతిషికుడైన ఆమె మేనమామ "ఇప్పుడు ఒక పండితురాలైన స్త్రీ మనమధ్యకు వచ్చిన"దని సంతోషమున అరిచెను.

ఆమె అనాకారిగాను, తెలివిమాలినదిగను నుండెడిది. కాని సంస్కృతకావ్యముల నధ్యయనము చేయుటలో మిక్కిలి చురుకుగా నుండెడిది. ఆమె తలిదండ్రులు, అప్పచెల్లెండ్రు, అన్నదమ్ములు అందరును ఒకరి తరువాత ఒకరు చనిపోయిరి. అంతతో నాగక పాప మా దురదృష్టవంతురాలు పక్షవాతవ్యాధికి గురియై ఆరునెలలు మంచముపట్టెను. ఈ వ్యాధి తగ్గి నయముకాగానే ఆమె రాజభవనమునందలి సాహిత్యసమావేశములయందు పాల్గొన నారంభించెను. ఈ అభ్యాస మామెకు క్రమక్రమముగా స్వాస్థ్యమును కల్గించెను.

లక్ష్మీరాణి మదనగిరి నంబూద్రిని పెండ్లాడెను. ఆమె మిక్కిలి ప్రేమగల తల్లిగా పేరుపొందెను. "ఆమె చేతులు ఎప్పుడును బిడ్డలను

లాలించుటయందో లేక కలమును చేపట్టి వ్రాయుటయందో నిమగ్నమై యుండెడిదికాని ఊరకే యెప్పుడును ఉండెడిదికాదని చెప్పుకొందురు. కాని ఆమె నలుగురు బిడ్డలలో ఒక్క బిడ్డమాత్రమే దక్కెను. ఈ విషాద సంఘటన ఆమెను మిక్కిలి కదల్చివేయగా, ఆమె సంస్కృతమున "సంతాన గోపాల" మను కావ్యమును రచించెను.

ఈమె యొక్క అసాధారణ శ్రద్ధా నిరతిని గూర్చి కథలుగా చెప్పుకొందురు. ఒకప్పు డామె వ్రాతలో నిమగ్నురాలై కూర్చొనియుండగా, ఆమెసోదరి యొకరు లోనికివచ్చునప్పటి కామె శరీరమున నొక గాయము నుండి రక్తము కారుచుండెను. "ఎందువలన రక్తమట్లు కారుచుండెను" అని పరిశీలించి పాము కాటువలన అది సంభవించెనని తెలిసికొని ఆ సోదరి భయముతో కెవ్వున నార్చెను. కాని లక్ష్మిరాణి తాను వ్రాయుచున్న తాటియాకును తడుముకొనుచు కర్మ యెట్లున్నదో అట్లు జరుగును లెమ్మ"ని అనుచు మూర్ఛపోయెను. అదృష్టవశాత్తు విషవైద్యు లొనర్చిన ఉపచారములవలన ఆమె విష నిర్ముక్తయై తేరుకొనెను.

ఈ కవయిత్రికి మాధవుడను పేరుగల శిష్యుడొకడుండెను. ఒకనాడు ఏమియు కారణము లేకుండగనే ఆ శిష్యు నామె "మాధవా? నీ వేల యింత క్రూరుడవై యున్నావు? పొమ్మామ్మవలకు నీ ముఖము చూపకుము అని కోపపడెను. ఈ సంఘటన జరిగిన వెనుక ఆత డామె ఎదుటబడుటకు సాహసించలేకపోయెను.

రోజులు గడచినవి. ఒకమారు దేవాలయావరణలో వా రిరువురును కలుసుకొనుట తటస్థించెను. మాధవు డామె కంటబడకుండ తప్పించుకొని పోవుటకై ఇంకొక ప్రక్కకుదిరిగెను. కాని లక్ష్మిరాణి అనుతాపస్వరముతో మాధవుని వెనుకకు పిలిచెను. తమ యిర్వుర నడుమనున్న అపోహను తొలగింపవలెనను ఆతురత ఆమెకు గల్గెను. మాధవునిపై కోపించిన ఆ రోజులలో ఆమె "సంతాన గోపాల" కావ్యమును వ్రాయుచుండెను. బ్రాహ్మణబాలుడైన ఈ మాధవుని తాను వ్రాయుచున్న కథ యందలి

శ్రీకృష్ణునిగా (శ్రీకృష్ణుడును మాధవు డగుటచే) భావించి యామె యానా డట్లు కోపించెనట. రచనా వ్యాసంగమున నామె యంతటి తాదాత్మ్యస్థితి నొందుచుండును. తనపై కోపగించుటకు గల కారణము మాధవు డప్పటికి తెలుసుకొనగల్గెను. "సంతాన గోపాలము" ఒక అందమైన చిన్న కావ్యము. వేన్మణియు. నాతని సమాజమువారును గావించు "శుద్ధ మళయాళ ఉద్యమము (కేవలము మళయాళమునందే రచింపవలెనను ఉద్యమము) మళయాళ సాహిత్యమున వేరుదన్ని పాదుకొనుచుండినను లక్ష్మిరాణి తన రచనకు సంస్కృతమునే యెంచుకొనెను. సంస్కృతమున నామె రచించిన యింకొకే యొక రచన 'భాగవత సంక్షేప' అనునది. వృద్ధాప్యమున నామెకు సాహిత్య వ్యాసంగమున అభిలాష నశించెను. మేలపుత్తూరు నారాయణీయమునందీపద్యములను పునశ్చరణ చేయుటతోడను, రామనామస్మరణతో గింజలను లెక్కించుటతోడను, ఆ ప్రాచీన రాజభవనవు వసారాలలో సన్నని, బక్కపలుచని, పొట్టి, తెల్లని, ఉడుపులను ధరించిన విగ్రహాయష్టితో, పవిత్ర భూతి పూసిన నుదుటితో కుడిప్రక్కతలపై ఎత్తుగా అల్లబడిన నెఱసిన జుట్టుతో మెల్లగా అడుగులువేయుచు ఆమె తన ప్రొద్దు గడపెను. ఆమె యొక్క ఈ విషాదభర జీవితము అరువదినాల్గవయేట ముగిసెను.

## రాణి లక్ష్మీబాయి (1847-1901) :

తిరువాన్కూరు రాణి లక్ష్మిబాయి మళయాళదేశమున ఆంగ్లవిద్య నభ్యసించిన ప్రథమ కవయిత్రి. ఈమె 1847 వ సంవత్సరమున మవేలిక్కరా భవన రాకుమార్తెగా జన్మించెను. 1857 లో ఈమె తన చెల్లెలితో తిరువాన్కూరు రాజవంశమునకు దత్తతవెళ్ళెను. అచ్చట ఆమె సంస్కృతమును, సంగీతమును బాగుగా నభ్యసించెను. తమిళమును, హిందీనికూడ నేర్చెను. ఒక ఐరోపీయ వనిత దగ్గర ఆంగ్లమునుకూడ నేర్చుకొనెను. 1858 లో లక్ష్మిపుర ప్రాసాదమునకు చెందిన కేరళవర్మ కోయిల్ తాంపురమ్ అను నాయనను పెండ్లాడెను. తరువాత ఈ కేరళవర్మ సాహిత్య

వరులచే "కేరళ కాళిదాసు" డను బిరుదముతో సమ్మానింపబడెను. కేరళ వర్మ సంస్కృతమునను, ఆంగ్లమునను ప్రౌఢ పండితుడు. సాహిత్యము నందును, కళలయందును ప్రగాఢాసక్తికలవాడు. ఆనాటి విజ్ఞానులకు ఆరాధనీయుడగు నాయకుడు. ఆతడు కేవలము వర్ధమానుడగు కవిసత్తముడే కాక ఆనాటికి ఇంకను ఆకృతి మలచుకొనుచున్న వచనరచనకు ప్రాథమికుడు. కేరళవర్మ కవిగా 1874 నాటికి పరాకాష్ఠనందిన, వేన్మణి, కేవల మళయాళోద్యమ సాంప్రదాయమునకు చెందినవాడుకాడు. సంస్కృత శబ్దములను యథేచ్ఛముగా వాడుచు మిక్కిలి శక్తిమంతమైన, దర్పముతోకూడిన మణిప్రవాళశైలికిమళ్ళెను. పాదమునందలి రెండవ అక్షరమును ప్రాసగా వాడు నియమమునకు బద్ధపడియుండెను. కేరళమునందంతటను ఆనాడు వికాసముగాంచుచున్న ప్రతిసాహిత్యోద్యమమును, కేరళవర్మ ప్రోత్సహించుటయేకాక ఆ ఉద్యమములకు సహాయపడెను. పోషించెనుకూడ. వర్ధమానులగు రచయితలను గుర్తించి వారికి సకాలమునకు తగు సలహాలనిచ్చి, ప్రోత్సహించి సహాయముచేసి, చక్కగా ఆదుకొనెను. అధిక ప్రతిభావంతులుకూడ అతని నాయకత్వమును అంగీకరించిరనుటలో ఆశ్చర్యమేమియును లేదు. అట్టి భర్తృసాన్నిధ్యమున లక్ష్మిబాయి శక్తిసామర్ధ్యములు అతి శీఘ్రగతిని వికసించి కార్యరూపము దాల్చెను. ఆమె మళయాళ జానపదనృత్యములకు పనికివచ్చునట్లు అనేకములగు స్తోత్రములను, పాటలను రచించెను. కాని ఈ యన్నింటియందును నలచరితముమాత్రము ముద్రితమయ్యెను. ఇది సంగీతాత్మకమై మిక్కిలి మధురముగా నున్నది.

ఆనాటి తిరువాన్కూరు మహారాజు ఆయిల్యమ్ తిరునాళ్లు ఏదో కొంత అపార్థముచేసుకొని హాయిగా సుఖజీవనమును గడపుచున్న ఆ జంట కెడబాటు గల్గునట్లు కేరళవర్మను విడదీసి వేరుగానుంచి ఆతనిపై నిఘా పెట్టెను. ఆ సమయమున కేరళవర్మ మయూర సందేశము అను కావ్యమును రచించెను. అది ఆతని రచనలయందు మిక్కిలిగా జనసామాన్యమున

ప్రచురతనొందిన కావ్యమై విస్తార ప్రశంసనొందెను. ఆ వియోగసమయమున లక్ష్మీబాయికూడ, "విరహిణీ ప్రలాపమ్" అను కరుణరస ప్రధాన కావ్యరచన మొనర్చెను. కాని ఆ కావ్యమునుగూర్చి వినినవారు చాలా అరుదు. మహారాజా ఆయిల్యమ్ మరణానంతరము లక్ష్మీబాయి భర్తను కలిసికొనగలిగెను. తరువాత ఆమె తన జీవితాంతమువఱకు భర్త సహాయముతో నారీజనోద్ధరణకును, స్త్రీ విద్యాభివృద్ధికొరకును మిక్కిలి పాటు పడెను. 1880 లో విక్టోరియా మహారాణిచే C. I. బిరుద మియ్యబడి గౌరవింపబడెను.

## తొట్టిక్కాట్ ఇక్కావమ్మా (1864-1914) :

1884 తర్వాత మళయాళ సారస్వతము పరిమాణమునందును, వైవిధ్యమునందును, అత్యంత శీఘ్రగతిని పెరిగిపోయెను. సారస్వత సమాజములు స్థాపింపబడెను. ఆంగ్ల సారస్వత జీవంజవములను పుణికిపుచ్చుకొనినట్టియు, దేశీయ సారస్వతములకు క్రొత్తశాఖలైనట్టియు, చిన్నకథ, నవల, వ్యాసము అను సాహిత్య ప్రక్రియలను వృద్ధిగావించుటకు మాసపత్రికలు తోడ్పడెను. సంస్కృతాభిమానముకూడ క్రొత్త ప్రక్రియలకు కారణమయ్యెను. కేరళవర్మ శాకుంతలమును మళయాళములోని కనువదించెను. సంస్కృతమునుండి అనువదించుటద్వారాగాని లేక అటనట పద్యములతో వచనమును కలిపి ప్రబంధించుచు సంస్కృత నాటక పద్ధతిని మళయాళ భాషలో స్వయముగ నాటకములను రచించుటద్వారాగాని ఈ ప్రక్రియను వెంటనే చాలామంది అనుసరించిరి. తమిళ సాంప్రదాయానుసారముగా "సంగీత నైషధము" వంటి సంగీతరచనలు తరువాత కొన్ని బయలు దేరెను. సాంఘికేతివృత్తములతో వచన నాటకములు క్రొత్తనాదమును పలికించెను. ఒక శతాబ్దమునుమించి ప్రవర్తిలిన అట్టక్కథల సృష్టి కొంత మందగించెను.

ఆ కాలమున మహిళచే వ్రాయబడిన ఏకకనాటకము "సుభద్రార్జునమ్" అనునది. ఆ గ్రంథకర్త్రి, తొట్టిక్కాట్ ఇక్కావమ్మ అను నామె.

శైలీపాకములయందలి వినూత్నతా సౌందర్యములచే ఈ రచన ఆనాడు ఈ పద్ధతిలో రచింపబడిన ఇతర రచనల నతిశయించెను.

కొచ్చిను మహారాజుచే "వీరశృంఖల" (సమ్మాన రూపముగ నియ్యబడు స్వర్ణకంకణము) సమ్మానముచే గౌరవింపబడిన కవి చాటు పణిక్కర్ ఇక్కావమ్మ తండ్రి. ఆమె తల్లి కుటుంబముకూడ విజ్ఞానసాంప్రదాయములు కలదియే. బాల్యమునుండియు ఇక్కావమ్మ అసాధారణమగు జ్ఞాపకశక్తి గల బాలిక. కేరళ దేశపు ప్రసిద్ధ కవులగు "ఎళుత్తచ్చన్" కుంచన్ నంబియారుల రచనలను కంఠోక్తిగ వల్లెవేయుట ద్వారా ఆమె ఈ అసాధారణ ప్రజ్ఞ తెలియనగును. ఆమె సంస్కృతము నభ్యసించెను. కాని సంస్కృతముకంటె ఆమెకు మళయాళముపైననే గౌరవాదరములు మెండు. పదునాల్గవయేట గవర్నమెంటు ఉద్యోగియగు కరక్కాట్ నారాయణ మీనన్‌ను పెండ్లాడెను. ఇక్కావమ్మ ఆంగ్లవిద్య నభ్యసింపకపోయినను తన జీవనసఖుడగు భర్తయొక్క నిరంతర సాహచర్యమున ఆధునికాంగ్ల విద్య ప్రసాదించు వివేక సంస్కారములను పొందగల్గెను. కాని నారాయణ మీనన్‌కు సాహిత్యమునందు తటస్థభావము తప్ప యేమంత అపేక్ష లేకపోయెను.

ఇక్కావమ్మ బిడ్డలు చక్కగా విద్యనభ్యసించిరి. వారు తమజీవితములలో ఉన్నత పదవులనందిరి. ఆమెకు పన్నెండుగురు పిల్లలు కలిగిరి అందు ఇద్దరు పిల్లలు పసివారుగనే చనిపోయిరి. ఆమె కుమార్తెలలో ఒకరైన "గౌరియమ్మ" ఒక కవయిత్రి అయ్యెను. కొల్లెంగోడు రాజా వాసుదేవ రాజా భార్యయగు ఆమె పెద్దకొమార్తె అకాలమరణ మామెకు పెద్ద అశనిఘాతమయ్యెను. ఏదో దీర్ఘకాల రోగమునకు శస్త్రచికిత్స చేయించుకొని చెన్నపురిలో 1914 లో ఆమె స్వర్గతురాలయ్యెను.

ఆమెయొక్క ప్రముఖ రచనలన్నియు ఆమె ఇరువది రెండు, ముప్పది యైదేండ్ల మధ్య వయస్సుననే రచింపబడియుండెను. ఆమె ప్రఖ్యాతికి కారణభూతమైన "సుభద్రార్జునము" ఆమె ఇరువదెనిమిదేండ్ల

వయసున నున్నపుడు 1890 సంవత్సరమున ప్రచురింపబడెను. "నలచరితమ్" అను నాటకము, "ఆర్యాశతకము", "ఉమాస్తోత్రములు", "సన్మార్గోప దేశము" ఒక తుల్లాల్‌ప్పట్టు సంపూర్తి చేయబడని "కలికి పురాణము"న కనువాద మొకటి ఆమె రచనలు.

ఇవికాక ఆమె కీర్తిపతాకకు పతాక దశలవలె జనసామాన్యమున సామెతలుగా వాడబడు సంస్కృతశ్లోకముల నెన్నింటినో రచించెను. ఆమె రచనయగు సుభద్రార్జునము గణపతిశాస్త్రిచే సంస్కృతమున కనువదింప బడెను. ఇక్కవమ్మ తన రచనలకు పురాణముల నుండియే ఇతివృత్తమును గ్రహించెను ప్రాసాదముల నుండి సామాన్య గృహాంగణములకు సరస్వతిని తీసుకొని వెళ్ళిన మహిళలలో ఈమె ప్రముఖురాలు అయినను ఆమె అర్చనా సామగ్రి మాత్రము సాంప్రదాయసిద్ధమే.

ఆడంబర రహితమైన, సజీవమైన ఆమె శైలీ సౌందర్య సంస్కృతి కదియే సాటి. పద్యములను, వచనమును సులభముగా, ధారాళముగా రచించెను.

ఆమె రచనలలో తరచుగా సవాలుచేయు స్త్రీత్వము కానగును. రచయిత్రులగు మహిళలు అరుదైన ఆ కాలమున స్త్రీలపేరిట సారస్వత సృష్టి గావింపబడుచుండునని ప్రజలు సాధారణముగా తలంచుచుండెడి వారు. ఈ అపవాదు ఈ కవయిత్రిని రెచ్చకొట్టి తన కావ్యములలో ఈ క్రింది విధముగా వ్రాయుటకు కారణభూతమయ్యెను-

"ప్రాచీన కాలమున భామ కదనమొనర్చెను.
సుభద్ర రథము నడపెను.
ఇపుడు విక్టోరియా అతి విశాల సామ్రాజ్యమేలుచుండెను.
మహిళలు కావ్యములను మాత్రము రచింపలేరనుటేల ?

మఱియును :-

"స్త్రీలనెప్పుడు నవమతి చేయరాదు.
పురుషులెల్లఱును ప్రతిభన్ పూర్ణులటవె ?"

ఆమె హృదయము ప్రకృతి రామణీయకమునకు స్పందించును. సన్మార్గోపదేశమున వెల్లువవలె భూమిని ముంచెత్తు వెన్నెలను వసంత రాత్రులయందలి కమ్మని పరిమళ పరీవాహములను. హృదయముల సమ్మోహపఱచు శీతల మారుతములను, పువ్వులపై గుంపులుగట్టి ఎగురు తుమ్మెదలను చక్కగా వర్ణించెను. ఇక్కావమ్మ దివ్యజ్ఞాన సామాజికురాలు. మంత్ర శాస్త్రమునందును జ్యోతిషమునందును ప్రగాఢ జ్ఞానము కలదు. ప్రశాంతోజ్జ్వలమగు ఆమె ముఖమును, స్వచ్ఛమైన ఉడుపులును విశుద్ధతను ఎగజిమ్ముచుండెడివి. ఆమె సంభాషణములు సజీవములై సంస్కృతితో కూడినవై ఉద్బోధకములుగ నుండెడివి. కవయిత్రిగా కీర్తినొందవలెనని ఆమెఎన్నడును ఆశింపలేదు. ప్రపంచ క్షేమమునకు పాటుపడునట్టి మానవ సంఘము ఉన్నత స్థాయి చేరుటకు తోడ్పడునట్టి ఆధ్యాత్మిక నాయకత్వమే ఆమె ఆశయము. ఈ లక్ష్యమును సాధించుటకు వలయు శిక్షణ; ధ్యానమునందే కలదనియు ఆమె విశ్వసించెను.

'లక్ష్మీబాయి', 'కవనకౌముది' అనుపేరున 1880 ప్రాంతమున రెండు సారస్వత పత్రికలు ప్రారంభింపబడెను. అందొకటి మహిళలకుద్దేశింపబడినది. రెండవది కవిత కంకితమైనది. ఇవి కేరళ స్త్రీలలో సారస్వత ప్రజ్ఞను రేకెత్తించుటకు బాగుగా తోడ్పడినవి. ఈ మాస పత్రికల ద్వారా తమ హృదయముల యందలి ఆశలను గానమొనర్చినవారును, స్తోత్రములను సమర్పించినవారును, కథలను పలికినవారును, తమ ఆశయములను విప్పి చెప్పుకొనినవారును నైన స్త్రీలెందరో కలరు. ఆంగ్లభాషా ప్రభావము మళయాళముపై ప్రసరించినకొలదియు పద్యమువలెనే వచనమును మిక్కిలిగా ఆదరింపబడుచు వచ్చెను.

ఈ సందర్భమున ఇంకా కొంతమంది స్త్రీ రచయిత్రులు పేర్కొనదగియున్నారు. మవేలిక్కారాకు చెందిన మంగళశ్మెరీ కోచ్చకుంజిఅమ్మ (1855-1932) పేరుపడిన కవయిత్రి కాకున్నను అనేకములగు పాటలను కొన్ని భావగీతములను రచించెను. తన కుమారుని మరణ సందర్భమున వ్రాసిన స్మృతి కావ్యము తీవ్రవేదనామయమై గమనార్హమై యున్నది.

**కరివేలిగౌరికుట్టిఅమ్మ :**

ముక్తక రచనలో కడు ప్రసిద్ధురాలు. ఆమె పేరు పత్రికలలో మిక్కిలి తరచుగా కనబడుచుండెను. ఆమె పండితురాలే కాక ముచ్చటగా తీర్చిదిద్దబడిన శైలిలో వ్రాయగల సమర్థురాలు "సంతాన గోపాలమ్" అను చంపూగ్రంథ మామె ప్రసిద్ధ రచన.

**పరువక్కాటు అమ్మురమ్మ :**

గోగ్రహణ కావ్యకర్త్రి. ప్రథమ యత్నముననే ఆమె ఈ రచన జయప్రదముగా నెఱవేరినది. తరువాత ఈమె సారస్వత వ్యాసంగమును విరమించినట్లు కనబడును.

**తరవత్ అమ్మాళుఅమ్మ (1862-1936) :**

భగవంతుని యెడ విశ్వాసమును కోల్పోవుట యనునదియే మానవునకు సంభవించు విపత్తులలో గొప్పది.

ఈ విశ్వాసమే అమ్మాళుఅమ్మకు మిక్కిలి శక్తిపాటవము నొసంగెను. ఈమె కేరళ స్త్రీలలో దుఃఖ పరంపరకు నిలయమైనట్టియు, సాహసములకు ఆస్పదమైనట్టియు జీవితమును నవ్వు ముఖముతో ఓర్చుకొనుటయే కాక, మధురమైన, ప్రశంసార్హమైన సారస్వత సృష్టితో అట్టి జీవితమును వికసింపజేసిన మహాయోగినియైన కవయిత్రి.

అమ్మాళుఅమ్మ పాల్ఘాటునందలి గౌరవ కుటుంబమున జన్మించెను. ఆమె తండ్రి ఆర్. శంకరన్‌నాయర్; మున్సిపు - మద్రాసునందలి జస్టిస్ పార్టీ వ్యవస్థాపకులలో నొకరైన డా॥ జె. యం. నాయరు ఈమెకు అవరజుడు. అగ్ని పరీక్షలు ఆమెకు జీవితమున ముందుగానే సంప్రాప్తించెను. బాల్యముననే వివాహము, డైవోర్సు, తండ్రియొక్క, తన ఏకక సోదరి యొక్క, ఆమె చిన్న పిల్లవానియొక్క మరణములును ఆమె యువ హృదయమునకు సమ్మెటపెట్టులాయెను. సంస్కృతమునందును, తమిళమునందును మిక్కిలి ఆలోచనాత్మకములగు కావ్యములను చదువుటలో ఆమె దుఃఖము కొంత యుపశమిల్లెను. సాధుత్వమును, వినమ్రతయు మత సంబంధమగు మానసిక తత్వమును గల ఈమె క్రమక్రమముగా అను

భవముతో పండి వివేకము, ఓర్పు, ప్రేమమయతత్త్వము, స్వార్థత్యాగము గల గృహిణిగా మారి మఱల తన పొరుగున నుండు స్నేహితుడైన రామావారియర్‌ను పెండ్లాడెను.

1903 లో ఆమె చిన్న కొమార్తె చనిపోయెను. ఆ సంఘటన ఆమెను గ్రంథకర్త్రిగా నొనర్చెను. కొన్ని నెలల వరకును ఈ విచారముతోనే ఆమె మంచముపట్టెను. అపుడామె భక్తి గ్రంథములను చదువుచు కాలముపుచ్చెను. ఆ సమయమున ఒక స్నేహితునిచే నియ్యబడిన ఒక సంస్కృత గ్రంథమామెకు నచ్చెను. "భక్తమాల" అను ఆ సంస్కృత గ్రంథమునందలి గొప్ప గొప్ప భక్తి కథలను సంస్కృత జ్ఞానములేని పాఠకులకు అందుబాటులో నుండునట్లు చేయవలెనను సంకల్ప మమ్మాళు అమ్మకు గల్గెను. వెంటనే అనువాదము ప్రారంభమయ్యెను. ఆమె బలహీనతవలన అనువాదమును తాను చెప్పుచు ఒకరిచే వ్రాయింప (ఉక్త లేఖనము చేయింప) వలసి వచ్చెను. కాని క్రమముగా ఈ వ్యాసంగము బాగుగా సాగి ఆమె కోలుకొని ఆరోగ్యవంతురాలు అగుటకు తోడ్పడెను.

భక్తమాలా ప్రచురణముతో అమ్మాళుఅమ్మ పేరు బాగుగ వెలుగులోనికి వచ్చెను. పక్వమైన, సహజమైన ఆమె వచన శైలి జనసామాన్యముచే ప్రశంసింపబడినట్లే విద్వాంసులచేత కూడ ప్రశంసింపబడెను. "భక్తమాల తరువాత నామె శివభక్త విలాసము" ను "కృష్ణభక్తి చంద్రిక" అను నాటకమును సంస్కృతము నుండి యనువదించెను.

తన సోదరుడైన టి. యం. నారాయణ కోర్కెననుసరించి ఎడ్విన్ ఆర్నాల్డు రచించిన ఆసియాజ్యోతి (Light of Asia) అను గ్రంథమును వచన గ్రంథముగా మళయాళములోని కనువదించెను. ఆమెకు ఇంగ్లీషు రాకున్నను ఒక స్నేహితుని సహాయమున నామె ఈ పనిని నిర్వర్తించెను. తరువాత ఆమె రచన శంకరాచార్యుల వేదాంత గ్రంథమున కనువాదము, తమిళమునుండి రెండు నవలల ననువదించెను. ఈ నవలలను కూడ ఆమె ప్రబోధాత్మకముగానే రచించెను. సారస్వతము మానవుని అంతస్థును పెంచి

ఉదాత్తుని చేయవలెనని యామె విశ్వసించెను. ఆమె స్వంతముగా ఎక్కువ గ్రంథములను వ్రాయకపోవుట శోచనీయము. ఆమె స్వంత గ్రంథములలో రెండు మాత్రమే మనకు లభించినవి. అందొకటి పిల్లల కుపయోగించు నీతి బోధకమగు కథావళి. వేరొకటి ఉత్తరాది తీర్థయాత్రలను గూర్చి ఆకర్షకముగా వ్రాసిన చిన్న గ్రంథము. ఆమె విశాలమగు పాండిత్యము, ప్రగాఢమగు జ్ఞానము స్పష్టమును, నిష్కృష్టమునగు అభిప్రాయములు భావములును, సాహిత్య పరిషత్తు వేదికనుండి ఆమె యొసంగిన కొద్ది ప్రసంగములలో గర్భితమై యుండెను.

"స్వదేశాభిమాని" పత్రికాసంపాదకుడైన రామకృష్ణపిళ్ళ 1912 లో తిరువాన్కూరునుండి బహిష్కరింపబడినపుడు అమ్మాళ్ళుఅమ్మ ఆయనను భార్యా పిల్లలతో తనయింటి కాహ్వానించెను. ఆయన వారియింటనుండి నన్నాళ్ళును అమ్మాళ్ళుఅమ్మ వారికి తల్లియయ్యెను. రెండేళ్ళ తరువాత ఆయన తన యేర్పాట్లు తాను చేసుకొనెను. కాని ఈ గడువు లోగా ఆ రెండు కుటుంబముల నడుమ కల్గిన ప్రగాఢ బంధములు చాలా దృఢమైనవి. కాని పాపము అమ్మాళ్ళుఅమ్మ పాలిటికి విధి ఈ దత్త పుత్రుని అకాల మరణ శోకమును కూడ విధించియుండెను. ఇంతేకాదు ఇంగ్లాండు వెళ్ళి అచ్చటనే మరణించిన ఆమె సోదరుడు డా॥ జె. ఎం. నాయరు మరణ దుఃఖమును ఆమె అనుభవింపవలసి వచ్చెను. ఆయన పేరున అమ్మాళ్ళుఅమ్మ మద్రాసు రాష్ట్రమునందు ఎం. బి., బి. యస్. పరీక్షలో శస్త్ర పరీక్షయందు ప్రథముడుగా ఉత్తీర్ణుడైన విద్యార్థికి ఒక బంగారు పతకమును బహుమానముగా ఏర్పాటు చేసెను.

ఇదికాక తన సోదరుని పేరున, ఆమె పేరున పాల్ఘాటులోని 'వాడక్కుంతారా' లో ఒక బాలికా పాఠశాలనుకూడ స్థాపించెను. ముసలి తనమున నామె తన జీవితమంతయు అనుసరించిన భక్తి వేదాంత పరమగు ప్రేమసారముల మూర్తీభావమా అనునట్లు కన్పించెడిది. ఆమెకు గల యిహలోకబంధములు కుటుంబాభిమానమే. అవియును క్రమముగా బ్రద్దలు

చేయబడెను. ఆమె ఐదుగురు సంతానమున, ఒక్క కుమార్తెమాత్రము ఆమె జీవితాంతమువఱకు ఆమెతో నున్నది. కష్టమును, జ్ఞానానుభవమును ఆమెను తల్లిగా రూపొందించెను. ఆమెతో పరిచయమున్నవారి కందర కును ఆమె తల్లియయ్యెను.

అమ్మాళుఅమ్మకు కుమార్తెజానకియమ్మ వర్ధమాన నవలా రచయిత్రి. ఆమె పిన్నవయస్సుననే మరణించెను. అమ్మాళుఅమ్మ సంతానమున జీవించియున్న ఒకే ఒక కుమార్తెయైన అమ్మనిఅమ్మ తన తల్లి జీవిత చరితమును, ఇంకా కొలది గ్రంథములను వ్రాసెను. ఇతివృత్తముల నెంచు కొనుటలో ఆమె తన పవిత్ర మాతృమూర్తిని అనుసరించును.

## K. M. కుంజిలక్ష్మీకేట్టిలమ్మ (1876-1947):

ప్రాథమిక పత్రికలలో మిక్కిలి ప్రశస్తినొందిన రచయిత్రులలో కన్నరాత్ మాట్టొవిల్ కుంజిలక్ష్మీకేట్టిలమ్మ ప్రభావసంపన్నురాలైన కవయిత్రిగా కన్పట్టును. ఈమె ఉత్తరమలబారులో ఒక గొప్ప కుటుంబ మున ప్రసిద్ధన్యాయవాది, కన్నన్ నంబియారు కుమార్తెగా జన్మించెను. విద్యాసక్తికల ఈ బాలికకు తనకాలమునాటి సారస్వతోద్యమములయందు సహజమగు అభిలాష యుండెడిది. ఈ అభిలాషతో ఆ బాలిక వినోదముగా కావ్యములను వ్రాయదొడగెను. అత్యంత మేధావంతుడైన ఒక సంపన్న కుటుంబమునకు చెందిన తజక్కాట్టు తిరుముంపుతో ఆమెకు వివాహ మయ్యెను. ఆ కుటుంబమువారు గొప్పగొప్పవారితో పరిచయముకల్గించి ఆమెకు గొప్ప అవకాశములనుకల్గించిరి. ఆమె మిత్రుడును పొరుగువాడును నైన మహాకవి కుట్టక్కాల్ ఆమెయందలి ప్రతిభ వృద్ధియగుటకు తగిన ప్రేరణనొసంగెను.

ఇట్లు కొన్నివర్షములు గడచినవెనుక ఆమె కేరళలో అగ్రశ్రేణి కవయిత్రిగా విశిష్ట స్థానమును పొందెననుట నిర్వివాదాంశము. సంస్కృత మళయాళ భాషలు రెండింటియందును ఆమె కవిత్వము పరిపక్వమగు నిర్వహణము తియ్యని శబ్దములతోకూడిన నిరాతంక ప్రవాహశైలిని

ప్రదర్శించెను. ఆమె సంస్కృత ఛ్ఛందోనుసారముగా రచించుచు, రెండవ అక్షరమును ప్రాసగాకూడ పాటించుచు వ్రాసెను. "ప్రార్థనా మంజరి" అను పేర సంస్కృతమున స్తోత్రములును "పురాణ చంద్రిక" అను పౌరాణిక గాథలును 'కౌసల్యాదేవి' అను గ్రంథమును ఆమె రచనలు. ఇవికాక పత్రికలలో ప్రచురింపబడిన ఖండకావ్యములు కొన్ని కలవు. అందు కొన్ని సాంఘికేతి వృత్తములు. కేరళలో సాంఘికేతి వృత్తములతో గ్రంథరచన సాగించుట కీమెయే ప్రథమురాలు కావచ్చును. కేట్టిలమ్మ ధైర్య ప్రవృత్తియు, మర్యాద వృత్తియు కల మహిళ. ఆనాటి రాజకీయ సాంఘిక చైతన్యము ఆమె కొన్ని కావ్యములలో ప్రతిబింబించుట అసహజము కాదు.

ఆమె భర్తయు, అల్లుడును గతించినవెనుక ఆమెకు సంసార వ్యాకులత్వము అధికమయ్యెను. తరువాత ఆమె ఉపేక్షాభావముతో జీవితము గడపెను.

## అంబాడీమీనాక్షిఅమ్మ (1882-1960) :

ఈ మహిళా రచయిత్రులలో తిరుచూరుకుచెందిన మువ్వురు అంబాడీ సోదరీమణులు, ప్రముఖ స్థానము నాక్రమించుదురు. గృహ వాతావరణము నందును, వారు అవలంబించిన విధులయందును వారి రచనలయందలి విషయము నందును వారిలో వారికి భేదములున్నను ప్రతిభా సమున్మేషము నందును, సాంఘిక విజ్ఞతయందును అచ్ఛమగు సునిశితమైన భారతీయ దృక్పథమునందును ఆ మువ్వురు సోదరీమణులకు సమానమగు విశిష్ట లక్షణములు కలవు.

పెద్దదగు మీనాక్షిఅమ్మ సంస్కృతమున పండితురాలు. దివ్యజ్ఞాన సామాజకుడును ప్రౌఢ పండితుడునైన పల్లియల్ కృష్ణమీనన్, ఆమె భర్త. భార్యాభర్త లిరువురకు ఆధ్యాత్మిక విద్యయన్నను, గూఢశక్తి విజ్ఞానమన్నను ఆసక్తి మెండు

ఉత్తమాదర్శములతో, కర్మకాండతో, తత్త్వ నీతిశాస్త్రములతో కూడిన హిందూమతమునకు కృష్ణమీనన్ "సనాతన ధర్మ" అను అమూల్య

వ్యాఖ్యానమును రచించెను. మీనాక్షిఅమ్మ సంస్కృతమునందలి ప్రసిద్ధ రచనలగు శంకరాచార్య కృతమగు సౌందర్యలహరికిని "కామ కళా విలాసము, సుభగోదయము, అను శాక్తేయధర్మమునకు చెందిన గ్రంథములకు వ్యాఖానము చేసెను. (మీనాక్షిఅమ్మ ఇష్టదేవత పరాశక్తి) ఆమెకు తాంత్రిక సిద్ధాంతముపై ఎంత ప్రావీణ్యముకలదో దుర్గ్రాహ్యభావములుగల సంస్కృత జాతీయములను సరళమును, అనర్గళము నగు మలయాళమున కనువదించుటయందును అంత ప్రావీణ్యము కలదనుట కీ వ్యాఖ్యానములు సాక్ష్యములు.

ఆమెకు మళయాళ సాహిత్యముపై కల అభిమానము మిక్కిలి గొప్పది. ఒకప్పుడు ఎర్నాకులమున సాహిత్యపరిషత్సమావేశము జరిగినపుడు ఆమె మళయాళ భాషాభివృద్ధికి మిక్కిలి ఉపయోగకరములగు సూచనలనిచ్చెను. సాంఘిక రంగమునగూడ ఆమె శ్రద్ధతో పాల్గొనెను.

1949 లో త్రిపునితురాలో "శాస్త్ర సదస్సుచే సాహిత్య నిపుణ" అను సముచిత బిరుదముచే ఆమె గౌరవింపబడెను. భర్తయగు కృష్ణ మీనన్ గతించుటయు, పెద్దకుమారుని అకాలమరణమును మీనాక్షిఅమ్మకు కఠోర పరీక్షలయ్యెను. కాని జ్ఞానము కలదగుటచే ఆ దెబ్బలను ఆమె గంభీరముగాను, ప్రశాంతముగాను ఓర్చెను. ఆమె తక్కిన పిల్లలు ఉన్నత స్థితినంది తల్లి దుఃఖమును కొంత ఉపశమింపజేసిరి. ఆమె అంతిమ వచనము "నా కోరిక లన్నియు ఈడేరెను" అనునది.

## టి. సి. కల్యాణిఅమ్మ (1879-1956) :

19 వ శతాబ్దపు చివరిదశలలో చెప్పదగిన సాహిత్య విశేషము 'కుందలత' అను మళయాళమునందలి ప్రథమ నవలా ప్రచురణము. ఇది కేరళ సాహిత్యమున ప్రజల హృదయములలో నాడు నాటికి బలియుచున్న ఆంగ్ల ప్రభావమునకు ప్రతీక ! కేరళమునకు ప్రత్యేక సాహిత్య ప్రక్రియ యైన, అట్టక్కథవలె కాక సంస్కృతమునుండి ఆకృతిని మలచుకొనిన నాటకమువలె కాక ఈ నవలాప్రక్రియ పూర్తిగా పాశ్చాత్యుల సృష్టియై

యుండెను. కేరళ సాహిత్యమునందు శ్రేష్ఠములై మిక్కిలి ఉత్తమములుగా పరిగణింపబడిన ప్రాథమిక నవలలెంత వేషము వేసికొనినప్పటికి వాని ఇతి వృత్తము ఆంగ్లమునుండియే గైకొనబడినది. కుందలత ఒక కొత్త సాహస యత్నముగా ప్రశంసింపబడినను దీనితరువాత 1889 లో వచ్చిన ఇందులేఖ (నవల) వలె కుతూహలమును రేకెత్తించలేదు.

ఆ కాలమునాటి ప్రవృత్తులకు దర్పణము వంటిదను బహుళప్రశస్తి ఇందులేఖ'కు వచ్చెను. ఇందులేఖ యందలి, దంభముతో సనాతన మూఢా చారములతో, ప్రాచీనతరమువారి నిరాడంబర ప్రకృతితోకూడిన మాధ్యమిక కుటుంబ చిత్రణ ఆధునికభావములతో, విద్యావంతులగు యువతరమువారి వ్యక్తిగత సమస్యలతో చాలా నిపుణముగా నిర్వహింపబడెను. 'ఇందులేఖ' ఇప్పటికిని పాఠకలోకమున అభిమాన పూర్వకమైన, ఆనందప్రదమైన నవలగా పరిగణింపబడుచున్నది. దీనికి కారణము సంధియుగపు హృదయ స్పందనమును విను అనుభవము అందరకును కావలసినదే; కనుక ఇందులేఖ ప్రజలలో ఇప్పటికిని చాలామందిచే చదువబడుచున్నది. నవలలను చదువుట వ్రాయుట యను నభిలాషను ఇందులేఖ పెంపొందించెను. అవి ఎవరికైనను తమ ఆశా నిరాశలను, సంతోషమును, దుఃఖమును గోపనము చేసుకొనకుండా వ్యక్తపరచుటకు నవలలు గొప్ప అనుకూల సాధనములు. ఈ విధముగా స్వతంత్రములుగా కొన్ని బెంగాలీ, ఇంగ్లీషు, తమిళ వాఙ్మయముల నుండి అనువాదములుగా కొన్ని నవలలు బయటకు వచ్చెను. నాటక రచనమునందువలె ఈ సాహస పూర్వక రచనోద్యమమునందును స్త్రీలు వెనుకంజవేయలేదు. K. దేవకిఅమ్మ, C. K. భారతిఅమ్మ మొదలగు రచయిత్రులచే సంపుటములు సంపుటములుగా నవలలు సృష్టింపబడెను. కాని పెక్కురు అనువాదములతోనే తృప్తిపడిరి.

### టి. సి. కల్యాణిఅమ్మ :

విశ్వరక్షిత, కృష్ణకాంతుని వీలునామా అను రెండు బెంగాలీ నవలలను మళయాళములోని కనువదించెను. ఈమె ఈ సబ్ కథలను పెక్కింటిని

కూడ మళయాళమున కనువదించెను. అంతేకాక పెక్కు వ్యాసములను కూడ వ్రాసెను. చాలా ఉపవ్యాసములనుకూడా ఇచ్చెను. ఆమె వచనము చాలా సరళమైనది. అందమైనది.

కళ్యాణిఅమ్మ తిరుచూరునందలి ఒక గొప్పకుటుంబమునకు చెందినది. ఆమె చదువు వీధిబడి చదువు మాత్రమే అని చెప్పవచ్చును. కాని తుదకు ఆమె యింటియందే సంస్కృత పండితురాలైన తన అవ్వగారి పర్యవేక్షణలో విద్య నభ్యసించినది. ఎర్నాకులములో వర్ధమాన న్యాయవాదియైన టి. కె. కృష్ణమీనన్ ను 1896 లో పెండ్లాడెను. ఆయనకు సాహిత్యమనిన ఆసక్తి మెండు. ఆయనతోపాటు కళ్యాణి బహు గ్రంథపఠనము కావించుటే కాక దేశమంతయు పర్యటించెను. ఆమె సాహిత్య క్షేత్రమును ప్రవేశించుటకు ఆయన బాగుగా సహాయపడెను. ఆమె ప్రప్రథమ సాహిత్యసంస్థయైన "భాషాపోషిణి" సమావేశములలో పాల్గొన నారంభించుటయే కాక ఆసక్తిదాయకమైన ప్రసంగములనుకూడ చేయనారంభించెను. భాషాపోషిణి సంస్థ పడిపోయినవెనుక క్రొత్త సాహిత్య సంస్థయైన "సాహిత్యపరిషత్తు" సమావేశములకుకూడ ఆమె హాజరుగు చుండెడిది. స్త్రీలకు విద్య, స్వాతంత్ర్యము ముఖ్యమని ఆమె అంగీకరించినను పాశ్చాత్య మర్యాదల ననుకరించుటకు ఆమె అనిష్టము చూపెడిది. ఒకమారు ఈమె స్త్రీలను సభ్యురాండ్రగా చేర్చుకొననందుకు ఆ సమాజమును విమర్శించెను.

ఈ దంపతుల జీవితమంతయు హెచ్చుగా సాహిత్యసేవకే అంకితమయ్యెను. తాము వ్రాసిన గ్రంథములను పరస్పరము ప్రోత్సహించుకొనుటద్వారాను, విమర్శించుకొనుటద్వారాను ఒకరి కొకరు సహాయపడుచు వారిర్వురును గ్రంథములను వ్రాసిరి. 1919 లో త్రిపునితురా సాహిత్య సదస్సు కృష్ణమీనన్‌ను "సాహిత్య కులశన్" అనియును కళ్యాణి అమ్మను "సాహిత్య సఖి" అనియు బిరుదములనిచ్చి, బంగారు పతకములనిచ్చి సమ్మానించెను.

కళ్యాణిఅమ్మ మంచి గేస్తురాలు. సౌఖ్యావహురాలైన జీవితసఖి. ఆమె యువకులయొక్కయు, చిన్నపిల్లలయొక్కయు సాధకబాధకముల

నర్థముచేసుకొని వారి అవసరములను దీర్చుటకై శ్రద్ధతీసుకొనెడిది. కృష్ణమీనన్ గతించినవెనుక ఆతని స్మృతిచిహ్నముగా ప్రతిసంవత్సరమును ఆ సంవత్సరపు ఉత్తమ మళయాళ గ్రంథమునకు చెందులాగున ఒక సాంవత్సరిక బహుమతి నేర్పాటుచేసెను. ఆమె కుమార్తె జానకి అమ్మ M. A. అరుదుగా తన రచనాశక్తిని ప్రదర్శించునదైనను, సమర్థురాలైన రచయిత్రి.

## బి. కళ్యాణిఅమ్మ (1884-1959) :

బి. కళ్యాణిఅమ్మ వ్యాఝూవాత్తా స్మారణకల్, అను గ్రంథకర్త్రిగా మిక్కిలి పేరుపొందినది. ఇది ఆమె వైవాహిక జీవిత సంగ్రహస్మృతులు గల గ్రంథము. దానిలో వర్ణింపబడిన ఇద్దరు మేధావంతుల పరస్పర మధురప్రేమ ప్రవాసమున వారనుభవించిన బాధలు, శాంతి దాయినియైన తల్లిప్రేమ, జీవిత సహచరునకు కడపటి వీడ్కోలును ఏ చదువరియును మఱువలేనట్టివి. స్మృతిగీతములకంటె చదువరి మనస్సును భావావేగముతో నింపి, వర్ణనా సంయమమువలన అది మనస్సులకు హత్తుకొనును.

కళ్యాణిఅమ్మ తిరువేంద్రము వాస్తవ్యులగు సుబ్బరాయన్‌పోట్టి కుమార్తె. ఆమె కాలేజీలో చదువుకొనుచుండగా 'స్వదేశాభిమాని' సంపాదకుడగు K. రామక్రిష్ణపిళ్ళైతో పరిచయ మేర్పడెను. కళ్యాణిఅమ్మచే అనువదింపబడిన ఒక కథ విషయమై వారిరువురకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరముల మూలముగా ఈ పరిచయము జరిగి, తరువాత ఈ పరిచయమే పెండ్లికి దారితీసెను. పెండ్లి అయిన వెనుకకూడ ఆమె తన చదువును పట్టము తీసుకొను నంతవరకు కొనసాగించెను.

"స్వదేశాభిమాని" సంపాదకుడుగా రామకృష్ణపిళ్లై తిరువాన్కూరు ప్రభుత్వము యొక్క అనేకములగు బాధ్యతారహితములగు చర్యలపై చురుక్కుమను విమర్శలను వ్రాసెను. దీని ఫలితముగా ముద్రణాలయమును జప్తుచేయుటయు సంపాదకుని రాష్ట్రమునుండి బహిష్కరించుటయు జరిగెను. ఈ బహిష్కరణ సందర్భమున కళ్యాణిఅమ్మ భర్తను అనుస

రించెను. ఆ సమయమున వారు కొజ్జికోడు, కొట్టక్కాల్ మద్రాసు మున్నగు అనేక స్థలములలో నివసించిరి. జీవనోపాధికై కల్యాణిఅమ్మ ట్యూషన్లు చెప్పవలసివచ్చెడిది. మద్రాసులో తారావతు అమ్మాళుఅమ్మ సోదరుడైన, తమ స్నేహితుని, టి. యమ్. నాయరును కలుసుకొనిరి. సోదరుని సలహాపై అమ్మాళుఅమ్మ ఇల్లులేని ఆ దంపతులను పాల్ఘాటులోని తన యింటిలో ఉండుడని ఆహ్వానించెను. అచటనుండగా అమ్మాళుఅమ్మ కును ఈ పిళ్లె యువదంపతులకును నడుమ ఆర్ద్రమైన, గౌరవప్రదమైన ప్రేమ పెంపొందె అది వారి జీవితాంతములవఱకు కొనసాగెను. కల్యాణి అమ్మయు, నామె భర్తయు తమ ఈ పెంపుడుతల్లినిగూర్చి ఎంతో గౌరవ ప్రతిపత్తిని చూపెడివారు. 1915 లో కల్యాణిఅమ్మ మద్రాసు ప్రభుత్వ విద్యాశాఖయందుచేరి, కన్ననూరులోని సెకండరీ బాలికా పాఠశాలయం దుద్యోగినియాయెను. భర్తతోడను, ఇరువురు చిన్నపిల్లలతోడను ఆమె అచ్చటనే కుదురుకొనెను. కాని భర్త యగు రామకృష్ణపిళ్లె మరణముతో ఆమెకు అనుకోని పెద్ద ఆపద తటస్థించి ఆమె యింటియందును పాఠశాల యందును కష్టించి పనిచేయవలసివచ్చెను. సారస్వత వ్యాసంగమునుకూడ ఆమె నిర్వహించెను. పాఠశాలలపై ఇన్స్పెక్ట్రెస్ అయినతర్వాత ఆమె 1939 లో ఉద్యోగవిరమణ మొనర్చెను. ఆ తర్వాత ఆమె తన ఏకైక పుత్రికతో కొజ్జికోడులో స్థిరపడెను. ఆమె జీవితము పొడుగునను అనుభ వించిన కష్టములచేతను, కఠినముగా పాటుపడుటచేతను శరీరము బలహీనమై ఆమె కఠిన స్వభావ అయ్యెను. తర్వాత దీర్ఘవ్యాధితో తీసుకొని ఈ తేజశ్శాలిని ఈ లోకమును వీడిపోయెను.

రామకృష్ణపిళ్లె దేశ బహిష్కృతినంది మృతిచెందువఱకు ప్రజలకు నాయకుడయ్యెను.

కేరళ సమైక్యత జరిగినవెనుక పిళ్లె భౌతికావశేషములు వైభవ ముగా ఉత్సవముతో తిరువేంద్రమునకు తీసుకొనిరాబడినవి. భర్త దేశ బహిష్కారమునందిన వెనుక జన్మస్థానమున నడుగిడని కల్యాణిఅమ్మకూడా

ఆ ఉత్సవమున పాల్గొనుటకై ఆహ్వానింపబడి హృదయపూర్వక స్వాగతము నందుకొనెను.

మొదట వ్రాసినవి కాక 'మహతికల్' (Great women) 'ఆరోగ్య విధులు, ఇంటిపొదుపు' అను గ్రంథములును, థామ రస్సేరి 'కర్మఫలమ్' అను రెండు నవలలును ఆమె ప్రముఖ రచనలుగా నుండెను. రవీంద్రుని నవల కనువాదముగ 'ఇంట-బయట' అను నవలను రచించెను. కల్యాణి అమ్మ శైలి శక్తిమంతముగను, తేజోవంతముగను నుండును. "ఆరోగ్య విధులు, ఇంటి పొదుపు' అను విషయములపై ఆమె ధారావాహిక రచనలు ప్రతి స్త్రీకిని అవసరమగు సలహాలతో కూడియుండును. అవి కేరళ మున పాఠ్యస్సేరీ గ్రంథములుగా నుండెను. ఆమె నవలలు నైతిక, పౌరాణిక విలువలను ఊది పల్కెను. థామరస్సేరీ ఈమె రచనలలో విశేషముగా ప్రశంసింపబడిన నవల 'ఇందులేఖ' వలె యిది ఆ కాలమునాటి సమస్యలతో కూడి యుండును.

ఈ నవలలో పిత్రార్జితము లేక, సాంఘికముగా కొంచెము తక్కువ కుటుంబములో పుట్టి పెరిగి, తన స్వార్జితముచే ధనవంతుడైన, చక్కని శీలసంపదగలిగిన ఒక యువకుని ప్రేమించిన తనకుమార్తె ప్రణయ సందర్భముగా దర్పాహంకారములుగల ఒక ధనవంతురాలు సంఘర్షణపడును. సాధారణముగా అట్టి సందర్భములలో ప్రథమసందర్శముననే ప్రేమ జనించుట అరుదు. అట్టి పరిస్థితులలో మొట్టమొదట ఆతని ప్రేమకు ఆ బాలికయొక్క వైముఖ్యమును వర్ణించి తరువాత ఆ బాలిక నాయకుని అభ్యర్థనపై మెత్తబడి లోనగుటయు, తరువాత ఆతని ప్రేమ నర్థము చేసికొనుటయు, వెనుక నాతని ప్రేమించుటయు నను నీ అంతస్థులను కల్యాణియమ్మ మనస్తత్వ పరిణామక్రమమున బాగుగా వర్ణించెను. ఈ నవల ఆంగ్లపద్ధతుల ననుసరించియున్నను, బహుశః ఆనాడు ఒక స్త్రీచే రచింపబడి, ఉత్తమశ్రేణికి చెందిన దిదియే కావచ్చును. ఆమె జీవిత చరమ దశలో వ్రాయబడిన 'కర్మఫలము' బహుళ ప్రచారము నందలేదు. కల్యాణి

అమ్మచేతనే వ్రాయబడి అసంపూర్ణముగా నుండిపోయిన ఆమె ఆత్మకథ సుప్రసిద్ధ రచయిత్రియు, ఆమె కుమార్తెయునైన, గోమతిఅమ్మచే ప్రచురింపబడుటకు సిద్ధముగా నున్నది.

భాగీరథీఅమ్మ - తంపురాన్ :

ఆధునిక తరమునకు వచ్చుసరికి ఇరువదియవ శతాబ్దపు మళయాళ సాహిత్యవృక్షము చాలా శాఖలతో విస్తరిల్లిన ఉజ్జ్వల వృక్షమనియును, దాని వ్రేళ్లు చాలా దూరము వ్యాపించు చున్నవనియు మనము గుర్తింప గలము. ప్రాచీనకాలమునందువలె రచయిత్రులు ఇప్పుడు అంత అరుదు కాదు. ఈ చిన్ని వ్యాసమున ఆ రచయిత్రు లందరకును న్యాయముచేయుట నిజముగా సాధ్యపడునదికాదు. ప్రముఖ రచయిత్రులను గూర్చియు సాహిత్య వ్యాసంగమున కాలము గడపినవారినిగూర్చి మాత్రమే ఇందు ప్రస్తావింపనగును.

భాగీరథిఅమ్మ తంపురాన్ (జన్మము 1889) కేరళవర్మ మేనల్లుడైన ప్రొఫే. రాజా రాజవర్మ కుమార్తె. రాజరాజవర్మ మిక్కిలి అవసరమైన చ్ఛందోవ్యాకరణ పాఠ్యగ్రంథములను రచించి మళయాళభాషకు చాలా సేవచేసెను. ఆతడుకూడ నలిగిన పాతదారులను విడిచి కొత్తదారులను కనుగొనుట కభిలషించునట్టి ఆధునిక దృక్పథము కల రచయిత. ఈ కారణమువలన భాగీరథిఅమ్మ సాహిత్యవాతావరణమున పెంచబడి పుస్తక ప్రేమికురాలయ్యెను. ఒక ప్రాథమిక పాఠశాలలో చదువు ముగిసినవెనుక ఆమెకు వివాహము కావింపబడెను. అయినను ఆమె యింటిదగ్గర తాను చదువుకొనుట కొనసాగించి సంస్కృతాంగ్లములలో ప్రవీణత నొందెను. తరువాత ఆమె హిందీకూడ నేర్చెను. "Reprsentative Indians" అను గ్రంథమునుండి కొన్ని భాగములను అనువదించుటతో ఆమె సాహిత్య వ్యాసంగ మారంభమయ్యెను. ఒక చిన్ని కథలసంపుటి, ఆంగ్ల నాటకము నాధారపరచుకొని వ్రాసిన ఒక నాటకము. ఇంకను కొన్ని ఆమె జీవిత విశేషము క్రిందివిధమున నున్నవి. అందు తన అన్నగారైన రాఘవవర్మతో

చేరి రచించిన, ప్రసిద్ధుడైన తన తండ్రి జీవితచరిత్రము రచనలలో ముఖ్యము, పెద్దది. ఇది ఒక గొప్ప వ్యక్తినిగూర్చి వ్రాసిన గొప్ప గ్రంథము. అంతే కాక ప్రధానమగు పరిణామములకు లోనగుచున్న ఆధునిక మళయాళ సాహిత్య చరిత్రకూడ నైయున్నది. 1963 లో మళయాళ సాహిత్య పరిషత్తు రాజరాజవర్మ యొక్క జన్మదిన శతవార్షికోత్సవము జరిగినపుడు ఈ గ్రంథమునకు 1,500 రూపాయలు పారితోషకము ఒసంగబడినది.

భాగీరథిఅమ్మ తంపురాన్ సాధారణపు దుస్తులు, చక్కని అలవాట్లు కల స్త్రీ. ఏ సమావేశముననైనను ఆమె పాల్గొనుటరుదు.

## అంబాడీ నారాయణీపోతువాల్స్యార్ (జననము 1886) :

తిరుచూరునకు చెందిన వయస్సుమీరిన అంబాడీ నారాయణీపోతు వాల్స్యార్‌ను గూర్చి ఇచట ప్రస్తావము చేయదగును. ఆమె తన చిన్న తనమున గొప్ప పట్టుదలతో ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ భాషల నభ్య సించెను. అంతేకాక ఈశ్వర చంద్ర విద్యాసాగరుని, సీతావనవాసాను వాద మును, ద్విజేంద్రలాల్‌రాయి యొక్క రాణాప్రతాపాను వాదమైన క్షాత్ర ప్రభావమును రచించెను. అశోకునిపై ఆమె సొంతముగ వ్రాసిన నాటక మొకటి గలదు.

## బి. భగీరధీఅమ్మ :

ఈమె బి. కల్యాణిఅమ్మ చెల్లెలు. స్త్రీలకొఱకు నడుపబడుచున్న 'మహిళ' అను ఆదర్శ మాసపత్రికకు ఈమె సంపాదకురాలుగా నుండెను. ఈ పత్రికా రచయిత్రి అనేకములగు స్త్రీల సమస్యలపై వ్రాసెను. ఆమె రచనలు "విజ్ఞాన ప్రకాశమ్" అను నీతికథలు ఆనందవల్లి అను నవలయై యున్నవి (1889-1957).

## వి. కె. చిన్నమ్మాళుఅమ్మ :

నవయుగ మాసపత్రికా సంపాదకురాలుగా నుండెను. ఆశావహ మగు భవిష్యత్తుకల రచయిత్రి, కాని అకాలమరణము పాతబడెను.

**తెక్కుకున్నత్ కళ్యాణికుట్టిఅమ్మ :**

కేట్టిలమ్మవలె సంస్కృత చ్ఛందమున అనేకవిషయములపై అనేక ఖండకావ్యములను రచించెను. ఒకప్పుడు ప్రతిమళయాళ పత్రికయందును ఆమె రచనలు కనుపించుచుండెడివి. కాని అవి ఒక గ్రంథముగ కూర్పబడ లేదు. ఆమె కుమార్తె ఓమనకుమారి తరుణ కవయిత్రి.

**అంబాదేవితంపురాట్టి :**

చేంపరల్ భవనమునకు చెందిన ఈమె కేరళవర్మకు సోదరపుత్రిక. ఈమె రచనలు సంస్కృతమునను మళయాళమునందును చాలా స్తోత్ర రూపమున కలవు. "అష్టమీ ప్రబంధ" (సంస్కృతము) మునకు మళయాళము లోనికి అనువాదమును "శ్రీ భూతనాధోదయమును ఈమె రచనలు. పిన్నవయస్సుననే ఈమె మరణించెను. (1889-1927)

**అంబాడీ కొత్యాయినిఅమ్మ, వేలాయుధమీనన్‌సతి (1895) :**

మీనాక్షిఅమ్మ సోదరియైన అంబాడీ కాత్యాయనిఅమ్మ రచయిత్రి గానే కాక సాంఘిక విద్యారంగములలో ప్రముఖ సేవ యొనర్చిన మహిళగా పేరుపొందినది. ఆమె శక్తి విశ్వాసముల ప్రతిరూపము. ప్రధాన మైన వివిధ సభా సమావేశములలో ఆమె పాల్గొని, (తన అభిమత విషయ ములు సాహిత్యము, స్త్రీల సమస్యలైనను.) విభిన్న విషయములపై ఇంపుగను, ధారాళముగను ప్రసంగించును. భావోన్మేషము కలిగించు "భాష-సంస్కృతి" కేరళ స్త్రీలు-కుటుంబమున, సమాజమున మొదలగు విషయములపై ఆంగ్లమునను, మళయాళమునను వ్యాసములు వ్రాయు చున్నది. బీతోవన్ పాటలు అనువాదము చేసెను. గాంధీ విచార పరిష త్సభ్యురాలుగా సంఘ సేవాకార్యము లొనర్చును. ఆమె విజ్ఞానము సువిశాలము. ఆమె అభిరుచులు వివిధములు. ఆమె తెలివితేటలు చురుకైనవి. ఆమె నిష్కర్షగా కాలనియమమును పాటించుచు మిక్కిలి శీఘ్రముగా విధినిర్వహణ మొనర్చును. మిక్కిలి కొద్ది విశ్రాంతితో సంతృప్తిపడు స్వభావముకల మహిళ.

ఈమె తల్లిదండ్రులైన పల్లియల్ కోచు గోవిందమీనన్ నానిఅమ్మల ఏడుగురు సంతానమునందొకతె. కొచ్చినుసంస్థానమున ఈమె పట్టభద్రురాలు. దక్షిణభారత మహిళల పోటీలో "నేటి భారత స్త్రీత్వముయొక్క ఆదర్శము" అను వ్యాసమునకు ఆమె బహుమతి నొందెను.

కాత్యాయనిఅమ్మ కొచ్చిను విద్యాశాఖలో చేరి ముప్పది రెండు సంవత్సరములు విశిష్ట సేవ యొనర్చి ఉద్యోగ విరమణ మొనర్చెను. ఆమె తన ఉద్యోగకాలమున హిందీని, గరల్ గైడును, జూనియర్ రెడ్ క్రాసును, రాట్నము వడకుటను, కేరళ జానపద నృత్యములను పాఠశాలలో ప్రవేశపెట్టుటకై ప్రప్రథముగా పనిచేసిన మహిళ.

ఆమె ప్రథమాఖిలభారత మహిళాసభను ఏర్పాటు చేయుటయేకాక అఖిలభారత మహిళా సభ (A.I.W.C.) కార్యాచరణ సంఘముయొక్క సభ్యురాలుగా నుండెను. ఏడేండ్లు ఆ సభకు అధ్యక్షురాలుగాకూడ నుండెను. కేరళ విశ్వవిద్యాలయ సెనేటు సభ్యురాలుగా నుండెను. ప్రస్తుతము కేరళ విద్యాశాఖా సలహా సంఘ సభ్యురాలుగా నున్నది. మళయాళ సాహిత్య పరిషత్సభ్యురాలుగా ఆమె శ్రద్ధాభక్తులతో సాహిత్య సేవ చేయుచున్నది. ఆకులమధ్య ప్రకాశించు పుష్పమువలె, ప్రేమమయియైన భార్యగను, ఇరువురు పిల్లలకు ఈమె ప్రేమపూర్ణయగు తల్లిగను గృహ జీవితమును మధురముగ ప్రకాశింప జేయుచున్నది.

కాత్యాయనిఅమ్మ సాహిత్యసేవ ఈ క్రింది విధముగా నున్నది. 'తరంగ విహార' అను చిన్న కథల సంపుటము, (స్వతంత్ర రచన) కొన్ని ఆంగ్లకథల కనువాదములు, పంచతంత్ర కథల కనువాదము. కొచ్చిను తిరువాన్కూరు సంస్థానముల చరిత్ర కథలు అనునవి రెండును పిల్లలకు పాఠ్యగ్రంథములు "డెన్నిస్ కిన్ కేయిడ్" యొక్క "గ్రేండ్ రెబెల్"కు అనువాదమును (ఇది ఢిల్లీ నేషనల్ బుక్కుట్రస్టువారి సలహాల ననుసరించి రచింపబడినది) కలవు. ఇవికాక పెక్కు రచనలు అసంపూర్ణములు అముద్రితములునై యున్నవి. ఇండియన్ P. E. N. వారిచే యేర్పాటు

చేయబడిన గోష్ఠియందు ఈమె చదివిన రామాయణమునుగూర్చిన వ్యాసము మళయాళ సాహిత్యముపై రామాయణమునకు కల ప్రభావమును, ఆ మహా పురాణము నాధారపఱచుకొని మళయాళ భాషయందు బయల్వెడలినంత సాహిత్యము మరే భాషయందును బయల్వెడల లేదను నంశమును చక్కగా తేటపఱచెను.

## అంబాడీఇక్కావూఅమ్మ (1898):

అంబాడీఇక్కావూఅమ్మ, కాత్యాయనిఅమ్మ సోదరి. స్కూలు ఫైనలు పరీక్ష ప్యాసైనతర్వాత, చిన్నపిల్లల ఉపాధ్యాయిగా ఆమె జీవిత మారంభమైనది. ఆమె ఆదరణగల ప్రవర్తన శ్రద్ధతోడి కార్యదీక్ష విద్యార్థుల గౌరవమును చూరగొనెను.

సాహిత్యక్షేత్రమున ఆమె తొలియత్నము రవీంద్రుని దివ్య నాటక మగు "చిత్ర" నాటకానువాదమైనను, ఇక్కావూఅమ్మ మళయాళమున బాల వాఙ్మయాభివృద్ధికై శ్రద్ధవహించెను. టాల్స్టాయి కథల అనువాదము (ఈ పుస్తకమును ప్రశంసించుచు మహాత్మా గాంధీజి వ్రాసిన లేఖ నామె యిప్పటికిని భద్రపఱచుకొనినది.) నెహ్రూజీయొక్క "జనకుని లేఖలు" అనువాదమును "కుట్టికాలూటుపూన్ కావానమ్ (పిల్లల సంరక్షకుడు) "బాలకథాకల్" (ఇది భారత ప్రభుత్వమువారి బాలవాఙ్మయ పోటీలో ప్రథమ బహుమతి నొందెను) అను స్వంత రచనలును ఆమె రచనలై యున్నవి.

బాపూజీ యొక్క గీతాబోధతోడి 'అనాసక్తి యోగము' న కనువాదమును K. M. పనిక్కరు యొక్క 'శ్రీ షర్షన్' అను ఆంగ్ల గ్రంథమున కనువాదమును, ఆస్కార్ వైల్డు యొక్క (Garden) కథల కనువాదమును ఆమె యితర రచనలు. ఆమె రచించిన అనాసక్తి యోగ మునకు మెప్పుగా ఈమె కొచ్చిన్ మహారాజుచే స్వర్ణపదకముచే బహూకరింపబడినది. "గృహనిర్వహణశాస్త్రము" అను రెండుసంపుటముల గ్రంథము ఆమె స్వతంత్ర రచన. ఆమె శైలి చాలా సరళమైనది. రమణీయమైనది.

ఇక్కావూఅమ్మ తారుణ్యదశలో సంస్కృతమును అభ్యసించెను. తరువాత ఆమె హిందీ ప్రాథమికలోచేరి ఈ రాష్ట్రభాషయందు ప్రావీణ్యమును సంపాదించెను. సంగీతమునకూడ ఆమె కతిశయిత ప్రజ్ఞ కలదు. ఆమె భర్త శ్రీ వి. కరుణాకరన్‌నాయరు మంచి రచయిత. దివ్యజ్ఞాన సామాజికులు వారి వైవాహిక జీవితము తరచుగగాని పొందుపడని ఆదర్శ సమన్వయముతో ఇరువురు బిడ్డలతో సుఖమయమై ధన్యమైనది.

ఇక్కావూఅమ్మ మతచింతనకలది. అంతియేకాక కర్మకాండయనిన ప్రియంపడునది. ఆమె గృహవాతావరణము సాధారణముగా గీతా పారాయణము తోడను, సహస్రనామ పారాయణము తోడను ముఖరిత మగుచుండును. ఎర్నాకులమునందలి శ్రీ శంకర దివ్యజ్ఞాన సమాజ కార్య కలాపమున ఆమె పాల్గొనుచుండును. మరియును దివ్యజ్ఞాన సామాజికురాలుగా తన భర్తయొక్క కార్యనిర్వహణమున తన చేతనైనంత సహాయము చేయుచుండును. ఆమె దివ్యజ్ఞాన సమాజపు లాడ్జియందు జరుగు పిల్లల కార్యక్రమములపట్ల శ్రద్ధ వహించుచుండును.

## మేరీజాన్‌తోట్టకు (1901) :

మళయాళమున 1895 లో రాజరాజవర్మచే భావగేయ పద్ధతి కవిత్వము ప్రవేశపెట్టబడెను. ఈ పద్ధతి రచనను జయప్రదముగా నిర్వహించిన ఇతరకవులు కొలదిగ నుండిరి. (Romantic) శృంగార కవిత్వయుగము సమీపమున నున్నట్లు అప్పటిలో కనబడెను. అయినను ప్రాచీన ప్రాబంధిక కవితా ప్రభావ మింకను ప్రముఖ కవుల హృదయములలో బలముగానే యుండెను. ఇరువదియవ శతాబ్దము సంస్కృత కావ్యపు ప్రతికృతులగు మహాకావ్యముల ప్రాదుర్భావముతో మొదలయ్యెను. ప్రతి పండితకవియు 'నగర్త్వవన శశివర్ణనాదికమైన అష్టాదశ వర్ణనములతో కూడిన పెద్ద ఆశ్వాసములుకల మహాకావ్యము నొక్కొక్కదానిని రచించెను. ఈ మహాకావ్య రచనమున వారివారి ప్రజ్ఞాధిక్యములు, ఊహాతిశయమును ప్రదర్శించు నవకాశము ఉండియుండవచ్చునుగాక. కాని మొత్తముపై ఇట్టి

మహాకావ్య నిర్మాణము మాత్రము జరిగినది. 1917 వరకు ఈ యుగము ఇట్లె నడచెను. కాని ఒక్క మహిళకూడ ఇట్టి ఒక్క మహాకావ్యమునైనను రచింపలేదు.

కడ కీ శృంగార కావ్య నిర్మాణోద్యమము (Romantic Movement) నిలువద్రొక్కుకొనెను. ప్రసిద్ధ కవులచేతను మహాకావ్యములను రచించిన మహాకవులచేతకూడా ఈ ఉద్యమము అభివృద్ధి కావింపబడెను. ధారాళముగా పదములను వాడుట, భావాంబర వీధులలో విహరించుట అను కవితా లక్షణముల ఆధిక్యముపోయి, భావచిత్రణకును, ధ్వని ప్రాధాన్యమునకును ఆధిక్యము లభించెను.

మానవుని వాస్తవిక సమస్యలకు సంబంధించిన ఇతివృత్తములు కొల్లలుగా బయల్వెడలెను. హెచ్చు సంగీతాత్మకముగాను కొలదిగా బిగువుసడలిన ద్రావిడ చ్ఛందములు భావగేయ రచన కనుగుణము లయ్యెను. సంగ్రహత (క్లుప్తతా గుణము) ఈ పునరుజ్జీవన యుగమునకు ముఖ్యలక్షణము. నవలలు కథలకును నవకవికల స్థాన మొసంగెను. పెద్దవియు, చిన్నవియు నగు ఖండకావ్యములు మహాకావ్యమున స్థాన మలంకరించెను.

ఇట్లు పునరుజ్జీవితమగు మళయాళ కవితాప్రాదుర్భావమున పాల్గొనిన ప్రథమ కవయిత్రి "మేరీజోన్‌తోట్టమ్" అనునామె, సారస్వత ప్రతిష్ఠను పొందిన ప్రథమ క్రిష్టియన్ కవయిత్రికూడ యీమెయే. మేరీ తిరువేంద్రము కొత్తాట్టు కులమునకు సమీపముననున్న "ఎలాంజి" అను గ్రామమున మిష్టరుజోన్, మేరీయమ్మల మొదటికుమార్తెగా జన్మించెను. పదునాల్గవపట కాన్వెంటు పాఠశాలలో చదువుకొనునప్పుడు మేరీ తన మొదటిపద్యమును రచించెను. అదిమొదలు ఆమె తన సహాధ్యాయినులచే కవయిత్రిగా గౌరవింపబడెను. అంతేకాక పర్వదినములపై ఆమె చాలా పద్యములను వ్రాయవలసి వచ్చెడిది. తరువాత ఫాదర్ సైమణ్‌గా ప్రసిద్ధుడైన, ఆమె మామ (పినతండ్రి) ఆమెను చిత్రాతిచిత్రమైన సాహిత్య రంగమున రచన చేయుటకు ప్రోత్సహించెను.

మేరీయొక్క ప్రాథమిక రచనలు, ఆమె చుట్టునున్న ప్రకృతి సౌందర్యమునకు ప్రతిబింబములు! కాని ఆమె కవిత్వము తరచుగా జీవిత రహస్యమును ప్రతిబింబింప జేయు చుండెడిది. ఆమె ప్రకృతి సౌందర్యము ననుభవించునపుడా ప్రకృతిమాటున దాగియున్న దివ్య తత్త్వమును దర్శించుట కామె శ్రమించుచున్నదా అని యనిపించును. ఆమె వయస్సు పెరుగుటతో ఆమె హృదయమున దోబూచులాడుచున్న నీడలు బలపడు టయే కాక ప్రాపంచిక భోగములు (సుఖములు) బూటకములనియు ఆమె తెలుసుకొనెను. అప్పు డామె యిట్లు పాడెను:

"తెలుసుకొనవలసినదానిని నేను ఇపుడు తెలుసుకొంటిని,
సంశయము లింక లేవు. ఎగసన ద్రోసిన వత్తితో నా గదిలో
నా ప్రభుని కొఱకు వేచియుందును".

ఇరవై ఏడవయేట మేరీ ప్రపంచము ను త్యజించి క్రైస్తవ సన్న్యాసిని అయ్యెను. "ప్రపంచమునకు వీడ్కోలు" అను నామె ఖండకావ్యమున తాత్త్విక చింతనల పట్టుమడతలలో నిక్షిప్తముచేసిన పరిచిత క్షేత్ర సౌందర్యము. అభిమానుల ప్రేమలను విడిచిపోవలసిన హృదయావేదనను ముద్రితమైయున్నది. ఈ సన్న్యాసిని కొన్నేండ్ల తరువాత సిస్టర్ బెనిగ్నా అను పేరున ఆమె రచనలు పత్రికలలో మఱల కనిపించెను. అప్పటి రచనల యందు చెప్పదగినమార్పు కాన్పించును. ఆమె ప్రాథమిక రచనలయందలి నూతనత్వము, ఆవేశ సౌందర్యమును అదృశ్యమైనవి. అవి యిపుడు సంఘర్షణమునుండి విడివడిన ఆత్మయొక్క గీతములు. అవి భక్తిపూర్ణములై సరసహృదయమును ఆ గీతములలో తరచుగా కాన్పించును.

సోదరి బెనెగ్నా ఆదర్శవాదిని. ఆమె కవిత్వము ఉన్నతమైన ప్రభావము కలది. మానవుని ఉత్తమ సంస్కారమునే ఆమె తన రచనకు వస్తువుగా స్వీకరించినది. "కవితారామమ్", "గీతావళి", "విధివైభవ", "మాగీ", "మధుర మంజరి" (చిన్న పువ్వుయొక్క బాల్యము) "భారత మహాలక్ష్మి" అనునవి ఆమె రచనలు. భారత మహాలక్ష్మి అనునది రాణీ

ఇంత వఱకు జరిగిన పరిశోధన వలన "నాధ్" తెగకు సంబంధించిన "గోరక్షనాధుడు" వివేక సింధువును రచించి నట్టియు, శంకరోక్తికి భాష్యమును రచించి నట్టియు, ముకుంద రాజు రచనలతో మహారాష్ట్ర సాహిత్యము ప్రారంభ మయ్యెను. ఈ కాలమున అమాయికత, దరిద్రత, మతా చారములు, ఉన్నతకులముల వారి అధికార ప్రాబల్యము మున్నగు వాని వలన పామర జనము క్షుభితమై హీన స్థితికి వచ్చెను. ఈ పామర జనమున చైతన్యము, ప్రబోధము కల్గించుటకై జైన శైవ, లింగాయత్, నాధ్, వరకారీ, మున్నగు తెగలను ఏర్పాటుచేసిన జాతి వ్యవ స్థాపకులు సంస్కృతమునకు బదులు మహారాష్ట్ర భాషను వ్యవహార భాషగా నేర్పర చిరి. దీనివలన పామర జనులు వారి ఉపదేశములను ఎక్కువ సులభముగా అర్ధము చేసికొనగల వారైరి.

ఆనాడు సాంఘిక చైతన్యమే మహారాష్ట్ర భాషయందు ఒక్క ఉదుటున కవిత్వాకృతి వహించినది. మహారాష్ట్ర భాష యందలి కవిత్వ ప్రాదుర్భావమునకు సాంఘిక చైతన్యమే జీవగఱ్ఱయనియు చెప్పవచ్చును.

**మహదాంబ :**

ముకుందరాజ్, గోరక్షనాధులు మహారాష్ట్ర సాహిత్యమునకు పితామహు లైనను ఒక సాంప్రదాయమును సాహిత్యమున నెలకొల్పి దానిని వ్యాప్తి చెందించుటలో కృతకృత్యులు కాజాలక పోయిరి. ప్రాచీన కాలమున వ్యాప్తి యందున్న కవిత్వ సాంప్రదాయమును పాదు కొల్పిన ఖ్యాతి "మహానుభవశాఖ" అను వారికి చెందును. ఈ శాఖ నుండియే మహారాష్ట్ర ప్రధమ కవయిత్రి కూడా ప్రాదుర్భవించెను. ఈ శాఖ యొక్క వ్యవస్థాపకుడైన శ్రీ చక్రధర్ (1194-1276) కు స్త్రీలలో కూడ గొప్ప అనుయాయి వర్గముండెను. ఈయనకు రూపై లేక మహదాంబ అను నామె స్త్రీలలో ముఖ్య శిష్యురాలు.

గోదావరీ నదికి దక్షిణ తీరమున, పురి అను నగరమున వామనాచార్య, మహదాయియాంశ అను నొక ఆదర్శ దంపతులుండిరి. ఈ బ్రాహ్మణ

దంపతుల మనుమడు మనుమరాలునైన వాయీనాయక్ కామాయీశ అను దంపతుల చిన్న కుమార్తె మహాదాంబ. మహానుభవ సాంప్రదాయమునకు చెందిన గొప్ప పండితుడును మతాచార్యుడును అయిన నాగదేవాచార్యుడు మహాదాంబ పినతండ్రి కొడుకు. మహాదాంబ బాల్యమున వితంతువై ఎక్కువగా బాధలు పడెను. తరువాత మొదటి సారిగా పట్‌వాడా పట్టణము నందున్న శ్రీ చక్రధర్ దగ్గరకు వచ్చెను. తుదకు ఆయన శిష్యురాలై పోయెను. తరువాత ఆయన ముఖ్యాంతే వాసులలో నొకతెయై ఆయన శిష్యులలో మిక్కిలి ప్రాముఖ్యము నొందెను. లీలా చరిత్రము నందుదాహరించిన దానిని బట్టి ఆమె చక్రధర్‌ను అనేక ప్రశ్నలడిగినట్లును చక్రధర్ అనేక ప్రత్యుత్తరముల నిచ్చి ఆమెను తృప్తి పఱచి నట్లును తెలియును. చక్రధర్ బదరికాశ్రమమునకు వెళ్లిపోగా జగదాంబ చక్రధరు గురువైన గోవింద ప్రభుని ఆశ్రయము నందుండెను. గోవింద ప్రభువు సిద్ధిపొందిన వెనుక తన పిన తండ్రి కొడుకైన నాగదేవాచార్యులతో కలిసి యుండెను. తరువాత ఆమె పాదము మీద గాయమై మరణించెను.

నాగదేవాచార్యు డామెను గూర్చి, మత సంరక్షకు రాలనియు, ప్రేమ శీలి, జనని అనియు ప్రియమార (ప్రీతిగదుర) చెప్పను. మహాదాంబ లోకాంతర గతురాలైన తేదీని నిశ్చయించి చెప్పలేము. కాని ఆమె పండు ముదుసలిరై నాగదేవాచార్యులకు ముందుగానే చనిపోయినదని చెప్ప వచ్చును.

ఒక మాఱు గోవింద ప్రభువు ఆమెను తన వివాహ సమయమున పాటలు రచింపుమని కోరెను. అంత వఱకు ఆమె ఒక్క పద్యమైనను వ్రాయలేదు. కాని తన గురువైన చక్రధరుని నామమును ధ్యానించుకొని ఒక ధవళమును పాడెను. మహారాష్ట్ర సాహిత్యము నందు "శ్రీకృష్ణుని వివాహమును వర్ణించు ఒక కవితా ప్రక్రియ ఇది.

మహాదాంబ యొక్క రచనలు 'ధావలె', 'మాతృకి', 'రుక్మిణీ స్వయంవర్', 'గర్భకాండ' అనునవి. ధవళములు ప్రారంభము-ఉప

సంహారము అని రెండు విధములుగా విభజింపబడి యున్నవి. ప్రారంభ కథ మహాదాంబచే రచింప బడెను ఉపసంహారము మహిమ్ భట్టు, లక్ష్మీంద్ర భట్టులచే రచింప బడెను. ధవళములు-రుక్మిణీ స్వయంవర అను రెండు కావ్యములును కృష్ణ వివాహ ఘట్టము కథా వస్తువుగా కలవి.

మహారాష్ట్ర సాహిత్య పరిశోధకుడు, విమర్శకుడునైన శ్రీ V. N దేశపాండేవర్ణన యందును, శైలి యందును భావము నందును చాలా నిరాడంబరమైనను, సరళమైనను మహాదాంబ ధావలేలు ధావలే ఎంత సుందరముగా నుండుటకు వీలుండునో అంత సుందరమైనవి. అత్యంత మనోహరమైన కావ్యపునమూనాలుగా మహాదాంబ ధావలేలను ఎంచవచ్చును. ఈ గుణములకు, తోడు తొందరపాటుతో కూడిన అతుకు బొతుకు కూర్పు అనవసరపు పునరుక్తి, ప్రాసవిహీనత మున్నగు కొన్ని లోపము లున్నవి. ఈ సాహిత్య ప్రక్రియ ఆశు రచన అను విషయము గమనార్హము. మాతృకీ రుక్మిణీ స్వయం వర అనునది. ధవలె (ధవళము) కంటె ఉత్తమ మైనది. అభంగములుగరచింప బడినది. "గర్భకాండ" కావ్యము ఇంత వఱకు అముద్రితము. మాతృకీ రుక్మిణీ స్వయంవరము నందలి వివిధ ఘట్టము లను ధవళము (ధావలె) నందలి వివిధములైన ఉత్సవములు పర్వములు మొదలైనవి వర్ణించుచు మహాదాంబ తన హృదయము విప్పి స్వానుభవము లను వెళ్ళబోసికొనెను. మాతృకీ రుక్మిణీ స్వయంవరమునందు నాటక రీతిలోనున్న శ్రీకృష్ణుడు రుక్మిణిని తీసికొని తన రథముపై వెళ్ళిపోవు నప్పటి ఘట్టమును కండ్లకు గట్టినట్లుగా స్పష్టముగా వర్ణించెను. సామాన్య పురుషలోకమే అవిద్యాంధకారమున తడుములాడుకొనుచున్న సమయ మున మహారాష్ట్ర సాహిత్యమున ఈ ప్రథమ కవయిత్రి ఆ సాహిత్యోద్యాన మును తన రచనలనెడు కమనీయ పుష్పములచే సురభీకృతమొనర్చుట యనునది నిజముగా స్త్రీ లోకము పట్ల చెప్పుకొనదగిన విషయమే.

**ముక్తాబాయి :**

ఇంచుమించు మహాదాంబకు సమకాలికురాలైన ఇంకొక కవయిత్రి ముక్తాబాయి. ముక్తాబాయి జ్ఞానదేవు సోదరి. (వర్కారీ శాఖవారిచే ఆమె

చాలా హెచ్చుగా గౌరవింపబడెను) ఇది జరిగి ఇప్పటికి ఎన్నో శతాబ్దములైనను ఇప్పటికిని పరమ భక్తురాలైన ముక్తాబాయిని, ఆదర్శ పురుషులైన ఆమెయొక్క సోదరులు, నివృత్తిదేవ్, జ్ఞానదేవ్, సోపానదేవ్, ఏకనాధ్, తుకారాములతో కలిసి ప్రస్తుతించుచు వర్కారీలు పాడెడు పాట వలన ఈ విషయము తెల్లమగును.

అపెగావ్ గ్రామమందలి యజుర్వేదీయ దేశస్థ బ్రాహ్మణులలో కులకర్ణి కుటుంబస్థులైన త్ర్యంబకపంత్ కులకర్ణికి ముక్తాబాయి మనుమరాలు. విఠల్‌పంత్ కులకర్ణి ఆమె తండ్రి. తన కుమారుడైన హరికారుని మృతిచే నిస్పృహుడై విరక్తిచెందిన త్ర్యంబకపంత్ గోరఖ్‌నాధుని శిష్యుడయ్యెను. ఈ సంఘటన ఫలితముగా ఈ కుటుంబమంతయు నాథ సంప్రదాయముల నవలంబించెను.

చిన్నప్పటినుండియు విఠల్‌పంత్ పరమార్థ తత్త్వ శాస్త్రాభ్యాసమున కలవడెను. విఠల్‌పంత్ ఆలంది వాస్తవ్యులైన సిద్ధోపంత్ కులకర్ణి కుమార్తె అయిన రుక్మిణీబాయిని పెండ్లాడెను. ఆతడు కొన్నాళ్ళు సంసార జీవిత సుఖముననుభవించెను. కాని తరువాత ఆయనకు ఐహిక జీవితముపై ఆసక్తి తగ్గెను. సంసార జీవితముపై ఆయనకు కల్గిన విరక్తి ప్రాబల్యముచే నాతడు భార్యకు కూడా చెప్పకయే కాశీకి వెళ్ళిపోయెను. అచట రామానందస్వామిదగ్గర ఆయన సన్న్యాసదీక్ష తీసికొనెను. తరువాత భార్య ఆజ్ఞ లేకుండా సన్న్యాసదీక్ష తీసికొనినందులకై మందలింపబడి విఠల్‌పంత్ సంసార జీవిత స్వీకారమునకై మఱల వెనుకకు పంపబడెను. స్వామి ఆజ్ఞ తలదాల్చి అతడు వెనుదిరిగివచ్చి ఆలందిచేరి మఱల గార్హస్థ్య జీవనమును స్వీకరించెను. అపుడాయనకు నలువురు బిడ్డలు కలిగిరి. కాని తిరిగి యిట్లు గృహస్థాశ్రమమును గైకొనుట సాంఘికముగా అతనికిగాని, అతని కుటుంబమునకుగాని ప్రయోజనకారి కాకపోయెను. ప్రజలాతని నపహాస్యము చేసి వెలివైచిరి. వారికి తిండికూడ కఱవాయెను. సన్న్యాసదీక్ష గైకొని మఱల గృహస్థగుటచే బ్రాహ్మణులా దంపతులకు ఉరిశిక్ష విధించిరి. విఠల్

పంత్, రుక్మిణీబాయియు నాశిషు కంగీకరించి తమ భౌతిక కాయమును ప్రయాగయొద్ద గంగాదేవికర్పించివైచిరి. వారి సంతానమైన జ్ఞానదేవు, తక్కినవారును పైఠాన్‌కు తిరిగివెళ్ళి అచ్చటి బ్రాహ్మణ సంఘమును తమ్ము శుద్ధిచేసి తమకు న్యాయము ప్రసాదింపుమని వేడుకొనిరి. కాని అచటి బ్రాహ్మణులు సన్న్యాసికి పుట్టిన పిల్లలకు శుద్ధికాండ లేదనియు, కఠిన నియమములతో బ్రహ్మచర్యాశ్రమము ననుష్ఠించుటయే ఉచిత కర్తవ్యమనియు చెప్పిరి. కాని జ్ఞానేశ్వరుని మహిమలు, వారి నిష్కళంక శీలము, వారి సాధుత్వము అన్నింటిని మించి జ్ఞానేశ్వరుని యొక్క రచనలును ప్రజలకు వారిపై భక్తిగౌరవ ప్రపత్తులు కలుగునట్లొనర్చుటయే కాక అదివఱలో వారిపై ప్రజలకుగల నిరసన, తిరస్కారాదులను దూరము గావించెను.

విఠల్‌పంత్‌నకు నలుగురు పిల్లలు. ముక్తాబాయి అందరికంటెను చిన్నది. (కడగొట్టు సంతానము) క్రీ. శ. 1279 లో ఆమె పుట్టినదని తలంపబడుచున్నది. ధ్యానతత్పరత, ప్రతిభ, మేధావిత్వము, సహనము, నిశ్చలత్వము మున్నగు పిత్రీయములైన గుణములు పిల్లలందఱకు సంక్రమించినవి. కాని బాల్యమునుండియు వీరు కష్టములనే ఎదుర్కొనవలసి వచ్చుటచే పై గుణములు ముందే వారియెడల బలపడి పసిబిడ్డల సహజమగు అమాయిక ప్రకృతిని లోపింపజేసెను. వారికి క్రమముగా వయస్సునకు మించిన తెలివితేటలు, గంభీర ప్రకృతి యేర్పడెను. ప్రసిద్ధులైన తన అన్నగార్లవలె ముక్తాబాయి తానుకూడా దుష్కరమైన జ్ఞానార్జన యందు తన మనస్సును లగ్నమొనర్చెను. ముక్తాబాయి తన జ్యేష్ఠ సోదరుడైన నివృత్తినాథునిచే ఉపదేశము పొందెను. దానిచే ఆమె హృదయమందిరము నందలి జ్ఞానకవాటములు వివృతమయ్యెను.వయస్సున చిన్నదైనను ముక్తాబాయి ఆత్మవేత్త్రి అయ్యెను. ఒకప్పుడు నామదేవు తన భగవద్భక్తిని గూర్చి దంభములు పల్కుచుండగా విని విని ముక్తాబాయి మిన్నకుండలేక అతని నీ క్రింది విధముగా ప్రశ్నించెను. నిత్యము భగవత్సాన్నిధ్యము నందుండు వారినుండి ఈ దాంభికత ఎందుకు తొలగిపోలేదో !

ఒకానొకప్పుడు ఛాంగదేవ వాతేశ్వర అనునొక గొప్ప యోగ సాధకులు జ్ఞానేశ్వరులకు ఉత్తరము వ్రాయుచు తనకును, జ్ఞానేశ్వరులకును నడుమ ఉండదగిన సంబంధమును గుర్తింపలేక తాను(ఛాంగదేవు) జ్ఞానేశ్వరులకు నమస్కారములతో ఉత్తరమారంభింపవలెనో,ఆశీస్సులతో ఉత్తరమారంభింపవలెనో తెలియక ఆ భాగమును పూరింపకయే వదలివైచెను. ముక్తాబాయి వెంటనే ఉత్తరమును చూచి "లెక్కలేనన్ని యేండ్లు యోగ సాధనలు చేసినను పాపము ఛాంగదేవుని బుద్ధి శూన్యముగానే యుండెను" అని వ్యాఖ్యానించెను. తరువాత ఛాంగదేవునకు ముక్తాబాయియే ఆత్మగురువయ్యెను. ఆధ్యాత్మికరంగమున ముక్తాబాయికి ఎట్టి స్థానము కలదో! ఈ సంఘటనయే చెప్పక చెప్పును.

ముక్తాబాయి సరిగా పదునెన్మిదేండ్లు మాత్రమే జీవించెను. ఈ పదునెనిమిదేండ్లలో ఆమె చిన్నతనమున పడిన కష్టములను మినహాయింపగా ఆమెకు ప్రతిభావంతమైన జీవితము ఆనాలుగైదేండ్లకు మించి మిగులలేదు. ఈ కొద్దికాలమునందే ఆమె మెఱుపువలె మెరసెను. అసాధారణ ప్రతిభావంతులైన వారి భక్తిజ్ఞానాచరణములలో తానుకూడ ఒకతెగా పాల్గొనెను. అత్యధిక శక్తిసంపన్నులైన అన్నగార్ల చాటున పెరిగినప్పటికిని ముక్తాబాయి తన వ్యక్తిత్వమును కాపాడుకొనుచునేయుండును. సంతతాధ్యాత్మికానుభవము ఆమె రచనలైన అభంగములలో పూర్తిగా ప్రదర్శిత మగుచున్నది. ఒకానొకప్పుడు జ్ఞానదేవు సమాజహేళనకు గుఱి అయి ఏకాంతముగా దిగులుగా కూర్చొనియుండగా ముక్తాబాయి అన్నగారిని ప్రబోధాత్మకముగా ఊరడించుచు "యోగసాధనల నొనర్చి నీవు తరించి లోకసంగ్రహమును చేయుటయే నీ కర్తవ్యము" అని బోధించు అభంగమును ఆశువుగా పాడెను. ఇది ముక్తాబాయి అభంగములలో ప్రసిద్ధి పొందినదిగా పేర్కొందురు. దీనినే తలుపుపాట యని అందురు. ఆ వివరణ మిట్లున్నది.

ఒకప్పుడు జ్ఞానదేవు లోక దూషణకు గురి అయి చాలా బాధపడి

తనంత తాను తన కుటీరములోపలికి వెళ్ళి తలుపు గడియ బిగించుకొని కూర్చొనెనట. ఇది తెలిసి ముక్తాబాయి ఇంటికివచ్చి యోగియైనవాడు ప్రాపంచికావమానములకు ఖేదపడకూడదను పరమార్థమును తన యన్న గారికి తెలియజెప్పుటకై ద్వారమునొద్ద ఈ విధముగా ఆశువుగా ఒక అభంగమును పాడెనట.

"నిజమైన ముని, యోగి విశుద్ధ మనస్కుడై లోకు లొనర్చిన అవమానమును క్షమించును. ప్రపంచమున పొగ లెగయుచు రోజు మంటలతో విజృంభించు అగ్ని, మౌని, నిత్యానందముతో కూడిన శీతల జలము. లోకులు మాటలను బాణములతో సాధుజనులకు అవమతి సల్పినను, యోగి అవి యన్నియు సలహాలవలె స్వీకరింపవలెను. ఈ విశ్వమంతయు బ్రహ్మపదార్థమను సూత్రముతో నేయబడిన వస్త్రము లోని పేలికలు - యోగివైన నీ విట్టి దిగులుపొందుట తగనిపని" అని

కొన్నిచోట్ల అస్పష్టమైన యోగపరిభాషా పదముల నుపయోగించుటచే ఆమె అభంగములు అర్థము చేసుకొనుటకు కష్టముగా నుండును. అయినను ఆమె కవిత్వము ఆత్మానుభవములకు దిక్ప్రదర్శకము.

ముక్తాబాయి జీవితమంతయు, సమాజముయొక్క అక్రమత్వము నకు, కాఠిన్యమునకు, సాంఘికానాచారములకు, దౌర్జన్యమునకు, కాపట్య మునకు గురి అయి అత్యంత విషాదకరమైన అనుభవములకు పాల్పడెను. అయినను కేవలము ఆమెయొక్క నిస్స్వార్థమైన దైవభక్తి, ఆధ్యాత్మి కానురక్తి మాత్రమే ఆమెను ఈ బాధలనుండి విముక్తురాలిగ నొనర్చి గమ్యస్థానమునకు నడిపించుకొని పోయెను. ఈ బాధానుభవము ఆమె కవిత్వపు వడపోతయందు గోచరించుటలో వింతయేమున్నది. జ్ఞానేశ్వరుడు నిర్యాణము పొందినవెనుక యెడ్లబాదు (Edlabad) లో భగవత్సంకీర్తన యందు మగ్నయైయున్న ముక్తాబాయికూడ పిడుగుపాటునకు గురి అయి మృతినందుటతో ఈ ఉజ్జ్వల జీవితము హఠాత్తుగ అంతమయ్యెను.

జ్ఞానేశ్వరుని కారణముగా చైతన్యముపొందిన సంస్కరణోద్యమము

మహోచ్ఛస్థానము నందుకొని జాతి కుల విచక్షణను ప్రోద్రోలి భక్తితత్త్వ మును పునరుద్ధరించెను. గొప్పవారు - పేదవారు, సవర్ణులు - అవర్ణులు నైన హిందువు లందరును ఒకేవిధముగ భాగవత ధర్మబోధవలన ఉపశాంతి నొందిరి. ఈ చైతన్యము ముఖ్యముగా కవిత్వము రూపొంది సంఘము నందలి అక్రమములను సంఘమున అణచివేయబడినట్టియు పేదలయొక్కయు బాధలను చిత్రించెను. అమాయికులు, విద్యావిహీనులూ అయినను పేద వారు తమపట్ల జరుపబడుచున్న అన్యాయమును గుర్తించినవారైరి. భాగ వత శాఖకు సంబంధించిన భక్తకవులు సాధించిన శాశ్వతమైన ఘనవిజయ మిది. కాని ఆనాటి సంఘమున వ్యాపించియున్న ప్రతి దురాచారమును, ఈ ప్రచారము సంస్కరింపలేదు. కొంత పరిమితియందు మాత్రమే సంఘ దురాచారములను నిర్మూలించెననుట సత్యేతరము కాజాలదు.

జనాబాయి :

జ్ఞానదేవ, నామదేవుల రచనలు సమకాలిక సమాజముపై ఒక చెఱగని ముద్రను విడిచెను. నామదేవుని కుటుంబమే కాక ఇంటి నౌకర్లు కూడా ఆయన బోధలచే ప్రభావితులైరనుటలో సందియములేదు. ఆ నౌకరులలో ఒకరైన జనాబాయి మహారాష్ట్ర సాహిత్యమున చెప్పదగిన స్థాయి నధిగమించెను. ఆమె రచనలు బహుజన పఠనయోగ్యములై ప్రస్తుతింపబడెను.

జనాబాయి : ఈమె డామా, కురుందు అను శూద్ర దంపతుల కుమార్తె. వీరు గోదావరీ తీరము నందలి గంగాఖేడ్ గ్రామ వాస్తవ్యులు. చిన్న తనముననే జనాబాయి నామదేవుని తండ్రి అయిన దామశెట్టి యింట పనికత్తెగా చేరెను. ఆమె యింటి పని చేసికొనుచునే భగవ త్కీర్తనలను పాడుకొను చుండెడిది. ఆమె భగవంతుడు తనకు ఆటల చెలి కాడనియు, సావాసగాడనియు, తన సహకారి యనియు, తలంచు చుండె డిది. భగవానుని, ఆమె తనకు తల్లి, ప్రవర్తకుడు, మంత్రి, ఆలోచన చెప్పు వాడు, రక్షకుడుగా భావించు చుండెడిది. ఆమె భగవంతునితో ఆడెడిది

తగవు లాడెడిది కూడ. ఆమె భావన యందు భగవంతుని వాస్తవ సాహచర్యము ననుభవించు చుండెడిది. పిండి విసరునపుడు భగవంతుడామెకు తోడ్పడెడు వాడనియు, ఒక నాడిట్లు జరుగు చుండగా పూజా సమయము సమీపించెననియు అప్పుడు భగవంతుడు తొందర తొందరగా ఆమెను విడిచి పెట్టి దేవాలయమునకు తిరిగి వెళ్లి పోయెననియు, ఆ తొందరలో జనాబాయి దగ్గరనున్న తన కొన్ని ఆభరణములను పెట్టుకొని వెళ్లుట మరచి పోయెననియు పూజారులు భగవంతుని విగ్రహముపై ఆ నగలు లేక పోవుట గమనించి వెదుక దొడంగిరనియు, అవి తరువాత జనాబాయి యింట దొరకెననియు, అంత నామె దొంగగా పరిగణింప బడుటయు, ఆమెకు ఉరిశిక్ష విధింపబడుటయు జరిగెను. ఈ అసత్యదోషారోపణము తనపై జరుగగనే ఆమె మిక్కిలి కోపగించి తన నిర్దోషిత్వమును ఋజువు పరచుటకై భగవంతునే రమ్మని సవాలు చేసెను. తరువాత ఒక మహాద్భుతము జరిగెను. ఆమెకు శూలారోపణముచేయు శిక్షకై తెప్పింపబడిన శూలము పుష్ప వృక్షముగా మారిపోయెను. న్యాయాధిపులు ఆ వింతను చూచి ఆమె యెడ భయ భ్రాంతులై జనాబాయి నిర్దోషి యని తీర్పు చెప్పిరి. నామదేవు ఆమెకు ఆధ్యాత్మిక గురువు, ఆచార్యుడునై యుండెను. ఆమె అభంగముల యందాతని ప్రభావము ప్రకాశన నగును. కాని ఆ యభంగముల యందు స్త్రీ సహజమైన సున్నితమగు దయ, స్త్రీలు మాత్రమే వ్యక్తము చేయగల్గిన కొన్ని సుకుమారానుభవములు, భావనలును కలవు. మధురమైన అభంగములయందలి ప్రముఖగుణము అద్వైతభక్తి సౌందర్యము. కాని ఆమె అభంగములయందు సమాజమునందలి అవినీతి అన్యాయము, అసమానత అనువానిపై ఆమెకుగల తీవ్రమగు నిరసన అంతర్ధ్వనిగా కన్పట్టును. దీనికి నిదర్శనమేమన నిమ్నజాతి భక్తుడైన చొక్కమేలాపై రచించిన అభంగములు. పురాణకథాప్రస్తావన చేయు టొకటి ఆమె అభంగముల విశిష్ట లక్షణము. కావుననే ఆమె అభంగము లీ నాటికిని భజన సంకీర్తనములలో బాగా పాడబడుచున్నవి.

బిడ్డ తల్లిని ప్రేమించునట్లు ఆమె భగవంతుని ప్రేమించెను. సుకుమారమైన భావుకత (భావోద్దీప్తి) కరుణ, జాలి. ఆమె కావ్యములను మఱింత మాధుర్యము కలవానినిగా నొనర్చెను. ఆమె భాష సులభమైనది. ముక్తాబాయి రచనల కంటె జనాబాయి రచనలు సంఖ్యలో అధికమైనవి. ఆమె యెప్పుడు మరణించెనో సరిగా తెలియదు. కాని ప్రాచీనమైన వ్రాత ప్రతులు ఆమె క్రీ. శ. 1350. శకసం 1272 లో మరణించెనని తెలుపుచున్నవి.

నామదేవు తల్లి గోనాబాయి, భార్యరాజాయి, అల్లే కుమార్తె కుమారుడు కుటుంబము వారందరును తమ తమ శక్తి మేరకు అభంగములను విరచించి యుండుటత్యాశ్చర్యకరమైన విషయము. కాని అవి చాలా కొద్దిగా నున్నవి. వానియందు సాహిత్య ధర్మము కూడా చాలా తక్కువగా నున్నది. సామాన్యముగా అవి యన్నియు పండరిపుర విఠల్ దేవుని సంకీర్తనలై యున్నవి.

ఇంతేకాక యింకా కొందరు మహిళా రచయిత్రుల రచనలకు కూడా నామదేవే ప్రధాన ప్రేరకుడుగా నుండుట గమనింప దగినది. గొప్ప భక్తుడైన చొక్కమేలా (Mahar Saint) భార్య సోయరాబాయి ఆతని సోదరి నిర్మల, మంగళవేధ ఆస్థాన గాయకుని కుమార్తె అయిన కాన్హోపాత్ర అను వార లితర రచయిత్రులు.

సాధుసత్తముడైన చొక్కామేలా మంగళవేధ నివాసి. ఆయన భార్య, సోదరి యిర్వురును అభంగములను రచించిరి. వాని యందు వారి సంఘము యొక్క బాధలు ప్రతిధ్వనించు చుండును. భాగవత శాఖవారి ఉపదేశములు ఆమెకు కేవల ప్రేరణాత్మకము లేకాక జీవితాశయముకూడనై యుండెను. నిర్మల యొక్క అభంగములు భాగవత శాఖవారి సామాన్య భక్తి సాంప్రదాయానుసారముగా ఐహిక జీవితము యొక్క అశాశ్వ తత్వమును ప్రకటించునవిగా నుండెను. ప్రఖ్యాత చరిత్ర కారుడైన కీ. శే, V. K. రాజ్వాడే అభిప్రాయమును బట్టి కాన్హో పాత్ర 1390 సంవత్సర

ప్రాంతము నందు జీవించెను. పండరీపురమునకు చేరువలో నున్న మంగళ వేధ యందు నివసించుచున్న రాజనర్తకియైన శ్యామ యొక్క కొమరిత కాన్హోపాత్ర మిక్కిలి సౌందర్యవతి. ఆమె అత్యంత సౌందర్యవతిగా ప్రసిద్ధి నొందుటయే గాక గొప్పగాయకురాలుగా, నర్తకిగాకూడ ప్రశంసింపబడెను. కాని ఒకప్పుడామె వర్కారీతెగ యాత్రీకులతో నేగి పండరీపురము నందలి విఠోబా దేవాలయమును సందర్శించుటతో ఆమెకు వైరాగ్యము కలిగి తన నర్తకి జీవితముపైనను, ఆమె జీవితము నందలి సుఖానుభవములపైనను రోత కల్గెను. అప్పటి నుండి ఆమెలో సంపూర్ణమైన మార్పు కలిగి విఠల్ దేవుని యెడ తీవ్రమైన భక్తికల దాయెను. ఆ దేవుని సేవల తోడను, ప్రార్థనల తోడను, ఆమె జీవిత శేషమును గడపెను.

కాన్హోపాత్ర తన అంత్యయాత్ర సందర్భమున విఠోబా సన్నిధిని ఆఖరుగా పాడిన అభంగము.

"ఓ విఠోబా నీవే నాకు చరమ శరణ్యముగా నెంచి నీ సన్నిధి కేతెంచితిని.

నేను, పాపిని, కడుపేదను, దుర్మార్గురాలను నాకు కులము లేదు; మర్యాద నెఱుగని మూఢురాలను.

నీ సాన్నిధ్యము నందుటకు నాకు ఎట్టి అర్హత లేకున్నను ఓ ప్రభూ, విఠోబా

ఈ కాన్హోపాత్ర నీ పదదాసి కావున నీ చరణ సన్నిధిని నాకొకింత శరణమిమ్ము."

కాని ఆమె సౌందర్యము బహుధా విశ్రుతమై దూర దూరములకు వ్యాపించి బీదరు ప్రభుని చెవులసోకెను. ఆ ప్రభువు ఆమెను తన ఆస్థానము నకు పిలువనంపెను. వచ్చుట కామె నిరాకరించినచో బలాత్కారమున తీసికొని రమ్మని ఆతడు ఆజ్ఞాపించెను. ఆమెకా కార్యమిష్టము లేకుండుటచే ఆయాపదనుండి రక్షింపుమని ఆమె సర్వశక్తిమంతుడైన భగవానుని ప్రార్థించెను. ఈ ప్రార్థనలు భక్తి పూర్ణములై కరుణామయములై

హృదయ విదారకములుగా నున్నవి. ప్రగాఢ భక్త్యావేశముతో ఆమె సమాధ్యవస్థ నొందెను. ఆ సమాధినుండి ఆమె తిరిగి జాగ్రదవస్థకు రాలేదు. అనితరలభ్యమైన ఆమె మృతియు, ఆమె యొక్క ప్రగాఢభక్తి గీతములును ప్రసిద్ధ యోగులలో ఆమెకు శాశ్వత స్థానమును కల్పించినవి.

జ్ఞానదేవ నామదేవుల నిర్యాణముతో మహారాష్ట్ర సాహిత్యము నందలి శోభా సమృద్ధమైన తరుణదశ ముగిసి పోయెను. అల్లకల్లోలముగా ఉప్పతిల్లిన సాంఘిక చైతన్య ప్రేరణచేపుట్టి ఉద్ధృతముగా ఉప్పొంగి ఉరకలు వేయు సాహిత్యమే ఈ కాలము యొక్క ప్రత్యేకత. భాగవత శాఖ వారి ఉపదేశములు అగ్రకులమువారైన మహాదాంబ మున్నగువారిని, నిమ్నజాతివారైన సోయరాబాయి, కాన్హోపాత్ర మున్నగు వారిని సమానముగా ఆకర్షించెను. ఈ భాగవత ధర్మము సమాజము నందు ప్రేళ్లు దన్నుకొని పోవుటయే కాక సమాజము యొక్క బాహ్యావ్యవస్థనే యథాశక్తినిలోగొనెను. జ్ఞానదేవుని నిర్యాణమునకుముందే మహ్మదీయాక్రమణము దక్షిణ భారతమును ఊపివైచెను. అల్లాద్దీన్ ఖిల్జీ, తుఘల్ వంటి ముస్లిము ప్రభువులు అప్పటికిని ఇంకా మిగిలిఉన్న కొద్దిపాటి యాదవ సామ్రాజ్య శక్తిని విచ్ఛేదన మొనర్చిరి. మహారాష్ట్రము యావత్తును ముస్లిము పరిపాలనా చ్ఛత్రము క్రిందకువచ్చెను. విజయనగర రాజ్యము పతనము కాగానే మహ్మదీయ పాలనా ప్రాభవము సంపూర్ణమయ్యెను. మహారాష్ట్ర భాష స్థానమునను, ఉన్నత వర్గముల యందును రాజభాషయైన ఉర్దూయే వ్యవహార భాష అయ్యెను. మరాఠి ప్రజల స్వతంత్ర సంస్కృతి ప్రతి పత్తులకీ పరపరిపాలన ఒక పెద్ద గొడ్డలి పెట్టయ్యెను. మహ్మదీయుల పరిపాలనయొక్క ఆరంభ దశయందే గొప్ప కఱవు వచ్చి వందలకొలది కుటుంబములను సమూల నాశన మొనర్చెను. ఈ కఱవు పండ్రెండేండ్లు కొనసాగుటతో మహారాష్ట్ర దేశము నందలి పల్లె ప్రాంతమంతయు నాశనమై పాడుపడి పోయెను. ముస్లిము ప్రభుత్వ ప్రభావము చేతను, ఆనాటి అస్థిర వ్యవస్థచేతను మహారాష్ట్ర దేశము నందలి సాంఘిక స్థితి మఱింత దిగజారెను.

అందువలన 14 వ శతాబ్దియు 15 వ శతాబ్దియొక్క ప్రారంభ దశయు మహారాష్ట్ర సాహిత్యమున అంధయుగమని చెప్పవచ్చును.

15వ శతాబ్ద్యంత్యకాలమునకు ఈ కలవు కాటకములనుండి ప్రజలు కోలుకొన్నట్లు కనబడిరి. బహామనీ రాజ్యము అయిదు స్వతంత్ర రాజ్యములుగా చీల్చబడెను. ప్రజలను తపింపజేయు దుష్టశక్తుల ప్రభావము అంతరింపదొడగెను. మహారాష్ట్రమునందలి శౌర్యధనులైన మోరే జాధభోన్సలే, గాడ్గేనింబాల్కర్, షిర్కే మున్నగు శూరజాతులు బహామనీ మహమ్మదీయ ప్రభువులకడ గణనీయమగు ప్రాబల్యమును సంపాదించిరి. సామాన్య హిందువునకు జీవితమునందు తీవ్రపరిస్థితి తగ్గి వెసులుబాటు ఏర్పడెను. ఆ సమయమున ఏకనాథునివంటి సంతపురుషులు తామొనరించిన రామాయణ, భాగవతాది పటిష్ఠ రచనములద్వారా సామాన్యమానవుని హృదయములలో ఆత్మగౌరవమును ఆత్మవిశ్వాసమును రేకెత్తింపజేసిరి. ఏది ఏమైనను స్త్రీలయెడ మాత్రము ఏమియు విశేషమగు మార్పులున్నట్లు కనబడదు. 16వ శతాబ్ద్యంతమువఱకు చెప్పదగిన స్త్రీ కవయిత్రులు కానరారు. ఆ కాలమున 'ఓవి' పాటలవంటివి కన్పట్టుచున్నను, ఆ పాటల కర్త లెవరో తెలియకున్నది యోగి సత్తములైన రామదాసువంటి మహత్తర శక్తికల వ్యవస్థాపకులు పూనుకొని మహమ్మదీయ పాలనయందలి అక్రమములకు వ్యతిరేకముగా ఆధ్యాత్మిక విప్లవమును లేవదీసిరి. అయితే ఏకనాథునివంటి వారల రచన విఫలము కాలేదు. తుకారామువంటి భక్త కవులు సామాన్యజనతయందు సాంఘిక రాజకీయ చైతన్యము కలుగునట్లు రచనలొనర్చిరి.

అట్టి విప్లవ సమయమున స్త్రీలు తమ పాత్రను నిర్వహించుటలో వెనుకబడలేదు. ఆనాటి రాజకీయ దిఙ్మండలమున ఎన్నటికిని మఱపురాని వివేకచాతుర్యములు, ధైర్య సాహసములుకల శివాజీప్రభుని తల్లియైన జిజియాబాయివంటి మహిళారత్నములు ఉదయించిరి.

బహినాబాయి :

పూర్వకాలమున యోగిసత్తముల శిష్యురాండ్రైయుండి సాహిత్య రంగమున తమ ఉత్తమ రచనలచే ప్రత్యేకస్థాన మలంకరించిన మహిళలవలె ఈ కాలమునందును భక్తతుకారాము, రామదాసుల శిష్యురాండ్రైన బహినాబాయి, వేనాబాయియు తమ రచనలచే ప్రఖ్యాతినొందిరి.

బహినాబాయి క్రీ.శ. 1628వ సంవత్సరమున వెరూల్ (ఎల్లోరా)కు సమీపమున నున్న దేవగ్రామమున ఒక కులకర్ణి కుటుంబమున జన్మించెను ఒక వయసుమళ్ళిన విధురునకు భార్య అయ్యెను. వివాహానంతరము ఆమెకు కష్టదినములు సంప్రాప్తమయ్యెను ఆ కుటుంబము గ్రామమునుండి వెళ్ళ గొట్టబడి కాలినడకను పండరిపురము చేరెను. అచట ఆమె విఠోభా భక్తురాలయ్యెను. ఆమె తుకారాం అభంగములనుకూడ అభ్యసించెను. అక్కడనుండి ఆ కుటుంబము కొల్హాపురమునకు వెళ్ళెను. అచట వారి కాతిథ్యమిచ్చిన ఒక బ్రాహ్మణకుటుంబముచే బహూకరింపబడిన, ఆవు, దూడ ఆమెకు ప్రీతిపాత్రములయ్యెను. ఆమెకు ఆ యావుదూడలయందుగల అతి ప్రేమను ప్రజలు గేలిసేయుటయే కాక ఆమెనుకూడ హింసించిరి. తరువాత ఆ దూడ చనిపోగా నాలుగురోజులామె స్మృతినిగోల్పోయెను. ఈ నిశ్చైతన్య స్థితియందు తుకారాము ఆమె స్వప్నమునం దగపడి ఆమెను ఓదార్చెను. తుకారాముయొక్క మహోదాత్త వాక్యము లామె జీవితమును మార్చివైచెను. ఆమె ఒక భక్తురాలాయెను. త్వరలో ఆమె భక్తి నలుదెసల వ్యాపించెను. దేశదేశములనుండి ఆమె దర్శనార్థమై జనులు రాదొడంగిరి. ఇది భర్తకు ఇష్టములేకపోయెను. అతడనేకవిధముల ఆమెను త్యజింతునని బెదరించెను.

ఇది యిట్లుండగా ఆమె భర్త వ్యాధిగ్రస్తుడయ్యెను. భక్తితో భర్తకు ఆమె ఉపచర్యలు చేసెను. అతడు మామూలుగా ఆరోగ్యమును పొందెను. అపు డాతనికి ఆమెపై ద్వేషము పోవుటతో తరువాత వారిరువురును కలిసి మహానుభావుడైన తుకారాము నివసించిన దేహూ

గ్రామమునకు వచ్చిరి. శూద్రుడైన తుకారామును గురువుగా స్వీకరించు టచే వారక్కడ చాలా బాధలు పడవలసివచ్చెను. ఒకనాడామె తపశ్చర్యకు పూనుకొనెను. మూడవ నాడామెకు తుకారాము కనబడి భక్తిగీతములు వ్రాయుమని ప్రబోధించెను.

బహినాబాయికి చిన్ననాటినుండియు దైవము నెడ భక్తిశ్రద్ధలు మెండు. బాల్యముననే ఆమెకు ప్రాపంచిక సౌఖ్యములయెడ భోగముల యెడ విహ్యాభావము కలిగెను. ఆమె జీవితము యొక్క అశాశ్వతత్వమును గూర్చియు, భగవత్ప్రార్థనాధ్యానముల యొక్క ప్రాధాన్యమునుగూర్చియు, అధ్యాత్మ తత్త్వము, భాగవతము ధర్మములనుగూర్చియు, జీవిత క్షణభంగు రత్వమును గూర్చియు అనేక అభంగములను రచించెను. ఆమె రచనయందు కొన్నిచోట్ల కూర్పు మోటుగా కన్పట్టును. కాని అర్థము చేసుకొనుటకు సులభముగానే యుండును. కొన్ని అభంగములలో ఆమె తన గత జన్మమునుగూర్చి పేర్కొనెను. ఆమె జీవితచరిత్ర ప్రస్తావన అభంగములు ఏబది కలవు. ఇట్టి అభంగ రచనయందు స్వీయానుభవ ప్రసక్తితో వ్రాసిన వారిలో ఈమెయే ప్రథమురాలు కావచ్చును. ఆమె యోగినియై కఠోర దీక్షతో నిస్సంగత్వమును నిర్వహించినను తన గృహకృత్యములయెడ ఎప్పుడును అశ్రద్ధ కనబఱుపలేదు. అంతేకాదు భగదారాధనకుగాని, భగవత్సంకీర్తనకుకాని ఆమెకు గృహకృత్య నిర్వహణ మెప్పుడు ఆటంకము కాలేదు. తనకు సంభవించిన కష్టముల నన్నింటిని ధైర్యముతో, స్థిర చిత్త ముతో ఎదుర్కొనెను. కడ కామె తన 72 వ ఏట క్రీ. శ. 1700 వ సం॥న మృతినొందెను.

## వేనాబాయి :

రామదాసు శిష్యురాలైన వేనాబాయి క్రీ. శ. 1627 వ సంవత్సర మున కొల్హాపురమున ఒక దేశపాండే కుటుంబమున జన్మించెను. ఆ కుటుంబమే రామభక్త కుటుంబము. బాల్యమునుండియు నామె కూడా శ్రీరామభక్తురాలాయెను. ఆనాడు స్త్రీలకు చదువుసంధ్యలు నిషిద్ధములై

యుండెను. కాని అదృష్టవశమున వేనాబాయి చదువుట వ్రాయుట నేర్చినది. వేనాబాయి బాలవితంతువు. ఒకా నొక సమయమున స్వామి రామదాసు భిక్షుకై ఆమెఉన్న యింటికి వచ్చెను. అచట ఏకనాథునిచే రచింపబడిన భాగవతమును చదువుచుండగా ఆమెను చూచి నీవు చదువు చున్న గ్రంథమునం దేమికలదో నీకు బాగుగా అర్థమగుచున్నదా ? అని యడిగెను. అర్థము చేసుకొనుటకు నేను యత్నించుచున్నానని ఆమె బదులిడెను. ఈ సంఘటన ఆమెను రామదాసస్వామి శిష్యురాలినొనర్చెను. ఆమె తరచు రామదాసస్వామి తత్త్వబోధలను వినుటకు ఆసక్తితో వెళ్లుచుండెడిది. కాని సంఘము అందులకు సమ్మతింపక ఆటంకపఱచెను. ఆమె సంఘ క్రోధాగ్నికి గురిఅయ్యెను. ఆ పనినుండి ఆమెను మరల్ప జాలక నిస్పృహులై ఆమె తలిదండ్రులు ఆమెకు విషముద్రాగింప యత్నించిరి. కాని ఆ క్లిష్ట సమయమున నొక వింతసంఘటన జరిగెను. అయితే హఠాత్తుగా జరిగిన రామదాసస్వామి అద్భుతదర్శనము ఆమెను కాపాడెను. ఇది జరిగినవెంటనే వేనాబాయి తన యింటిని, కుటుంబమును విడచి రామదాసస్వామి ఆశ్రమమునకు వెళ్ళిపోయెను. అచ్చట ఆమె మఱల చదువుకొనుట కారంభించి పురాణాదుల నన్నింటిని బాగుగా చదివెను. రామదాసస్వామి బోధలన్నింటిని శ్రద్ధతో ఆలించి వ్యాగ్రత మొనర్చుకొనెను. ఆశ్రమమునందలి శిష్యురాండ్రందరలో బోధించుటకు అర్హత ఆమె కొక్కతెకే లభించెను. రామదాసస్వామి ఆమె సామర్ధ్యమును చక్కగా తెలిసినవారై ఆమెను మీరటునందలి తన ఆశ్రమమునకు మహాం తుగా నొనర్చిరి. ఆమె తన ఉపదేశములలో పురాణాది సద్గ్రంథములకు వ్యాఖ్యాన మొనర్చి వివరించి చెప్పుచుండెడిది. ఆమె స్వయముగా కావ్య రచనకూడ ఒనర్చెను. రామదాసస్వామి శిష్యులలో ఆమె మహోన్నత స్థానము నలంకరించెను.

వేనాబాయి తాత్త్విక వివాదములో మిక్కిలి ప్రతిభావంతురాలు ఆమె అభంగములయందును చాలచోట్లలో ప్రజ్ఞాపూర్వక సంవాదములు

కన్పించును. సీతా స్వయంవర మామె కావ్యములలో గొప్పది. అందు రామచరితకు సంబంధించిన సంభాషణలు భగవత్స్తోత్రములు కలవు. ఇవియే కాక ఆమె కవితాశక్తికి దిక్ప్రదర్శకములగు కొన్ని భావగేయ ములు కూడ కలవు, సీతా స్వయంవర మామె నైపుణ్యమునకు నిదర్శనము. సీతాదేవి వివాహఘట్టము నందలి దృశ్యములను ఆమె కడు శోభాయ మానముగా వర్ణించెను. ఆమె కావించిన సీతారాముల యొక్కయు, జనకుని యొక్కయు, పాత్ర చిత్రణము మిక్కిలి స్పష్టమై భావుకత యందును, రచనా నిర్వహణమునందును ఆమెకుగల ఉపజ్ఞను సూచించును. అయినను ఆమె రచనలయందు రామదాసస్వామి రచన ప్రభావము కన్పించుచుండును. ఇందసహజత ఏమియు అత్యుక్తియును లేదు. ఆ రచన లలో ఒకదానియందు సఖ్యులు శ్రీరాముని కోరిన కోరికలను ఆమె వర్ణించెను. సమకాలిక సంఘటనలను నిశితదృష్టితో విమర్శించుట ఆమె ప్రత్యేక లక్షణము. 1678 వ సంవత్సరమున చైత్రమాసమున సాయం ప్రార్థనానంతరము దేవునకు నమస్కరించుచు తన గురువుగారి పాదసన్నిధిని ఆమె పరమపదించెను.

ప్రేమాబాయి, అంబాబాయి, బాయాబాయి, అవదాబాయి అను వారు కూడా కవయిత్రులే. వీరందరును భాగవతశాఖకు చెందినవారే. వేనాబాయి రచనలతో పోల్చి చూచినచో వీరి రచనలు సంఖ్యయందును, గుణమునందును వేనాబాయి రచనలకు తక్కువే. ప్రేమ్‌బాయి, బాయా బాయి రచించిన కొన్ని గేయములు చాలా చక్కగానున్నవి. వీరిరువురు హిందీలోకూడ రచించిరి.

ప్రాచీనకాలమునందలి కవయిత్రు లందరును ప్రసిద్ధ యోగుల యొక్క శిష్యురాండ్రే. వారందరును ఆ సిద్ధపురుషుల బోధలవలనను, వారి రచనలవలనను ప్రభావితురాండ్రైన వారే. ఈ కవయిత్రు లందరును ఆనాటి ప్రసిద్ధ సిద్ధపురుషులను, తమ గురువులుగా స్వీకరించినవారే. ఒక్క కాన్హోపాత్ర మాత్రము ఎవరికిని శిష్యురాలు కాదు. ఈ కవయిత్రు

లలో ఇద్దరు బాలవితంతువులు, ఇద్దరు జీవితాంతము అవివాహితు రాండ్రుగానే యుండిపోయిరి. కాన్హోపాత్ర ఒక్కతె ఆస్థాన నర్తకి కుమార్తె. బహినాబాయి యొక్కతె మాత్రమే వైవాహిక జీవితము గడపెను. తక్కినవారు బాలవితంతువులగుటచేతను, సామాన్య స్త్రీలకంటె వారి పరిస్థితులు భిన్నములగుటచేతను వారికి విద్యావకాశము లభించెను. ఇట్టివారికి తప్ప మామూలుగా ఆనాడు స్త్రీలకు విద్యావకాశములు నిరాకరింపబడెననియే చెప్పవచ్చును. కేవలము రాజకుమార్తెలు, గొప్పవారి బిడ్డలు మాత్రమే ప్రాథమికవిద్యను పొందుచుండిరి. కాని ఆనాడు స్త్రీ లందరును పురాణాది సద్గ్రంథములనుండి కథలనుమాత్రము చదువుచుండెడి వారు. లేదా వినుచుండెడివారు.

17, 18 శతాబ్దములలో నున్న రాజకుటుంబములకు చెందిన స్త్రీలు పరస్పరము వ్రాసికొన్న ఉత్తరములు కొన్ని లభించెను. లేఖా రచనమున గోపికాబాయి, ఆనందీబాయిపీష్వే, అహల్యాబాయిహోల్కార్, బాయాజా బాయి సిందే అను వారలు చాలా సుప్రసిద్ధురాండ్రు. వారు తమ ఉత్తరములయందు కనబఱచిన లౌకికజ్ఞానము, మానవస్వభావ విజ్ఞత, లౌక్యప్రతిభ, పరిశీలనాశక్తి, ధీరప్రవృత్తి మున్నగునవి అద్వితీయములు. ఇంతమాత్రమున నివి సాహిత్య స్థానము నొందజాలవు. కాని రచనావకాశ మున్నచో వీరుకూడ రచయిత్రులు కాగలరను నంశమును వీరి లేఖల యందలి సాహితీగుణములు సూచించును.

18 వ శతాబ్దాంతమున మహారాష్ట్ర పాలన క్షీణించెను. క్రమముగా పీష్వాల చేతినుండి నిజమైన అధికారము అంతరించి వారు నామ మాత్రాధి కారులై యున్నపుడు దాని ఫలితముగా అరాజకత్వమేర్పడుట సహజము. తూర్పు ఇండియా ప్రభుత్వము వేగియమానముగా తన రాచరికమును వ్యాప్తి పొందింప జేయుచుండెను. కొందరు ప్రముఖ మహారాష్ట్ర సరదారులు స్వలాభములకొఱకు, స్వప్రయోజనములకొఱకును కంపెనీ ప్రభుత్వ పక్షమున చేరుచుండిరి. రామదాసు తుకారాముల తర్వాత ఉన్న

మాటను పైకి గట్టిగా చెప్పగలిగినట్టియు, ధైర్యసాహసములు కలిగి నట్టియు, భక్తుల పరంపరనశించెను. వివిధశాఖల తత్వవేత్తలు యోగులును జనసామాన్యమునందు ఆధ్యాత్మిక ప్రచారము చేయుటయందు లక్ష్య ముంచక తమతమ పవిత్రాశ్రమ భూములయందే నిలిచిపోయిరి.

ఈ యుగమున వామనుడు, మోరోపంతు మున్నగు పండితకవు లుద్భవించిరి. వారు సామాన్య ప్రజానీకమునకు, పామర జనమునకును అర్థముకాని సంస్కృత పదములతోను, భావములతోను కూడినట్టియు సంస్కృత శైలి ననుకరించునట్టియు రచనలు గావించిరి. పామరజనము ప్రేమను, శౌర్యమును వెలిగ్రక్కు ఒక రచనా సాంప్రదాయము (లావణీ, సావడే) ను బయలుదేరదీసిరి.

పీష్వా పరిపాలనము క్రీ. శ. 1818 లో అంతమొందెను. మహారాష్ట్ర దేశము ఆంగ్లేయ హస్తగతమయ్యెను. తుదకు అరాజకస్థితి తొలగి ప్రశాంత పరిస్థితి సక్రమ వ్యవస్థయు నేర్పడెను. యువకులైనవారు ఆఫీసులలో తమ క్రింది ఉద్యోగులుగా పనిచేయుటకును, ఇంగ్లీషు తెలిసిన గుమాస్తాలుగా పనిచేయుటకును క్రొత్తగా వచ్చిన ఆంగ్లేయ ప్రభుత్వము విద్యావిధాన మును అమలులో పెట్టెను. 1820 లో బొంబాయిలో ఇంగ్లీషు పాఠశాల లను ప్రారంభించిరి. తరువాత క్రమముగా ఇటువంటి విద్యలేకున్న సుఖజీవనాది సౌకర్యములు కలుగనేరవను నభిప్రాయము సంఘమున బలపడజొచ్చెను. ఉన్నత వర్గములవారు ఈ పాఠశాలలకు ఎగబడజొచ్చిరి. ఇంత జరిగినను స్త్రీలకు విద్య అవసరము అను నంశమును మాత్రము ఎవ్వరును గ్రహింపలేదు. 1840 ప్రాంతములయందు ప్రప్రథమముగా లోకహితవాది దేశముఖ, బాబాపదంజీ, డాక్టర్ రామ్‌జీ, గాణోజీ అను వారలు స్త్రీలకు విద్య అవసరమని సంఘమున ప్రబోధము చేయనారం భించిరి. 1848 వ సంవత్సరమున మిష్టర్ జ్యోతిబాపూలే అను ప్రతిభా వంతుడైన యువ సంస్కర్త పూనాపట్టణమునందు ప్రప్రథమముగా బాలికలకు పాఠశాలను స్థాపించెను. అతనికి ఈ పవిత్ర కార్యమున నాతని

భార్య సావిత్రీబాయి పూర్తిగా తోడుపడెను. ఈ పని చేయుటవలన వారిరువురును సాంఘిక శిక్షనుండి తప్పించుకొనలేకపోయిరి. బడికివచ్చు బాలికలుకూడా సనాతన మూఢాచారముల బారికి గురికాక తప్పక పోయెను. పది పదకొండు సంవత్సరముల బాలికలకు పెండ్లియగుటతోడనే విద్యకు స్వస్తిచెప్పుట సాధారణముగా జరుగుచుండెను. చదువుట వ్రాయుట అనునవి బాలికలపట్ల రహస్యముగా అభ్యసింపవలసిన విషయములయ్యెను. తరువాత క్రమక్రమముగా బ్రాహ్మణ బాలికలు తమంతతామే సాహసించి పాఠశాలలకు పోనారంభించిరి. ఆ తరువాత ఇతర కులములవారుకూడా పాఠశాలలకుపోయి చదువుకొనుటకు సాహసింప దొడగిరి.

కాని సంఘమున విద్యావ్యాప్తినిగూర్చి ఆలోచించుచో సగటున విద్యాభ్యాసమునకు దోహదమొనర్చుటకంటె అణచివేయుటయే యెక్కువగా కన్పట్టుచుండెను. ప్రజ్ఞావంతులైన యోగుల శకము అంతమైనట్లే యెంచ వచ్చును. సంఘమున విద్యకు అవకాశములు లేకపోవుటచేతను, ప్రాచీన పరంపరకు చెందిన యోగులు, తత్త్వవేత్తలును లేకుండుట చేతను ఇటు ఈ రీతిగా విద్యనేర్చిన స్త్రీ సంఘమునుండికాని, అటు ఆశ్రమములయందలి సాధువులు, యోగుల సంఘములనుండికాని చెప్పదగిన మహా కవయిత్రి ఆవిర్భవింపలేదు. ఏమైనను ఆనాటి విద్యా కృషి పూర్తిగా నిష్ప్రయోజ నము కాలేదనియే చెప్పవలసి వచ్చును. ఆనాటి కొందరు స్త్రీలలో సాహిత్యాభిరతి కన్పడుటయు, వారు తమ భావములను పదములలోనికి మార్చుటకు ప్రయత్నించుటయు కన్పట్టెను.

అమెరికన్ మిషను బొంబాయిలో 1824 లో ఒక మహారాష్ట్రీ పాఠశాలను స్థాపించెను. ఈ మిషను పాఠశాల మూలమున స్త్రీలు మరాఠీని నేర్చుకొనుటయే కాక చిన్న చిన్న పాఠ్యపుస్తకములనుకూడ రచించిరి. నాసిక వాస్తవ్యులు ఫెర్రార్ సతియు, విల్సన్ సతియు బైబిలు నుండియు, కొందరు క్రిష్టియన్ యోగుల గ్రంథములనుండియు కొన్ని కొన్ని భాగములను మరాఠీలోని కనువదించిరి. ఆధునిక స్త్రీలలో వీరే ప్రథమ వచన రచయిత్రులని చెప్పవలసియున్నది.

సాలూబాయితాంబ్వేకర్ :

1860 వ సంవత్సర ప్రాంతమున ముక్తమాల, మంజుఘోష అను మహారాష్ట్రి కల్పనా కథానికా కావ్యములు మిక్కిలి ప్రచారమునొందెను. సాలూబాయితాంబ్వేకర్ అను నామె అద్భుత కథానికలను రచించెను. అవి సాహసకార్యములతో కూడిన కథలై మధ్యయుగ సాహిత్య లక్షణములకు చెందియుండెను.

పండిత రామాబాయి :

1848 లో పుట్టిన అనంతశాస్త్రిడాంగే ఆఖరి పీష్వాభార్యకు అధ్యాపకుడు. ఆయన కడపటి కుమార్తె పండిత రామాబాయి అను పేరున ప్రఖ్యాతి నొందెను. పీష్వా పూనాను విడిచిపెట్టవలసి వచ్చినపుడు డోంగ్రేశాస్త్రి ఉద్యోగముకూడా పోయెను. అపు డాయన తనభార్యయైన లక్ష్మీబాయికిని, కుమార్తెలైన కృష్ణాబాయి, రామాబాయి అను వారలకు సంస్కృతము నభ్యసింపజేసెను. స్త్రీలకు సంస్కృతము బోధించిన మహాపాపమునకు డోంగ్రేశాస్త్రి సంఘ బహిష్కృతి నొందెను. దానిచే అతడు తన స్వస్థానమును విడిచిపెట్టవలసిన వాడయ్యెను. ఆ సందర్భమున ఆయన తన కుటుంబముతో యాత్రార్థియై భారతదేశమునందలి పుణ్యస్థలముల నన్నింటిని పర్యటించెను. యాత్రలోకూడా రామాబాయి తన తలిదండ్రుల సహాయముతో తన విద్యాభ్యాసమును కొనసాగించెను. ఈ యాత్రలో కుటుంబమంతయు దుర్భర క్షామముపాలబడి రామాబాయి తల్లి, దండ్రి, అక్కగార్లు చనిపోయిరి. రామాబాయి పెద్దఅన్నగారు, రామాబాయి మాత్రము బ్రదికి బయటపడి 1878 లో కలకత్తా చేరిరి. అచట బాలికయైన రామాబాయి ఒక గుడి కేగెను. అచట ఆ గుడిలో చేరినవారందఱును ఆశ్చర్య చకితులగునట్లు సంస్కృతము బోధలుచేసెను. వెంటనే ఆమె పేరు ప్రతిష్ఠలు కలకత్తా నగరమంతయు వ్యాపించెను. ప్రవచన మొనర్చుటకు ఆమె నగరమున పలుతావుల కాహ్వానింపబడెను. రామాబాయికి సంస్కృత వాఙ్మయమున గల అర్హతను, జ్ఞానమును పరీక్షింపగల పండిత సంఘములు

సమావేశమైన సభలలోకూడ ఆమె ప్రసంగించెను. కలకత్తా విశ్వవిద్యాలయము ఆమెయెడ విశేషాదరము నెఱపి పండిత సరస్వతి అను బిరుదమిచ్చి చాలా ఘనముగా సత్కరించెను.

ఇది జరిగిన కొన్నినాళ్లకే ఆమెను ఏకాకినినిచేసి అన్న చనిపోయెను. అన్న మరణానంతర మామె అన్న స్నేహితుడైన బిపిన్‌బిహార్‌దాస్ అను నాయనను పెండ్లిచేసికొనెను. ఇది వర్ణాంతర వివాహము. ఈ వివాహము మఱల ఇంకొక సంఘ బహిష్కృతికి ఆమెను గురిచేసెను. పెండ్లి అయిన పందొమ్మిది నెలలకే భర్త బిపిన్‌బిహార్‌దాస్ చనిపోయెను. అంతట రామాబాయి తన ఏకక పుత్రిక మనోరమతో మహారాష్ట్రమునకు తిర్గివచ్చెను. ఇచట ఆమె ప్రచారదీక్షతో సంఘసేవ చేయుటకు తలపడి మహారాష్ట్ర దేశమంతయు పర్యటించి స్త్రీ విద్యావసరమును గుర్తింపజేయుటకై మిక్కిలి పాటుపడెను. అంతేకాక ఆ ఆశయ సాఫల్యమునకై ఆర్య మహిళాసమాజమును స్థాపించి ప్రచార మొనర్చెను. ఆమె తరువాత "శారదాసదన్" అను పేరిట ఒక వితంతు శరణాలయమునుకూడ స్థాపించెను. హంటర్ కమీషను ఎదుట రామాబాయి గొప్ప వాగ్ధోరణితో స్త్రీ విద్యావసరమును గూర్చి వాదించెను. ఆమె ఆ సమయమున యిచ్చిన వాఙ్మాలము మిక్కిలి ప్రశంసార్హమై ఆంగ్లములోని కనువదింపబడి విదేశములలో కూడ మెప్పును పొందెను. ఆమె తనంత తానే ఇంగ్లాండు దేశమునకు, అమెరికాకు వెళ్ళెను. ఆమె ఇంగ్లాండులో ఉండగా క్రీస్తు మతమును స్వీకరించెను.

పాశ్చాత్యులు స్త్రీ విద్యారంగమున సాధించిన అభ్యుదయమునకామె మిక్కిలి ఆకృష్టురాలై హిందూదేశమునందుకూడా అట్టి సంస్థను స్థాపించవలెనని ఆమె అపుడే నిశ్చయము చేసికొనెను. "ఉన్నత కులము నందలి స్త్రీలు" అను మకుటమున నొక పుస్తకమును రచించెను. దానిని అచ్చటి ప్రజలు అభిమానముతో ఆదరించిరి. ఆమెకు పదిసంవత్సరములు సహాయమొనర్చుటకై రామాబాయి అసోసియేషను అను నొక సంస్థ యేర్పడెను.

ఆమె భారతదేశమునకు తిరిగివచ్చిన వెనుక "ముక్తి సదన్" అను పేరున పూనాకు సుమారు 30 మైళ్ళ దూరమున కేజ్‌గామ్‌లో ఒక విద్యాసంస్థను స్థాపించెను. మొట్టమొదట ఇది ఖచ్చితముగా మతప్రబోధము లకు దూరముగా నుండెను కాని తర్వాత కొన్నినాళ్ళకు క్రీస్తు మత ప్రబోధము క్రీస్తు మత వ్యాపకత్వములను కార్యక్రమములను ఈ సంస్థ చేకొనెను. ఈ సమయమున గొప్ప కాటకమేర్పడి మధ్యప్రదేశ్‌ను కబళింపజొచ్చెను. రామాబాయి అచటకేగి తన సదనమున వారి కాశ్రయ మిచ్చెదనని చెప్పి వారిని రక్షించెను. ఆమె ఈ పవిత్ర సేవాకార్యమున కందరును హర్షామోదముల నొందిరి. తుదకీ ధీరవనిత తన 74వ ఏట 1922 వ సంవత్సరమున మరణించెను.

రామాబాయి తన విదేశపర్యటన సందర్భమున మతమునుగూర్చియు, నీతిని గూర్చియు గ్రంథములను రచించెను. ఆమె బైబిలును మరాఠీలోని కనువదించెను. స్త్రీలయొక్క విధినిర్వహణముపై ఆమె చక్కగా వ్యాఖ్యా నించెను (విమర్శించెను). ఆమె స్త్రీల గృహ సాంఘిక మత విషయిక స్థితి గతులను నిశితముగా పరిశోధించెను (పరీక్షించెను) ఇంగ్లాండు, అమెరికా దేశముల యందలి పరిపాలనాయంత్రాంగమును, ఇండియా పరిపాలనా విధానముతో చక్కగాపోల్చి వివరించెను. ఆమె తాను రచించిన "అగ్రవర్ణ స్త్రీలు"అను గ్రంథమున ఆమె హైందవస్త్రీల "Trials and tributions" దుస్థితిని, ప్రయత్నములను బాగుగా వివరించుటయే కాక తన అభి ప్రాయములను ధైర్యముగా వెలిబుచ్చెను. ఈ గ్రంథము ఆమెకు గల పరిశీలనాశక్తిని, ఆంగ్లభాషయందు ఆమెకుగల ప్రావీణ్యమును ఉద్ఘా టించును. "బాలోద్యాన్" అను గ్రంథమునందు అమెరికాలోని శిశు విద్యాసంస్థలనుగూర్చి పేర్కొనెను.

ఆనందీబాయిజోషీ :

రామాబాయి సమకాలికురాలు. ఆమె పుస్తకములేమియు వ్రాయ లేదు. కాని ఆమె తన భర్తకును ఇతర బంధువులకును, ఆమె అమెరికా

పినతల్లి (Aunt) మిసెస్ కార్పెన్టర్ సతికిని వ్రాసిన జాబులు ప్రసిద్ధములు. ఈ ఉత్తరములు అనేక విషయములపై ఆమెకుగల అభిప్రాయములను వెలువరించుచున్నవి. ఆ ఉత్తరములయందు నిస్సందేహముగా చక్కని సాహిత్యాంశ కలదు. అందు ఆమె తన భావములను నిష్కర్షగా వెలిబుచ్చెను. చక్కని మానవ స్వభావజ్ఞతయు నందు కాననగును. అవి దేశ భక్తిపూర్ణములై దేశమునకు సంఘమునకు ప్రజలు చేయవలసిన సేవకు శంఖారావములై ఉన్నవి. డా॥ ఆనందీబాయి సాంఘిక సమస్యలను ఉన్నత స్థాయిలో పరిష్కరింపగలదు. అంతేకాక ఈ ఉత్తరములు కొన్ని పద్యములతోను, కొన్ని వ్యాసములతోను నిండియుండి ఆమె యుపజ్ఞా స్ఫోరకములై యున్నవి.

ఆనందీబాయిజోషీ 1865 లో జన్మించెను. 12 వ ఏట ఆమె పోష్టలు డిపార్టుమెంటులో పనిచేయుచున్న గోపాలరావుజోషీని పెండ్లాడెను. గోపాలరావుజోషి ఆనందీబాయి తప్పక విద్యావతి కావలెనని పట్టుబట్టి, భార్య విద్యాభ్యాసమునకు శక్తివంచనలేకుండా తనకు చేతనైన ఏర్పాట్లన్నియు చేసెను. మిక్కిలి పిన్నవయస్కురాలైన తన భార్యను ఆనందీబాయిని అమెరికాలో వైద్యవిద్యయందు ఉన్నత విద్యాభ్యాసము నిమిత్తము అమెరికాకు పంపెను. గోపాలరావుజోషీ పక్షముగా చూచినను, అంత పిన్నవయస్సుననే అంత దూరముననున్న అపరిచిత దేశమునకు ఒంటరిగా పయనమై వెళ్ళుటకు అంగీకరించిన ఆనందీబాయి పక్షముగా ఆలోచించినను ఇది నిజముగా గొప్ప సాహసకార్యము. ఎన్ని కష్టములు పడినప్పటికిని ఆమె అచటికి వెళ్ళి తన చదువు పూర్తిచేసుకొనగల్గినది. పరీక్షలో కృతార్థురాలై M. D. (డిగ్రీ) పట్టము తీసుకొనగల్గినది. ఈ కృషి సాఫల్యముకొరకు ఆమె అచట చాలా అసౌకర్యములపాలై కష్టపడవలసి వచ్చెను. ఈ సంకటము లామె ఆరోగ్యమును పాడుచేసెను. భారతదేశమునకు తిరిగివచ్చిన తర్వాత ఆమెకు క్షయవ్యాధి సంక్రమించి తన ఇరువది రెండవయేట 1887 లో మృత్యుదేవతా కరాళహస్తముల పాలబడెను.

కాశీబాయి కనిత్కర్ సతి. డా॥ ఆనందీబాయిజోషీ జీవితమును ఒక గ్రంథముగా రచించెను. కనిత్కర్ సతి 19వ శతాబ్దపు ప్రముఖ రచయిత్రి. ఈమె 1861 లో జన్మించెను. గోవింద వాసుదేవకనిత్‌కర్‌ను పెండ్లాడెను. కనిత్‌కర్ ఒక రచయిత, కవి, సంఘ సంస్కర్త. కాశీబాయి సతి దీక్షాశీలియగు తన భర్త యొసగు సంతత ప్రోత్సాహ ప్రబోధముల నందుకొని పట్టుదలతో ముందంజవేసెను. ప్రసిద్ధ నవలా రచయిత హరినారాయణ్ ఆప్టేకూడా ఈమెకు తగు ప్రోత్సాహమిచ్చెను. వారు తమ శైలియందును, భావమునందును, రచనయందును, ఒకరి ప్రభావ మింకొకరిపై ప్రసరించునట్లు అందమగు భాషలో ఉత్తర ప్రత్యుత్తరము లను నడపుకొనిరి.

నూతనమైన పాశ్చాత్య విద్యా విధాన మేతెంచుటతోడనే మహారాష్ట్రమునందలి మేధావు లందఱును, మత సాంఘిక సంస్కరణముల పట్ల పర్వడిన తత్‌క్షణావశ్యకతను గుర్తించి ఆ సంస్కరణముల పట్ల శ్రద్ధ వహించిరి. చిప్లుంకర్, రానడే, ఆగర్‌కర్, గోఖలే, తిలక్, మున్నగు మహా నాయకులందరును జాతీయాభిమానము తోడను. దేశభక్తి తీవ్రత తోడను ఆనాటి వాతావరణమును ఉత్తేజ పరచిరి. సాహిత్యక్షేత్రమున కూడ మత సాంఘికాచారము యందలి అన్యాయములపై అక్రమములపై తిరుగుబాటు దృక్పథము వెల్లి విరిసెను. లేటు H. N. ఆప్టే తన నవలల యందు ఈ సాంఘిక దురంతములపై ఒకమాఱు విరుచుకొని పడెను. H. N. ఆప్టే కర్మణుక్ అను మాసపత్రికా సంపాదకుడు వ్యవస్థాపకుడు కూడ. కణితికర్ సతి ఈ పత్రికకు, మనోరంజన్ నిబంధ చంద్రిక అను నితర పత్రికల (Periodicals) కు Thought Porvoking భావోద్దీప్తి కల్గించు వ్యాసములను వ్రాసిపంపెడిది. ఇందు చాలా వ్యాసములు సాంఘిక సమస్యలతో దేశభక్తితో కూడినవి. ఇవి యన్నియు 1900 లో గ్రంథరూపముగా వెలువరింపబడెను. కణిత్‌కర్ సతి వ్రాసిన మొదటి నవల రంగారావు. ఇది 1892 లో 'మనోరంజన్' పత్రికలో ధారావాహిక

నవలగా ప్రచురింపబడెను. ఇందలి పాత్రచిత్రణను శ్రీ ఆప్టే మిక్కిలి ప్రశం సించెను. "పళ్కిచా గోండా" అనునది కనిత్కర్ సతి వ్రాసిన ఇంకొక నవల. ఇదిమిష్టర్ ఆప్టేశైలిని జ్ఞాపకమునకు తెచ్చును. ఈ నవలయందలి పాత్ర చిత్రణము పతితల మనస్సును హత్తుకొను నదియై విశదమైన వర్ణనలతో నిండియుండును.

డా॥ ఆనందీబాయి జీవిత చరిత్ర అను నింకొక గ్రంథము కనిత్ కర్ సతి రచనలలో ప్రముఖమైనది. ఈ గ్రంథరచన సందర్భమున విషయ సేకరణకును, చక్కని కూర్పునకును కనిత్కర్ సతి చాలా శ్రమింపవలసి వచ్చెను. ఇందు డా॥ ఆనందీబాయి జోషి లేఖల నుండి వస్తువు ధారాళ ముగా గ్రహింపబడెను.

ఈ జీవిత చరిత్ర వలన పురోగామి తత్త్వము కల్గిన విద్యాధికురాలి అకుంఠిత విద్యాపిపాస, హక్కులకై పోరాడు తీవ్రాభిరతి, విజయ సాధన యందు గల దీక్ష ద్యోతకమగును.

కనిత్కర్ సతి 1948 లో చనిపోయెను. ఈ యుగమున గద్యము, పద్యము, నవల, వ్యాసములు, కథలు, జీవిత చరిత్ర అను వివిధ సాహిత్య ప్రక్రియల యందు కృషిచేసిన ప్రథమ మహిళ యీమె.

ఇరువదియవ శతాబ్ది వఱకు దిగ్విజయముగా సాహిత్య కృషి జరిపిన మహారాష్ట్ర రచయిత్రుల చరిత్ర ముగియవచ్చినది. ఈ మహనీయ చరిత్ర 12వ శతాబ్ది యందలి మహదాంబతో మొదలిడి ఆధునిక యుగమైన ఇరువదియవ శతాబ్దము వఱకు సాగినది. వర్తమాన యుగమున రచ యిత్రులు ఆధునికమైన ఏ సాహిత్యశాఖ యందైనను రచనము నొనర్చు టయే కాక ఉన్నత ప్రమాణములను కూడ నెలకొల్పిరి. రచనలో నేటి మహిళల భావుకత, దృక్పథము రెండును సువిశాలములై సమున్నతములై గంభీరములై పరిఢవిల్లినవి. కమలాబాయి దేశపాండె, మాలతీబాయి చెడేకర్, ఇరావతీ కార్వే, ముక్తాబాయి దీక్షిత్, కుసుమావతీ దేశపాండే శాంతాబాయి నాసికకర్, దుర్గాబాయి భగవత్, ఇందిరాశాంత్, గీతాసానే, మున్నగువారు నేటి సాహిత్యాంబరమున వెలుగు జ్యోతిర్మయ తారలు.

ఇంగ్లండు నుండి హిందూదేశమునకు తరలి వచ్చిన I. C. S ఉద్యోగులు తమకు వంగభాష రానందువలన దేశపరిపాలన నడుపులో పెట్టుటలో చాలా కష్టతరమైన బాధ్యతలను ఎదుర్కొన వలసి వచ్చెడిది. ఈస్టిండియా కంపెనీ, వారి కాలమున చాలా మంది విదేశీ వర్తకులు హుగ్లీనదిపై నున్న సుతనుతి (Sutanuty) రేవు పట్టణమున స్థిరపడిరి. కావున అప్పటి నుండియు క్రమముగా కలకత్తా ఒక ప్రముఖ ప్రదేశముగా అభివృద్ధిగాంచినది. మఱియు ఆ చుట్టు ప్రక్కలనున్న పట్టణము లన్నియు ప్రాధాన్యము పొందినవి.

ప్లాసీ యుద్ధానంతరము 1757 సం॥ లో మీర్జాఫర్ను నామ మాత్రపు రాజుగా నుంచి క్లైవు ప్రభువు దేశమును చాలా యుక్తితో పరిపాలించెను. ఈస్టిండియా కంపెనీ సంస్థల ముసుగుమాటుననే దురాక్రమణ పరుడైన మీర్ జాఫర్ను అత్యంత చాకచక్యముగను నేర్పుగను. పట్టియుంచ గల్గెను. కావున పర్షియను భాషయే ఆనాడు రాజభాషగా నుండెను. అందువలన ప్రజలు కూడ పర్షియను భాషనే తప్పక నేర్చుకొన వలసి వచ్చెను. ఆంగ్లభాష; దేశమున విస్తృతముగా ప్రవేశ పెట్టబడినప్పటికిని పర్షియను భాషను మాత్రము ప్రముఖవ్యక్తులు విశేష శ్రద్ధతో అభివృద్ధి గావించుకొనిరి. వంగభాషలో అత్యధికముగా పర్షియన్ పదములు ఇప్పటికినీ కన్పించుట కిదియే కారణము.

వారన్ హేస్టింగ్స్ రాకతో రాష్ట్ర పరిస్థితులు మారినవి. ఆతడు పరిపాలనా దక్షతతో బాటు పాండిత్యము నందు కూడా ప్రతిభావంతుడై యుండెను. 1773 లో జరిగిన రెగ్యులేటింగు చట్టము ననుసరించి హేస్టింగ్సు వంగదేశపు ప్రప్రథమ గవర్నరు జనరలుగా నియమితుడాయెను. 1774 సం॥ లో కలకత్తాలో సుప్రీంకోర్టు స్థాపింపబడెను. అప్పటి నుండి పర్షియను భాష క్షీణదశలోనికి వచ్చుటయు, ఆంగ్లభాష ప్రాబల్యమును పొందుటయు రెండును ఒక్కమారే జరిగినవి. దీనికి ఫలితముగా వంగ భాషకు ఆంగ్లభాషతో ప్రత్యక్షమగు సంబంధము కలిగినది. మరియు వంగ

భాషపై గల్గిన ఆంగ్ల భాషా ప్రభావము మనకు బాగుగా కన్పింప సాగినది. రామమోహనరాయ్ జన్మించు సమయమునకు ఆంగ్లభాష అప్పు డప్పుడే దేశ సరిహద్దులలో పాదుకొను చుండెను. రామమోహనుడు వంగీయుల మాతృభాష నీచ స్థితిలోకి దిగజారి పోవుటను గమనించెను. వంగభాష రెండు ప్రత్యేకమైన రూపములతో నుండెను. సామాన్య ప్రజలు తమదైనందిన జీవితములో ఉపయోగించు వ్యావహారిక భాష యొకటి సంస్కృతము నుండి యధాతధమైన అనుకరణము కల్గినట్టిభాష రెండవది.

విలియమ్‌కారే, జాన్ మార్ష్‌మన్ మొదలగు క్రైస్తవ మతా చార్యులు ముద్రణ యంత్రముల మూలమున వంగభాషా వాఙ్మయమును అందఱకును అందుబాటులో నుండునట్లు తీసికొని వచ్చుటకై విశేష శ్రద్ధను చూపిరి ఆ సమయముననే 1880 సం॥ లో కలకత్తాలో ఫోర్ట్‌విలి యమ్ కళాశాల నెలకొల్పబడెను. ఏమైనను ఆ సంస్థ వంగీయుల ఉద్ధరణకం తగా ఉపయోగపడలేదు. నిజమునకు ఆ సంస్థ వెలస్లీ ప్రభువు కాలము నాటి ఆంగ్లోద్యోగులకు, వారు ఆ దేశ ప్రజల మనస్సులను, ఆచార వ్యవ హారములను ఆ భాషా వాఙ్మయమును, సాహిత్యమును అర్థము చేసికొను టకు మాత్రమే ఉద్దేశింప బడినది. అచట వంగభాష ఇతర గ్రామీణభాష లతో బాటు నేర్పబడు చుండెడిది. డాక్టరు విలియమ్ కార్ సంస్కృత, వంగ భాషలకు ఆచార్యుడు. ఈ ఉద్యమ నిర్వహణమున ఆతడు తనకు తోడ్పడుటకై కొంతమంది సహాయకులను నియమించు కొనెను. పండిత మృత్యుంజయ విద్యాలంకార్, రామ్ రామ్ బోస్ అనువారు అట్టి వారిలో కలరు. ఫోర్ట్ విలియమ్ కళాశాల ఆవరణములో వంగభాష ఈ విధముగా పునరుద్ధరింప బడినది. విలియం కార్వే శ్రీరామపురము నందలి ముద్రణశాలకును, అచ్చటి బాప్టిస్టు మిషనునకును వ్యవస్థాపకుడు బెంగాలీ భాషలోనికి తమ పవిత్ర గ్రంథమగు బైబిలును అనువాదము చేయుటతో వారు మొట్ట మొదటగా వారి ఉద్యమమును ప్రారంభించిరి. మిషనరీలు కరపత్రముల ద్వారా, వంగ భాషలోనికి తర్జుమా చేయబడిన

బైబిలు ద్వారా మఱి యితర గ్రంథములద్వారా తమ క్రైస్తవ మతమును రాష్ట్రములో వ్యాప్తి చేయుటకు ప్రయత్నించిరి. ఏసు క్రీస్తును గూర్చిన కీర్తనలను కూర్చుట ద్వారా రామ్ రామ్ బోస్ ఈ ఉద్యమమునకు తోడ్పడెను.

అట్టి సమయముననే నూతనముగా వికాసమునకు వచ్చిన వంగ దేశమునకు పితృ సమానుడును, వంగదేశపునరుద్ధారకుడును అయిన రామ మోహనరాయ్ రంగమున ప్రవేశించి క్రైస్తవ మిషనరీల బారినుండి హిందూమతమును రక్షించుటకు బద్ధకంకణు డయ్యెను. అజ్ఞానము, మూఢ విశ్వాసముల నుండి హిందూమతమును రక్షించుట కతడు పూను కొనెను. అందుకొఱకై అతడు ప్రాచీన శాస్త్రములనుండి అనేక తార్కాణములను, వాదములను వెలికి తీసి హిందూమతమును బాగుగా సంస్కరించెను.

ఇట్టి మత సంస్కరణమునకై ఆయన కొన్ని గ్రంథములు వ్రాయ వలసివచ్చెను. మొట్టమొదట ఆతడు పర్షియను భాషలో గ్రంథ రచన గావించెను. తర్వాత ఆంగ్ల వంగ భాషలలో రచనలు చేసెను. ఈ విధముగా వ్రాసిన వంగభాషా గ్రంథములు పవిత్రమైన, సుందరమైన వంగ శైలికి సోపానముల వంటివి. ఆ తరుణముననే పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు రంగమున ప్రవేశించెను. ఆతని గ్రంథములు వంగ భాషా సామ్రాజ్యమున నొక నూతన శకమును సృష్టించెను.

కావున అప్పటి నుండియు ఇప్పటి వఱకును ప్రముఖ రచయితలచేత సంస్కృతీకరింపబడిన వంగభాషా సాహిత్యము మనకు లభించుచున్నది.

క్రైస్తవమత ప్రచారకులు స్త్రీ విద్యా విషయమై కూడ బహు శ్రద్ధాసక్తులను కనబఱచిరి. క్రైస్తవమత బోధ ప్రచారములే దీని వెనుక నిగూఢమైయున్న ఆదర్శములు. అయినప్పటికిని ఈ ఉద్యమము స్త్రీ విద్యకొక ఉద్వేగమును గల్గించినది.

1819 స॥ నుండి మిషనరీలు బాలికా పాఠశాలలను స్థాపించుటలో

శ్రద్ధ వహించిరి. రాధాకాంతదేవు, వైద్యనాథరాయ్ మున్నగువారు ఈ విషయమై వారికి చాలా సహాయము చేసిరి. పండిత ఈశ్వరచంద్ర విద్యా సాగరుని కాలమునుండి స్త్రీ విద్యా విషయమున నూతనమైన ఆధునిక విధానములు ప్రవేశపెట్టబడినవి.

అట్టి వాతావరణమున స్త్రీలు విద్యావేత్తలుగానే గాక రచయిత్రులుగ కూడ వర్ధిల్లిరి. మార్తా, సౌదామనీసిన్హా వంటి స్త్రీలు కొందరు ఇట్టి మిషనరీ ఉద్యమము మూలమున వర్ధిల్లిరని మనకు తెలిసిన విషయమే.

సంస్కృత సాహిత్యమునందు కూడ పరిణతిచెందిన విద్యావేత్తలు కొద్దిమంది ఆ రోజులలో కలరు. హాథీ విద్యాలంకార్ అట్టివారిలో ఒకరు. ఆతడు పండితుడే కాక, గొప్ప సాహితీవేత్తగా కూడ పేర్గాంచెను.

సాహిత్యము వ్రాత పూర్వకముగా ప్రచారమునకు రాకముందే చాలామంది రచయిత్రులు వంగ రాష్ట్రమున ప్రసిద్ధికెక్కిరి. కాని వారి వాఙ్మయము అనుశ్రుతముగా తరతరములవారు పాడుకొనుటకు వీలైన పాటల రూపముగను గేయరూపకముగను ఉండెడిది. 16 లేక 17 శతాబ్దముల చివరనున్న చంద్రావతి అట్టి వారిలో నొక కవయిత్రి ఆమె 'రామాయణము' ఇప్పటికిని సాహిత్య ప్రపంచమున నొక విశిష్ట స్థానమును పొందినది. కాని దురదృష్టవశాత్తు అందలి పాటలు చాలావఱకు నష్టమైనవి. ఆ కావ్యము శ్రవణానందకరముగను, మనోహరముగను ఉండును. సీతాదేవి యొక్క వనవాసము వఱకు శ్రీరామచంద్రుని చరిత్ర ఇందు అత్యంత మనోహరముగా ఈ వంగ కవయిత్రిచే కూర్చబడి గానము చేయబడినది.

వంగ సాహిత్యము ముద్రణాపరమైన నూతన రూపమును సంతరించుకొనిన తర్వాత రచయితలకు ఒక పెద్ద కార్యభారము నెదుర్కొనవలసి వచ్చెను. వారు భాష నభివృద్ధిచేయుటకై నూతన పదసృష్టి చేయవలెను. అదే సమయమున నూతన భావనా సృష్టి కూడ జరుగవలసి యుండెను. ఇంతేగాక వారికి భాషా విషయకముగా నూతన రూపములను తంత్రములను సాధింపవలసి వచ్చెను. ఒకప్రక్క రామమోహనరాయ్,

పండిత ఈశ్వరచంద్ర మున్నగువారి కృషి మూలమున వచన రచనాభివృద్ధి తగినంతగా జరుగుచుండగా, రెండవప్రక్క భారతచంద్ర (18 వ శతాబ్దమున కృష్ణనగర్ మహారాజైన కృష్ణచంద్రుని ఆస్థానకవి) ఈశ్వరచంద్ర గుప్త అనువారు వంగదేశమునకు అభిమానపాత్రులైన కవులుగా ప్రసిద్ధి గాంచిరి. ఈశ్వరచంద్ర పండితుడు, రామమోహనరాయల ప్రోద్బలమున వచనము అభివృద్ధి గాంచుచునే యుండెను.

ఇది ఇట్లుండగా 1824 లో వంగదేశమున ఒక గొప్ప సారస్వతవేత్తయైన మైకేలు మధుసూదనదత్తు యొక్క మహోదయమయ్యెను. విశ్వజనీన భావవ్యాప్తికి రాష్ట్రభాష నొక ఉపకరణముగా ఉపయోగించుకొనిన మహామహుడీతడు. అతడు క్రొత్త ప్రయోగములను, క్రొత్త పారిభాషిక పదములను, శబ్దజాలమునకు పుట్టినిల్లైన సంస్కృతము నుండి రూపొందించుకొని వంగ భాషలో ప్రవేశపెట్టెను. ఆతడు గొప్ప గొప్ప పాశ్చాత్య పురాణములయొక్కయు, శాస్త్రీయ సాహిత్యముల యొక్కయు శైలిని అనుకరించెను. ఈ కృషి ఫలితముగా వంగభాష తన శైశవ స్థితిని దాటినది. సంకుచిత మనస్తత్వములు విశాలములైనవి. మరియు వంగభాష బహుధా విస్తృతమైనది.

వచన రచనలో వైజ్ఞానిక సంబంధమైన అభివృద్ధికి బకిమ్‌చంద్ర ఛటర్జీ (1828-1893) అనునాతడు సూత్రధారుడు.

ఆ తర్వాత రవీంద్రుని రంగ ప్రవేశము జరిగెను. రవీంద్రనాథుడు తాత్వికుడును, కవియును, దీర్ఘదర్శియే గాక సర్వోత్తమ గుణములు మూర్తీభవించిన మహామేధావి. 1913 లో ఆతడు నోబుల్ బహుమతి గ్రుహీత యగుటతోడనే వంగభాషా సాహిత్యములు విశ్వవిఖ్యాతి గాంచినవి.

19 శతాబ్దాంతమున స్త్రీ విద్యా ఉద్యమమున, నూతన శకము ప్రారంభమయ్యెను. స్త్రీలకు పాఠశాలయందును, కళాశాలలయందును విద్య నేర్పబడుచుండెను. ఇండ్లవద్ద కూడ అన్ని రకముల విద్యలను అభ్య

సింప మొదలిడిరి. అట్లే సాహిత్యము కూడ అభివృద్ధి చెందెను. కొంతమంది స్త్రీలు సాహిత్యాభివృద్ధికై తమ జీవితముల నర్పణము చేసిరి. అప్పటి నుండి ప్రముఖులైన స్త్రీ రచయిత్రులు వంగదేశమున వర్థిల్లిరి.

**కృష్ణకామినీదాసి :**

19 వ శకమునాటి ప్రముఖుల కృషి ఫలితముగా అభివృద్ధి చెందిన స్త్రీ విద్య ఈ విధమైన క్రొత్త ఉరవడిని పొందిన తర్వాత కృష్ణకామినీ దాసి అను కవయిత్రి 1856 లో చిత్తవిలాసిని (The delighter of Heart) అనునొక కావ్యరాజమును, సారస్వత ప్రపంచమున సృష్టించి సారస్వత చరిత్రలో నొక నూతన సోపానమును కల్పించెను. ఒక మహిళ రచయిత్రిగా దేశమున పేరు పొందుట కదియే ప్రప్రథమ ప్రయత్నము. ఈ తొట్టతొలి ప్రయత్నము ప్రతియొక్కరిచేతను ప్రస్తుతింపబడినది. తొలి కావ్యమైనను కవయిత్రి రచనలో చాలా స్వేచ్ఛను కనబఱచినది. అందలి కొన్ని వాక్యములీ క్రింద ఉదాహరించుచున్నాను.

"ఈ చీకటి రాత్రి యందొంటరిగ చరించు నీవు ఎవ్వరిదానవు ? నీవు పసిదానవు.

నీకు సైదో డెవ్వరును లేరు. అయినను నీవు ఉల్లాసముగనే ఉన్నావు. ఓ సుందరీ నీ పేరేమి ? నీ తలిదండ్రు లెవరు ? మంత్రకత్తెవా ? అచ్చరవా ? దేవతవా చెప్పుము.

ఈ ప్రశ్నలకు ఆ సుందరి ఇడిన సమాధానము, చాలా సరళము గను, ఆహ్లాదకరముగను నున్నది. పరపురుషునితో తాను సంభాషించలేనని ఆమె ఆతనితో చాలా తీవ్రముగ చెప్పినప్పటికిని, ఆమె సంభాషణ పరిస్థితి చాలా సరళముగ నున్నది. 1861 లో "వామసుందరీ దేవి" మూఢా చారముల తొలగించుటనుగూర్చి ఒక చిన్న పుస్తకమును వ్రాసి ప్రచు రించెను. అదే సంవత్సరమున 'హరకుమారీదేవి' అను నామె "విద్యా దరిద్రదళని కావ్య" (Poverty - C.onquering E.ducation) అను నొక పద్యకావ్యమును వ్రాసెను.

కైలాసవాసినీదేవి :

1863 సం॥న 'కైలాసవాసినీదేవి' స్త్రీల యొక్క హీనస్థితినిగూర్చి 'హిందూ మహిళల హీనావస్థ' (The Sad plight of Hindu Women) అను పేర భావపూర్ణమైన గంభీరమైన ఒక గ్రంథమును వ్రాసెను.

స్త్రీ విద్యను ప్రోత్సహించుటయే ముఖ్యోద్దేశముగా గల్గిన 'వామ బోధినీ పత్రిక' అను నొక పత్రిక అపుడు ప్రచారములో నుండెను. అందు స్త్రీ రచయిత్రుల రచనలు వరుసగా ప్రచురితములగుచుండెను.

మార్తా సౌదామనీసిన్హా :

1865 లో మార్తాసౌదామినీసిన్హా అను నామె 'నారీచరిత' అను గ్రంథమును, రాఖాల్ మణిగుప్త అను నామె 'కవితామాల' అను కావ్యమును వెలయించిరి.

అప్పుడే ఒకానొక మహిళచే వ్రాయబడిన 'ఊర్వసీ నాటక' (Drama of Urvasi)అను నొక ప్రప్రథమ నాటకము సారస్వతలోకమున వెలసినది. 1868 లో ఈమెయే 'బాల బోధికా' అను నొక గ్రంథమును వ్రాసెను. తర్వాత వెలసిన గ్రంథము వసంతకుమారీదాసీ వ్రాసిన 'కవితామంజరి' (Flowers of Poetry) అనునది. అప్పటి నుండి మహిళా రచయిత్రుల సారస్వత కృషి గమనార్హమైనది ప్రసిద్ధురాలైన స్వర్ణ కుమారిదేవికి ముందు చాలామంది రచయిత్రులు మనకు కన్పింతురు. 'నవీనకాళీదేవి' (Navin Kalidevi) 'కామినీ కళంక' (Women's scandal) అను నొక నవలను లిఖించెను. హేమాంగిని యను నొక రచయిత్రి 'మనోరమ' (The Charming) అను నొక కథను వ్రాసెను.

రచనకు తగిన ఇతివృత్తము కొఱకై రచయిత్రులు చరిత్రనుకూడ ఆధారము చేసికొనెడివారు. ఇట్టి కృషి ఫలితమే సురాంగినీదేవి యొక్క తారా చరితము (The life of Tara) అను గ్రంథము. ఇందలి కథ రాజస్థాన చరిత్ర నుండి గ్రహింపబడినది.

రాస సుందరిచేత రచియింప బడినట్టియు సగము వేదాంత చర్చ గల్గినట్టియు 'హామరా జీవన్' (My life) అను గ్రంథము ఆ రోజులలో ఒక విశిష్ట స్థానమును పొందెను. ఆమె శైలి సరళమును, అద్వితీయమును అనన్య సాధ్యమునై యున్నది.

## స్వర్ణకుమారీదేవి :

స్వర్ణకుమారీదేవి (1855-1932) అను నామె ఈ నూతన శకమున ప్రథమ శ్రేణిలో నిలచును. ఆమె రవీంద్రుని పెద్దక్క. అందువలన వంశ పారంపర్యముగా ఆమె ఈ ప్రజ్ఞను బడయగల్గెను.

ఆమె ఎప్పుడును పాఠశాలయందుగాని, కళాశాలయందుగాని విద్యాభ్యాసము చేయక పోయినను "ఇంటిలో పొందిన శిక్షణ అత్యద్భుత మైనది" ఆమె చాలా ప్రజ్ఞావంతురాలైనను, దురదృష్టవశమున ఆమె తన సోదరుని ప్రతిభా విశేషములముందు రాణించవలసినంతగా రాణించలేక పోయెను.

స్వర్ణకుమారీదేవి రచనల సంఖ్యను చూచినచో అన్ని రంగముల యందును ఆమెకు గల సృజనాత్మక ప్రజ్ఞా పాటవములకు మనము ఆశ్చర్యచకితులము కాగలము. ఆమె కొన్ని పాఠ్యపుస్తకములను గూడ వ్రాసెను. అందు ముఖ్యమైనవి "గల్ప-సల్ప", (Some-Tales) ప్రథమ పాఠ వ్యాకరణము' (The primary grammer) "ఆదర్శ నీతి" (Adarsa Neethi) మొదలగునవి. మధురమైన, సులభమైన రాగ వరుసలతో, బాణీలతో ఆమె పెక్కు గీతములను స్వరయుతముగ రచించెను. అవి రెండు సంపుటములుగా నుండెను. ఆమె గేయవాఙ్మయ కర్త్రి యేగాక గొప్ప కవయిత్రికూడ. ఆమె పద్యకావ్యమైన 'కవితా ఓ, గాన్' (Kavitha O Gan) అనునది ప్రశస్తికెక్కినది.

స్వర్ణకుమారీదేవి 'భారతి' యను మాసపత్రికను నడపెను. భారతి పత్రికలో ఆ కాలమున ప్రసిద్ధికెక్కిన రచయిత లందరి రచనలు ప్రచురింప బడెడివి. సృజనాత్మకమైన అన్నిరంగములయందును ఆమె తన ప్రజ్ఞను

చూపెను. ఇంతేగాక రాజకీయముగను, వైజ్ఞానికముగను, చారిత్రక విషయములనుకూడ ఆమె రచించెడిది. ఆమె నాటకములు, ప్రహసనములు గాక నవలలు, చిన్న కథలనుగూడ రచించెను. ఆమె తొట్టతొలి రచనలగు 'దీప నిర్వాణ్' (The Quenched Lamp) అను నవల 1883 లో దేశమున వెలసెను. మొత్తము ఆమె ఇరువదియేడు గ్రంథములను రచించెను. 'స్నేహాలత' యను నవల 1893 లో ప్రచురింపబడెను. అది ఆ కాలమునాటి వాస్తవిక సాంఘిక ప్రతికృతి వంటిది. 'పృథివి' యను వైజ్ఞానిక గ్రంథము 1882 లో ప్రకటింపబడెను. ఆమె రచనలలో ముఖ్యమైనది. "హుగ్లీ, ఇమ్మామ్ బరి" (The Imambari in Hooghly) అను నింకొక నవల. హాజీ మహ్మద్ మొహసీన్ యొక్కయు ఆతని సవతి చెల్లెలియొక్కయు జీవితచరిత్ర; ఇందలి ఇతివృత్తము. ఈ నవల చారిత్ర కాధారముల ననుసరించి వ్రాయబడినది. మఱియు మహమ్మదీయుల చరిత్రను ఇతివృత్తముగా గ్రహించుటలో రచయిత్రి యొక్క హృదయవైశాల్యము విశదమగు చున్నది. "మేబార్ రాజ్" (The King of Mebar) (మేవాడ్ రాజు) "విద్రోహ" (The Revolt) అనునవి రెండును చారిత్రక నవలలు "వసంతసేవ" (The Spring of Pestival) అను గేయ రూపకము కడు మనోజ్ఞముగ నుండును.

సౌదామినీదేవి :

స్వర్ణకుమారీదేవి సోదరియైన సౌదామినీదేవి వాస్తవిక గాథలను రచించుటలో కడు నేర్పరి. స్వర్ణకుమారీదేవి కుమార్తెయైన సరళాదేవి చౌధురాణీ (1872) కూడ ప్రతిభావంతురాలైన రచయిత్రియే. "భారతి" పత్రికను ఆమెకూడ కొన్నిదినములపాటు నిర్వహించుటయే గాక అందు జాతీయ గీతములనుకూడ వ్రాసి ప్రచురించెడిది. ఆమె పాటలలో ఒకటి విశేష ఖ్యాతి నార్జించినది.

"ప్రాచీన వైభవ స్మృతి గర్భితములగు
నా పలుకులను భరతభూమి పాడును గాక."

హిరణ్మయీదేవి :

సరళాదేవి సోదరి హిరణ్మయీదేవి (1870) కూడ ప్రసిద్ధురాలైన కవయిత్రియే. ఆమెకూడ కొన్నిదినములపాటు "భారతి" పత్రికను నడపినది. స్వర్ణకుమారీదేవితోపాటు వచన రచనలో చెప్పుకోదగినవారు శరత్కుమారీ చౌధురాణీ, సరోజకుమారీదేవి అను వారిర్వురు. సరోజ కుమారీదేవి రచనలగు (Flower - Vase) అదృష్టలిపి (Fate) అను గ్రంథములు రెండును 1915 లో వెలువరింపబడినవి. ఈమె ఎవరును అంత వరకు రచించనట్టి ఆనాటి విదేశ యాత్రానుభవములనుగూర్చి గ్రంథముగ రచించుటచే ఈమె రచనలు ప్రజలచే విశేషముగ గుర్తింపబడినవి. శరత్కుమార చౌధురాణీ రచనయైన 'శుభ వివాహ' (The auspicious Wedding) అను గ్రంథమునకు గౌరవనీయులైన రవీంద్రనాథ టాగూరు ఉపోద్ఘాతము వ్రాయుటచే ఇది గర్వింపదగిన విషయమయ్యెను.

గిరీంద్రమోహనదాసి :

ఎట్లైనను వంగదేశమున ఆ కాలమున రచయిత్రులు పెక్కుమంది ఉండిరనుటలో సందేహములేదు. కొద్దిమంది విశేష ఖ్యాతి నార్జించిరి. గిరీంద్రమోహనదాసి (1858-1924) అను నామె విఖ్యాత రచయిత్రి. ఆమె బాల వితంతువు. ఆమె సాహిత్యసేవకును, చిత్రకళారాధనకును తన జీవితము నర్పణముచేసెను. ఆమె జాహ్నవి అను పత్రికను కూడ నడపెను. నవయౌవన దశయందే భర్త గతించుటచే ఆమె జీవితమంతయు దుఃఖభరితమాయెను. కడు ప్రఖ్యాతినొందిన "అశ్రుకణ" అను నీమె పద్యకావ్యము శోకరసభరితమైనది. ఇది ఈ కవయిత్రి జీవితకాలమునందే నాలుగుమార్లు అచ్చువేయబడుటచే ఈ కావ్య మెంత ప్రఖ్యాతి నార్జించి నదియు మనము తెలిసికొనగలము.

గిరీంద్రమోహినీదాసి శక్తిసామర్థ్యములును, స్పష్టతయును గల కవయిత్రి శోకరసభరితమైన ఆమె పద్యములు గాయపడిన హృదయము నుండి స్రవించుచున్న శుద్ధమైన రక్తపుబొట్లవలె స్వచ్ఛముగను, పరిశుద్ధము

గను నుండును. నోబెల్ బహుమానము పొందిన గేబ్రియాల్ మిస్ట్రాల్ వలెనే ఈమెకూడ జీవితమునందలి విషాదాంత సంఘటనవలననే ఉత్తమ సాహిత్య నిర్మాత్రిగా రూపొందినది. కవయిత్రి గిరీంద్రమోహిని ఒకచో ఈ విధముగా వాకొనినది.

"ఈ కన్నీరు పుష్పోద్యానమున ప్రియసమాగమము సంభవించు
నపుడు కలుగు వలపువలన కన్గొలకుల తూగాడు
ఆ స్ఫటిక స్వచ్ఛ జల బిందువులుకావు.
ఓ ప్రియుడా, చిర వియోగా నన్తరము మనకు కలిగిన
పునస్సమాగను వేళయందలి ఆనందపు టంచులనుండి
తొరగిన అశ్రుబిందువులుకావు, ఇవి నైరాశ్యముచే కల్గిన
ఆవేదన మూలముగా కల్గిన విషాదాశ్రువులు.
ఇవి- శాశ్వత ప్రణయ వాంఛా పిపాసచే కల్గిన దుఃఖా
శ్రువులు, ఇవి ప్రణయోన్మాద వాంఛా విషాద ధారలు,
ఇవి మృత్యుదేవత కావించిన బ్రతుకు తుదికౌగిలి
యందలి ఖేదామోదాశ్రువులు ప్రియా."

'కవితావిహార్' (The garland of Poems) 'శిఖ' (The plames) 'ఆభాష్' (The suggestion-Abbash?) 'అర్ఘ్య' (Argh) (The offering); 'స్వదేశిని' (The patri of) 'సింధుగాథ' (Saga of Sea); 'భారత్ కుసుమ్' (India's Flowers) అనునవి ఆమె ఇతర పద్యకావ్యములు. ఇవియే గాక ఆమె 'సన్న్యాసిని' లేక 'మీరాబాయి' (The Humit or Mirabai) అను నాటకమునుకూడ వ్రాసెను. ఆమె వ్రాసిన కొన్ని లేఖలు జనైక్ హిందూ మొహిలార్ పత్రావళి (The letters of a certain Hindu Lady) అను నొక గ్రంథరూపమును సంతరించుకొన్నవి. ఆమె వివిధ మనస్తత్త్వములు కలది. మాతృహృదయములో పాడిన పాట.

"నా కున్నదంతయును నీవు దొంగిలించితివి
ఓ చోరుడా, నీవు ఎక్కడనుండి వచ్చితివి ?"

ప్రసన్నమయీదేవి :

ఈమెకు కొద్దిగా పై కాలమునందున్న ఇంకొక కవయిత్రి ప్రసన్నమయీదేవి (1857 - 1939) కడు ప్రసిద్ధురాలైన కవయిత్రియగు ప్రియంవదాదేవి తల్లి. ఈమె 'ప్రసన్నమయీదేవి', 'వనలత', 'నీహారికా' మొదలగు కావ్యములను వ్రాసెను. ఈ గ్రంథములు పాఠకుల మన్నల నందుకొన్నవి. భారతదేశ పర్యటన సంబంధమైన ఆర్యావర్త అను గ్రంథము 'అశోక' అను నొక నవలనుకూడ వ్రాసెను.

మన్‌కుమారీబాసు :

మన మిప్పుడు మన్‌కుమారీబాసు అను ప్రసిద్ధ కవయిత్రిగురించి తెలిసికొందము. ఈమె కవిత్వము శక్తిమంతముగను, గంభీరమైన, ఉన్నతమైన భావములతోను, కూడికొనియుండును. ఈమె ఆధునిక వంగ భాషా నిర్మాతయు పౌరాణిక కావ్యకవియు నగు మహామహుడైన మధుసూదన దత్తుని మేనకోడలు ఆమె మేనమామను అనుసరించి అతని అడుగుజాడలలో నడచుటయే ఆమె అభిలాష. దీని కనుగుణముగా ఆమె తన 14 వ సంవత్సరముననే తన మేనమామచే రచింపబడిన 'మేఘనాథ్‌బధ' (వధ) అను నొక ప్రసిద్ధ పౌరాణిక కావ్యమునకు అనుకరణముగా అనిబద్ధ పద్యముతో నొక కావ్యఖండమును వ్రాసెను.

తర్వాత ప్రచురింపబడిన 12 గ్రంథములలో 'వీరకుమార్‌బధ' (వధ) (The Death of Heroic Prince) అను నొక కావ్యము ఒక మహాకావ్యమునకు నిజమైన అనుకరణము. ఆమె వ్యాసములను నవలలుకూడ వ్రాసినది. కాని అన్నిటిలోను కావ్య కుసుమాంజలి (The floral offering of Poesy) కనకాంజలి (The golden offering) అనునవి బహుళ ప్రచారమును పొందినవి. ఈమె వితంతువుకూడ. ఆ రోజులలో వంగదేశపు వితంతువులకు విరామముండెడిది కాదు. మరియు అత్యంత కఠినమైన నియమములతో జీవనమును గడుపుకొనవలసి వచ్చెడిది. కావున వంగదేశము నందలి ఇతర రచయిత్రులవలెనే ఆమె జీవితము, ఆమె రచనలుకూడ

దుఃఖపూరితమైన, అశాంతితో వేదనతో నిండియుండెడివి. అయితే ఈమె మాత్రము తన దుఃఖమునకు, బాధలకు అతీతురాలగుటకును, ఇతరులు సుఖపడుటను చూచి సంతోషించుట కెల్లప్పుడును ప్రయత్నించుచుండెడిది. ఈ విధమైన ఈమె మనస్తత్త్వమే ఆమె కావ్యములకు ఒక విధమైన అతిలోక సౌందర్యము నిచ్చుచున్నది. ఆమె చివరిప్రార్థన ఇట్లున్నది.

"ఓ భగవంతుడా! నేను మరణింపకముందు నా చుట్టును సహస్రాధికానందమును చూడనాసింతును.

నేను నిష్క్రమించుటకుముందు విశ్వమంతయు దుఃఖమునుండి విముక్తము కావలెను.

మానవుడు వ్యసనములనుండియు, నటనమునుండియు, బాధల నుండియు విముక్తుడు కావలెను.

ప్రతిమనుజుడును ఆనందాభయ సాగరమున తేలుదురుగాక. వారు పరస్పరము ప్రేమించుకొందురుగాక.

ఈ విశ్వమంతయు త్యాగముతోడను, శక్తితోడను, ఆనందము తోడను నిండియుండుగాక.

నేను మరణింపకముందు నే నట్టి కళ్యాణమయ లోకమును తప్పక చూచెదను."

అదే సమయమున అనగా 19 వ శతాబ్దపు నడిమభాగమున దేశ మంతటను జాతీయత, జాతీయాభిమానము విస్తరించుచుండెను. మనము ఇంతకుముందే చెప్పిన సరళాదేవి కవిత్వము ఈ జాతీయోద్యమ ఫలితమే. మన్‌కుమారీబాసుకూడ ఇట్లు జాతీయోద్యమ ప్రచారకురాలే. ప్రత్యేక ముగా ఈ విషయమై సారస్వతమున కీమె చేసిన సేవ అపారము.

### జ్ఞానదానందినీ :

స్వర్ణకుమారీదేవి సమకాలికులలో 'జ్ఞానదానందినీ' దేవి పేరు గమనింపదగినది. ఆమె స్వర్ణకుమారీదేవి పెద్ద అన్నగారిని వివాహము చేసికొనెను. అతిశయ ప్రజ్ఞాప్రాభవములు కలిగిన కుటుంబములోనికి ఈమె

ప్రవేశించుటచే ఈమెకూడ సాహిత్యసేవ కలవడెను. ఆమె పిల్లలకొఱకై 'సాత్ భాయ్ చంపా' (Sat-Bhai Chempa. The Seven Champa Brothers), 'తాక్-డుమాడుమ్' (Tak-Duma-Dum) (Tra-la la) అను పుస్తకములను వ్రాసెను. ఆమె 'బాలక్' (The Boy) అను నొక బాలల పత్రికను ఒక సంవత్సరముపాటు కడు సమర్థతతో నడపెను.

ఇంకా యితర రచయిత్రులుకూడ బాల సాహిత్యమును ప్రచురించిరి. కాని మన కత్యంత ఆసక్తిని కల్గించు విషయ మేమనగా జ్ఞానదానందినీదేవి సాహిత్యమంతయు బాల సాహిత్యమే యగుట గమనార్హమైన విషయము.

## హేమలతా సర్కారు :

బ్రహ్మ సమాజీయుడైన పండిత శివనాధశాస్త్రి (1868-1943) జ్యేష్ఠ పుత్రికయగు హేమలతా సర్కారు వచన రచనలును, వాస్తవికతను, చిత్రించు రచనలను చేయుటలో సిద్ధహస్తురాలు. "మేవార్ గౌరవకథా" (The glories of Mebar) నేపాలీ బంగనారు (A Bengalee Lady in Nepal) భారత వర్షేర్ ఇతిహాష్ (The History of India) మొదలగునవి ఈమె రచనలు. ఇందు ఆఖరి రచన 'మిరియమ్ నైట్' అను నామెచే ఆంగ్లములోనికి తర్జుమా చేయబడినది.

అమ్బుజీ సుందరిదాస్ గుప్త (1870-1946) మోక్షదాయినీ ముఖర్జీ (కాలము సరిగా తెలియదు గాని రచనలు మాత్రము 1882 లో కన్పించినవి) అను వారిర్వును ఈ కాలమున ప్రసిద్ధురాండ్రుగా కన్పించుచున్నారు. మొదటియామె వచనమునందును, పద్యరచన యందును సరిసమానమైన ప్రజ్ఞాప్రాభవములు కలిగియుండెను. రెండవయామె ఆ కాలమునాటి ప్రసిద్ధ కవయిత్రి "వనప్రసూన" (The Wild Plower) 'కల్యాణప్రదీప్' (The light that was Kalyan) 'సఫల్‌సప్నా' (The dreams pulfilled) (ఇయ్యది శ్రీమతి నళినీబ్లాయిర్ చేత అనువదింపబడినది) అను మూడును ఈమె రచనలు. ఈమె వ్యంగ్యభరితమైన శైలిని

ప్రదర్శించుటలో కడు నేర్పరి. ఇంతేకాక ప్రసిద్ధ కవిపుంగవుడైన హేమ చంద్ర బెనర్జీని తన పాండిత్య ప్రభావముచే ఈమె త్రిప్పికొట్టిన దెబ్బ నిజముగా ఆశ్చర్యకరమైనది.

**సుకుమారీదత్తు :**

సుప్రసిద్ధురాండ్రైన ఈ కవయిత్రులతో బాటు మనము సుకుమారీ దత్తు (Golapmohini) అను నామెనుగూర్చి కూడ తెలిసికొనవలయును. దురదృష్టవశాత్తు ఆమె నటి యగుటచే ఆనాటి ఆచారముల ననుసరించి సంఘమునుండి వెలివేయబడినది. కాని ఆమె తన పరిస్థితుల నతిక్రమించి అభివృద్ధి పొందుటకు యత్నించెను. 'అపూర్వసుయిట్టి' (Apurva Saittee 1875). 'అపూర్వసతి' అనునామె నాటకములో ఆమెనుగూర్చి విశదముగా తెలియనగును.

**కామినీరాయ్ :**

నేటికిని ప్రజానీకముచే ప్రశంసింపబడి, చదువరులలో నుత్సాహమును రేకెత్తించు గొప్ప కవయిత్రు లిర్వురను గూర్చి ప్రస్తావింపవలసి యున్నది. వారే కామినీరాయ్ (1864-1933), ప్రియంవదాదేవి (1871-1935) అనువారు.

ఇప్పటి వఱకు సమీక్ష చేయబడిన రచయిత్రులందరును ఇంటివద్దనే ఉండి విద్యాభ్యాసము చేసినవారు. వారిలో కొంతమంది విశేష పాండిత్య ప్రాభవములు గలవారే అయినను ఇంటియొద్ద వారు తండ్రిదగ్గరనో, సోదరుని దగ్గరనో, లేక భర్తదగ్గరనో విద్యాభ్యాసము చేసినవారు. సరళా దేవి ఒక్కరుమాత్రమే కలకత్తా విశ్వవిద్యాలయ పట్టభద్రురాలు. పైన చెప్పిన కామినీరాయ్ ప్రియంవదాదేవు లిర్వురు కూడ కలకత్తా విశ్వ విద్యాలయ పట్టభద్రురాండ్రే.

కామినీరాయ్ సంస్కృత విద్యలో విశిష్టత కల్గిన పట్టభద్రురాలు. మరియు ఆమె వివాహమగుట వఱకు బిథూన్ పాఠశాలలో ఉపాధ్యాయి నిగ పనిచేసెడిది. ఆమె విశేష పాండిత్యముగల విద్వత్కవయిత్రి. ఆమె

కావ్యములు ఆమెయొక్క భావస్పష్టతను, శ్రేష్ఠమైన కావ్యశిల్పమును ప్రతిబింబింపచేయును.

ఆమె ప్రప్రథమ పద్యకావ్యమైన ఆలో ఓ ఛాయా (Alo-o-chaya) (Light and darkness) అనునది కవితా సామ్రాజ్యమున ఉత్తమ రచనలలో నొకటిగా పరిగణింపబడుచున్నది. రవీంద్రనాథునికి సమకాలికురాలైనను ఆమె ఆయనచే ప్రభావితురాలు కాలేదు. వంగదేశ కావ్య ప్రపంచ చరిత్రలో ఆమె కావ్యమొక మైలురాయివలె నిలచినది. తన కావ్యములో ఆమె తన పూర్వపు ప్రణయగాథ చెప్పుచు తద్వారా ఆమె పొందిన నిరాశ, నిస్పృహా, దుఃఖాదులను నిష్కల్మషముగా అంగీకరించినది. గ్రంథమంతయు ఆదర్శ వాదముతో నిండియుండును. అచ్చటచ్చట దేశభక్తి ప్రపూరితములైన పద్యములుకూడ కన్పించును.

కామినీరాయ్ రచన వివిధ సాహిత్య ప్రక్రియలలో కన్పించును. ఆమె పద్యకావ్యములు : నైర్మల్య (The Holy Flowers) 'పౌరాణిక' (of Ancient times) 'అశోక సంగీత' (Songs of Asoka) 'మాల్య ఓ నైర్మల్య' (Gar-land and Holy Flower) 'దీప్ ఓ ధూప్' (The Lamp and Incense) 'ఠాకూర్ మార్ చీటి' (Letter of Grand mother), 'జీవన్ పథేర్' (on the way of life) మొదలగునవి. 'అశోక సంగీత్' 'జీవన పథేర్' అనునవి. (Sonnets) సానెట్లు 'గుంజన్' (Murmuring) అనునది బాలలకొఱకై వ్రాయబడిన పద్యకావ్యము. 'ధర్మపుత్ర' (Adopted son) అనునది కథాసాహిత్యమునకు చెందును. 'అమ్బ' (Amba) గేయకావ్యము, 'సితిమ' అను గేయరూపకము 'అశోకస్మృతి' (In memory of Ashoka) అనునది ఒక జీవితచరిత్ర 'స్రాధికి' (Sradhi) అనునది పద్యములలో వ్రాసిన 'జీవనస్మృతులు' పద్యకావ్యము. 'మన స్త్రీల విద్యనుగూర్చిన కొన్ని ఆలోచనలు' (Some Thoughts on the Education of our Women) అను ఆంగ్ల గ్రంథమునుగూడ వ్రాసెను.

ఇంత సమీక్ష చేసినపిదప కామినీరాయ్ పాండిత్య మెన్నివిధములుగా వికసించినదో సులభముగా తెలిసికొనవచ్చును. 19 వ శతాబ్దము చివరిరోజులలో కామినీరాయ్ నామము విశేషఖ్యాతిని పొందెను. 'పుండరీక' అను ఆమె కావ్యమునుండి తీయబడిన ఈ పద్యభాగములు చూడుడు.

"పవిత్రమైన, పరిశుద్ధమైన నా యాత్మ మఱల పుండరీకుని యాకృతినొందెను.

నీ హస్తములు ఉంచబడినట్లు
నా మెడచుట్టును ఒంటివరుస ముత్యములహారము చుట్టబడెను.
నా హృదయ దర్పణమున
మహాశ్వేత యాకృతి బింబితమైయున్నది.
ఆహా! ఒక దుష్టస్వప్నము గడచిన తరువాత ఎట్టి మెలకువ కలిగెను?

తరువాత - మహాశ్వేతయు పుండరీకుడును శాశ్వత వివాహబంధమున నైక్యమైరి?"

## ప్రియంవదాదేవి :

ఈమె తర్వాత ప్రఖ్యాతిపొందినది ప్రియంవదాదేవి (1871-1935) ఈమె తన మాతృమూర్తియగు ప్రసన్నమయినుండి సహజమయిన కావ్యాత్మను వారసత్వముగా పొందెను. విశ్వవిద్యాలయములో ఆమెయొక్క అద్భుతమైన నడవడిచే ఆమె శక్తిసామర్థ్యము లింకను మెఱుగెక్కినవి. ఆమె తన అద్భుత పాండిత్యమునకు నిదర్శనముగా ఆనర్సులో వివిధ పతకములతో విశ్వవిద్యాలయమున పట్టము పుచ్చుకొనినది.

వివాహానంతరము అయిదు సంవత్సరముల లోపుననే ఆమె తన భర్తను పుత్రుని కోల్పోయెను. ఆమె తన మిగిలిన జీవితమునంతను సాహిత్యసేవకే అర్పణము గావించెను. ఆమె కొన్ని చక్కని వచన రచనలను రచియించుటయే గాక సంస్కృతము, ఆంగ్లము ఫ్రెంచి భాషలనుండి స్వేచ్ఛగా అనువాదములనుకూడ చేసెను.

ఆమె పద్యకావ్యమైన 'రేణు' (Flower-Dust) ప్రచురితమైనప్పుడు ఆమె అత్యంత మనోహరమును, మృదుమధురమును నగు కవిత్వము వ్రాయు కవులందరిలో నొకతెగా ప్రశంసింపబడెను. వచన రచనలు, అనువాదములతోబాటు 'తారా' (Tara) 'పత్రలేఖ' (Letter on Foliage) అంశూ (Angsue Rays), చంపా, పతల్ (Patal-Kinds of Plowers) మొదలగునవి ఆమె ఇతర పద్యకావ్యములు. ఇంకను ఆ యా పత్రికలలో అచ్చటచ్చట ప్రచురింపబడిన ఆమె రచనలు ఎన్నియో సంఖ్యకు మించి యున్నవి.

ప్రియంవదాదేవి కవిత్వము అత్యంత మనోహరమైన శైలితో నొప్పుచుండును. ఆమె పద్యములు సంగీతమయముగాను, గంభీరముగాను యుండును. ఆధునిక యుగమునకు చెందినవారైనను ఆమె కావ్యములను తఱచు చదువ నిచ్చగింతురు. మనము ప్రియంవదాదేవి కావ్యానువాదమును పరిశీలింతము.

"మఱల మనము కలిసికొనగలమో, లేదో

ఓనా, అతిథీ, వంచిన కండ్లతో, మౌనమువహించిన ముఖముతో ఉల్లాస సమయమున స్వప్నప్రాయమగు నీ రవ నిశీథమువలె ఏతెంచితివి.

అల్లేతెంచి కండ్లనెత్తి నా హృదయమున వెలుగు కిరణములను గ్రుచ్చితివి.

ఆ వెలుగు అంతరించగనే మఱల నా హృదయమున విషాద మేఘ మావరించినది.

నీవు వెళ్ళిపోయితివి. నిశి యేతెంచి భూమి నావరించెను.

శిశిర లీలయగు లిల్లీ పువ్వులు కన్నీటి సరస్సున వాలి రాలి పోయెను.

ఉరవడిగా రాలిపడు మంచు, చీకట్ల నీడల ముసుగులు, భూమిని అగమ్యాగోచరముగా (నిగూఢా స్పష్ట మార్గములు కలదానినిగా) నొనర్చినవి.

ఉత్తరపు గాలిచే రాల్చివేయబడిన వాడిపోయిన ఆకులు
మృత్యుశయ్యా సౌందర్యమువలె అడవిలో వ్యాపించియున్నవి."

ఆ కాలమునందలి పెక్కురు రచయిత లందరును కావ్యరచనయందే ఎక్కువ నైపుణ్యము చూపిరి. స్వర్ణకుమారీదేవివంటి గొప్ప వచన రచయిత్రులును గ్రంథరచనమున కృతకృత్యురాండ్రైన నవలా రచయిత్రులును, పద్యకావ్య రచనయందే కృషిసల్పిరి. వచన రచయిత్రులుగూడ చక్కని కవిత్వము చెప్పెడివారు. వారి నవలలకంటె పద్యకావ్యములే మిన్నగా నుండెడివి. ఆ రోజులలో హిందూసమాజమునందువారు పరదా పద్ధతిని కఠిన నిబంధనలతో అనుసరించియుండిన యుండవచ్చుగాక. మఱియు చాలామంది రచయిత్రుల విద్యాభ్యాసము, వారి వారి అనుభూతులు పరిమితములుగానే యుండెడివి. వీరి నవలా రచనలకంటె పద్యకావ్య రచనయం దెక్కువ అభిలాష చూపుట కీ రెండింటి యందేదైన కారణము కావచ్చును.

ఇంకను 'లజ్జావతీబాసు', 'మృణాళినీసేన్', 'నిరోద్ మోహినీబాసు', 'లీలాదేవి', 'పంకజనీబోస్' మొదలగు సుప్రసిద్ధ కవయిత్రులు కలరు. వీరేకాక 'కుముదినీ మిత్రా', 'బసంతీదేవి', 'హేమలతాఠాగూర్' వంటి పత్రికా రచయిత్రులుకూడ కలరు.

అనురూపాదేవి :

ఇక కల్పనా కథారచయిత్రుల శకము ప్రారంభమగుచున్నది. దీనికి 'అనురూపాదేవి' (1882-1958) నాయకత్వము వహించుచున్నది. 20వ శతాబ్దపు ప్రథమ భాగమున అనురూపాదేవి ప్రసిద్ధ నవలారచయిత్రిగా పేర్గాంచెను.

ఆమె సంఖ్యకుమించిన గ్రంథములను వ్రాసెను. ఆమెయొక్క ఈ పాండిత్యము మనలను ఆశ్చర్యచకితులను చేయును. ఆమె తన రచనలన్నిటియందును గాంభీర్యమును, ఔన్నత్యమును, ఆదర్శరీతులను మొదటి నుండి చివరివరకు ఒకే స్థాయిలో కడు నైపుణ్యముతో నిర్వహించెను.

ఆమె గొప్ప కథానికా రచయిత్రి ఆమె నవలలు చమత్కారపూరితమైన సన్నివేశ కల్పనయందు విశేష ప్రజ్ఞను చాటును. ఆమె పాత్ర చిత్రణ విశదము, సజీవముగాను యుండును. ఆమె తన నవలలకు డికెన్స్‌వలెనే మన నిత్య జీవితమునందు తటస్థపడుపాత్రలనే ఎన్నుకొనును. ప్రచురితమైన బహుసంఖ్యాకములగు ఆమె రచనలలో ఈ దిగువ కొన్ని తెలుపబడినవి.

'మా' (Mother), 'మహా నిషా' (The Enternal right), 'మంత్రశక్తి' (The spell of Mantras), 'పోష్యపుత్ర' (Adopted Son), 'వాగ్దత్త' (The Affianced), 'జ్యోతిహార' (Without Light), 'ఉత్తరాయణ' (The Rood to Death), 'పథహార' (The Lost one), 'చక్ర' (The Snair), 'పైవర్తన్' (Evolu - tion), 'శర్వాణీ' 'హిమాద్రి' 'గోరీ జెర్ మెయె' (The poor girl), 'హారణో ఖాటా' (Haranokhata - The lost Book), 'సోనార్ ఖానీ' (The gold Mine), 'జ్యోహార్-భాన్తా' (Flood and Elob), 'రాంఘూరా' (Ram ghara), 'పథేర్ సతి' (The Companion), 'ఉల్కా' (The Meter) మొ॥ అన్నియు ఈమె నవలలే.

ఆమె యొక్క కథానికా సంపుటములు : 'రంగశంఖ' (The Red Bangalis), 'మధుమల్లి' (The Honey Creeper), 'చిత్రదీప్' (Plame in Sketches), 'ప్రాణేర్ పరశా' (ప్రాణస్పర్శ) మొదలగునవి.

ఆమె వ్యాస సంపుటములు - సాహిత్యే నారి (Shahitya-Nari-the woman in Literature), 'సాహిత్య-ఓ-సమాజ్' (Literature and Society), 'విద్యారణ్య' (Wood of Knowledge), 'కుమారిలభట్టు' 'ఉత్తర ఖండేర్ పత్ర' (Letter from north) మొదలగునవి. ఇందు యాత్రా విశేషములు వర్ణించబడినవి.

ఆమె పెక్కు నాటకములుకూడ వ్రాసినది. 'విజయయిని' (The Conquering Lady), 'జ్యోతిహార' (Without light)

'పూర్వాపర' (The Begining and End), 'నాట్య చతుష్టయ' (Four Dramas) పెద్ద కథల సంపుటములు, చిన్న నవలలు, ఖండకావ్య సంపుటములు, పాటల సంపుటములుకూడా ఎన్నియో ఈమెవి ఇప్పటికిని సాహిత్య ప్రపంచమున విశిష్టస్థానమును సంపాదించుకొన్నవి కలవు.

ప్రప్రథమమున అనురూపాదేవి నవలారచయిత్రి అయినప్పటికిని ఇతర శాఖలయందుకూడ ఎక్కువగా రచించి, రచయిత్రిగా పేరుపొందినది. ఆమె కథానికలు కొంచెము క్లిష్టముగా నుండును. కాని ఆమెయొక్క పెద్దపెద్ద నవలలు తరచుగా వ్యక్తమగు ఆమె విశేషములతో చదువుటకు ఉత్సాహమును రేకెత్తించుచుండును.

ఆమె చాలా ప్రసిద్ధిపొందిన కవయిత్రి. ఆమె జీవితకాలమునందే ఆమె పేరిట పాఠశాలలు నెలకొల్పబడినవి. సినిమాలు, నాటకశాలలు ఈమె నవలలను ఇతివృత్తముగా గ్రహించినవి హిందూమతమును, హిందూ మతాభివృద్ధిని ముఖ్యముగా హిందూ వనితల అభివృద్ధిని, అనురూపాదేవి తన ప్రధాన కర్తవ్యముగా భావించెడిది. ప్రాచీన హైందవ సంఘ సంస్కృతి వేదాంత తత్వ సమ్మేళనమే హిందూమతమును, హిందూ స్త్రీలును అని యామె విశ్వాసము. 19వ శతాబ్దియందలి పెక్కు రచయిత్రు లందరివలెనే ఆమెకూడ ఆదర్శవాదమునందును బ్రాహ్మణ మతమునందును సంపూర్ణ విశ్వాసము కలిగియున్నది. ఆమె యొక్క భావములు కేవల కవితా దృక్పథముతో కాక తత్త్వవేత్తయొక్క గంభీర పరిశీలనా దృక్పథములో నుండును. ఒక్కొక్కచో ఆమె వెలువఱచిన భావములు ఇప్పటివారికి దుస్సాధములు ఒక్కొక్కచో ఆమె పాండిత్య విశేషము వ్యక్తమగును. అయినను తుదకు అన్నిరచనలయందును సత్యాన్వేషణమే ప్రధాన కర్తవ్యముగను, స్థిరసంకల్పముగను గోచరించును. ఆమె ఎల్లప్పు డును భగవత్సాక్షాత్కారమును సులభముగా పొందుట కవకాశముగల ప్రపంచమును దైవాంశ సంభూతులుగా నుండుటకు ప్రయత్నించెడు మానవ ప్రపంచమును తన రచనలయందు సృష్టించును. ప్రజాబాహుళ్యము

యొక్క శ్రేయస్సుకొఱకు ఆమె తన స్వార్థమును విస్మరించెను. విస్మృత సంస్కృతిని పునరుద్ధరింపవలెననెడు దీక్ష ఈమె రచనలలో స్పష్టముగ గోచరించును.

## నిరుపమాదేవి :

ఇక ఆమె మిత్రమును, తోడి నవలారచయిత్రియు నగు నిరుపమా దేవిని గూర్చి తెలిసికొందము. ఆమె అనుపమాదేవి యంత శక్తిసామర్థ్య ములు గలది గాకపోయినను, ఆమె లేఖిని మృదుమధురమైన తీయని కవిత్వమును సృజించినది. 'దీదీ' యను ఆమె నవలను ఇప్పటికిని ప్రజలు అత్యాశతో చదువుచుందురు ఆమె ఇతరనవలల్లో 'శ్యామలి', 'అన్నపూర్ణర్ మందిర్' (The temple of Annapurna) విధిలిపి (Pate) అనునవి సుప్ర సిద్ధములు. ఆమె చిన్నకథలు అంత ఎక్కువగా వ్రాయలేదు. ఆమె కొన్ని పద్యములనుకూడ రచించెను.

ఆమె నవలలు తరచుగా ఇతర రచనలయందు కన్పింపని విశిష్ట ప్రావీణ్యముతో ఉన్న గాంభీర్యముతోడను ప్రకాశించుచుండును. ఆమె నవలలయందలి నాయికా నాయకులు జాగరూకతతో మెలగుచు తమ నిత్యజీవనమునందు మసలుచు కామక్రోధాదులను జయించుటకు ప్రయ త్నించు వ్యక్తులు ఆమె నాయికలు సరళస్వభావులును స్వార్థత్యాగులుగను కన్పింతురు. నవల చదువగనే మన హృదయమున హత్తుకొనునట్టి సజీవ పాత్రలను ఈమె సృష్టింపగలదు.

## ఇందిరాదేవి :

అనురూపాదేవి యొక్క జ్యేష్ఠసోదరియైన ఇందిరాదేవి (1881 - 1923) కూడ ఆ కాలమున పేరుపొందిన రచయిత్రులలో నొకరు - ఈమె తన చిన్నచెల్లెలివలె ప్రసిద్ధిపొందిన రచయిత్రియు, సుప్రసిద్ధ కవయిత్రియు.

స్పర్శమణి (Sparsha manee - The Touth - Stone) అను నవల ఆమె రచనలలో విశిష్ట ప్రఖ్యాతి నార్జించినది. ఆమె యితర రచనలు 'నైర్మల్య' (Nimalya - Holy Flowers) 'కేతకి' (Ketaki - Plowers)

'పరాజిత' (The defeated) 'స్రోతేర్ గతి' (Direction of the Tide) 'ఫూలేర్ తోరా' (Phuler Tora - Bouquest) 'పొత్యాబర్తన్' (The Coming Back), 'శేషధాన్' (The last Gift) మొదలగునవి 'గీతిగాథ' (Musical Lays) అనునది పద్యకావ్యము, 'సౌధరహస్య' (Mystery of the House) అనునది అనువాద గ్రంథము.

ఇందిరాదేవి చౌధరాణి.

ఈ యుగమున ఇందిరాదేవిచౌధరాణి (1873-1960) అను నింకొక సుప్రసిద్ధ కవయిత్రిగా పేరొందినది. ఆమె ఠాగూరునకు సోదరపుత్రి (neice) పెక్కు వ్యాస సంపుటములను ప్రచురించెను. స్మృతి కావ్యము లను, విమర్శనగ్రంథములను వ్రాసెను. ఇవియేగాక ఆంగ్లము, ఫ్రెంచి భాషలనుండి స్వేచ్ఛానువాదములు చేసెను.

'సరళాబా సర్కార్', 'వంగనారి' అను వారలు మనోహరమైన ప్రబంధములను వ్రాసిరి.

20వ శతాబ్దపు ప్రథమ భాగమున విలసిల్లిన రచయిత్రులలో కాంచనమాలాదేవి, హేమ్‌నలినీదేవి, సరసిబాలా సరస్వతి అనువారు ముఖ్యులు; వీరు ఆ కాలమునందలి కథా రచయిత్రులలో ఎన్నదగినవారు. కాంచనమాలాదేవియొక్క 'రోషిర్ డైరీ' (The Diary of Roshi, the dog) హేమ్ నలినీదేవి యొక్క (లీకా) చదువరుల కుతూహలతను గల్గించును.

## 19వ శతాబ్దములో జన్మించి సజీవులై యున్న రచయిత్రులు

జ్యోతిర్మయీదేవి (1894) అనునామె నవలలను, కథలను, వ్యాస ములను రచించెను. 'ఛాయాపథ' (Melky way), 'ఆరావళ్లియర్ అరలే' (Behind the Mountain of Aravalli) మొదలగునవి ఆమె రచనలలో ముఖ్యములు.

శాంతాదేవి - సీతాదేవి :

శాంతాదేవి (1892), ఆమె సోదరి సీతాదేవి (1895) అనువారిర్వురును 20 వ శతాబ్దపు తొలి దినములలో ప్రసిద్ధికెక్కినవారు. వీరు తమ రచనలయందు నూతనత్వమును, ఆధునికతను ప్రవేశపెట్టిరి. కళాశాలా విద్యార్థినుల పాత్రలకు సాహిత్యమున తావిచ్చుటతో వీరి రచనలు ప్రచురితమైన క్షణమునందే ప్రజల ఆదరాభిమానములను చూఱగొన్నవి.

శాంతాదేవియొక్క సుప్రసిద్ధ రచనలు : 'చిరంతని' (Chiran tani - The Eternal Fact), ఆలోకఝుర ('Aloka-jhora' the invisible spring' జీవనడోలా (The cradle of Life) వధూ వరణ్ (The welcoming of the Bride) 'దియాలెర్ అరల్' (Dealer Aral - Behind the wall)

సీతాదేవి రచనలు : 'సోనార్ ఖంచ (Sonar khan chaThe Golden cage) 'మహామాయా'పరభృతిక (The foster child) ఛాయావీథి (Chaya Bithi - The shadowy Bower) క్షనికేర్ అతిథి ( 'Kshaniker Atithi - :The knight Errant) ఇది రచయిత్రిచే అనువదింప బడినది. శైలబాల ఘోష్ జయ అను నామె సాహసికురాలైన రచయిత్రి. ఆమె రచించిన షేక్ అంధూ (Sheik Andhu) అను నవల ఆ కాలమున నొక నవపంథాననుగమనించినది.

గిరిబాలాదేవి సరస్వతి (1891) అను నామె గ్రామీణ జీవితమునకు సంబంధించిన రచనలను నిపుణముగా రచించిన వారిలో మిక్కిలి ప్రసిద్ధురాలు. ఆమె గల్పిక (సంక్షేప వర్ణనలు)లు చిన్న కథలు, పెద్ద నవలలు, అన్నియు భారతదేశపు గ్రామముల యొక్కయు, తద్గ్రామీణుల యొక్కయు ఆంతరంగిక జీవిత సమస్యలతో కూడుకొని యుండును. ఆమె కవయిత్రిగా తన సారస్వత జీవనమును ఆరంభించిన దగుటచే ఆమె లేఖిని సరళమై, కవితావేశ పూర్ణమై శోభలు చిందినవి. గాఢమైన స్వదేశాను రక్తిని, గ్రామీణ జీవిత సౌందర్యమును కనులకు గట్టు నట్లు

వర్ణించు ప్రజ్ఞ గలదగుటచే ఆమె రచనలు ఇప్పటికిని ప్రజల హృదయములలో ఆసక్తిని రేకెత్తించుచున్నవి. ఆమె రచనలలో ముఖ్యమైనవి. 'రూపహీన' (The plain girl) 'హిందూర్ మెయె' (Hindur maye - A Typical Hindu girl) దాన ప్రతిదాన్. Giving and Return) ఖండ మేఘ (The scattered megha) కురనోమాణిక్ ( Kurano maink - The picked Jem) త్రిణగుచ్ఛ (Trina gucha - sheaf of grass) మకుట మణి (jem of crown) మొదలగునవి. ఇంకను చిన్నకథ లెన్నియో రచించెను.

సుఖలతారావు (1885) అను నామె యువ సాహిత్యమును రచించెను. 'గల్ప జేర్ గల్ప' (Stories and stories) సోనార్ మయూర్ (The golden peacock) 'బేహుల' (Behula) అనునవి ముఖ్య రచనలు బేహుల, అను గ్రంథములో రచయిత్రిచేతనే చిత్రింపబడిన కొన్ని వర్ణ చిత్రములు కూడ కలవు.

## ప్రభావతీదేవీ సరస్వతి :

ప్రభావతీదేవి సరస్వతి (Prabavati Devi Saraswati) 2895 అను నామె బహుళ సంఖ్యలో వచన గ్రంథములు వ్రాసిన రచయిత్రి ఆమె వ్రాసిన రచనలలో నవలలు, కథలు, బాల సాహిత్యము మొదలగునవన్నియు కలసి సంఖ్యలో 250 కి మించి యున్నవి. ఆమె వితంతువుల యెడను, హిందూవనితల దుఃఖ జీవితములయెడను కడు సానుభూతిని ప్రదర్శించెడిది. బాల్యము నుండియే ఈమె అవిరామముగ గ్రంథరచన చేయుటచే ఈమె గ్రంథము లెన్నియో లెక్కించుటకు వీలులేనన్ని యున్నవి. విజిత (The conquered) దానేర్ మర్యాదా (The glory of the gift) మాటిర్ దేవతా (The god of clay) మొదలగున వీమె రచనలలో ముఖ్యములు.

# తోరూదత్తు - సరోజినీదేవి నాయుడు

రచయిత్రి:
ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

భారతీయ భాషలలో కావ్యములు విరచింపకపోయినను, వంగ జాతి మహిళలై ఆంగ్ల పరాసు భాషలయందు కవిత్వమల్లి, కావ్యరచన మొనర్చిన తోరూదత్తును గూర్చియు, కవయిత్రి శిరోమణి సరోజినీదేవి నాయుడును గూర్చియు ప్రస్తావింపక పోయినచో వంగ కవయిత్రుల చరిత్రయే కాదు భారతీయ కవయిత్రుల చరిత్రయే సమగ్రముకాదు. అందును కవితా శిల్ప సౌందర్యము చేతను, సమధిక ధిషణా ప్రాభవము చేతను, అద్వితీయ దేశభక్తిచేతను, అసమాన వక్తృతా నైపుణ్యముచేతను, ధరణీతలమునకే శిరోభూషణముగ ప్రఖ్యాతి బడసి, భారతదేశమున రాజ ప్రతినిధి పదముచే గౌరవింపబడిన సరోజినీదేవి నాయుడు (ఆంగ్ల భాషలో కావ్యరచన మొనర్చినను) ను గూర్చి ఈ అఖిలభారత కవయిత్రీ గ్రంథ మున ప్రస్తావింపక పోవుట అనుచితము.

తోరూదత్తు 1856-77: తోరూదత్తు కలకత్తా యందలి దత్తు కుటుంబమునకు చెందిన గోవిందదత్తు తనయ. ఆ దత్తు కుటుంబము ఆనాటి సాహిత్యాభిరుచులకు సమగ్ర ప్రతిరూపమే కాక, సర్వమానవసౌభ్రాత్ర మునకును, పాశ్చాత్య నాగరికతానుకరణమునకును మిక్కిలిపేరు పొంది నది. తోరూ తండ్రియగు గోవింద దత్తును, ఆతని అన్నదమ్ములును క్రీస్తు మతమును శరణు జొచ్చిరి. సుసంపన్నమును ఆంగ్ల నాగరికతా సంఫుల్లమునైన ఆ దత్తుకుటుంబమున జన్మించిన తోరూదత్తునకు ఆంగ్ల ముననే అక్షరాభ్యాసము కూడ కావింపబడెను. గోవిందదత్తు తాను స్వయ ముగ శ్రద్ధ వహించి బాల తోరూదత్తును తన అభిరుచుల కనుగుణముగ దిద్దెను. తోరూ ఎంత సునిశిత మేధాసంపత్తియు, స్వయంవ్యక్తిత్వము కలదయ్యును, తండ్రి ప్రభావమామెపై ప్రసరింపక పోలేదు. "నా తండ్రి శిక్షణయే నాకు లభింపనిచో నేనేమై యుండెడి దాననో" అని తోరూ

దత్తు వ్రాసిన వాక్యములే దీని కుపబలకము. బాల తోరూదత్తునకు తన మాతృభాషయైన వంగభాషయందు తనపేరును సరియైన వర్ణక్రమముతో వ్రాయుటకూడ చేతనయ్యేడిది కాదట. కాని ఆమె తన పదునాల్గవయేట తండ్రితో ఇంగ్లాండునకు వెళ్లుటకుముందే షేక్స్పియరు, పారడైజు కృతులలో ఆరితేరిన ప్రజ్ఞా నిర్వాహకములను పొందియుండెను.

అచ్చట ఇంగ్లాండు నందు ఆమె కన్ని విధముల తగు శిక్షకుల నియమించి, పెద్ద పెద్ద రచయితలతో పరిచయము కల్పించి, తండ్రి గోవింద దత్తు ఆమె అభివృద్ధి కన్నివిధముల ప్రయత్నించెను. అచట ఆమె ఆంగ్ల పరాసు భాషలలో విశేష ప్రజ్ఞ నార్జించెను.

ఆమె కేంబ్రిడ్జిలోనుండగా పరాసు భాషనుండి ఇంగ్లీషు భాషలోనికి కొన్ని కావ్యములను అనువాద మొనర్చెను. అవి కొన్ని ఆమె కావ్యగుచ్ఛమున గలవు.

1873 వ సంవత్సరమున వారు విదేశముల నుండి కలకత్తాకు తిరిగి వచ్చిన వెనుక తోరూదత్తునకు అచ్చటి స్వేచ్ఛా స్వాతంత్ర్య వాతావరణములు లభింపక ఆమె తిరిగి విదేశములకే వెళ్ళవలెనని యెంత యత్నించినను ఆమె సాహిత్యజీవితమున మాత్ర మేమాత్రమును మార్పు గలుగ లేదు. ఆమె తన జీవితాంత్యకాలమున విదేశములనుండి తిరిగి వచ్చినవెనుక భారత దేశమున గడపిన నాలుగేండ్లలోను అవిరామముగ ఆంగ్ల పరాసు భాషలలో ప్రావీణ్యమును సంపాదించుటకును, ఆ భాషలలో రచనము గావించుటకును, అదనముగ సంస్కృత సాహిత్య ప్రావీణ్యమునకును పాటు పడెను. అంతకంటె హెచ్చుగా తాను రచించుచున్న కావ్యములను పూర్తి చేయుటకు ఆమె మిక్కిలి కృషిచేసెను. తన కుటుంబమునందలి అల్లకల్లోలములనుగాని, తన అనారోగ్యమునుగాని సరకుసేయక ఆమె రచనయందే ప్రొద్దుపుచ్చెను. ముఖ్యముగా తాను రచింపబూనుకొనిన "A sheaf cleaned in French fields" అను గ్రంథ సంపూర్తి యందామె తన మనస్సును

లగ్నము చేసెను. ఆమె అసంపూర్ణ రచనగా మిగిలిపోయిన ఆంగ్ల పరాసు భాషల యందలి రెండు నవలలను, హిందూస్థాన ప్రాచీన వీర గాథా గేయములు, కథలు అను గ్రంథమును ఆమె మరణానంతరము గోవిందదత్తు అత్యంత విషాదఖిన్నతతో ఆమె స్మృతి చిహ్నముగా ప్రచురించెను. తోరూదత్తు ఇరువది యొక్క యేండ్ల చిన్న వయస్సుననే మరణించెను. అత్యధిక ప్రతిశాలినియైన తోరూదత్తు తాను జీవించిన అత్యల్పకాలముననకే ప్రపంచప్రఖ్యాతమగు కవిత్వమల్లి విశ్వమానవానీకము నద్భుతానంద పరవశ మొనర్చెను. ప్రపంచమునందలి ఆనాటి విజ్ఞులు ఎడ్మండ్ థామస్ గోసు, ఆంద్రే తోరియట్ (Andre Thewriet) మున్నగు వారు ఆమె కవితాప్రాభవమునకు, భావుకతకు మిక్కిలి ప్రశంసించి యుండిరి.

నిజముగా తోరూదత్తు 19 వ శతాబ్ద సాహిత్యాంబరమునకు గర్వ కారణమైన ఉజ్వలతార !

కవయిత్రీ శిరోమణి
సరోజినీదేవినాయుడు (1879-1949) :

వంగజాతి యందు జన్మించి, ఆంధ్రుల కోడలైన సరోజినీదేవి నాయుడు అసామాన్య ప్రతిభావంతురాలు. ఆమె ఒక గొప్ప కవయిత్రి. మహిత సుందర భావుకురాలు. సత్యమానవతాదర్శవాది. అకళంక దేశ భక్తురాలు. సాటిలేని రాజకీయవేత్త. గొప్ప వక్త్రి.

ప్రసిద్ధ విజ్ఞానవేత్తయు, పండితుడును, హైదరాబాదునందలి నిజాము కాలేజీ వ్యవస్థాపకుడునైన అఘోరనాథ ఛటర్జీ కుమార్తె. ఆమె తల్లి వరదసుందరీదేవి మహాభక్తురాలే కాక, మనోహరమైన ఆధ్యాత్మిక భావము లతో గీతముల నల్లి భగవత్సంకీర్తన మొనర్చెడిది.

అఘోరనాథుడు సంపన్న గృహస్థు, ఉదారుడు, త్యాగశీలి. సర్వజన మతాదరమును కలవాడగుటచే బాల సరోజినికి ఆ యింటి వాతావరణ ప్రాబల్యమున బాల్యము నుండియు సర్వసమభావముతో కూడిన విశాల

దృక్పథ మలవడెను. చిన్న వయస్సు నుండియు ఉన్నత విద్యా సంస్కార వాతావరణమున సుశిక్షితురాలగుటచే 1895 వ సంవత్సరమున ఆమె తన పదునారవ యేటనే నైజాము ప్రభుత్వమువారి స్కాలరుషిప్పుతో ఉన్నత విద్యాభ్యాసమునకై ఇంగ్లాండునకు పంపబడెను. విద్యాతీర్థురాలై ఇంగ్లండు నుండి తిరిగివచ్చిన వెనుక 1897 లో ఆంధ్రుడైన గోవిందరాజులునాయుడుతో ఆమెకు పరిణయమయ్యెను. ఈ వివాహము వర్ణాంతర వివాహమే కాక, ఆంధ్ర వంగజాతులకు వియ్యము గూర్చిన ఆదర్శ వివాహము.

సరోజినీదేవి పదునొకండేండ్ల బాలసరోజినిగా నున్నపుడే ఆంగ్లమున కవిత్వమల్లెను. పదమూడవ యేట ఆమె ఆంగ్లమున వ్రాసిన ఒక గొప్ప గీతముచే ఆమె కవయిత్రిగాం పేరుబొందెను. మహాకవయిత్రి యగు సరోజినీదేవి సుకుమార, సునిశిత కవితాశిల్ప సౌందర్య సౌరభ పరీవాహ వాహిక యగు భాగ్యమునకు నోచుకొన్న దాంగ్లభాష !

తరువాత ఆమె ఇంగ్లండులో నుండగా ఆమె కవితా వ్యాసంగమున కన్నివిధముల ప్రోత్సాహ మొసంగిన సర్ ఎడ్మండ్ గోస్, సర్ ఆర్థర్ సిమ్మనులు మిక్కిలి వంద్యులు.

వారి ప్రోత్సాహమున సరోజినీదేవి భారతదేశ సుందర ప్రకృతిని, నైసర్గిక స్వరూపమును, భారతీయ నరనారుల స్వభావమును చక్కగా వర్ణించెను. మొఘలు యువరాజ, యువరాజ్ఞులను గూర్చియు, భారతదేశ దాస్యమును గూర్చి విషాదభరితముగను, భారతదేశ భవిష్యత్తును గూర్చి ఆశావహముగను ఆమె కవిత చెప్పెను. ఆమె కవిత్వము నందలి సున్నితమైన కవితాశిల్ప సౌందర్య మనన్యసాధ్యమని ఆనాడే పేరు పొందెను.

భారతీయ స్వాతంత్ర్యభాను నావరించియున్న దాస్య మేఘములు మిక్కిలి దట్టమై, రాజకీయముగా భారతదేశము మిక్కిలి దురదృష్ట వశగతమై యున్న ఆ రోజులలో కూడా ఆమెకు గల అచంచలమైన భగవద్విశ్వాసము వలె, భారతదేశము యొక్క ఉజ్జ్వల భవిష్యత్తుపై కూడ చెక్కుచెదరని విశ్వాసముండెడిది. ఆ విశ్వాసముతో ఆమె రచించిన ఈ గేయమును గాంచుడు :

"The solace of faith to the lips that falter,
The succour of hope to the hands that fail
The tidings of joy when peace shall triumph,
When truth shall conquer and love prevail"

సరోజినీదేవి కవిత్వమున ఒకానొక అలౌకికాతిశయ మాధుర్యము, సునిశితానుభవము, నవీన దృక్పథముతో కూడిన భావావిష్కారము, అతి బలీయమగు శక్తిసంపదయు మనకు గోచరించును.

'లిరిక్' కవిత్వము యొక్క స్వచ్ఛశోభ భారతీయ సంస్కృతిబద్ధమైన యామె ఆంగ్ల కవిత్వమున ప్రతిఫలించుచుండును. ఈ క్రింది గీతమున ప్రతి ధ్వనించు భారతీయ సంస్కృతి ప్రగాఢ ప్రభావితాధ్యాత్మిక భావబంధురత్వమును గమనింపుడు.

"Lord of the universe Lord of our being,
Father eternal, innefable om !
Thou art the seed, and seythe of our harvests,
Thou art our hands, and our heart and home,
We bring thee our lives and our labours for our tribute,
Grant us thy succour, thy counsel, thy care,
Life of all life, and all blessing, we hail thee,
We praise thee, O, Brahma with symble and prayer"

మిక్కిలి ఉత్కృష్టమగు ఇట్టి ఆధ్యాత్మిక కవిత్వ మల్లుట యందును, మిక్కిలి సుకుమార భావ సౌభాగ్యము కల కవిత్వ మల్లుట యందును సరోజినీదేవి కడు సిద్ధహస్తురాలే.

"కాలవిహంగము", "పాలకీబోయ", "గాజుల బేహారి", "అనాథ బాల", "నిద్రాగీతము" మున్నగునామె రచనలలో ఇట్టి సుకుమారభావ రమణీయకత్వము ఉట్టిపడుచుండును. "స్వర్ణద్వార కవాటము" అను పేర సంపుటీకరింపబడిన ఆమె కృతులన్నియు విశ్వవిఖ్యాతములు.

అంతియకాక పూజ్య బాపూజీ సత్యాగ్రహ సమర శంఖారావము విని, మాతృదేశ దాస్యబంధన విముక్తికై నడుము కట్టి పాటుపడిన దినము

# సింధీ రచయిత్రులు

మూలము :
శ్రీమతి ప్రొఫె. హీరానందానీ, బొంబాయి.

## సింధీభాషయొక్క ప్రస్తుత పరిస్థితి

సింధీభాష సంస్కృతమునకు చాలా సమీపముగా ఉండు ఒక ప్రాచీన భాష. కాని సింధీభాషకు భారత రాజ్యాంగమునందు గుర్తింపు లేదు. మధ్యప్రదేశ్, రాజస్థాన్ ప్రభుత్వముల యందు కూడ ఈ భాషకు తగిన ఆదరము లేదు. తక్కిన రాష్ట్ర ప్రభుత్వముల యొక్క ఆదరణతో జరుప బడు సారస్వత సంబంధమైన పోటీ పరీక్షలలో కూడ సింధీభాషకు స్థానము కన్పింపకపోవుట శోచనీయము. కేంద్ర ప్రభుత్వము ఈ భాషాభివృద్ధి కొఱకై ఎన్నో మార్లు వాగ్దానము చేసియున్నను, రాష్ట్ర ప్రభుత్వముల సహకారము లేనందు వలన ఈ భాషాభివృద్ధి ప్రయత్నముల యెడ నిస్సహా యమై పోయినది. ఈ మధ్యనే స్థాపింపబడిన మధ్యప్రదేశ్‌లోని 'సాహిత్య పరిషత్తు', కలకత్తాలోని 'జ్ఞానపీఠ్' కూడా ఈ భాషా విషయమును పూర్తిగా విడచినవి.

ఈ భాష ఇంత అనాదరణకు గురిఅగుటకు సింధీభాషకు గల లోపము ; ఆ భాష తన స్వదేశమును, స్వస్థానమును వీడుటయే.

అంతేకాక పొరుగులలోని కొన్నికొన్ని సంఘటనల వలన, కొందఱ ప్రవర్తనల వలన సామాన్య సింధీపౌరులు తమ భాషను మఱచిపోవలసి వచ్చుచున్నది. మానవుడు పరిసరముల ప్రభావముచే ఎన్ని విభిన్న సంస్కృతులకు, విభిన్న పరభాషలకును అలవాటుపడినను, తన మాతృభాషయందు తాను అనుభవించు భావ సౌలభ్యము ఇతర భాషల యందు లభించుట కష్టసాధ్యము. మాతృభాషానుభవముచే కల్గు ఆనందము కూడ కేవల అనుభవైకవేద్యమే. ఈ సందర్భమున 'యీట్సు' చెప్పిన సూక్తి గమ

నార్హము. "ఏ మనుజుడును తన మాతృభాషలో కాక ఇక ఏ పరభాష యందును, శక్తిమంతముగను ఆలోచింపనులేడు, రచింపనులేడు."

అంతేకాక సింధీయులు తమ భాషాభివృద్ధి కొఱకై ఎట్టి ధనరూప ప్రతిఫలము గాని, అభినందనలను గాని ఆశింపకయే తమ సింధీభాషను సమృద్ధముచేయు అపేక్షను తృప్తిపఱచుకొనుచున్నారు.

## సింధీభాషా విషయము

సింధీభాష దిగువ సింధులోయ యందలి మొహెంజొదారో నాగరికత ఉచ్ఛస్థితియందుండిన కాలము నాటిది. ఋగ్వేద మంత్రములకును, మొహెంజొదారో వాసుల నగర వీథుల వాడుకలో నున్న భాషకును సింధీభాష చాలా చేరువగానే ఉన్నదనవచ్చును.

ప్రముఖ వ్యాకరణవేత్త, పండితుడునైన 'ఎర్నెస్ట్ ట్రంప్' (1872) ఇట్లు చెప్పెను : "సింధీభాష స్వచ్ఛమైన సంస్కృత సంబంధము కల భాష. ఉత్తర హిందూస్థానము నందలి యే యితర భాషల కంటెను దీని యందు విజాతీయ గుణములు చాలా తక్కువగా నుండును." వ్యాకరణవేత్తలు సింధీభాషకు మూలమైన 'అపభ్రంశ' ప్రాకృతభాషను మిగిలిన అన్ని ప్రాకృత భాషల కంటెను తక్కువగా పరిగణించినప్పటికిని, ప్రస్తుతము సింధీ యొక్క సహభాషలను పరిశీలించినచో వ్యాకరణ రీత్యా సింధీభాషదే ప్రముఖ స్థానమని గ్రహింపనగును. ప్రస్తుత హిందీ, పంజాబీ, వంగభాషల కంటెను ఈ సింధీభాషకే ప్రాచీన ప్రాకృతముతో సంబంధ మెక్కువ. మిగిలిన భాషలన్నియు ఈ భాషపై అసూయపడవలసిన లక్షణము దీని వ్యాకరణ రూపాధిక్యము. ఏమనగా మిగిలిన అన్ని భాషలును సంపూర్ణ విచ్ఛిత్తి నొంది, తమ మూలభాష యొక్క పోలికలను కూడ పోగొట్టుకొనుచున్న యీ కాలమున కూడా సింధీభాష యొక్కటే మూలభాష యొక్క ముఖ్యాంశములను కాపాడుకొని తన సోదరీ భాషలను మించిన సుందరమైన, పొందికయైన, సుస్థిరమైన వ్యాకరణ వ్యవస్థను నెలకొల్పుకొన్నది.

ప్రాచీన ప్రాకృతభాష యొక్క ప్రథమ శిథిల దశలోనే సింధీభాష నిశ్చలముగా నిలిచినది. తక్కిన భాషలు మాత్రము కొన్ని అంశములలో క్రిందకు దిగినవి. ప్రాకృత వైయాకరణి 'క్రమాధీశ్వరుడు' అపభ్రంశ భాషను గూర్చి చెప్పుచు నిర్ణయించిన సూత్రములు, ప్రక్రియలును ఈనాడు సింధీభాషలో గోచరించునే కాని తక్కిన భాషలలో అట్లు గోచరింపవు. ఈ విధముగా సింధీ తన పరిసర భాషలకు సహోదరియైనను, అది ఆ భాష లన్నింటి కంటెను పూర్తిగా భిన్నమై, ఒక స్వతంత్ర భాషగా రూపొందినది. సింధీభాష తన ప్రాకృత సోదరీ భాషల కంటె క్లిష్టము, కష్టమునై నదగుటచే నేర్చుకొనుటకు కష్టమైనదే యనవలెను. భాషా శాస్త్రివేత్తల కృషికి మాత్రము పుష్కలముగా ప్రతిఫలము నొసగును. సోదరీ భాషలలో కాన రాని అనేకములగు జాతీయములను సింధీభాష తన భాషలో నిల్పుకొన్నది. కావుననే ఆధునిక ఆర్యభాష లన్నింటితో సరిపోల్చిచూచిన సింధీభాష అత్యంతోపయోగకరమైనదిగా కాననగును.

సర్. హెచ్. టి. సారలే D. Lt. C. I. E. 1939 లో ఈ భాషను గూర్చి ఇట్లనెను : "సామాన్యముగా ఒక భాష, ఆ భాషను మాట్లాడు ప్రజల స్వభావమును సూచించునదిగా నుండును. సింధీభాష ఆ ప్రజల శాంతికాముక, వ్యావసాయిక ప్రధానమైన గ్రామీణ నాగరికతను తూ.చా. తప్పకుండా సూచించును. వీరు శ్రమజీవులు, యుద్ధవ్యతిరేకులు" అని.

సింధీభాషలో గ్రామీణ పదజాలము చాలా ఎక్కువ. సింధీయులు అతి నేర్పుతో నిర్వహించు డేగ వేట యందలి చిత్ర విచిత్ర సన్నివేశముల కన్నింటికిని ఈ భాషలో సాంకేతిక పదజాలము కలదు.

ఈ భాష యందు అబ్దుల్ లతీఫ్ అను ప్రసిద్ధ సింధీకవి ఆ లోక మండితమైన అవ్వలి తీరమువైపు చేయి సాచి కష్టపడి కవులు సాధించు సుదీర్ఘ సౌందర్యము తోడను, సుందరమగు లయ తోడను కావ్యరచన యొనర్చెను. సుదీర్ఘమగు సింధీ ప్రేమగాథలలో కవి యొక్క గానాభి లాషకు అత్యుత్తమోదాహారణములు ఉజ్జ్వలముగా కాన్పించును.

పేరుపొందిన చరిత్రకారుడు బర్టన్ (1851) ఇట్లు వ్రాసెను. "సింధీభాష సంస్కృతము నుండి నేరుగా వచ్చినది. పశ్చిమ హిందూదేశము లోని చాలా భాషల కంటె అందములోను, పొందికలోను సింధీభాష చాలా గొప్పది. ఆ భాష కీ రూపము పదకొండవ శతాబ్దములోనే లభించినది"అని.

## సింధీ రచయిత్రులు

శతాబ్దముల నుండి సింధీయులు పరదేశముల దాడులకు, ఆక్రమణ లకు గురియగుచుండిరి. ఈ దాడులు ప్రజల భాషావాఙ్మయములు రెండింటి పైనను ప్రభావమును చూపినవి. ఎడతెగని యుద్ధముల వలనను, సంక్షోభ ముల వలనను సింధీ బాగుగా అభివృద్ధి నొందజాలకపోయినది. ఇంతవఱకును 15వ శతాబ్దమునాటి మామోయీ ఫకీర్ల సప్తజ్యోత్స్యములే సింధీ వాఙ్మ యమున ప్రప్రథమముగా తలంపబడుచున్నది. 16వ శతాబ్దము తరువాతి వాఙ్మయమంతయు మత సంబంధమైన సూఫీ భక్తకవులు రచించిన జ్ఞాన పద కథలతో, భక్తిరసపూరితములగు గేయములతో నిండియుండెను. తరువాత రెండు శతాబ్దముల వఱకును ఇట్లే గడచిపోయినది. 1853 వ సంవత్సరము వఱకును సింధీభాష యొక్క లిపి చాలా ఘోర పరిస్థితిలో నుండెను. 1853లో ఆంగ్ల పరిపాలకులు 'అరబ్బీ లిపి' అని వ్యవహరింప బడుచున్న నేటి లిపిని ప్రవేశపెట్టిరి. ఈ లిపిలో మొదటికావ్యము 1858లో అవతరించెను. కాని, 1900 వఱకు కవయిత్రుల ప్రస్తావన కాన్పింపదు.

స్త్రీ విద్యా ప్రవేశముతో ఎన్నో ప్రముఖములైన మార్పులు కలిగినవి. స్త్రీలు తమకు ప్రాప్తించిన నవశక్త్యుత్సాహములను రచనలో ప్రదర్శించిరి. 20 వ శతాబ్దపు మొదటి రెండు మూడు దశాబ్దములలో స్త్రీలు రచించిన గ్రంథము లెన్నియో వెల్వడినవి.

1922 వ సంవత్సరమున సింధీభాషలో 'కన్య' అను ఒక మహిళల పత్రిక స్థాపింపబడినది. ఆ పత్రిక యందు స్త్రీలు తాము తమ జీవితములలో ఎదుర్కొనుచున్న కష్ట నష్టములను గూర్చియు, సాంఘిక దురాచారములను

గూర్చియు వ్రాయుచుండిరి. 'నవజీవన్' అను ఇంకొక పత్రిక కూడ అదే కాలమున స్థాపింపబడినది.

కమలాహీరానంద్ మఖీజానీ :

'కమలాహీరానంద్ మఖీజానీ' అనునామె ఈ పత్రిక నడుపుటకును, పత్రికకు కావలసిన వ్యాసములు మున్నగు రచనలు రచించుటకును, సమకూర్చుటకును చాలా శ్రమపడి కృషిసల్పెను. ఈమె 1932 లో 'ఉన్నతి' అను పత్రికకు సంపాదకురాలుగా నుండెడిది. ఇంకను ఎన్నియో పత్రికలకు వ్యాసములు వ్రాయుచుండెడిది. ఈమె సింధూదేశ పత్రిక లన్నింటిలో ప్రముఖమైన 'సింధు' పత్రికకు కూడ కొన్ని వ్యాసములు వ్రాసినది. ఈమె రచనలన్నియు సాంఘిక పరిస్థితులకు సంబంధించునవియై, సంఘము నందలి దురాచారములను ఎత్తిచూపునవిగా నుండెను. ఈమె బొంబాయి యందు ప్రచురింపబడు 'హిందూవాసి' అను పత్రికకు కూడ రచనలు పంపుచుండెడిది.

'గులీ సదా రంజని' అనునామె ఈమె సేవకు చేదోడై నిల్చెను. ఈమె హిందూ ముస్లిమ్ వివాహ సమస్యపై 'ఇత్తిహాదు' (ఐకమత్యము) అను నవలను రచించెను. ఈ నవల దేశమున గొప్ప అలజడిని లేవదీసెను. ఈమె 'రవీంద్రనాథ ఠాగోరు' రచించిన 'గోరా' ను సింధీభాషలోని కనువదించి సింధీ చదువరుల హృదయమును చూరగొనెను. ఈమె ఈమధ్యనే 'సాధనా-జో-సుపనే' (సాధన - స్వప్నము) అను నవలను రచించెను.

రాధీసిపాహీమలానీ :

రాధీ సిపాహీ మలానీ పుట్టు గ్రుడ్డి. ఈమె రవీంద్రుని ఖండ కావ్యములను కొన్నింటి ననువదించెను. మత సంబంధముగా కొన్ని ఖండ కావ్యములను రచించెను. స్వాతంత్ర్యోద్యమము ఈమెలో నవశక్త్యుత్సాహము లను రేకెత్తించెను. 'బుల్ బుల్' అను కలము పేరున వ్రాసిన పద్యము లన్నింటి యందును దేశభక్తి ప్రజ్వరిల్లుచుండును.

'క్విట్ ఇండియా' ఉద్యమము స్త్రీల రచనలలో ఒక మైలురాయి. 'తారామీర్ ఛందానీ', 'చంద్రా అద్వానీ', 'భగవత్ దద్లానీ', 'ఈశ్వర్

జత్వానీ' మున్నగు యువతులందఱును, 'జెఠీ కృపలానీ', 'హరికృపలానీ', 'కమలాహీరానందానీ' మొదలగుస్త్రీలును పత్రికలకు విరివిరిగా వ్యాసములు వ్రాయమొదలిడిరి. వీరి రచనలలో 'ఉర్ భారతజీ సంతాన్' (లెమ్ము భారతపుత్రా) 'భారతీ', 'దేశద్రోహి', 'ఉర్ భారతీ' (భారతీ లెమ్ము) మొదలగు కథలు, వ్యాసములు కలవు.

కాని స్వాతంత్ర్యముతో వచ్చిన పాకిస్థానీ విభాగముతో మఱల అంతయు సర్వనాశనమయ్యెను. మతావేశపరులు ఎన్ని కుటుంబములనో నాశనముచేసిరి. ఈ కలహములు సద్దుమణిగిన తరువాత కూడ నిలువ నీడ లేని లక్షలాది సింధీయులు తమ పరిస్థితిని కుదురుపఱచుకొనుటకు యత్నించుటలో ఎన్నియో కష్టములను, కాల వైపరీత్యములను నెదుర్కొనవలసి వచ్చెను. కాని మబ్బులకు వెండి అంచు లుండునట్లు బ్రతుకుతెఱవు కొఱకు వారు పడిన అగచాట్లు, వారిలో రేకెత్తించిన మానసిక చైతన్యము వారి రచనలలో ప్రకాశించెను. ఈ విభాగము యొక్క భయంకర పరిణామములు ఎందఱో యువతులను కవయిత్రుల నొనర్చినది.

## ప్రొఫెసర్ కుమారి పోపతీహీరానందానీ :

వీరిలో ప్రొఫెసర్ కుమారీ హీరానందానీ గొప్ప పేరుప్రఖ్యాతుల నందెను. ఈమె ఎంతో ఉన్నత ప్రమాణములుగల గ్రంథముల నెన్నింటినో రచించెను.

ఈమె 1926 లో సింధు హైదరాబాదులో జన్మించెను. ఈమె తన రచనా వ్యాసంగమును 1947 లో నారంభించి ఇంకను కొనసాగించుచునే యున్నది. ఈమె 'మజ్జు', హిసిరతుని జీతురీబత్' (భావమాల సమాధి) అను రెండు నవలలను రచించెను. రెండును సంఘమున స్త్రీకి గల విచారకరమైన స్థానమును, సంఘమునందలి అన్యాయములవలన స్త్రీ సంఘమునకు గల్గు దుఃఖమునువ్యక్తముచేయును. ఈమె 'రంగీన్ జమానే జూ కహాయియే' (ఈ విచిత్ర ప్రపంచములోని కొన్ని విచార కథానికలు) 'పుకార్' అను రెండు చిన్న కథల సంపుటములను ప్రచురించెను. మొదటి సంపుట

మున పదునాల్గు కథలును, రెండవ గ్రంథమున మూడు కథలును కలవు. ఈ మూడు కథలును ధనవంతురాలైన మహిళ, మధ్యతరగతి మహిళ, పేదరాలైన మహిళ, ఈ మూడు తరగతులకు చెందిన స్త్రీల గాథలు. ఈమె రచనయగు "హిమపుష్ప పంద్రహ్ పంఖేరియా" (15 రేకుల పుష్పము) అను వ్యాస సంపుటము 1962 లో 'అఖిలభారత సాహితీబోలీ సభ' వారి బహూకృతిని పొందినది. దీనిలో పదునైదు వ్యాసములు కలవు. ఇందు "కాళిదాస కవిత" వంటి సాహిత్యవ్యాసములును, "మోక్షమార్గ్" వంటి మతసంబంధ వ్యాసములును "నర్-ఏ-నారీ"వంటి సాంఘిక వ్యాసములును కొన్ని కళాత్మక వ్యాసములును కలవు. అదే సంవత్సరమున ప్రచురింపబడిన "భాషాశాస్త్రి" అను గ్రంథమునకు ద్వితీయ బహుమతి లభించినది.

ఈమె స్వామి ప్రభానంద్ ఆంగ్లమున వ్రాసిన "శ్రీమద్భాగవత్" (రామకృష్ణ మిషన్‌వారి ప్రచురణము) అను గ్రంథమును సింధీలోనికనువదించెను.

ఈ మధ్యనే వ్రాసిన "భారత్ జీ నారీ" (భారత స్త్రీలు) ప్రచురణనందుచున్నది. ఇది వేదకాలమునుండి, ప్రస్తుత కాలమువఱకు గల స్త్రీలపై ఒక పరిశీలన. ఇందు భారతస్త్రీలు - విద్య, భారతస్త్రీలు - శౌర్యము, భారతస్త్రీలు-వేదములు మున్నగు పది అధ్యాయములు కలవు.

సింధీ పత్రికలలో ఈమె దాదాపు 150 వ్యాసములను, 40 కథలను, 3 నాటికలను కొన్ని గేయములను ప్రకటించినది.

ఈమె వారణాసి యందలి హిందూ విశ్వవిద్యాలయమున 1943లో పట్టభద్రురాలైనది. ఈమెకు సింధీ, సంస్కృతము, ఆంగ్లము, హిందీ భాషలు వచ్చును. బొంబాయి విశ్వవిద్యాలయమునందలి సింధీ పాఠ్య పుస్తకములలో ఎనిమిదవ తరగతినుండి ఇంటరువఱకు ఈమె వ్యాసములు తప్పక ఉండును. "భాషాశాస్త్రి" గ్రంథము బొంబాయి గుజరాతు విశ్వవిద్యాలయములలో Special B. A. కు పాఠ్యగ్రంథము. ఈమె

వ్రాసిన నాటికలు, ఏకాంకికలు పాఠశాలలలోను, కళాశాలలలోను విజయ వంతముగ ప్రదర్శింపబడినవి. ఈమె శైలి-ఉన్నతము. భాష-శక్తిమంతము. ఈమె మన జీవితమునందలి ప్రముఖమగు అంశములను కొన్నింటిని పరిశీలించును. అత్తా కోడండ్ర తగవులను సహజముగ చిత్రించును. సంఘము నందలి దోషములను, లోపముతోగూడిన వైఖరులను, పిచ్చి అభిప్రాయము లను విమర్శించును. సంఘమున ప్రస్తుతము స్త్రీయొక్క న్యూనతకు కారణములును, ఆధారములు నైన మూఢవిశ్వాసములను వదలివేయుడని ఎలుగెత్తి చాటెను. ఉద్బోధించెను. స్త్రీలయెడ పురుషుల ప్రవర్తనను ఈమె తీవ్రముగా ఖండించును. ఇట్టి యీమె రచనలన్నియు నవజీవన ప్రాదుర్భావమునకు ప్రోదిసేయును.

## సుందీరి ఉత్తమ్‌చందానీ :

తరువాత సుంద్రీ ఉత్తమ్‌చందానీ చెప్పుకొనదగిన రచయిత్రి. ఈమె సుమారు 40, 45 చిన్న కథలను వ్రాసినది. అయినను నవలా రచయిత్రిగనే ఈమె పేరుపొందెను. 1924 లో సింధు హైదరాబాదులో జన్మించెను. ఈమె ప్రప్రథమముగా ఒక కథను అనువదించెను. ఇది "సాధీ" అను పత్రికలో ప్రచురింపబడెను. తరువాత ఈమె తన స్వీయకథను "మమత" (తల్లిప్రేమ) అను కథగా రచించెను. ఈ కథకు కథలపోటీలో ప్రథమ బహుమతి లభించెను. ఈమె మొదటి నవలయగు 'కిరందర్ దివార్' (కూలుచున్న గోడలు) మంచి ప్రశంసల నందుకొన్నది. ఈ నవల ఒక సింధీ మధ్యమ తరగతి కుటుంబమును వర్ణించును. ఇందు ఈమె మధ్య తరగతివారు ధనవంతులను అనుకరించుటకు ప్రయత్నించుటలో లోనగు బాధలను తెలియబఱచెను. ఈమె రెండవ నవల "ప్రీతీపురానీ-రీతీ నిరాలీ" (పాత ప్రేమ-క్రొత్త పద్ధతులు) ఇది సారస్వత లోకమున పెద్ద అలజడిని లేవదీసినది. "ప్రేమ విషయమునగల ప్రాత అభిప్రాయములను మార్చుకొన వలెననియు, ఒక యువతి తనను మోసగించిన యువకుని తలంచుకొని దుఃఖించుచు కూర్చొనరాదనియు, జీవితమును సౌఖ్యప్రదముగ చేసి

కొనుటకే ప్రేమ నుపయోగపఱచుకొనవలెను. కాని ప్రేమకొఱకు జీవనమును వ్యర్థము చేసికొనరాదనియు నుద్బోధించెను.

ఈమె వ్రాసిన "కోశా", "ఖిర్ భర్యా-హాథిరా" అను కథలు ఎన్నియో పోటీలలో బహుమతులను పొందెను. ఈ రెండు నవలలును మూడుమార్లు ప్రచురింపబడినవి. మొదటి నవల ఉర్దూ, హిందీ భాషల లోనికి అనువదింపబడినదికూడ. ఈమె ఒక పది పన్నెండు ఏకాంకిలను వ్రాసినది. ఇవి రేడియోలలోను, రంగస్థలములయందును పెక్కుమార్లు ప్రదర్శింపబడినవి.

## శ్రీమతి కళాప్రకాశ్ :

తరువాత శ్రీమతి కళాప్రకాశ్‌నుగూర్చి తెలుసుకొందము. ఈమె 1934 లో కరాచీలో జన్మించినది. ఈమె "హిక్‌దిల్ హజార్ ఆర్మన్" (ఒక్కటే హృదయము-వెయ్యి దుఃఖములు), "శీశోకీ దిల్" (గాజు హృదయము) అను రెండు నవలలను రచించినది. ఇంకను ఈమె ముప్పది చిన్నకథలను రచించెను. కాని, ఈమెకు వచన గేయ రచనకే ఎక్కువ ఖ్యాతి వచ్చెను. మానవజీవితములపై ఈమె చాలా సున్నితమైన విమర్శను చేసినది. ఈమె రచనలన్నియు భావోద్రిక్తతతో నిండియుండును.

## శ్రీమతి తారామీర్‌చందానీ :

శ్రీమతి తారామీర్‌చందానీ పాఠశాలలో చదువుచున్నపుడే కొన్ని రచనలనుచేసినది. ఈమె వ్రాసిన "కుమాయర్‌కలీ" (వాడిన మొగ్గ) అను చిన్న నవల, మఱికొన్ని చిన్నకథలు మంచి పేరును గడించినవి. ఈమె రచనలు ప్రాచీన సాంప్రదాయ ప్రకారముగా నుండును. ఈమె "కళ కళకొఱకే" అను సిద్ధాంతమునందు నమ్మకము కలది.

## ఈశ్వర్ జోత్వానీ :

"ఈశ్వర్ జోత్వానీ" అను నీ రచయిత్రి "ఉలిఫత్ జీ ఆరా" (ప్రేమాగ్ని) అను నొక నవలను, కొన్ని చిన్న కథలను రచించెను. ఈమె నవలా వస్తువు సొంతము గాకపోయినను, రచనాయత్నము ప్రశంసార్హమే

కుమారి చంద్రాఅద్వానీ :

కుమారి చంద్రాఅద్వానీ 'Orange Bloosoms' అను నొక ఆంగ్ల నవలను సింధీలోని కనువదించెను. "సుషమా" అను నొక నవలను వ్రాసెను. ఈమె పత్రికలకు వ్యాసము, చిన్నకథలనుకూడ వ్రాయుచుండును. ఈమె శైలి సులభముగను హాయిగొల్పునదిగాను ఉండును.

ప్రొఫెసర్ కుమారి కళారిఝేసింగాని :

మఱియొక కవయిత్రి. మరాఠీ, గుజరాతీ, బెంగాలీ భాషలనుండి కొన్ని అనువాదములను, తన కథ నొకదానిని కలిపి 'సుగమ్' అను ఏడు కథల పుస్తకమును ప్రచురించెను. ఈమె ఢిల్లీ సాహిత్య ఎకాడమీ సలహా సంఘ సభ్యురాలుగా నున్నది. ఈ స్థానమును పురస్కరించుకొని సాహిత్య ఎకాడమీవారు ఈమెకు సింధీ భాషలోని చిన్న కథలయొక్క సంకలన కార్య మప్పగించిరి. మఱికొందఱు రచయిత్రుల సహాయముతో ఈమె సంకలనమొనర్చిన ఈ గ్రంథము ఈ నడుమనే ప్రచురింపబడినది. ఇందు ఇరవైఅయిదు చిన్న కథలు కలవు. ఈమె అనువదించిన రవీంద్రుని జీవితకథ 1962 లో సాహిత్య ఎకాడమీచే ప్రచురింపబడినది.

చిన్న కథలు. ఏకాంకికలు వ్రాయువారిలో గోపీ మొత్వానీ ఒకరు.

ఇప్పుడిప్పుడే రచనా ప్రపంచములోనికి అడుగిడుచున్న వారిలో శ్రీమతి గీతారాజ్, శ్రీమతి కళా ప్రేమలానీ, శ్రీమతి కవితాపుష్ప, జాసీ రామ్నానీ, కుమారి అమిసర్, శ్రీమతి మాయారాహి మున్నగు వారు కొందఱు. వీరి రచనలు పత్రికలలో తఱచు కానవచ్చుచుండును. పై నుదాహరించిన కవయిత్రు లందఱును అభ్యుదయ, వాస్తవిక కవితా దృక్పథముకలవారే.

సింధీ రచయిత లందఱును తమ రచనలను లాఘవదృష్టితోకాక పరమార్థదృష్టితోడనే భావించెదరు. వారి కల్పిత కథలయందు తీవ్ర సంస్కారణాభి నివేశము వ్యక్తమగును.

# హిందీ కవయిత్రులు

మూలము :
శ్రీమతి కమలరూప్‌కరణ్

అనువాదము :
శ్రీమతి పి. యశోదారెడ్డి

## మొదటి అధ్యాయము

హిందీ సాహిత్య ప్రారంభకాలమునుండి, దాదాపు పందొమ్మిదవ శతాబ్ద్యంతమువరకు, ఆ సాహిత్య సంపుటములందు స్త్రీలనామము లంతగ గోచరింపవు. ఆ కాలములో స్త్రీలు తమ మధుర కంఠములనెత్తి కవితా గానముల జేసి హిందీ సాహిత్య వికాసమున కంతగా తోడుపడినట్లుగ గూడ కానుపింపదు. ఆ కాలములో వెలసిన రసభావముల కనుగుణముగ ప్రభావితలుగాక స్త్రీలు నా డెట్లు నిలచియుండగలిగిరో, ప్రభావితలైన కొందరుకూడ నాటి సాహిత్య ప్రక్రియలయందు పాల్గొనక తటస్థలై ఎట్లు ప్రవర్తింపగలరో అను విషయము నిజమునకు విచిత్రమైనదే. కాని నాటి సాంఘిక, మత, రాజకీయాది విషయముల నొక్కసారి పర్యాలోచింప, నేడు వింతగ దోచు స్త్రీలయొక్క ఈ తాటస్థ్యమునకు కొన్ని ప్రబలకారణములు గోచరింపకపోవు.

నాడు వెలసిన సంఘము స్త్రీ విద్య నంతగ ప్రోత్సహించినదికాదు. సాహిత్య వ్యాసంగమునందు తగుల్కొనిన స్త్రీ, కుటుంబమునకు గౌరవ మును గాక, కళంకమునే ఆపాదించునని భావింపబడు రోజులవి. ఉదాహార ణమునకు "దారిప్రక్క నున్న దుమ్ము తెల్లని బట్టను మైలపరచినంతగ రంగు దానిని చేయలేదు. ఏ కొలదిపాటి మాలిన్యమునైనను ప్రస్ఫుట ముగ కనబరచు తెల్లని బట్టవంటిది స్త్రీ. రంగు గుడ్డవంటివాడు పురుషుడు" అను శ్రీమతి అమృతప్రీతమ్ రచించిన వాక్యముల నుద్ధరింపవచ్చును. అయ్యును మేఘాచ్ఛన్నమైన ఆకాశమునందు మిణుగురులట్లు, అక్క డక్కడ వినవచ్చిన కొన్ని స్త్రీ కంఠములే నాటి స్త్రీ స్థితిగతుల నెరుగుట కవకాశముల గల్పించుచున్నవి.

నిరంతర సేవాసక్తి, త్యాగము, సహనము, కార్యదీక్ష మున్నగు ఉత్తమగుణములతో సహ గొప్ప శక్తులు మరికొన్ని కలిగిన స్త్రీ తన శోచనీయమైన పరిస్థితిని గ్రహించి నాడే అర్థముచేసికొనినది. తన ఇష్టానుసారముగ ప్రవర్తింపలేని నిస్సహాయస్థితి, తన తండ్రియింటి ఆస్తిపాస్తులందు తన కధికారము లేకపోవుట, మీదుమిక్కిలి తన తండ్రికుటుంబమున, తానొక భారముగ తలంపబడుట మున్నగు విషయములు ఆమె హృదయమును కలచివైచినవి. ఆ విధముగ కలతనొందిన స్త్రీ హృదయము, భావబంధురములైన కొన్ని గీతముల నాలపించి, కొంత హృదయభారము తగ్గినట్లుగ నిట్టూర్చినది.

ఉదాహరణ :

[1] "ఓ తండ్రీ నన్నెందుకు కానని దేశాలకు పంపుతావు
ఇచ్చినావు నీవు అన్నకు సుందర భవనాన్ని
నాకు ప్రవాస జీవితాన్ని"

అని పాడిన పాటవలన అన్నాచెల్లెండ్ర మధ్యలోగల తారతమ్యము గోచరింపచేసినది.

మరొక గీతములో :

[2] "నాన్నా! నీ పెరట్లో కుప్పిగంతులువేసి,
ఎగిరిపోయే చిన్న పిట్టలవంటి వాళ్లం"

అని తమ బాల్యవివాహమునుగూర్చి వాపోయినది.

జీవితసమస్యయైన వివాహ విషయములోకూడ కన్య ఇష్టానిష్టాలతో ప్రసక్తిలేకయే చేయు వరనిశ్చయమునుగూర్చి.

---

१. काहे को दीना विदेश रे बाबुल मोरे
भैय्या को दिना ऊची रे अटरिया
हमें दीना विदेश रे ।

२. हम तो बबुल तोरे आंगन की चिरिया
चुगत चुगत उड़ जाए रे

1 "తమ్ము తోలినవైపు వెళ్ళే అమాయికపు టావులవలెనే
మమ్ము పంపే మార్గంలో పయనించుట మా భాగధేయం"
అని బాధతో ఆలపించినది.

మరొకసారి ఆడశిశువును పొందిన తండ్రి స్థితినిచూచి

2 "ఓ తండ్రీ ఆడపిల్లలకు తండ్రివైనప్పుడే
నిర్భాగ్యుడుగ లెక్కింపబడినావు కదా!"
అని సానుభూతిని కనబరచినట్లుగ పాడినది.

ఈ విధముగ స్త్రీ తన భాగధేయమునుగూర్చి, తన పారతంత్ర్యమునుగూర్చి పాడిన పాటలవలన నాటి స్త్రీల స్థితిని, సంఘమునందు వారికున్న స్థానమును, కొంతవరకు ఊహింపగలుగుదుము. కాని కేవల మీ పాటల నాధారముచేసికొని అనాదినుండి భారత సంఘమున స్త్రీ తక్కువచూపుతో చూడబడుచుండెనను అపోహను దృఢపరచుకొనరాదు. ఈ యుగమునకు ముందు స్త్రీ కొక పెద్ద చరిత్రయున్నది. ఆ స్త్రీ తన ఉన్నతిని, స్వాతంత్ర్యమును ఎప్పుడు గోలుపోయినదో చెప్పుట కష్టము. మానవ జీవిత చరిత్రలవలెనే, స్త్రీ చరిత్రములుకూడ, అధికాభ్యున్నతిని పొంది, అందరి మన్ననల కాస్పదములైన శుభదినములను చూచి, చివరకు పతనమును పొందుట కనేక కారణములు తోడుపడినవి.

సంఘమునందు స్త్రీ లత్యున్నత స్థానము నలంకరించినది, అనుభవించినది వేదయుగము. అది వీరిపాలిటి స్వర్ణయుగమనికూడ చెప్పవచ్చును. ఈ కాలమునందు స్త్రీలు, పురుషులతో సమానమైన అధికారమును కలిగి యజ్ఞయాగాదులందు పాల్గొనుచు, వేదాధ్యయనము కావించుచు, అగ్నిహోత్రముల నిర్వహించుచు, అస్త్రశస్త్ర రహస్యముల నెరిగి యుద్ధములందుకూడ పాల్గొనుచుండిన శుభదినములవి. ఇట్టి అభ్యుదయ కరమైన వాతావరణమునందు స్త్రీలు, కవయిత్రులై, పండితలై

१. हम थो बबुल तोरे खंटे की गैया
जित हाको हंक जाए रे

२. धिरिया जनम नहिं दीना बिधाता

వృద్ధిపొందినారు. వేదములం దనేక ఋక్కులు, ఘోషా, కక్షవతి, సూర్య, సావిత్రి, ఇంద్రాణి, విశ్వవర్ణ, లోపాముద్ర, అపాల మున్నగువారికి చెంది నట్లుగ గోచరించుచున్నవి వీ రందరిలో అపాలాత్రేయ ఋషి స్థానమును కూడ పొందగలిగినది.

రానురాను సంఘ జీవితములో మార్పు సంభవించినది. సంఘము నందు, పురుష సంతానేచ్ఛ అధికమైనది. మగశిశువు జన్మకై మంత్రతంత్ర ములు, ప్రార్థన ప్రారంభమైనవి. గృహము నుద్ధరించువాడు పురుషుడను భావన అభివృద్ధి పొందినకొలది ఆడబిడ్డ విలువ తగ్గిపోసాగినది. కేవలము కొడుకులనుగన్న తల్లిగ తప్ప స్త్రీ జీవితము వ్యర్థముగ చూడబడినది. సంఘమునందు కొడుకునకున్న ప్రాధాన్యమును పురస్కరించుకొని, వంశో ద్ధారకులైన కుమారులు జన్మించి సంఘము వృద్ధికావలయునన్న, ఆతని జన్మకు కారణమై స్త్రీ సంరక్షణము చాల ముఖ్యముగ భావించబడినది. అందుకొరకై స్త్రీని చిన్నతనములో తండ్రి, యౌవనమున భర్త, ముసలి తనమున కుమారుడు పోషింపవలయునను నియమ మేర్పరుపబడినది. ఈ నియమమువలన స్త్రీ స్వాతంత్ర్యము పూర్తిగ బంధింపబడినది. ఆమె పాతి వ్రత్యమునకు పవిత్రతకు త్రికరణశుద్ధు లవసరమైనవి. ఇక పురుషుడు తన జీవి తావసరముల ననుసరించి, తన దృష్టియందు భేదములు పొడసూప ఆమెను ఉపయోగించుకొనినాడు. తా నొకప్పుడు ఉదార హృదయుడై స్త్రీని మాత, 'సదయ', 'జీవరక్షణి', 'సుఖదయాని', 'సుజాత' అని పిలిచినాడు. మరొకప్పుడు ఆమె శరీర సౌందర్యమునకు ముగ్ధుడై సులోచన, చంద్ర వదన, సుహాసిని, ప్రియవాదిని అని పిలిచినాడు. మరొకప్పుడు కుటిల, మాయావిని, దుష్ట అని గర్హించి తృణీకరించినాడు. ఈ దూషణ, భూష ణము లన్నిటిని, సహనశీలయైన స్త్రీ మారుమాటాడక సాంప్రదాయాను సారిణియై సహించినది. ఆమె మూగతనమే ఆమె తప్పులకు సాక్ష్యమని నాటి సంఘము తీర్పునిచ్చినది. ఇక మధ్యయుగములో పురుషునకు (Zar = స్త్రీ), (Zewar = సిరి), (Zamcen = భూమి) అత్యంత గర్వ

కారణము లైన సంపదలుగ పరిగణింపబడినవి. భూమి, ధన సంపత్తులతో సహా స్త్రీకూడ పురుషున కొక విశేష విత్తముగ పరిగణింపబడినది. అట్టి విత్తములను, సంపాదించుటకు, సంపాదించిన వానిని కాపాడుకొనుటకు, పురుషుడు నిరంతరము జాగరూకుడై యుండువాడు. అందుకొరకే పురుషుడు తరచు యుద్ధములందుకూడ దిగువాడు. ఈ పరిస్థితులందు స్త్రీ నిస్సహాయురాలై పురుషుని అనుగమించినది.

పదునొకండవ శతాబ్ద్యంతమువరకు స్త్రీ పరిస్థితి కొంత దయనీయముగ మారినది. సహగమనము ఆచరణలోనికి వచ్చినది. వితంతు వివాహములు నిషేధింపబడినవి. బాల్యవివాహములు దాటరాని ఆచారములైనవి. నాటి హైందవ సంఘము సనాతన ధర్మాచారములను పేరుతో మూఢ విశ్వాసములకు, గ్రుడ్డినమ్మకములకు ఆటపట్టయినది. దీనివలన అనేకములైన దురాచారములు సంఘమునందు వేరూని తమ ప్రభావములను స్త్రీలపై కానుపింప జేసినవి.

ఈ విధముగ కేవలము మత విషయములే కాక, సాంఘిక రాజకీయాది పరిస్థితులుకూడ స్త్రీ పతనమునందు భాగము పంచుకొనినవి. విదేశీయుల దాడులు హైందవజాతి నైతిక పతనమునకు దారిదీసినవి. అధికారులు, ప్రభువులు విషయలోలురైనారు. అట్టి విషయలోలురు, నీతిబాహ్యులైన అధికారులనుండి స్త్రీలను కాపాడవలయునని, వారి దృష్టినుండి స్త్రీలను తప్పించుటకై పరదాపద్ధతి ఆచరణయందుంచబడినది. దీనితో స్త్రీ స్వాతంత్ర్యము పూర్తిగ నిరోధింపబడి, వారు కేవలము బానిసలుగ మార్చబడినారు.

ఈ విధముగ ప్రారంభింపబడిన ఘోషాపద్ధతితో స్త్రీ తనఇంటినాల్గు గోడలమధ్య సురక్షితముగ కాపు పెట్టబడినది. ఇట్లు పాలింపబడుచుండిన స్త్రీ వేరు ప్రపంచమును గానక, తన భర్తను సర్వవిధముల గ్రుడ్డిగ అనుసరించుటయే, తన ప్రధానలక్ష్యమని భావించినది. నాటినుండియే స్త్రీ నిర్వీర్య, అబలయై మెలుగవలసి వచ్చినది.

ఇట్టి స్వాతంత్ర్యరహితకాలమునందు కూడ, కొందరు స్త్రీలు, భిన్న మైన జీవతమును అనుభవించినవా రున్నారు. వీరు రాజవంశమునకు చెందిన రాణులు, రాజకన్యలు, లేదా రాజవాల్లభ్యమును పొందిన వేశ్యలు. నాడు రాజప్రసాదములందు స్త్రీలకు ప్రత్యేక వేదికలనుంచు ఏర్పాట్లు ఉండెడివట. ఈ వేదికలు నానా కళలకు ఆటపట్టులుగ నుండెడివి. ఇవి రాజాంతఃపురములకు చెందినవి. ఇక వేశ్యలు సర్వకళాసంపూర్ణలై సంగీత, నాటక, కావ్యగోష్ఠులందు పాల్గొనుచు, ప్రభువులను. పండితులను, రసికులను రంజింపజేయువారు ఇందుకొరకే కాబోలు రాజశేఖరుడు "పురుషుల వలెనే స్త్రీలు, ఉత్తమ కవితలనల్లి గొప్ప కవయిత్రులు కాగలుగుదు" రని నిరూపించుటకు ప్రయత్నించినాడు.

ఈ పై కారణములను పురస్కరించుకొని చూచిన తగు అవకాశములను కల్పించినచో స్త్రీ ఏ కళయందుగాని, మరి యే విశేష కార్య నిర్వహణయందుగాని పురుషునకు తీసిపోదని చెప్పవచ్చును.

## రెండవ అధ్యాయము

ఏ భాషా సాహిత్య చరిత్రములనైనను పాఠకుల సౌలభ్యముకొరకు కొన్ని యుగములుగ విభజించుట పరిపాటి. నిజమునకు ఒక యుగమునందు వెలసిన సాహిత్యప్రక్రియలు మరియొక యుగమునందు ప్రవేశింపకూడదనికాని, ఆ యుగసాహిత్య లక్షణములు, తు.చ తప్పక అవియే అయియుండవలయునను నియమములేదు. అయ్యును, సాధారణముగ నాయా యుగములందు వెలసిన సాహిత్య సామాన్య లక్షణములను పురస్కరించుకొని యుగ విభజన చేయుదురు. ఆ విధముగనె, ఆయా కాలములందలి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల నాయా యుగములందు వెలసిన సాహిత్యము, ప్రతిబింబింప జేయుచుండును.

ఆచార్య రామచంద్రశుక్ల యొక్క విభజనము ననుసరించి పరిశీలించినచో హిందీ సాహిత్య చరిత్ర నాలుగు యుగములుగ విభజింపబడినట్లు గోచరించును.

(1) వీరగాథాయుగము. (3) రీతియుగము.
(2) భక్తియుగము (4) ఆధునికయుగము.

రామచంద్రుని పై హిందీ సాహిత్యచరిత్ర విభజన ననుసరించి వీరగాథాకాలమును పరిశీలించి చూచినచో ఇందు స్త్రీలు సాహిత్యమునకు చేసిన సేవ బహు స్వల్పము, ఏమియు లేదని చెప్పినను చెప్పవచ్చును. ఈ కాలమునందు స్త్రీలు యుగధర్మము ననుసరించి, ధైర్య సాహసోపేతము లైన ఇతివృత్తముల స్వీకరించి రచనముల గావింపలేదు. ఈ కారణముచేత నాటి స్త్రీలు వీరకృత్యములనిన గిట్టనివారుకారు. రణరంగమునందు వీర విహారముసల్పి, విజయలక్ష్మిని చేపట్టి ఇంటికి వచ్చిన పురుషులకు మంగళ నీరాజనములతో స్వాగతముల నిచ్చువారు. పగతురకు వెరచి రణరంగము నుండి పారివచ్చిన పురుషుని హీనునిగ చూచువారు. తనభర్త విజయమునే తన విజయముగ లెక్కించునది స్త్రీ. ఆమె ఆత్మత్యాగమునకేని సిద్ధపడు చుండెడిదికాని భర్తయొక్క అపజయమువలన కలుగు అవమానమును సహించునది కాదు. ఈ విధమైనట్టి ధైర్యము, స్వార్థత్యాగము, ప్రేమ మున్నగు ఉత్తమ భావములను కవితాముఖమున బయలుపరచుటకు నాటి సాంఘిక పరిస్థితులు స్త్రీల కవకాశముల నిచ్చినవికావు.

జనాబాయి, ముక్తాబాయి అను ఇద్దరు కవయిత్రులు సాహసించి కావ్యగాన మొనరించినప్పటికిని, భక్తిభావ బంధురములైన గీతముల రచించిరేగాని, వారు వీరగాథల పేరునకైన వెళ్లినట్లుగ లేదు. అందులకే మనము వారిని భక్తియుగ కవయిత్రులుగ పేర్కొనవచ్చును. ఈ విధము గనే రీతియుగమునుగూర్చికూడ ఆలోచించిన, అందు స్త్రీలభాగము మృగ్యముగనే గోచరించును. ఈ యుగమునందు, ఆచార్యులైన మహాకవు లందరు తమ పాండిత్యమును ప్రకటించుకొనుటకును, కావ్య శాస్త్రము లందు తమకుగల శక్తిని ప్రదర్శించుకొనుటకును ప్రయత్నించుచుండిరి. ధ్వన్యలంకార లక్షణపూరితములైన రచనలు జేయు పండిత కవులముందు వీనితో పరిచయములేని స్త్రీలు కవిత చెప్పుటకు సాహసింపరైరి. విద్యా

భావముచేత, వలయునంత పరిశ్రమ లేని కారణముచేత చాలమంది స్త్రీలు కావ్యముల వ్రాయకపోయినను, కొందరు మాత్రము శృంగార రస ప్రధానములైన కావ్యముల వ్రాసినారు. ప్రభువులయొక్కయు, వారి యాస్థానముల యొక్కయు ప్రోత్సాహమువలన పాదుషాలయొక్క శృంగార విలాసముల ఆదరణవలన నాటి సంఘము ప్రభావితమై, ఇట్టి రచనలకు దారితీసినది. కాని యీ విధమైన శృంగార రసప్రధానమైన కావ్యముల రచించిన స్త్రీలు గౌరవింపబడక తక్కువదృష్టితో చూడబడుచుండిరి.

పై కారణములను పురస్కరించుకొని రామచంద్రుడు చేసిన సాహిత్య కాలవిభజనమును స్త్రీలవిషయములోకూడ విభజించి నిర్ణయించుటకు వీలుకాదు.

సాంఘికాది పరిస్థితులను పురస్కరించుకొని, స్త్రీలు బాహ్య ప్రపంచముతో సంబంధములేక వారు కేవలము ధర్మానురక్తలై కాలమును గడుపుటవలనను, స్వాభావికముగ స్త్రీలు మతానుసరణమునందు, అభిమానము కలవారగుటచేతను, భక్తిభావన వారికి మిక్కిలి యభిమతమైనది. కష్టతరమైన తపస్సు, యోగాదులను ప్రారంభింపకయే సులభమార్గమున అభిమత ఫలమును పొందుటకు భక్తిమార్గము చాల అనువైనది. పురుషులు కూడ తమ విధ్యుక్త ధర్మములను తప్పక నిర్వర్తించుచు భక్తిమార్గమునందు సంచరించు స్త్రీలను అంతగ అడ్డుపెట్టువారు గారు. ఈ కారణము కూడ, నిర్నిరోధముగ స్త్రీలు పందొమ్మిదవ శతాబ్ద్యంతమువరకు హిందీ సాహిత్యమునందు రచనలు చేయుటకు సహకరించినది. ఈ కాలమునందు రచించిన వీరి రచనలను రెండుభాగములుగ విభజింపవచ్చును.

(1) భక్తిసాహిత్యము. (2) శృంగార సాహిత్యము.

యీ భక్తికావ్యములను మనము రెండు విధములుగ విభజింపవచ్చును. ఒకటి నిర్గుణ భక్తికావ్యములు. రెండు సగుణ భక్తికావ్యములు. తిరిగి సగుణ భక్తికావ్యములను, రామకృష్ణుల నాధారముగ జేసికొని రెండు విభాగములు చేయవచ్చును.

(1) కృష్ణ సంబంధ కావ్యములు. (2) రామ సంబంధ కావ్యములు.

## మూడవ అధ్యాయము

## సాహిత్యముపైన భక్తిభావ ప్రభావము

నాడు మత పరిస్థితులు నిర్ణీతమార్గమునందు గాక, అల్లకల్లోలముగా నుండెను. అనేకములైన సిద్ధాంతములు బయలుదేరి, అనేకులైన దేవత లందు నమ్మకము కలవారై, ప్రజలు విపులమైన కర్మకాండయందు మునిగియుండిరి. నాడు శక్తిపూజతో సహా యోగము, తపశ్చర్య, మున్నగు విధానములన్నియు, ఆచరణయందుండెను. విజ్ఞానపుమార్గములు ఏ కొంద రికో తప్ప సామాన్య మానవునకు ఎరుంగరాక మోక్షమార్గము దుర్గమమై యుండెను. సాధారణ మానవుడు కేవలము కర్మకాండయందు గ్రుడ్డిగ ప్రవర్తించువాడై యుండెను. సాధారణముగ నిట్టి యల్లకల్లోలములైన పరిస్థితులందు కొందరు మహావ్యక్తు లుద్భవించి నూతనపథమునం దడుగిడి యా మార్గమునందే ప్రజల నందరిని నడచునట్లుగ చేయుట చరిత్రప్రసిద్ధ మైన విషయమే. ఈ విధములైన సంస్కరణోద్యమములు మన హిందూ మతమునం దనేకములున్నవి. ఉదాహరణమునకు, శంకరాచార్యులు, రామానుజ, మాధవ, వాసవ, వల్లభాచార్య, రామానంద, మున్నగు మహాపురుషులు ఇట్టి ఉద్యమములను బయలుదీసినవారే. కాని మత సంబంధ మైన పునరుద్ధరణ ఏ ఒక్కరిచేతనుగాని, ఏ ఒక్క సంఘమువలననుగాని జరుగునది కాదు. దీనికి ప్రజాబాహుళ్యముయొక్క సహకారము ఎంతేని యవసరము. ఉత్తరహిందూస్థానమునందు రామానంద, వల్లభాచార్యుల యొక్క ప్రభావము అధికముగ ప్రసరించినది. వీరు మతభేదములను రూపుమాపి జనసామాన్యమునకు అర్థమగు భాషనే గ్రహించి వారి హృదయములను చూఱగొను కవిత్వమును వ్రాసినారు.

రామానందునియొక్క బోధలను ఆధారముగ గ్రహించిన జనాళికి రాముడే పరమదైవతమనియు, అతని వలననే ముక్తిని సాధించవచ్చు ననియు తెలియును. ఇతడు జాతి మత భేదములులేక శిష్యులను పరిగ్ర

హించినాడు. ఇందు సేనానాయి అను నాతడు అంత్యకులమునకు చెందిన వాడుగను, కబీరు మహమ్మదీయుడుగను, రామదేవు అను నాతడు మోచీవాడుగను కనుపించెదరు. ఈ రామానందుడు పద్మావతి, సురసూరి యను నిద్దరు స్త్రీలనుకూడ శిష్యులుగ స్వీకరించుట విశేషము.

## నిర్గుణభక్తి

గురువులయం దత్యధికమైన భక్తి గౌరవములు, వారి పవిత్రమైన నామమును జపించుటయు, కులతత్వము ననుసరించి వ్యక్తికి గౌరవము లభింపక పోవుటయు, భగవంతుడు సర్వమానవ హృదయములందు వసించు నని నమ్మటయు, భక్తియనునది ఆంతరంగికమైన భావ విశేషమని నమ్మటయు, నిర్గుణభక్తిమార్గమునకు ప్రధానసూత్రములు. ఈ సిద్ధాంతము ననుసరించి, మసీదులకుకాని, మందిరములకుగాని వెళ్ళుట అనవసరము. ఊర్ధ్వపుండ్రములను ధరించుట, భస్మముచేత శరీరమును అలదుకొనుట, పూలమాలలచే నలంకరించుకొనుట, భజనలుచేయుట మున్నగునవి ఏవియు అవసరములు కాక. కేవలము, ఉత్తమ కర్మలు, హృదయపారిశుద్ధ్యములకే ప్రాధాన్య మొసగబడినది. ఈ విధములైన భావప్రభావములు స్త్రీల కవితా విశేషములందు గోచరించును.

ఈ మార్గానుయాయినులలో ప్రధానలు పార్వతి, ఇంద్రమతి, గవారిబాయి, ఉమ, సహజోబాయి, దయాబాయి, బాయికుశాల, రూపాదే, జానాబేగమ్, బబానిసాహిబా, స్వరూపాబాయి, మరియు ముక్తాబాయి అనువారలు.

## నిర్గుణ కావ్య కవయిత్రులు

**ముక్తాబాయి :**

ఈమె జ్ఞానేశ్వరుడను సాధువునకు సోదరి. అతని సంపర్క సౌభాగ్యము వలన నీమెకు భక్తిమార్గమునందు అభిరుచి కలిగినది. నిర్గుణ బ్రహ్మోపాసనమునందు నమ్మకముకలిగి తాను నిర్గుణ భక్తిమార్గాను

యాయినియైనది. సన్న్యాసులైన తలిదండ్రులకు వీరు బిడ్డలగుటచేత గృహస్థ జీవితము యొక్క గౌరవ మర్యాదల నెరుంగక కష్టముతో వారి జీవితము లను గడుపవలసి వచ్చినది. అందుచే జ్ఞానేశ్వర ముక్తాబాయిలకు దైవభక్తి యందు మనసుకుదిరి, చివరకు అదియే వారి ధ్యేయమైనది. మొట్టమొదట నీమెపేరు కవయిత్రిగ మిశ్రబంధూ వినోద్‌నందు గాంచనగును. ఈమె రచించిన కొన్ని పదములు ప్రాచీన మరాఠీ సాహిత్య సంపుటములందు గోచరించుచున్నవి. ఈమెకు సాధువులనిన భక్తి యధికమని క్రింది చరణ ములవలన గోచరించును.

[1]"నేను సాధువులను దర్శించినప్పుడు దివ్యానుభూతియందు మునిగిపోవుదును.

పార్వతి :

ఈమె రచించిన కొన్ని పదములు 'సేవాదాస్‌కి వాణి'లో కనబడు చున్నవి. ఈమె జన్మస్థానమునుగూర్చిన విశేషము లేవియు మనకు తెలి యవు. యుక్తవయస్సునందే కామకాంచనముల రోసి భగవచ్చింతనము నందు లీనుడైన మహానుభావుని యొక్క శిష్యురాలు. ఈమె కవితావస్తువు కేవలము యోగరీతులు, గురుస్తోత్రములవరకే పరిమితములై యున్నవి. [2]ఈమె నిర్గుణ భక్తిభావమునకు చెందిన దగుటచేత పురుష వశీకరణ సాధనమైన కామినీ రూపమును గర్హించినది. తరువాత నారూపముచే నాకృష్ణుడుగాని తన గురువును అతిగా స్తుతించినది.

స్వరూపబాయిజీ :

ఈమె పదునెనిమిదవ శతాబ్దమునందు 'బికనీయర్' సంస్థానములో జన్మించినది. ఈమె 'రాంసమేహీ సాంప్రదాయమును' కనిపెట్టినది.

---

१. जहां जहां साधु दसवा अपहि आप विकाना

२. धन जोवन को करे न आस ।
चित्त न राखे कामिनी पास ॥
नाद बिन्दु जाके घट जरै ।
ताकी सेवा पारवती करै ॥

రామచంద్రదాసు యొక్క శిష్యురాలు. ఈమె గురుభక్తి కొనియాడ దగినది. ఈమె తన గురువు భక్తిని వ్యాపింపచేయుటకు ఈ ప్రపంచమునకు వచ్చినాడనియు, ధనిక దరిద్రభేదము లేక, భగవంతుని మార్గమును అందరకు చూపినాడనియు, మరియు మంచీ చెడు భేదమును పాటింపక అందరకు సేవ గావించినాడని కొనియాడినది. నేడు మనకు కానవచ్చు చున్న యీామె రెండు పద్యములలో ప్రపంచము అశాశ్వతమైనదనియు, అట్టి ప్రపంచమునుబట్టి వ్రేలాడుట కేవలము వృథాయని నిరూపించుటకు ప్రయత్నించినది.

[1]ఈమె భాష రాజస్థాన భాషచేత ప్రభావితమైనట్లుగ గోచరించును.

ఝూనాబేగమ్ :

ఈమె దాదాపు 1805 వ (సంవత్)న అల్వర్ సంస్థానమందలి 'దూతి' గ్రామమందు జన్మించినది. ఈమె చవన సాధువుయొక్క శిష్యురాలు. ఈమె చరణదాసీ సాంప్రదాయమును అనుసరించినది. తదితర సాధుకవుల వలెనే ఈమెకూడ గురువునెడల అతిగౌరవమును గనబరచినది. [2]ఈమె రచించిన గ్రంథము 'సుదామ చరిత' మనునది. ఈమె భాష బ్రిజ్ భాషను పోలియుండును.

రూపాధే :

ఈమె పదునైదవ శతాబ్ది మధ్యకాలమునందు మార్వారులో జన్మించినది. ఈమె మల్లీనాధ్ జీ యొక్క భార్య. వాగ్మాసీబట్టి ఈమె గురువు. ఈమె జాతిమత విచక్షణలేక రామదేవుని సమావేశములందు పాల్గొని ఆ ప్రసాదమును స్వీకరించునది.

ఈమె భక్తురాలుగను, సాధువుగను, మానవాతీతమైన కొన్ని

---

१. गुरु छौना महाराज तुम्हे परनाम है ।
माकू कथा सुनाई अभि राम है ॥

२. सवंत ठारह स पीतीस सार ही ।

శక్తులు కలదిగను ప్రసిద్ధురాలైనది. ఈమె యొక్క మానవాతీతమైన కార్యములగూర్చి యనేకములైన కథలు గలవు.

'రూపాదేకబైరూ' అను పేరుతో నీమె కథల సంపుటి కలదు. ఈమె భాష రాజస్థానీ భాషను పోలియుండును.

ప్రేరణ ఫిబ్రవరి 1963, పుట 109.

భాయి ఖుశాల :

ఈమె ఆల్వారునందు జన్మించి 1837 వ ప్రాంతమునందు రచనలను గావించినట్లుగ గోచరించును. ఈమె చరణదాసీ సాంప్రదాయమునకు చెందిన అఖైరాం అను సాధువు యొక్క శిష్యురాలు.

ఈమె గ్రంథములు :

(1) నెర్సీజీ రా భాతా. (2) బుద్ధవిలాసా అనునవి.

ठारह से सैतीसवा गायो ग्रन्थ विलास

గవరీబాయి :

ఈమె 1815 వ (సంపత్) న, ధుంగార్ పూర్ లో జన్మించినది. జన్మచేత బ్రాహ్మణకులమునకు చెందిన ఈమె 1830-1895 ల నడుమ రచనలను సాగించినట్లుగ గోచరించుచున్నది. మతమునందు భక్తిశ్రద్ధలు కలిగిన తలిదండ్రుల వలన అధికముగ ప్రభావితురాలైనది. ఈమె సంస్కృత భాషయందు నిష్ణాతయై ఉత్తమ పాండిత్యమును సంపాదించినట్లుగ గణింపబడినది. దురదృష్టవశాత్తు ఈమె బాల్యమునందే వితంతువై తన జీవితమును పదములను వ్రాయుటయందును, వానిని గానముచేయుట కొరకును ధారవోసినది. దాదాపు 610 పదములు ఈమె రచించినవి ఇప్పుడు లభించుచున్నవి.

రాజా షేర్ సింగ్ అను ధుంగార్ ప్రభువు, ఈమెపేరుపై ఆలయము నిర్మించి, ఈమెను అధికముగ గౌరవించినాడు. ఈమె నిర్గుణ భక్తిమార్గమునకు చెందినది యైనప్పటికిని, భగవంతుని రాముడనియు, కృష్ణుడనియు, నట్వర నాగరుడనియు అనేకములైన పేరులతో సంబోధించినది.

[1]"ఓ స్వామి ఒక్కసారి మాత్రమే నీ దర్శనము నాకు ఒసంగు. ధనము కాని, రాజ్యముకాని నాకు అక్కరలేదు. ఒక్కసారి నీ కడగంటిచూపు నాకు చాలు" అని భగవంతుని ప్రార్థించినది.

1. ప్రేరణ ఫిబ్రవరి 1963, పుట 106.

**ఉమ :**

ఈమె పేరు నాగర ప్రచార సభయొక్క అముద్రిత రిసర్చ్ రిపోర్టులో పేర్కొనబడినది. ఈమె పదునెనిమిదవ శతాబ్దికి చెందినదని దీనదయాళ్ ఆగా అను నాతడు పేర్కొనగా, డాక్టర్ సావిత్రి సిన్హా అను వారు, ఈమె జీవితకాలమును గూర్చి సందేహమును వెలిబుచ్చుచున్నారు. ఈమె తలిదండ్రులనుగూర్చికూడ ఏ మాత్రము తెలియదు.

ఈమె రాముని పరమాత్మునితో సమానుడని పరిగణించినదిగ తెలియుచున్నది. రాముని యీమె విష్ణువుయొక్క అవతారముగా లెక్కింపలేదు. ఈమెయందు భగవంతుడు దయామయుడుగా నున్నట్లు, ఈమె అతనినిగూర్చి సంబోధించినది. శృంగార రస భావ పారవశ్యమున ఒక్కొక్కసారి యీమె భగవంతునితో 'హోలి'యాడినట్లుగ భావించునది.

తదితర సాధు కవయిత్రులవలెనే, యీమెకూడ తన గురువునుగూర్చి స్తోత్రములను వ్రాసినది. ఒక్కొక్కసారి, ఈమె రచించిన పద్యముల నాధారముగ నీమెను నిర్గుణ బ్రహ్మోపాసకురాలుగ నెరుంగుట కవకాశము గల్గుచున్నది.

[2]ఈమె భాష రాజస్థానీ భాషయైకూడ, అక్కడక్కడ 'బ్రిజ్' 'కారిభోలి' పదములు కలసియుండుట కానగును,

2. ప్రేరణ ఫిబ్రవరి 1963, పుట 107.
3. మధ్యకాలీన కవిత్రయము, పుట 48.

---

1. प्रभु मोको एक छेर दर्शन दइये
   हीरा मानक गरथ भण्डारा, माक्षा मुलक नाहीं चाहिए ।
2. करू णनन्द सामी ग्ररज सुनो ।
   कायी कपटी क्रोधी मन बसु लालच में अति लीन ।
   अधम डधारू विरद तुम्हारो सो क्यों होवे गा दीन ।

బబారి సాహెబా :

ఈమె ఏ కాలమునకు చెందినదో నిక్కముగా తెలియదు. కాని ఢిల్లీ ప్రాంతమునకు చెందినదిగా ఊహింపవచ్చును. ఈమె రచనలలో *సవయా అనునది మాత్రమే లభించుచున్నది.

మీరా వలెనే యీమెకూడ భగవంతునిపై గల భక్తి ప్రేమలకు శిక్షింపబడినది. అయ్యును ఈమె తన స్థిర నిశ్చయమునుండి అంత సులభముగ చలింపలేదు. భగవంతునిగూర్చిన జ్ఞానమును స్వయముగ సంపాదించుట కీమె, మతమునందుండు, అన్ని మాయమర్మములను కాలద్రోసినది. ప్రత్యేకముగ నర్థరహితమైన పూజలను, క్రియాకలాపములను ప్రతిఘటించినది.

భగవంతునిగూర్చి తెలిసికొనుటకు, ఆమెలో నున్న కాంక్ష, బాధన ఎంత తీవ్రమైనదో మనము, ఈ క్రింద నుదాహరించిన పద్యభావమువల, గ్రహింపవచ్చును.

*ఓ స్వామి నీ గీతము నేవిధముగ గానము చేయవలెను
ఈ దాసి నీ చూపుకొరకు పిచ్చిదైనది
దీపమును చుట్టు శలభమువలె స్వామి చూపుకొరకు
తా నున్మాదిని యైనదని వ్రాసినది.

ఈ విధమైన బాధ, ఆకర్షణ కేవలము ప్రేమికులు మాత్రమె గ్రహింప గలుగుదురు.

ఈమె పేరును భువనేశ్వరమిశ్ర తన సంస్కృత సాహిత్య చరిత్రయందు ప్రతిపాదించినాడు.

---

1. बावरी रावरी का कहिये, मन है के पतंग भरै नित भाँवरी ।
भाँवरी जानहिं संत सुजान जिन्हें हरि-रुप हिये दरसावरि ॥
साँवरी सूरत, मोहिनी मूरत देकर ज्ञान अनंत लखावी ।
खावरी सौहं तिहारी प्रभु, राति रावरी देरीव भई भति बावरी ॥

*సవయా :- ఇది యొక ప్రత్యేక ఛందస్సు. దీనికి చెందిన ఒక్కొక్క పాదమునందు 22 మొదలు 26 వరకు అక్షరములుండును.

ఇందుమతి :

ఈమె 17వ శతాబ్దమున పన్నా సంస్థానమందుండినది. ఈమె ధామి సాంప్రదాయమునకు చెందిన ప్రాణనాథ్ అను సాధువునకు భార్య.

ఇందుమతి మరియు నామె భర్త కలసి రచించినట్లుగ పన్నెండు పుస్తకముల పేర్లు గానవచ్చుచున్నవి. హిందూ మహమ్మదీయుల ఐక్యమును సాధించుట కీమె ధామి పంథను కనుగొనినది.

'దీన్ ఇలాహి', 'సత్యపీర్ కీ పూజ' అను సిద్ధాంతముల ప్రచార ద్వారమున పై జాతుల ఏకత్వమును సాధించుటకు పూనుకొనినది. తనకు చిన్ననాటినుండియు పరిచితములైన మత ధర్మములను కాదని, సనాతన సాంప్రదాయముల వదలిపెట్టి. ముఖ్యముగ నూతన భావములన జంకు చుండిన రోజులలో ఇందుమతి ఇట్టి నూతనమార్గము నవలంబించుటయన సామాన్య విషయముకాదు. ఇది ఎంతయో సాహసముతో కూడుకొనినపని.

ఈమె రచించిన గ్రంథములు :

1. కితాబ్ జమ్భూర్,
2. ఘటరల్,
3. షట్ బుతు,
4. షద్రుత్-నో-కలాస్,
5. బారహోమాసి,
6. ఖలావత్,
7. రామత్ రహస్య,
8. పరిక్రమా
9. ఖులాన్ సాగర్.
10. ఆధోసాగర్,
11. ఖయామత్ నామా ఛోటో,
12. ఖయామత్ నామా బాడో,

మరియు 13. కీర్తన్ అనునవి.

ఈ పుస్తకములం దీమె ధామి మత సిద్ధాంతములను ప్రతిపాదించు విషయములనుగూర్చి రచించినది.

భగవద్గీతయొక్క దశమస్కంధము నాధారముగ 'కృష్ణలీలను', ఇస్లాం మతము ప్రతిపాదించునటుల ఏకేశ్వరారాధనమును రచించినది. మరియు సూఫీ కవులు సంవత్సరమునందలి షడృతువుల కానవచ్చు విరహ మును వర్ణించినటులనే తాను విరహవర్ణనము గావించినది.

ఈమె రచనలయందు సాధారణముగ హిందూ మహమ్మదీయ మత సామరస్యము గోచరించుచుండును. ఈమె గ్రహించిన విషయములను బట్టియే, ఈమె హృదయము విశాలమైన దనియు, ఈమె దృష్టి సంకుచితమైనది కాదనియు, గ్రహింపవచ్చును. దేశ క్షేమమునకు, పరస్పర మతములం దధిక విభేదము లేర్పడ, కేవలము పురాతన మార్గమునబట్టి ప్రాకులాడుట, అంత మేలు కాదని గట్టినమ్మకము గలది.

ఈమె తన గ్రంథముల నన్నిటిని ప్రధానముగ బుందేలుఖండ్ భాష యందు రచించినది. అక్కడక్కడ సంస్కృతమును, ఇస్లాం మత తత్వముల ప్రతిపాదించునప్పుడు పరిష్యన్ పద జాలమునుకూడ వాడినది. [1]ఉదాహరణమునకు ఈ క్రిందిపద్యము చూడవచ్చును.

**సహజోబాయి :**

ఈమె దాదాపు 1743 నుండి 1800 వరకు జీవించినది. ఈమె ఢిల్లీ నివాసినిగ గోచరించును.

ఈమె రచించిన ఒకానొక పద్యమును పురస్కరించుకొని యీమె జీవిత విశేషములు కొన్ని తెలియవచ్చుచున్నవి. [2]అవి, తాను హరిప్రసాదు కుమార్తెయైన సహజోబాయి యనియు, దూసర వంశమునకు చెందిన దనియు తన జీవితమును సమర్పించిన చరణదాసునకు శిష్యురాలనని చెప్పిన విషయములు. ఆ గురువే, అధికతర యోగముచేతకూడ సాధ్యము కాని ముక్తిమార్గమును తనకు చూపినవాడని చెప్పినది.

---

1. सव तन विरहे खाइया, गल गया लोहू मांस
   न आवे अंदर-बाहर या विधि सूकत मांस ।

2. हरि प्रसाद की सुता नाम है सहजो बाई ।
   दूसर कुल में जन्म सदा गुरु चरण सहाई ।।
   चरणदास गुरुदेव सेव मोंहि अगम बसायो ।
   जोग जुगुत सो दुर्लभ, सुलभ करि दृष्टि दिखायो ।।
   चरन दास पर तन मन वाँरूँ,
   गुरु न तजं हरी को तज डारूँ ।

ఈమె దాదాపు నలువది పద్యములను వ్రాసినట్లు గోచరించు చున్నది. ఈ పద్యములన్నియు చరణదాస రచనలయందు కానవచ్చు చున్నవి. ఈమె కబీరుదాసువలెనే తన గురువుకూడ భగవంతునితో సమానుడని నమ్మినది. అవసరమైనచో భగవంతుని విడువగలదు. కాని గురువునుమాత్రము వదలిపెట్టలేదట.

ఈమె గ్రహించిన కావ్యవస్తువులు, సద్గురుమహిమ, గురుమహిమ, సాధుమహిమ, దశాంగనామ, వైరాగ్యములు. ఈమె ప్రధానముగ నిర్గుణ భక్తి సిద్ధాంతములనే ప్రతిపాదించినప్పటికిని, ఒకవైపు కబీరుదాసును పోలినట్లును, మరొకవైపు సూరదాసును పోలి సగుణభక్తిని యారాధించి నట్లుగ నీమె రచించిన కావ్యములందు వ్యక్తమగు భావములవలన గోచ రించును.

ఉదాహరణమునకు :

[1]"పుత్రకళన్తర్ కోన్ కే మాయీ తరూ బంధా" అనియు.

[2]"అబ్ తుమ్ అప్నీ ఔర్ నియారో
హమారె అవగుణ్ చిత్ నాహి జాయో" అనియు వ్రాసినది.

ఈ విధములైన భావములు ప్రజలకు సహజములై, వారి మానసిక పరివర్తనము చూపుటకు, అనుగుణములై యున్నవి.

ఈమె ప్రపంచముయొక్క అశాశ్వతత్వమునుగూర్చియు, భోగ ములయొక్క క్షణికత్వమునుగూర్చి, నిర్గుణ బ్రహ్మ సిద్ధాంతములగూర్చి బోధించినది. ఈ పై విషయములన్నియు నీమె నిర్గుణ భక్తిమార్గమును ప్రతిపాదించు సాధువుయొక్క శిష్యురాలని నిరూపించుచున్నవి.

ఈమె ఉత్తమమైన పాండిత్యమును కలిగియుండి తాను చేబట్టిన గంభీర విషయములకును, ఉదారభావములకును అనుగుణమైన భాషనే

---

1. पुत्र कलन्तर कौन के भाई परु बन्धा।
2. अब तुम अपनी ओर निहारो।
हमारे औगुण पै नहि जाओ, तुम्ही, विरद सम्हारो।

వాడగలిగిన శక్తిమంతురాలు. ఈమె సాధారణముగ బ్రిజ్ భాషనే వాడినది.

దయాబాయి :

ఈమె (1752-1805) సంవత్ ప్రాంతమున వెలసిన స్త్రీ కవయిత్రి. ఈమె ఢిల్లీ నివాసినిగ గోచరించును. మరియు నీమె సాధు చరణదాసు యొక్క శిష్యురాలు. కొందరీమెను సహజోబాయి యొక్క సోదరియని కూడ నందురు. ఈ ఇద్దరు కవయిత్రులొకే గురువునకు శిష్యురాండ్రగుటయు, ఒకే ప్రదేశమునందు నివసించుట మున్నగు విషయములు, వీరిద్దరక్కాచెల్లెండ్రను భావమునకు దారితీసి యుండవచ్చును.

ఈమె గురువునందు అచంచలమైన భక్తికలది. ఈ భావమునే తాను

[1]"చరణదాస్ గురుదేవ్ బ్రహ్మరూప్ సుఖధామ్

తాపహరన్ సబ్‌సుఖ్ కరన్ దయాకరత్ ప్రదామ్" అని వ్రాసినది.

దీనినిబట్టి గురువు సమస్తములైన తాపములను హరించి సుఖముల నిచ్చు బ్రహ్మరూపముతో సమానమైన శక్తికలవాడని, నిరూపించుచున్నది. ఈమె గ్రహించిన కవితావస్తువులు, సాధారణముగ, గురుమహిమ, ధ్యానము, ప్రేమ, తపశ్చర్య మున్నగునవి.

ఈమెకు దయా, దయాదాసి, దయాకున్‌వారి అను పేర్లున్నట్లుగా నీమె కావ్యములందు గోచరించును.

1. దయాబోధ, 2. వినయమాలిక. అనునవి

ఈమె రచించిన గ్రంథములు. కాని రెండవ గ్రంథమీమె రచించినది కాదని కొందరు విమర్శకులు, అభిప్రాయపడుచున్నారు. ఈమె నిర్గుణ భక్తి సిద్ధాంతములను ప్రతిపాదించుటయందును, గంభీరములైన భావముల

1. चरनदास गुरु देव जू, ब्रह्म रूप सुख धाम
ताप हरन सब सुख करन, दया करत परनाम ॥
पंथ प्रेम को अटपटी कोइय न जानत वीर
कै मन जानत आपनो कै लागी जेहि पीर

వెలిబుచ్చుటయందును, పటిష్ఠమైన భాషను వాడుటయందును ఏ మహా కవికినికూడ తీసిపోని కవయిత్రి. ఈమె ఉదాత్తములైన విషయములను చేతబట్టికూడ ఏ విధమైన విసుగును పాఠకులకు కలిగింపకయే రచలను సాగించునట్టి జాణ. ఈమె స్త్రీ హృదయమునకు సహజమైన ప్రేమ, దయ మున్నగు భావములను ప్రకటించుటయందు మీరాబాయితో పోల్ప వచ్చును. ఈమెకు భాషయందు పరిపూర్ణమైన అధికార మున్నట్లు గోచరించును.

సహజోబాయి తా ననుసరించు మార్గముయొక్క సిద్ధాంతములను గూర్చియు, భావములను గూర్చియు అధికమైన అభినివేశమును కనబరచగ, ఈమె తన భావములను పరిపూర్ణముగ బయలుపరచుటకు ప్రయత్నించినది. అందులకే ఈమె తన కవితకు స్త్రీ సహజమైన కోమలత్వమును సంతరించినది. ఈమె ప్రబోధకురాలుగ కాక శిష్యురాలుగనె యధికముగ రాణించినది.

## నాల్గవ అధ్యాయము

## సగుణభక్తి

ఈ మార్గానుయాయులకు శ్రీరామ, శ్రీకృష్ణులందు, శ్రీ మహా విష్ణువుయొక్క అవతారములను నమ్మకము కలదు. అయ్యును పరమాత్మ భావమునందుకూడ విశ్వాసముకలవారు. ఈ పరమాత్మనే వీరు అనాదియని పరిణామరహితుడని, రూపరహితుడని భావింతురు. సాధారణ మానవుడు పైన పేర్కొనబడినట్టి పరమాత్మను గ్రహించుట యసాధ్యమనియు, అట్టి పరమాత్మను పూజించుట, అంతకన్న కష్టతరమని ఎరింగినట్టివారు. మానవులయొక్క కష్టములను పారద్రోలి, దయామయుడై పాపుల దోషముల మన్నించి, వారికి ఆనంద, సంతోషముల గలిగించుటకును, ప్రపంచ సంబంధమైన భయములను నివారించి శాశ్వతమైన మోక్షమును ప్రసాదించువాడు భగవంతుడేనని వీరు గ్రహించినారు.

నిర్గుణ సిద్ధాంతమును ప్రతిపాదించు సాధువులు, పంచేంద్రియముల నియమించుట యందును, నానా కోరికలకై పరుగెత్తు ఇంద్రియ వ్యాపారముల నరికట్టుటయందును, అధికమైన శ్రద్ధను వహించి, కఠినమైన నియమముల నేర్పరచిరి. ఈ నియమాచరణకు స్త్రీలు, గొప్ప ప్రతిబంధకములై నిలచినారు. పురుషచిత్తాకర్షణకు స్త్రీ ప్రధానకారణము కాబట్టి యామె దర్శనమునే పరిహరించినారు. ఏదేని సందర్భమువచ్చినచో స్త్రీని అగౌరవమైన మాటలతో సూచించువారు. అట్టియెడ స్త్రీలకు ఎట్టి భక్తిమార్గమునందు ప్రవేశించి పాలుపంచుకొనుటకు తావులేకుండెడిది. అందు కొరకే స్త్రీలు రామ, కృష్ణులను పూజించుటకు మొదలిడి, ఆ పూజయందు కొంత సుఖశాంతులను పొందగలిగినారు.

## రామ భక్తిమార్గము

తులసీదాసు తన రామచరిత కావ్యమునందు, విస్మృతమైన హైందవ సంఘమును, దానియొక్క సంస్కృతిని పరిపూర్ణముగా చిత్రించినాడు. ఈ చిత్రణము హైందవ సంఘమునందొక నూతన జీవితమును ప్రారంభింపజేసినది. కాని ఇతడుకూడ ప్రాచీనులవలెనే, పురుషునకు స్త్రీని విధేయగనె చూపి, ఆమె పురుషునకు సొమ్ముమాత్రమేకాని ఆమె కొక సొంత మనుగడ లేనట్లుగ ప్రతిపాదించినాడు. ఈ విధమైన రచనలు స్త్రీలను బాధపరచి మరింత క్రుంగదీసినవి. ఇంతేగాక తులసీదాసు అష్టవిధతౌల్యములకు స్త్రీలే కారణమని వ్రాయగ, సంఘమునందుగాని, మతమునందుగాని, తమ కాధారములేకపోవుటచే స్త్రీలు, రామునియొక్క శీలసౌందర్యములచేతను, ఆతనియొక్క ధైర్య సాహసములచేత నాకర్షింపబడి, అతని గుణగణములను భక్తిపారవశ్యముచేత గానము చేసినారు.

ఇంతేగాక తులసీదాసు రామచరిత మహాకావ్యమునందు ప్రదర్శించిన పాండిత్యము, తత్వము, స్త్రీల కందుబాటునందు లేకపోవుటచే, దానిని స్త్రీలలో పర్యావృత్తము గావించుటకు, స్త్రీలు గేయకవిత్వమును వ్రాయుటకు ప్రారభించినారు.

రామచరితముచేత నాకర్షింపబడిన కవయిత్రులు భగేలి విష్ణుప్రసాద్ కన్వారి, తులఛ్‌రాయ్, ప్రతాప్‌కున్వారిబాయి, రూప్‌దేవి, రాంప్రియ, రత్నకున్వారిబాయి మొదలగువారు.

## భగేలి విష్ణుప్రసాద్‌కన్వారి (కువరి) :

ఈమె 19 వ శతాబ్దమున జోద్‌పూర్‌నందు జన్మించినది. ఈమె రివా సంస్థానపు ప్రభువైన మహారాజ రఘునాథసింగ్ యొక్క కుమార్తె. మరియు జోద్‌పూర్ మహారాజైన యశ్వంతసింగ్ తమ్ముడగు మహారాజా కిశోర్‌సింగ్ యొక్క భార్య.

ఈమె రాంసాంచి సాంప్రదాయమునకు చెందినది. దయాళ్ అను గురువునకు శిష్యురాలు. ఈమె రచించిన గ్రంథములు :

1. అవధవిలాస్, (Avadhavilas)
2. కృష్ణవిలాస్, 3. రాధావిలాస్. అనునవి.

ఈమె రామభక్తియందు విశ్వాసము కలదియైనను, శ్రీకృష్ణునకు భక్తురాలుగ అనేకములైన పద్యములను రచించినది. ఈమె శ్రీకృష్ణుని, శ్రీరాముని యొక్క అవతారమని భావించినది. పై పేర్కొనిన గ్రంథములే గాక అనేకములైన పదములనుకూడ నీమె రచించినది. అవి వివిధములైన విషయముల నాకళించుకొని యొప్పుచున్నవి.

ఉదాహరణమునకు :

అనురాగలీల, దంపత్‌మోహిని, దధిలీల, పన్‌ఘట్‌లీల, హిందోళా, వర్దన్ మున్నగునవి.

ఈమెకు కావ్యకళయందు తగినంత ప్రవేశముండుటచేతనే ఈమె రచించిన గ్రంథములు సాహిత్య కళాఖండములుగ పరిగణింపబడు చున్నవి.

ఈమె చేపట్టిన భాష బ్రిజ్ భాషతో మిశితమైన రాజస్థానీభాష.

## తులఛ్‌రాయ్ :

ఈమె 19 వ శతాబ్దియందు జోద్‌పూర్‌నందు వెలసినది. ఈమె మార్వార్ దేశపు ప్రభువైన మహారాజ మాన్‌సింగు యొక్క ప్రియురాలు.

ఈమె రాణి ప్రతాప్‌కున్వారీతో సహకవితా సాధనము చేసినట్లుగ కానవచ్చుచున్నది. ఈ విషయమునుగూర్చియే రాణీ ప్రతాప్ కున్వారి "నేను తులఛ్‌రాయి కలసియే మాట్లాడుకొందు" మని వ్రాసినది.

ఈమె రాముని పురస్కరించుకొని కొన్ని, శ్రీకృష్ణు నాధారముగ కొన్ని పదములు రచించినది. [1]ఈమెకు రాగరాగిణి సంబంధమైన జ్ఞాన మధికముగ కలదు. ఈమె గీతములు అధికతర మధురములై యుండును.

ఈమె రాజస్థానీ భాషతో మిశితమైన బ్రిజ్ భాషను వాడుచు, అక్కడక్కడ సులభ సంస్కృత పదములను చూపించుచుండును.

ప్రేరణ ఫిబ్రవరి 1963, పుట 50.

## ప్రతాప్‌కున్వారీబాయి :

ఈమె జోద్‌పూర్ ప్రాంతమునందలి జౌఖాద్ సంస్థానమునందు వెలసినది. జాఖాద్ ప్రభువైన గోజన్‌దాసు యొక్క కుమార్తెయై మార్వార్ దేశపు ప్రభువైన రాజా మానసింగ్‌ను వివాహమాడినది.

ఈమె బాల్యమునుండియే సునిశిత బుద్ధికలదియై చదువునందు అధికమైన శ్రద్ధను కనబరచునది. ఈ విషయమును గ్రహించి తండ్రి ఈమె చదువుకొరకు కొన్ని సదుపాయములు గావించినాడు. రామభక్త పూరణ్ దాసు నెడ నీమె యత్యంత గౌరవమును ప్రదర్శించునది. ఇతనిపై గల గౌరవమే యీమెయందు భక్తిభావములను నాటినది. ఈమె వివాహిత యైన అచిరకాలముననే వితంతువగుటచేత, రానురాను భక్తిభావము, ఈమె హృదయమునందు మరింత గాఢముగ నల్లుకొనినది.

ఈమె తన సమయమునందలి చాలకాలమును, పూజయందును, దానధర్మములందును వెచ్చించునది. ఈమె పురన్‌దాస్, గోస్వామి,

1. तलछराय नै सगं थे दीज्यो।
भिल दोउ करस्यों बात।
सीता रामजी सू खेली मैं होरी
भरलूं गुलाल की झोरी ॥

దామోదరదాసులయందు అత్యంత భక్తిశ్రద్ధలుకలిగి వారిపేర్లపైననే జోధ్‌పురమునందు రామద్వారమును కట్టించినది. ఈమె యనేకములగు దేవాలయములను గట్టించుటయే గాక బీదలకును, బ్రాహ్మణులకును దానముల గావించునది.

ఈమె రచించిన ప్రతిపుస్తకమునందును శ్రీరాముని యొక్క భక్తినిగూర్చియే గానముచేసినది.

ఈమె రచించిన గ్రంథములు :

1. రామచంద్ర మహిమ,
2. రామ గుణసాగర్,
3. రఘువీర స్నేహలీల,
4. రామ సుజాస్ పచ్చీసీ,
5. రామ సుఖసాగర్ పత్రిక,
6. జ్ఞానప్రకాశ్,
7. రఘునాథ్‌జీకె కవిత్,
8. భజనపదహరి జాసా,
9. ప్రతాప వినయ,
10. శ్రీరామచంద్ వినయ,
11. హరిజాస గాయన,
12. జ్ఞానసాగర్. అనునవి.

ఈమె తనయొక్క భర్త, తండ్రులచేత లాలింపబడుచు తన జీవితమును సుఖవంతముగ గడిపినది. ఈ విషయము, ఈమె రచించిన గ్రంథములందు గోచరించును. వినయశీల, విశ్వాసపాత్రురాలైన భార్యవలెనే ఈమె ఉత్తమ గృహిణీధర్మములనుగూర్చి కొన్ని నియమముల నేర్పరచినది. [1]"భర్తకు విశ్వాసపాత్రురాలై, అతనికి విధేయతను గనబరచుటయే ప్రపంచ ధర్మములలో నెల్ల ఉత్తమ ధర్మము స్త్రీలకు" అని వ్రాసినది. ఈ విధముగ ఈమె రచనలయందు గృహజీవితమును ప్రతిబింబింపజేసిన, ఈమె తన భర్తచేత ప్రేమింపబడి, అతని మృతితరువాత ఏకాంతమును సహింపలేక బాధపడినది. కాని తన ఆజ్ఞానువర్తియగు కుమారునివలన, తన విచారము లన్నియు మరచిపోయి తిరిగి సుఖము ననుభవింపగలిగినదని ఈమె రచనలవలననే తెలియుచున్నది.

---

1. धर्म अनेक कहे जग माहीं
   तिय के पतिव्रत सभ कुछ नाहीं ।
   पति वियोग दुखभयो अपारा । हुआ सकल सूना संसारा
   देख देख सुत प्राज्ञाकारि । कघु इक दुःख की बात विसारी ।

ఈమె అక్కడక్కడ ఫారసీ పదములతో కూడిన ఔధిభాషయందు రచనలను గావించినది.

రూప్‌దేవి :

ఈమె (1908 - 1924) సంవత్ నందు ఆల్వార్ ప్రాంతమున నివసించినది. ఈమె తండ్రిపేరు అమర్‌సింగ్ ఆల్వార్ సంస్థానాధీశుడైన రాజా వినయసింగ్ అను నాత డీమె భర్త.

ఈమె రచించిన గ్రంథములు :

(1) రూప్‌మంజరి,

(2) రామరస,

(3) రూప్ రుక్ - మాని మంగల్.

ఈమె రచించిన పుస్తకములకు సాహిత్యమునం దెంతయో ప్రాధాన్యము కలదు. శ్రీకృష్ణ భక్తులు శ్రీకృష్ణదేవుని రాసలీలలను వర్ణించినట్లుగనె ఈమె శ్రీరాముని రాసలీలను రామరస యను గ్రంథమున వర్ణించినది.

ఈమె వాడిన వృత్తములు తులసీదాసు రామచరితమునందు వాడినట్టి 'దోహా', చంపై, సవయ్యే మున్నగునవి. ఈమెకు అలంకారములు వాడుటయందున్న అధికారము, అభినివేశము లత్యంత ప్రశంసనీయములైనవి. ఈమె కావ్యములందు ప్రకృతి సౌందర్యవర్ణన అధికమై గోచరించును.

రాగరాగిణులయొక్క జ్ఞానముకూడ ఈమెకు చాలినంత గలదు. ఈమె రాజస్థానీ భాషచేత ప్రభావితమైన బ్రిజ్ భాషను వాడినది.*

రాంప్రియ :

ఈమె పేరు నిజమునకు రఘ్‌రాజ్‌కున్వారి. ఈమె ప్రతాప్‌గఢ్ సంస్థానాధిపతియైన రాజా ప్రతాప్ బహద్దూరునకు భార్య.

---

*Her name is given in prerana Feb. 1963. Page 55.

ఈమె రామకృష్ణు లిద్దరియందు భక్తిప్రపత్తులు గలిగి ఇద్దరినికూడ పూజించునది. స్త్రీ స్వాతంత్ర్యమునం దభినివేశము గలిగిన యీామె ఆ సందర్భమునం దేర్పరచిన సభలందుకూడ పాల్గొనునది. "రామ ప్రియ విలాస" మనునది ఈమె రచించిన గ్రంథము.

ఈమె సంస్కృత పదములతోకూడిన బ్రిజ్ భాషను ఉపయోగించినది.

రత్నకున్వారీబాయి :

ఈమె ప్రఖ్యాత కవయిత్రియగు రామభక్త రాణి ప్రతాప్‌కున్వారి యొక్క మేనకోడలు. ఈమె శ్రీరామచంద్రుని యొక్క సౌందర్యమును, అతని గొప్పతనమును వర్ణించుచు కొన్ని పదములను వ్రాసినది.*

కృష్ణభక్తి :

శ్రీకృష్ణు డాధారముగ రెండు విధములైన భక్తిమార్గములు ప్రబలినవి. ఒక విధమైన మార్గమునందు రుక్మిణీ సహితుడైన శ్రీకృష్ణు పూజయు, మరియొక విధానమునందు రాధాసహితుడైన శ్రీకృష్ణుపూజయు గోచరించుచున్నది.

నింబారక, విష్ణుస్వామి, వల్లభాచార్య, చైతన్య మున్నగు భక్తు లందరు రాధాసహితుడైన శ్రీకృష్ణుని పూజించు భక్తిమార్గమునకు చెందినవారు. మరియు మహారాష్ట్ర సాధువులైన జ్ఞానేశ్వరుడు, నామదేవ్, ఏకనాథుడు, తుకారాం మున్నగువారు, రుక్మిణీ సహితుడైన శ్రీకృష్ణుని పూజించు మార్గమునకు చెందినవారు. ఈ మార్గానుయాయు లిద్దరుకూడ భార్యాభర్తల మధ్యనుండు పవిత్రమైన ప్రేమను గ్రహించినవారే. రుక్మిణీ కృష్ణుల ప్రేమకన్న రాధాకృష్ణుల ప్రేమయే మధురభక్తి మార్గమునకు

---

* १. रुप गुणन प्रागारो रे
२. मेरे मन मोये रंगीले राम
उसकी छवि निरखत ही मेरो विसर गयो सब काम
अस्टयाम मेरे हिरदे बिच, प्रान कियो निज धाम ।।

దారితీసినది. 12 వ శతాబ్దమునందలి జయదేవుని గీత గోవిందముతో ప్రారంభమైన ఈ ప్రేమ విధానమునే గ్రహించి 16 వ శతాబ్దమునందలి వైష్ణవకవులు రాధాకృష్ణుల ప్రేమనుగూర్చి గానముచేసినారు. వీరందరిలో ప్రధానముగ గణింపబడునది మీరా కవయిత్రి.

వల్లభాచార్యుడు 16 వ శతాబ్దమునందు శుద్ధ అద్వైతమును ప్రచారము గావించి, భగవంతుని యొక్క దయానుగ్రహములను పొందిన వారు గోలోకము (కృష్ణలోకము) నకు వెళ్లుదురని ప్రతిపాదించినాడు. ఈ మార్గము ననుసరించి భక్తుడు, భగవంతునిని స్నేహితుడుగను, బిడ్డగను, తల్లిగను, భార్యగను ప్రేమించి ఆరాధించ వచ్చును.*

## కృష్ణభక్తి కావ్యములు

**మీరాబాయి :**

ఈమె దాదాపు (1560-1603) సంవత్ ప్రాంతమున వెలసినట్టి కవయిత్రి. చౌకాదియను గ్రామము ఈమె జననముచేత పవిత్రమైనది. ఈమె రత్నసింగ్ రాథోర్ నకు కుమార్తెగ జన్మించి, ఉదయపురి యొక్క మహారాణా భోజ్‌రాజ్ అను నాతనిని వివాహమాడినది. ఈమె తన బాల్యమునుండియే కృష్ణుని పూజించుచు అతనియం దధికానురాగముగలది యైనది.

ఈమెకు తన వివాహానంతరముకూడ శ్రీకృష్ణభగవానునియందు కలిగిన భక్తి యధికము కాజొచ్చినదేకాని ఏమాత్రమును తరిగిపోలేదు. ఈమె వివాహితయైన కొలదికాలమునకే వితంతువైనది. నాటినుండి శ్రీకృష్ణునియందలి భక్తియే ఈమె జీవిత ప్రధానాశయమైనది. ఈమె ధన కనక వాహన వస్తుసంపత్తితోకూడ ప్రపంచమును త్యజించి సన్న్యాసినియై తన జీవిత సర్వస్వమును భగవంతున కర్పించినది.

ఈమె భగవంతుని ఒక ప్రియునివలెచూచి యారాధించినది. అతనితో సంగమమును పొందుట కీమె హృదయము సదా తహతహలాడుచుండట.

---

*जित बैठाओ तित ही बैठू बेचे तो बिक जाऊँ

*"నిన్ను కలియుటకు నేను కోరుచున్నాను ప్రియ. కలిసెద వెప్పుడో యీ వినీతదాసిని" అని ఈమె భగవంతునిగూర్చి ప్రార్థించినది.

ఈమె శ్రీకృష్ణుని దయా, ప్రేమ మున్నగువానిని తెలిసికొనుట కొరకు సాధువులయొక్క సభా, సమావేశములయందు పాల్గొనునది. ఈ విధముగ తాను శ్రీకృష్ణుని గూర్చి తెలిసికొనుటకు ఉన్నత రాజవంశ మునకు చెందినదయ్యు ఘోషా పద్ధతిని కాదని, సర్వసాధారణులతో మెలగుట మున్నగు తదితర విధానములవలన మీరా తన బంధువులవలన అధికముగ బాధింపబడినది. కాని భగవంతునియందు ప్రగాఢమైన భక్తి, ప్రేమ అచంచలమైన విశ్వాసములు గలిగిన ఈమె తన ప్రయత్నమును మాత్రము మానలేదు. కొందరు బంధువులు ఈమెకు విషప్రయోగమును చేయుటకు కూడ జంకలేదట. ఈమె తన స్వగృహమును వీడి, బృందా వనము, మధుర మున్నగు ప్రాంతములను దర్శించుచు, చివరకు శ్రీకృష్ణుని నివాసమైన ద్వారకను ప్రవేశించి తన జీవితకాలమంతయు నచటనే గడిపినది.

ఈమె అవలంబించినది చైతన్య మహాప్రభువు ప్రతిపాదించిన మధుర భక్తిమార్గము. ఈమె తన గురువైన సాధురాయదాసు, మరియు చైతన్య మహాప్రభువులయొక్క పవిత్ర నామములను కీర్తించినది.

ఈమె కవితయందు భాషాపటిమకన్న భావ గాంభీర్యము, అధిక ముగా నుండును. ఉదాత్తములైన ఈమె భావములు, భక్తిశ్రద్ధలు, ప్రతి మానవుని హృదయమును పులకితము గావించుచున్నవి.

ఈమె రచించిన పదములు, పాటలు, పద్యములన్నియు బ్రిజ్ భాషా మరియు హిందీ భాషయందు వ్రాయబడినవి.

ఈమె రచించిన గ్రంథములు :

1. నెర్సీజికి మాయియా,
2. గీత గోవింద్‌కి టీకా,
3. రాజ్ గోవింద్,
4. మీరాకి పదాఁయే (మీరాపదములు),
5. మీరానిగెర్బి,
6. పాటలు.

చంద్రిసఖి :

ఈమె జీవితమునుగూర్చిగాని, జన్మస్థానమునుగూర్చిగాని, తలిదండ్రులను గూర్చిగాని ఏ విశేషములు తెలియరావు. కాని నవయుగ గ్రంథ కుటీర్ వారు ప్రకటించిన "చంద్రసఖికా భజన్" అను దానిలో నీమె పాటలు కానవచ్చుచున్నవి. ఈమె పాటలను శ్రీ నరోత్తమ, M.A. గారు ఈ క్రింది విధముగ విభజించినారు. అవి :

1. వినయ, 5. ప్రేమమాధురి,
2. బాలకృష్ణ, 6. విరహావేదన,
3. రాధాకిషన్, 7. ఉత్తమ సంవాద,
4. మురళీ మాధురి, 8. కర్మగీత అనునవి.

ఈమె మీరావలెనే పరదా మున్నగు పురాతనపద్ధతులను వదలిపెట్టి తన జీవితమంతయు శ్రీకృష్ణ భక్తికై ఎత్తు కట్టినది.

[1]"జనానీకము నన్నుచూచి నవ్వినా
నా ఘనతకొక లోపము వచ్చినా,
నా హృదయము మాత్రము
బృందావనముననే పయనించును" అని గానముచేసినది.

ఈమె పదములు, పద్యములు మాధుర్యమును పుణికి పుచ్చుకొని మీరాబాయి పదములని తోపింపజేయుటకూడ వింతయైనది. అందుకొరకే అనేకమారులు పాఠకు లీమె పదములను మీరాబాయి పదములుగ భావించుటకూడ జరుగుచున్నది. ఈమె పద్యములందలి మాధుర్యమునుబట్టి, ఆ నడకయందలి సొగసునుబట్టి, జానపదగీతము లట్టివి దేశపు నలుమూలల గానము చేయబడుచున్నవి.[2] ఈమె భాష బ్రిజ్ భాషకు చెందినది. ఈమె ఝుమ్రీలను వ్రాయుటయందు పేరువడసినది.

---

1. मन वृन्दावल चाल बसरे। मान घटो चाहे लोग हो तेरे।
2. कैसे व्यांह राधे कन्हैयो तेरो कारो।
घर घर री वो गऊ चरावै, ओढ़ण कवंल कारो।
छीन झपट दधि खात विरज में चलै गो कैसे राधे को गुजारो।
मोरी राधा अजब सुन्दरी, तेरी कन्हैयो कारो।

రాణీ రత్నావతి :

ఈమె రాజా మధుసింగ్ యొక్క భార్య. ఈ మధుసింగ్ రాజా మాన్‌సింగ్ యొక్క సోదరుడని ప్రతీతి. ఈమె తనభర్తయొక్క ఆజ్ఞలకు, అభిప్రాయములకు విరుద్ధముగ శ్రీకృష్ణునియందు భక్తికలదియై సాధు పుంగవుల సభా సమావేశములకు వెళ్లుచుండునది. ఇట్టి ఈమె చర్యలచేత క్రుద్ధుడైన ఈమె భర్త ఈమెను వృథాగ చంపుటకు ప్రయత్నించినాడు.

ఈమె భగవద్భక్తురాలైన మరొక దాసీతో కలసి శ్రీకృష్ణుని గూర్చి గానము చేయునదట. ఈమె రచించిన గ్రంథము లెవ్వియు గానరావు. ఈమెపేరు, కళ్యాణ్ జనవరి ప్రత్యేకసంచికయందు గోచరించు చున్నది.*

ప్రేరణ ఫిబ్రవరి 1962, పుట 87.

మహారాణి సోనేకున్వారి :

ఈమె 18వ శతాబ్దమునందు జయపూర్‌నందు వర్ధిల్లినది. ఈమె రాధావల్లభ్ సాంప్రదాయమునకు చెందినది. ఈమె రచించిన పాటలను శ్రీకృష్ణోత్సవ సందర్భములందు ప్రజలు గానముచేయువారట. ఈమె సువర్ణవల్లియను పేరుతో అనేకములైన పదములను రచించిన కవయిత్రి.

ఈమె రచించిన గ్రంథము 'సువర్ణబెలీ' యనునది.

రసిక్‌బిహారీబనీరణజీ :

ఈమె (1747-1822) సంవత్ ప్రాంతమున కృష్ణగఢ్ నందు వర్ధిల్లినది. ఈమె నాగరీదాస్ అను సాధువుయొక్క సాహచర్యమునం దుండినది. ఈమె యాతని సాహచర్యముచేతనే కావ్యకళను సంపాదించు కొని యాతడు సన్న్యసించినప్పుడు, ఈమెకూడ అతనిని అనుగమించినది.

ఈమె పద్యములు సాధారణముగ రాధాకృష్ణుల ప్రేమగాథల

---

*कघुक उपाय की जै मोहन दिखाय दीजै
तब ही तो जीजै, वे तो आनि उर अरे हैं ।

నాధారము చేసుకొనియే యుండును. రాధామాధవులయం దీమె రాధకే ప్రాధాన్యము నెక్కువగ నిచ్చినది.

ఈమె రాధయొక్క సౌందర్యమునకు, శృంగార లీలకు లోబడి ముగ్ధయైనది. [1]రాధ జన్మ సందర్భమునందలి సంతోషాధిక్యమును వర్ణించు సందర్భమునం దధికమైన అభినివేశమును గనబరచినది.

శ్రీకృష్ణ జన్మోత్సవము, హోలి, రాధజననము, పన్‌ఘట్ లీల మున్నగు విషయములను కావ్యవస్తువులుగా స్వీకరించినది.

ఈమె భాషపై మంచి అధికారము కలది. ఛందస్సునుగూర్చిన ఉత్తమ జ్ఞానము గలిగిన ఈమె రాగరాగిణుల యొక్క పరిచయమును కూడ సంపాదించుకొని కవిత్వమును చెప్పనేర్చినది.

ఈమె సాధారణముగ రాజస్థానీ భాషతోకూడిన బ్రిజ్ భాషను ఉపయోగించును. ఈమె రచించిన పదము లనేకములు నాగరసంపుటము లందు గానుపించుచున్నవి. ఈ పదములన్నియు "అనాకారి" అను పేరుతో వ్రాయబడి యున్నవి. మరికొన్ని పదములు, ద్విపదలు, 'ఉత్సవమాల' యందు సొంతపేరుతో గానవచ్చుచున్నవి.

## గంగాబాయి (విఠల్ గిరిధరణ్) :

ఈమె విఠల్‌నాధుని యొక్క శిష్యురాలు. విఠల్‌నాధ్ యొక్క పదములతో సహా విఠల్‌గిరిధారిణీ అను పేరుతో నీమె పదములుకూడ కానవచ్చుచున్నవి. ఈమె తన గురువువలెనే శ్రీకృష్ణుని యొక్క బాల్య లీలను తన కావ్యవస్తువుగ గ్రహించినది.

సాహిత్య దృష్టిలో నీమె పదములకంత ప్రాధాన్యములేదు. స్త్రీ సహజములైన భావములను వ్యక్తపరచుటయందు, ఈమె పదములు, పాటలు ఒక ప్రత్యేకతను సంతరించుకొనినవి. భారతదేశమునందలి ప్రధానమైన ఉత్సవములు, పండుగలు, శిశుజననము, బాల్యము మున్నగు విషయము

---

1. आज बरसाने मगंल गाई
कुवंर लली को जन्म भयो है घर घर बजत बधाई ।

లన్నియు నీమెకు కవితా వస్తువులైనవి. ఉదాహరణమునకు, రాధా అష్టమీ దినము. రాసకేళి, దీపావళి, అన్నకూటము మున్నగునవి.[1]

ఈమె మార్గీయ కవులవలెనే వాత్సల్యమును, మధుర భావ భక్తిని చేపట్టినది. Dr. సావిత్రీసిన్హా, Dr. మిశ్రబంధు అను వారలు, ఈమెకు హిందీ కవయిత్రులందు స్థానము నిచ్చినారు.

## బ్రిజ్‌దాసి (రాణి బంకావతి) :

ఈమె 18 వ శతాబ్దమునకు చెందినది. ఈమె జయపూరు సంస్థాన మందలి కచ్‌ఛాకు చెందిన రాజా ఆనందరాం యొక్క కూతురు. ఈ వంశీయు లందరు, స్త్రీ, పురుష భేదములేక వారి బిరుదనామమగు బంకా అను పదమును వాడుకొనుచుందురు. అందుకొరకే బ్రిజ్‌దాసీ రాణి బ్రిజ్‌దాసీ బంకావతిగ ప్రసిద్ధురాలైనది.

ఈమె కృష్ణగఢ్ ప్రభువైన మహారాజా రాజ్‌సింగ్‌ను వివాహ మాడినది. ఈమె కుమార్తెయైన సుందరకున్వారీ బాయి భక్తి మార్గ కవయిత్రులలో ప్రసిద్ధురాలు. ఈమె శ్రీమద్భాగవతమును బ్రిజ్‌భాష లోనికి అనువాదము గావించినది. ఈ పుస్తకమునే బ్రిజ్‌దాసీభాగవత్ అనికూడ అందురు.

ఈమె సంస్కృతమునందును, కావ్యలక్షణముల యందును, అలంకార ముల యందును మంచి జ్ఞానముకలదియై, అచ్చటచ్చట కొన్ని రాజస్థానీ పదములనుకూడ వాడుచుండును.[2]

## (ప్రియసఖి) రాణి భక్తకున్వారి :

ఈమె ప్రియసఖ యను మారుపేరుతో 1734 సంవత్ ప్రాంతమున తన రచనలను సాగించినది. ఈమె రాధాకృష్ణులకు (యుగళమూర్తులు)

---

1. रानी जू सुख पायो सुत जाय
वड़े गोप बधुन की रानी हंसि हसि लागत पाय ।
बैठी महरि गोद लिये ढोटा प्राछी सेग विछाय ।
बोलि लिये प्रजराज सबनि मिलि यह सुख देखी जाय ।।

2. बार बार वन्दन करौ, श्री वृषमानु कुंवरि
जय जय श्री गोपाल जू, की जै कृष्ण मुरारी ।

భక్తురాలు. అందులకే వారి ప్రేమవిలాసము, ఈమె కావ్య వస్తువుగ మారినది.

ఈమె రాజ ప్రాసాదములందలి విలాసముల నాధారముగ హోలీ వర్ణనము గావించినది.[1] "ప్రియసఖి బానీ" యనునది, ఈమె రచించిన గ్రంథము. ఈమె పేరు మొదట Dr. సుశీలాసిన్హాగారిచేత పేర్కొనబడినది.

సోఢీనాథి :

ఈమె దాదాపు 1695 సంవత్ ప్రాంతమునందు జన్మించి (1725-1731) ప్రాంతమున రచనలు గావించినది. ఈమె రాణాభోజ్ యొక్క కూతురు. మహారాజా సుందరదాసు అను నాత డీమెకు భర్త. రాణా చంద్రసేను డీమె పితామహుడు.

ఈమె రచించిన గ్రంథములు బికనీర్ సంస్థానమునందలి అనూప్ సంస్కృత గ్రంథాలయమునందు లభించుచున్నవి.

ఈమె రచించిన గ్రంథములు :

(1) బాలచరిత (2) భగవద్భావ చంద్రాయణ (3) సాఖీ (4) రామలీల (5) కంసలీల యనునవి.

ఈమెకు అలంకార శాస్త్రమునందును, ఛందో వ్యాకరణముల యందును మంచి పాండిత్య మున్నట్లుగ గోచరించుచున్నది.

ఈమె పేరు మధ్య కాలీన హిందీ కవయిత్రులను గ్రంథమునందును ప్రేరణ ప్రత్యేక సంచికయందును కానవచ్చుచున్నది.

సాధువులనిన మహా భక్తుల కెంతటి గౌరవ మర్యాదలు కలవో ఈమెకుకూడ నంతయే కలవని క్రింది పద్య భావమువలన చెప్పనగును.

---

1. सखी । ये दोई होरी खेलै
रगं महल से राधा वल्लभ रुष चरस्प भोले ।
रूप परस्पर भोलत होरी खेलत खेल नवेले ॥
प्रेम पिचक पिय नैन भरे तिय, रूप गुलाल सुमैसे ।
कुन्दन तन पर केसरि फीको, स्थान गौर भये मैंसे ।

[1]"సాధువు పరశువేది, శిష్యుడు ఇనుపముక్క
అతని స్పర్శవల్లనే ఇనుము బంగారమగును."

## సుందరకున్వారిబాయి :

ఈమె ఢిల్లీప్రాంత నివాసిని. దాదాపు 1791 సంవత్ ప్రాంతమున జన్మించి 1817-1848 ప్రాంతమున తన రచనలను సాగించినది. ఈమె రూప్‌నగర్ పరిపాలకుడైన మహారాజా రాజ్‌సింగ్ రాథోర్‌నకు కుమార్తె. ప్రసిద్ధ కవయిత్రియైన బంకావతి యీమె తల్లి. ఈమె రాజకుమార్ బలవంతసింగ్‌ను వివాహమాడినది. ఈమె మంచి సాహిత్య సంపర్కముతో కూడిన పరిసరములం దుండుటచేత, తానుకూడ ఆ అభిరుచిని అభివృద్ధిపరచుకొని రచయిత్రి యైనది.

ఈమె రాధావల్లభ సాంప్రదాయమునకు చెందినది. భక్త నాగరీదాసునకు, ఈమె చెల్లెలగునేమోయని శ్రీ దీనదయాళ్‌గారు ఒక అభిప్రాయమును వెలిబుచ్చినారు. ఈమె దాదాపు 11 పుస్తకములను రచించినట్లుగ తెలియుచున్నది.

(1) రసపుంజ్,
(2) నెహానిధి,
(3) రామరహస్య,
(4) సంకేతయుగళ్,
(5) గోపీమహాత్మాయా,
(6) సారసంగ్రహా,
(7) బృందావన్‌గోపీమహాత్మాయా
(8) భావన ప్రకాశ్,
(9) రంగ్‌ఝూర్,
(10) ప్రేమసంపుట్,
(11) పదములు.

అనునవి ఈమె గ్రంథములు.

ఈమె పుస్తకము లన్నిటియందును భగవద్భక్తియే ప్రధానమై కానవచ్చును. ఈమె మహా భక్తులైన సూర్‌దాస్, తులసీదాసుల వలెనే శ్రీరామకృష్ణుల నిద్దరిని పూజించినది. ఈమె తన గ్రంథములందు, అత్యంత భక్తిభావమును, పవిత్రీకృతమైన ప్రేమను చిత్రించినది. ఈమె వర్ణించిన ప్రేమ ఇంద్రియ తర్పణమునకు చెందినదిగాక దైవరతికమై యుండును.

---

1. साधु पारस पिंड है सिस है लोह समान ।
आप सरिखो करि लिये संगत का फल जाण ॥

ఈమె ప్రధానముగ శృంగార, శాంతరసములను చేపట్టినప్పటికిని అచ్చటచ్చట సుఖవంతమైన గృహజీవితమునకు సంబంధించిన హాస్యరసమును కూడ ప్రదర్శించుచుండును.

ఈమె సవయా, కవిత్, దోహా, కుండ్లియా అను వేరువేరు వృత్తములను వాడినది. ఈమె ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకాదియలంకారములయందు మిగుల అభినివేశమును కనబరచును.

[1]ఈమె యనేకములైన సంస్కృత పదములను వాడుచు బ్రిజ్-భాష యందు తన రచనలను గావించినది.

తాజ్ :

ఈమె దాదాపు 17 వ శతాబ్ద్యంతమునందు నివసించినది. ఈమె మహమ్మదీయ మతమునకు చెందినదైనప్పటికిని కృష్ణభక్తిని యనుసరించినది. వైష్ణవ హిందూ భక్తులవలెనే, ఈమెకు శ్రీకృష్ణభక్తి యధికము కాగా తాను, నమాజ్‌ను మరచినదని, ఇకముందు దేవతలను పూజింపగలదని ఒకానొక పద్యమునందు తెలిసినది. ఈమె శ్రీకృష్ణుని తనప్రభువుగ భావించి అతని లీలలయందు విశ్వాసముకలిగి సంతోష సుఖములను పొందినది.

ఈమె రచించిన గ్రంథములను చూడగ నీమెకున్న కవితా పాటవమునే గాక, హిందూ ధర్మమునందును, హిందూ మత సిద్ధాంతముల యందును, ఈమెకు ఉన్న జ్ఞానము ఆశ్చర్యము గొల్పుచుండును.

[2]ఒక్కొక్కప్పు డీమె ఉర్దూపదములతో మిశితమైన హిందీ భాష యందు సరళ, సుందరములైన భావములను వ్యక్తపరచుచుండును. ఈమె భాష, భావ వ్యక్తీకరణ విధానము మున్నగు విషయము లీమెను, ఉత్తమ కవయిత్రుల కోవలో చేర్చినవి.

---

1. चित्र सी-लिखी-सौ राधे विवश-सी रही।
   देव पूजा ठानी हौं निवाज हूँ-भुलानी तजे।

2. मिलण मिलण तुम कह गये मोहन
   अब क्यों देर लगाय रे।

రావ్ జోదాజీకి సంఖోలి రాణి :

ఈమె దాదాపు 19 వ శతాబ్దియందు మార్వారు ప్రాంతములో వెలసినది. 'కృష్ణజీకి వాతి' అనునది యీమె రచించిన గ్రంథమని Dr. Tesitery అనువారు మొదట పేర్కొనినారు.

ఈ గ్రంథమునం దీమె రుక్మిణీ కృష్ణులయొక్క సౌందర్యమును వర్ణించినది. ఈమె వాడిన భాష రాజస్థానీ భాష.

పీరన్ (పీరాం) :

ఈమె జోధూపూర్ నందు 1730 సంవత్ ప్రాంతమున జన్మించి 1750-1800 ప్రాంతమునందు తన రచనలను గావించినది.

జోధూపూర్ గ్రంథాలయమునందు శ్రీ భక్తసింగ్ అను ప్రభువు రచించిన పదములతో గలిపి ఈమె పదములుకూడ అముద్రిత రూపమునందు గానవచ్చు చున్నవి. దీనినిబట్టి ఈమె రాజగృహమునకు సంబంధించినదిగ నూహింపబడుచున్నది.

ఈమె రచించిన గీతములన్నియు శ్రీకృష్ణ భక్తిభావ విలసితములై యున్నవి. ఈ పాట లన్నియు స్వాభావిక సౌందర్యమును సంతరించుకొని చాల సరళములై యున్నవి.

ఈమె రాజస్థానీ భాషనే ఉపయోగించినది.*

ఛత్రికున్వారిబాయి :

ఈమె 1715 సంవత్ ప్రాంతమునందు కృష్ణగఢ్ లో జన్మించినది. ప్రసిద్ధ కవియైన నాగరీదాసు ఈమె పితామహుడు. సర్దార్ సింగ్ అను నాతడు ఈమెకు తండ్రి. [1]ఈమె తాను రచించిన 'ప్రేమ-వినోద్' అను గ్రంథమునందు పై విషయములను పేర్కొనినది.

అనేక శతాబ్దములనుండి శ్రీకృష్ణభక్తులుగా పేరుపొందిన వంశమునం దీమె జన్మించినది. తన ప్రాచీనుల సాంప్రదాయము ననుసరించి ఈమె

---

* बस रहि मेरे प्रान मुरलिया, बस रही मेरे प्रान
या मुरली में कान घोल्यो, उन व्रज वासिन कान ।

నింబారక సాంప్రదాయమునకు చెందిన భక్తిమార్గము ననుసరించినది. భక్తిభావ విలసితయై రాధాకృష్ణుల ప్రేమను వర్ణించి, కీర్తించినది * ఈమె రాధాకృష్ణుల శృంగారమును వర్ణించునప్పుడు దివ్యమైన శృంగార మునే వర్ణించినది.

ఈమె వాడిన భాష రాజస్థానీ పదములతో మిశితమైన బ్రిజ్ భాష.

## దాసీ సుందర్ :

ఈమె నాథ్ ద్వారమునందు 18వ శతాబ్దమున వెలసినది. పుష్టి మార్గీయ భక్తుడైన గోస్వామి ఈమె భర్త. అందరు భక్తులవలెనే ఈమె కూడ కృష్ణలీలలనే తన కావ్య వస్తువుగ స్వీకరించినది. 'బాలలీలాకవిత్' అనునది ఈమె రచించిన గ్రంథము. ఆ పుస్తక మిప్పుడు "అనూప్ సంస్కృత గ్రంథాలయమునందు, అముద్రిత రూపములో నున్నది.

ఈమెకు బ్రిజ్ భాషయందు మంచి ప్రవేశమున్నట్లుగ గోచరించును.

## గిరిరాజకుమారి :

ఈమె 1902 సంవత్ ప్రాంతమున వెలసిన కవయిత్రి. ఈమె తన బాల్యమునుండియే శ్రీకృష్ణునియందు భక్తి కలిగియుండి, ఆ భక్తి ప్రభా వము చేతనే బ్రిజు రాజ విలాసమను గ్రంథమును వ్రాసినది.

ఈమె వినయమును పుణికిపుచ్చుకొనినవిగా కనుపట్టు కొన్ని పద్య ములను కూడ వ్రాసినది.

ఈమె రచనలు సూర్ దాస్ రచనలవలెనే గౌరవముద్రను ముద్రించు కొనినవి. ఇదికాక ఈమె పాకశాస్త్రమును మరియొక గ్రంథమును రచించి

---

* रूप नगर राजसी निज सुत नागरी दास
तिनके सुत सरदार सी, हो तनया मै तास
छत्र कुवरी भम नात्र है कहिवे की जग माहि
स्याम सखी हंसि कुवंरि दिस, वोली मधुरे बैन।
सुमन लैन चलिये अबै यह विरिया सुख़ दैन।

నట్లుగ గోచరించుచున్నది. ఈమె పేరు మొదట దీనదయాళ్ ప్రేరణ యందు పేర్కొనినారు.*

## బ్రిజ్‌భాన్‌కిశోరి :

ఈమె 19వ శతాబ్దియందు జోధ్‌పూర్‌లో వెలసినది. ఈమె జోధ్‌పుర ప్రభువైన మహారాజా తఖ్తుసింగ్‌నకు భార్య. ఈమె రామకృష్ణు లిద్దరిపైనను పద్యముల రచించినది. ఎట్టి శిక్షణములేకయే సంగీతమునం దీమె మంచి పాండిత్యమును సంపాదింపగలిగినది.

ఈమె ప్రాంతీయ పదజాలము నక్కడక్కడ చొప్పించుచు బ్రిజ భాషలో తన రచనలను సాగించినది.

## సమ్మాన్‌బాయి :

ఈమె అల్వార్ ప్రాంతమునందు జన్మించి, 1925 సంవత్ ప్రాంతము నుండి రచనలను చేయ ప్రారంభించినది.

ఈమె తండ్రియైన రామ్‌నాథ్‌గారితోనే విద్య నభ్యసించినది. వివాహానంతరముకూడ విద్యా వ్యాసంగములందు పరిశ్రమ సల్పుచునే యుండినదట.

ఈమె తాను రచించిన 'పతిశతక' మను గ్రంథమునందు, పతియే పరమదైవమని వ్యక్తపరచినది. ఈమె తాను రచించిన సమయాలలోను పదములందును శ్రీకృష్ణుని బాలలీలలను బాగుగ వర్ణించినది.

రాజస్థానీ పదములు, అక్కడక్కడ కలిగిన బ్రిజ్ భాషనే ఈమె వాడినది.

## బీబీరత్నకున్వారి (కుంవరి) :

రాజా షేర్‌ప్రసా దీమెకు మనుమడనియు, ఈమె సంస్కృతము నందు పాండిత్యము సంపాదించి, అలంకార చ్ఛందో రీతుల నెరిగి, వాటి

---

* मो सम कौन प्रथम जग यांही
सगरी उमर विसयर में खोई, हरी की सुधि विसरई ।
मन भायो सोद तो कीनो, जग में भई हँसाई ।।
काम क्रोध मद लोभ मोह के घेरे हुए सिपाही ।।
इन ते मांही छुडावो स्वामी, णींरज है सरसाई ।।

యందు కొంత ప్రవేశముకూడ కలదియని అతని రచనల మూలమున తెలియుచున్నది.

ఈమె హిందూ సాంప్రదాయము ననుసరించి, తన అంత్యాకాలమును కాశియందే గడిపినది.

"ప్రేమరత్న" యనున దీమె రచించిన గ్రంథము. 1945 ప్రాంతమున షేర్ ప్రసాదుచేత నిది ముద్రింపబడినది. ఈ పుస్తకము భాగవతము 12వ స్కంధములోని శ్రీకృష్ణ చరితమునందలి ఒక ఘట్టము స్వీకరింపబడి వ్రాయబడినది.

ఈమె మహా కావ్యమార్గము ననుసరించి, కృష్ణలీలలను వర్ణించునపుడు, స్వాతంత్ర్యము కనబరచినది. ఈమె 'దోహా', 'చంపత్' వృత్తములను గ్రహించి కృష్ణ భక్తిమార్గ కవులకన్నను వానిని భిన్నముగ వాడి తన వ్యక్తిత్వమును ప్రకటించినది.

ఈమె తాను వర్ణించిన గోపీకృష్ణుల సంగమమునందును, రాధాకృష్ణుల యందును, యశోదా నారదులయందును, తాను జీవితమునందు పొందిన సంతోష సుఖములను వ్యక్తీకరింప జేయుచుండును.

ఈమె సంస్కృత పదములతో కలసిన ఔధిభాషను వాడినది.

పంజన్‌కున్వారి :

ఈమె *'బారహామాస్' అను గ్రంథమును రచించినట్లుగ నాగరీ ప్రచార సభవారి రిపోర్టులో కానవచ్చుచున్నది,

కృష్ణావతి :

ఈమె రాధా వల్లభ్ సాంప్రదాయమునకు చెందినదియై 1900సంవత్ నకు పూర్వమే తన రచనలను గావించినది.

ఈమె కృష్ణునకన్న అధికముగ రాధకే ప్రాధాన్యము నిచ్చినది.

---

*पजरा कुवंरी की विनय जानि कर है व्रज मे वासी ।
मत अनुसारि गाई मै प्रभु की या वारहमासी ।

[1]'వివాహ విలాస' మనునది, ఈమె రచించిన గ్రంథము. ఈ గ్రంథమునం దీమె రాధాకృష్ణుల వివాహమును వర్ణించుచు స్త్రీల కత్యంత ప్రియమైన గృహ జీవితము, వివాహము, ఆచారములు మున్నగు వానిని అధిక అభినివేశముతో వర్ణించినది.

## అల్‌బేలీ అలి :

ఈమె గురువు "వన్షీ అలీ" యను నాతడు.

ఈమె రచించిన గ్రంథములు :

(1) అల్‌బేలీ అలి గ్రంథావళీ, (2) గోస్వామీజీకా మంగళ్,
(3) వినయకుండ్లియాం.

[2]ఈ పై గ్రంథముల నీమె బ్రిజ్ భాషయందు రచించినది. కొందరీమె విషయముపై సందేహమును ప్రకటించుచు సఖీ సాంప్రదాయమునకు చెందిన భక్తురాలుగ భావించుచున్నారు.

## ప్రితాప్‌బాల :

ఈమె గుజరాత్ నందలి జామానగర్ సంస్థానమునకు చెందినది. జోధ్‌పూర్ ప్రభువైన తఖ్తసింగున కీమె భార్య.

ఈమె చాల ఉదార హృదయురాలు, అనేకములైన దేవాలయములను నిర్మించి, బీదలకు అన్న వస్త్ర దానములు గావించునది. ఈమె దురదృష్టముచేత భర్తను, ఇద్దరు కుమారులను పోగొట్టుకొని జీవితమునందు విరక్తికలుగగ భగవద్భక్తురాలై అనేకములైన భక్తిగీతములు వ్రాసినది.

[3]ఈమె శ్రీకృష్ణుని యొక్క భక్తురాలుగ "ప్రతాప్‌కున్వారి

---

1. घरै वर दीउ नंद के हैं करौ बलि होई सलीवी सगाई ।
   नही री नही बलि हौं न करौ मेरी फूल-सी राधे के कारे कन्हाई ।।
2. मत्र मन हंस उलास वढ़े दिन दिन प्रतिभारी ।
   रहै सदा चित चाक लखै ज्यों चातक वारी ।।
   कामी के मन काम दाम ज्यों रंकहि भावै ।
   नवल कुवंर पद प्रीति सु अलवेलि अलि पावे ।।
3. वारी थारा मुखडारी श्याम सुजान ।
   मन्द मन्द मुख हास्य बिराजै कोटिक काम लजान ।
   अनियारी अँखियाँ रस मीनी वाँकी मौह कमान ।।

రత్నావళి" యను గ్రంథమున వ్రాసినది. ఈమె యుపయోగించిన భాషపై రాజస్థానీ భాష ప్రభావము, అధికముగ గోచరించుచు.

మంగళగౌరి :

ఈమె గుజరాత్ నందలి "పాటన్" ప్రాంతమునకు చెందినది. ఈమె "నర్మదా శంకర్ ల ఖియా"అను నాతనిని వివాహమాడి, యాతడు సన్న్యసింపగ నీమె తన మనస్సును భగవద్భక్తిపై కేంద్రీకరింప జేసినది.

ఈమె స్త్రీల సమూహమునందు కీర్తనలను పాడుచుండెడిది. కొంత కాలము తరువాత నీమెకు కన్నులుపోయినప్పుడు తన భక్తినిమాత్రము విడువలేదు. ఈమె :

(1) యమునాజీకి ఆర్తి, (2) పాటన్‌కా గిర్‌ధర్‌జీకా బెర్వా అను గ్రంథములను రచించినది. ఈమె గుజరాతీ, బ్రిజ్ భాషయను రెండిటి యందునుకూడ రచనలను సాగించినది. ఈమె 'మహాదేవ్', 'గణేశ్'లను గూర్చికూడ కొన్ని పదములను రచించినది.

## అయిదవ అధ్యాయము

## శృంగార కావ్యములు

రాజపుత్ర పాలకులు తమ స్వాతంత్ర్యమును గోలుపోయిన తరువాత దేశముయొక్క రాజకీయ జీవితమునందు గొప్ప మార్పు వచ్చినది. ప్రభువులు, ప్రజల సంక్షేమముపైనే మాత్రమును దృష్టిలేక సంచరించు చుండిరి. సామంతులు, జాగీరుదారులు విలాసవంతమైన జీవితమున కలవాటు పడి యుండిరి. ఇట్టి విలాస ప్రియులైన ప్రభువులను సంతోషపరచుటకు నాటి కవులు కావ్యములను వ్రాయుచుండిరి. కవులు కావ్య కళను జీవనాధారముగ పరిగణించుచుండిన రోజులవి. అందుకొరకే నాటి సాహిత్యము ప్రజాజీవితమును ప్రతిబింబింప చేయునది గాక రాజుల యభిరుచులను వ్యక్తపరచునదిగా నుండెను.

ఈ కాలమునందు వేశ్యల ప్రభావ మధికమై యుండెను. వీరు పురుష హృదయమును పూర్తిగ వశపరచుకొనుటకై సంగీత సాహిత్యము లందు మంచి ప్రావీణ్యమును సంపాదించుకొని యుండిరి. వేశ్యలే కాక ఈ కాలమునందు కొందరు రాజకన్యలు, రాణులు కూడ శృంగార కావ్యములను రచించినారు. వీరు తమ ప్రియులైన రాజకుమారులవద్దనుండి యీ కళ నభ్యసించినారు. ఎట్లయినను ఈ కాలమునందు స్త్రీ కవయిత్రులు తక్కువగనే గోచరింతురు. ఇందుకు కారణము లనేకములు. అందు ముఖ్యముగ నాటి హిందీ కవులతో సరిసమానమగు పాండిత్యము స్త్రీలకు లేక పోవుట, తన తోటి, సాటి యగు స్త్రీ, సౌందర్యమును వర్ణించుటకు సహృదయత లేకపోవుట, పరదా మున్నగు సాంఘికాచారములని చెప్ప వచ్చును.

### ప్రవీణ్ రాయ్ :

ఈమె ఓర్ఛా (Orcha) సంస్థానమునకు చెందిన ఇంద్రజిత్ సింగ్ యొక్క ప్రియురాలు. ఈమె ప్రసిద్ధ హిందీ కవియైన కేశవదాసుతో కావ్య కళ నభ్యసించినది. ఆత డొకానొక పద్యమునం దీమెను శారద, లక్ష్మి, సత్యభామలతో పోల్చినాడు.

ఈమెను కాంక్షించి అక్బరు చక్రవర్తి యొకసారి సందేశమును పంపగ, తా నిదివరకే ఇతరుల సొమ్మనియు, ఒకరి ఉచ్ఛిష్టమును కుక్కలు మున్నగు నీచ జంతువులు తప్ప మరెవ్వరు ముట్టరని సమాధానము పంపినదట. ఈమె కావ్యకళయందు మంచి ప్రవేశమును పొందినట్లుగనె, సంగీత, నృత్యములయందు కూడ మంచి పాండిత్యము కలిగి, నిశితమైన బుద్ధి వైభముతో ప్రకాశించుచునదట.

ఈమె రచించిన స్వతంత్ర గ్రంథ మేదియు కానరాదు లభించిన కొన్ని పద్యములను పురస్కరించుకొని చూచిన ప్రధానముగ నీమె శృంగార రసమును పోషించినట్లుగ తెలియుచున్నది.

*ఈమె గ్రాంధిక విధానము ననుసరించి. సంస్కృత పదజాలముతో మిళితమైన బ్రిజ్ భాషలో వ్రాసినది, ఈమె ఛందస్సును గ్రహించి వాడుట యందు శ్రద్ధను, అలంకార పోషణమునం దభిరుచిని కనబరచినది.

రాణి రణ్ ధారీజి :

ఈమె మార్వారు దేశమునందలి "రార్ ధాఢా" అను ప్రాంతము నకు చెందినది. సాహిత్యవేత్తయైన సిరోహి ప్రభువు రాయ్‌జీని వివాహ మాడినది.

ఈమె రాజ సభలయొక్క పరిసరములచేత ప్రభావితయై, ఆ విలాస జీవితమునే గూర్చి వ్రాసినది. ఈమె రచనలయందు సుఖవంతమైన వైవా హిక జీవిత చ్ఛాయలు గోచరించును.

బ్రిజ్ భాషా పదములతో కూడిన రాజస్థానీ భాషయం దీమె రచనలు గావించినది.

రూప్‌వతీబేగం :

ఈమె "ఉజ్జయినీ" సమీపమునందలి సారంగ్‌పూర్ నివాసిని. ఈమె వేశ్యాకుటుంబమునకు చెందినది. ఈమె కవిత్వమునందే కాక నృత్య గీతాదు లందు కూడ మంచి నేర్పు కలిగినది.

ఈమె సంగీత సాహిత్యముల కలరిన మాల్వా నవాబ్ బాజ్ బహద్దూరు ఈమె ప్రేమయందు తగుల్కొనినాడు. అక్బర్ బాజ్ బహద్దూరును జయించినప్పు డీమె ఆత్మహత్య గావించుకొనినది.

ఈమె పద్యములనుగూర్చి భిన్నాభి ప్రాయములున్నవి. బాజ్ బహద్దూరు రచించిన పద్యములందుకూడ ఈమె పేరు వాడబడుచుండె

---

*जूठी पातरी मखत हैं बारी, वायस, स्वान ।
राय प्रवीन कि शारदा, रुचि राजत अंग ।
वीणा पुस्तक धारिनी राज हस सुत सग ॥
नीकी घनी गुननारि निहारि नेवारितउ संखिया ललचाती ।
जान अजानत जोरति दीठ बसीठ के ठौरन औरन हाती ॥
आतुरता पिय के जिय की लखि प्यारी प्रवीन बहै रसभाती ।
ज्यो-ज्यों कछु न बसाति गोपाल की त्यों-त्यों फिरै मन मे मुस्काती ।

ననియు, కాని రూపావతి అను పేరుతో రచించిన పద్యములు మాత్రమే ఈమె రచితములని Dr. సావిత్రీసిన్హాగారు అభిప్రాయపడుచున్నారు.

[1]ఈమె తాను, తన ప్రియుడైన బాజ్ బహద్దూర్ యొక్క ప్రేమ గాథనే యితివృత్తముగ స్వీకరించి రచనములను గావించినది.

షేఖారంగారేజన్ :

ఈమె 18వ శతాబ్దమునం దుండిన మహమ్మదీయ కవయిత్రి. ఈమెను గూర్చి ఎన్నియో గాథలు ప్రచారమున నున్నవి. ఆలమ్ అను కవి ఈమె చక్కదనమును, సున్నిత భావప్రకటనములను గాంచి ముగ్ధుడై తాను బ్రాహ్మణుడయ్యు నీమెను వివాహమాడి చివరకు తానుకూడ నా మతమును స్వీకరించినాడట.

కావ్యశాస్త్రములందు మంచి పాండిత్యము కలిగిన ఈమె వివిధ నాయికలను పోషించి చాల సుందరముగ చిత్రించినది. ఈమె రాధా కృష్ణుల ప్రేమగాధను ప్రధానముగ గ్రహించి రచనలు చేసినది. ఈమె భక్తిప్రపూర్ణ హృదయయై శ్రీకృష్ణ లీలలను వర్ణించుచు కొన్నిపద్యముల వ్రాసినది. గోపికలయొక్క విరహమును చిత్రించుటయం దీమె యెక్కువ అభినివేశమును కనబరచినది.

ఈమె పై విషయములగూర్చియే కాక మరికొన్ని భ్రమర గీతము లను గూడ వ్రాసినట్లు తెలియుచున్నది.

[2]ఈమె భావములు, సుందరములును, ఉదారములునై యున్నవి. ఆ సుందర భావములను బ్రిజ్ భాషయందు రచించి మరింత మనోహరముగా చేసినది. భాషపై ఈమెకు గల అధికారము ఎనలేనిది.

---

1. रूपवती दुखिया भई बिना बहादुर बाज।
सो अब जियरा तजत है यहाँ नहीं कछु काज।

2. शेख प्यारे अति ही बिहाल होई हाय हाय,
पल पल अंग की मणे मुस्कातु है।
प्रानि चाल होति तिहि तन प्यारी चलि चाहि,
बिराही जरनि ते बिरह जरयो जातु है।

### సుందర్ కలీ :

ఈమె మహమ్మదీయ యువతి. ఈమెనుగూర్చిన విశేషము లేవియు గానరావు.

[1]"సుందర్ కలీ" లేక "సుందర్ కలీ కా బారహోమాసి" అను పుస్తకము నీమె రచించినట్లుగా తెలియుచున్నది, అదియును పూర్తిగ లేదు. ఈమె వాడిన భాష సరళమై యున్నది.

### ఝిమాచర్ని (ఝిమాచరణి) :

ఈమె బికనీయర్ ప్రాంతమునకు చెందిన విధుచరణ్ యొక్క సోదరి. రాజా అచలదేవ్ అను నాతడు ఝిమా స్నేహితురాలగు 'ఉమాదే' ను వివాహమాడుటకు కూడ ఝిమా వాక్పాటవ, చమత్కారము లెక్కువగ సహకరించినవట.

ఈమెది గానమునందును, వీణా నాదమునందును అందెవేసిన చేయి.

### పద్మచర్ని (పద్మచరణి) :

ఈమె ఉదాజీ సాధువునకు కుమార్తె. బర్హాదా శంకరు భార్య. తన తండ్రి, భర్తలవలెనే ఈమెకూడ 'దిన్‌గల్', గీత్, కవిత్ అను వానిని వ్రాయుటయందు అందెవేసిన చేయి.

ఈమె నాటి సాంప్రదాయమునకు విరుద్ధముగ వీరగాథను ఇతివృత్తముగ స్వీకరించి రచన చేసి, రాజా అమీర్ సింగ్ అను నాతనిని మేలు కొల్పినది.

ఈమెకు కావ్యకళ యందును, రాజస్థానీ భాషయందును చాలినంత ప్రవేశమున్నది. రాజస్థానీ భాషయందు గల 'వ్యంద్ సగమ్' అను అలంకారమును వాడుటలో నీమె ప్రత్యేకమైన నేర్పును చూపుచుండును. భాష నుపయోగించుటయం దీమె కున్న శక్తి చాల ప్రశంసనీయమైనది.

---

1. जो आया मास फागुन का सुहाना ।
   सखी अब घर घर खेले हैं होरी । सलोनी सांवरी सब रंग गोरी ।
   किस रिया रंग पिचकारी में भर भर । सभीडाले है अपने पीके ऊपर ।

**చంపాదెరాణి :**

బికనీయర్ ప్రాంతమున 'దిన్‌గల్ కవిగా' ప్రసిద్ధుడైన మహారాజా పృథ్వీరాజ్‌నకు భార్య. ఈమె తన పుట్టినింటినుండియు, మెట్టినింటి నుండియుకూడ సాహిత్య సాంప్రదాయములను జీర్ణించుకొని తనవి గావించుకొనినది.

ఈమె తాను వ్రాసిన దోహాయి'లయందు తన ప్రణయ వృత్తాంత మునే చిత్రించినది. కొన్ని కొన్ని సమయములందీమె భర్త రచనలకు తోడ్పడునదట.

**హరిజీరాణి చౌద్‌జి :**

ఈమె మానసింగు రెండవభార్య. మానసింహుడు, ఈమె చక్కదన మునకును, ప్రతిభకును ముగ్ధుడై యీమె నతిగామన్నించువాడట. ఈమె అత్యంత సహనశీల. తన భర్త పెళ్ళికొడుకుగాకూడ వెళ్ళునప్పుడు కూడ ఈమె అనేకములైన గీతములను రచించి విశాల హృదయయై వానిని గానము చేయునదట.

**థాకురాణీ కాకారెజెహి :**

థాకూర్ భగేలా అగ్రజాజీయొక్క కూతురీమె. కేసినగర్ నరహరి దాస్‌జీని వివాహమాడినది.

ఈమెభర్త షాజహాన్‌తో జరిగిన యుద్ధమునందు మరణించినాడు. ఒకానొకప్పుడు, ధూర్తుడొకడు, ఈమె భర్తదుస్తులను ధరించి మోసగించు టకు రాగా నావిషయమును గ్రహించిన ఈమె వానికి పద్యమునందే సమాధానముచెప్పి బుద్ధివచ్చునట్లు చేసినదట.

**చంద్రికళాబాయి :**

ఈమె బూంది సంస్థానమునందలి దాసికుమార్తె. కవిరాజ్ గులాబ్ సింగు అనునాత డీమెకు కావ్యకళనుగూర్చి బోధించినాడట. ఈమె యీ కాలమునందు సమస్యా పూరణములో ప్రసిద్ధివహించినది.

ఈమె యనేక కవి సమ్మేళనములందు గౌరవింపబడి బిరుదులను కూడ పొందినది.

'సీతాపూర్ కవిమండలి' వసుంధరారత్న అను బిరుదమునునిచ్చి యీమెను సత్కరించినది.

(1) కరుణశతక, (2) రామచంద్ర, (3) పదవీ ప్రకాశ్,
(4) మహోత్సవ ప్రకాశ్ అనునవి ఈమె గ్రంథములు.

**ముష్తారి :**

ఈమె వేశ్యాకుటుంబమునకు చెందినది. ఈమె 'దేశ్ షేకు, 'పతి భక్తి' స్త్రీధర్మ, ఫామాచ్, హోలి మున్నగు విషయములపైన రచనలను గావించినది.

**తీన్ తరంగ్ :**

ఈమె మహారాజా మధూత్ సర్ షా సంస్థానమునందు రాజనర్తకిగా నుండునది. ఈమె కోకశాస్త్రమును గూర్చి ఒక పుస్తకమును వ్రాసినది.

## ఆఱవ అధ్యాయము

**వివిధ కావ్యములు :**

సాధారణముగ ఒకే భావముతో ప్రభావితమగుట, ఆవిషయమును మాత్రమే గ్రహించి కావ్యములనల్లుట అందరికి సాధ్యముకాదు. అందు కొరకే కొందరు స్త్రీ కవయిత్రులు, భక్తి, శృంగారములనేకాక, స్త్రీధర్మ ములు, నీతి, మున్నగు విషయములను గ్రహించి కావ్యములను వ్రాసినారు. ఇందు జామియత్, బిర్ జూబాయి, సరస్వతీదేవి అనువారలున్నారు.

**జామియత్ :**

ఈమె 1920 పాజీప్రాంతమున ఆగ్రాలో వెలసినది. మున్షీ ఫజల్, మహమ్మద్ అబ్బాస్ అనువారు, 'ముషాయరానుస్వాన్‌లో ఈమె పేరును

పేర్కొనినారు. అతని ప్రకారముగ నీమె బ్రిజ్ భాషయందు కొన్నిపద ములను, ముఖ్యముగ దాద్రా, హోలీలనుగూర్చి వ్రాసినట్లు తెలియు చున్నది.

ఖగ్నియా :

ఈమె తానువ్రాసిన పద్యమునందే తానొక బారూ అను నూనె వర్తకుని కూతురననియు, తాను పొడుపు కథలను, సమస్యలను వ్రాయుదు ననియు తెలిపినది. ఈమె పొడుపుకథలను వ్రాయుటకు తగిన భాషా జ్ఞానము కలిగి బౌధీ భాషయందు రచనలను చేయునది.

బిర్జూబాయి :

ఈమె కవిరాజ్ కరమ్‌దీనునకు సోదరి. ఈమె చారణవంశమునకు చెందినది. ఉత్తమ కవుల కీ వంశము పుట్టినిల్లు. తన వంశీయుల కీమె యప్పుడప్పుడు పద్యములు వ్రాసి సహాయము చేయునదట. ఈమె మేనల్లుడా రచనలను చంపావతి సంస్థానాధీశ్వరుడైన ప్రతాప్‌సింగు దర్బారునందు చదువుచుండగా నందలి స్త్రీ భావముల గుర్తించిన ప్రతా పుడా పద్యమునకు కర్త యెవ్వరని ప్రశ్నింప అప్పుడాతడు బిర్జూబాయి అను సమాధానమును పొంది, అమితానందముతో నీమెపై విలువైన కానుకల గ్రుమ్మరించినాడట.

పై ప్రకారముగ నీమె యజ్ఞాత వాసమునుండి బయలుపడినది. ఈమె రచించిన కావ్యములు లేవు. కాని దిన్‌గల్ భాషయం దనేక పదములు, పాటలు లభించుచున్నవి.

కవిరాణి చౌబె :

ఈమె కవిరాజ్ లోకనాథ్ చౌబెయొక్క భార్య. ఇతడు బూంది రాజైన బుద్ధసింగు ఆస్థానకవి. కవియైన భర్తనుండియే ఈమె కవిత్వ మును నేర్చుకొనినది. ఈమె పద్యములందు స్త్రీ హృదయమునకు సహా

జములైన రసభావములు తొణికిసలాడుచుండును. [1]ఒకానొక పద్యమునం దీమె తనభర్త ప్రయాణమును గూర్చియు, ఆ ప్రదేశమునం దాతడు హైందవధర్మమునకు విరుద్ధములైన ఆచారముల నెక్కడ అలవరచుకొనునో యను భీతిని వెలిబుచ్చినది.

## సాయన్ (Saen) :

ఈమె ప్రసిద్ధ కవియగు గిరిధర్ కవిరాజ్ యొక్క భార్య. ఈమె పేరుతో [1]'కుండ్లియా' అను కొన్ని పద్యములు గోచరించుచున్నవి. కాని కొందరివి గిరిధర్ వ్రాసినవని చెప్పుచున్నారు. శ్రీ నిర్మల్, శ్రీ దేవీ ప్రసాద్ అనువారలు, అవి ఈమె రచనలనియే చెప్పుచున్నారు. ఈమె రచనలన్నియు వర్ణనాత్మకములై, అనుయుక్తి విధానముతో నీతిమార్గ మును ప్రతిపాదించునవిగా నున్నవి.

ఈ పద్యములు కేవలము నీతినేగాక, సాంఘిక, రాజకీయ సమస్య లను ప్రతిబింబింప జేయుచు, కవయిత్రికిగల లోకజ్ఞానమును, సాంఘిక దృష్టిని గోచరింప జేయుచున్నవి.

ఈమె సాధారణముగ బ్రిజ్ భాషనే వాడినది.

## రత్నావతి :

ఈమె ప్రసిద్ధ హిందూకవియైన తులసిదాసునకు భార్య. రఘునాథ లఘుదోహా సంగ్రమునన దీమె రచించిన గ్రంథమని కొందరందురు. కాని కాదని మరికొందరు వాదించుచున్నారు. ఈ గ్రంథమువలననే, ఈమెపేరు రత్నావతియనియు నీమెను భర్త వదలిపెట్టుటచేత దీనబంధుచేత రక్షింప బడి ఒంటరిగా జీవితమును గడపెననియు తెలియుచున్నది.

---

1. It is a metre in which there are 6 padas and in that there are 144 matras which are essential and in every line there should be 24 matras. In this the first line is repeated in the last word of the last line and first word of often the last portion of first and second line becomes the first portion of the 3rd line.

దీనబంధు అనునది తన తండ్రిపేరు కావచ్చు. ఈమె గ్రంథమునందు గృహజీవితము, పతిభక్తి, నీతిమార్గములను చక్కగా ప్రతిబింబింపజేసినది ఈమె తాను రచించిన దోహాలయం దింతకుముందు తాను భర్తనుగూర్చి వాడిన మాటలకు పశ్చాత్తాపమును వెలిబుచ్చినది.

కేశవపుత్రివధు :

ఈమె తానొక వైద్యునకు భార్యనని చెప్పినది. చిన్నతనమునందే వితంతువై నికృష్టజీవితమును గడిపినది. ఒకరోజీమె కసువు నూడ్చుచుండగ నొకగొఱ్ఱె ఆమె పాదముపై నెక్కినదట. అప్పుడామె నోటి నుండి యప్రయత్నముగ కవిత్వము వెలువడినదట.

ఈమె బ్రిజ్ భాషయందు 'సవయ్యా'లను వ్రాసినది.

సరస్వతీదేవి :

ఈమె ప్రఖ్యాతకవియైన పండిత్ రామచరిత్ త్రిపాఠి ఏకక కుమార్తె. ఈమె అజమ్‌గఢ్ పండిత్ మహావీర్ ప్రసాదును వివాహమాడి భర్త తండ్రు లిద్దరినుండి కావ్యకళ నభ్యసించినది. ఈమె శారద అను మారుపేరుతో నీతికావ్యముల వ్రాసినది. (1) సుందరిసుఫల్ (2) నీతి నిచోడ్ (3) శారదాశతక్ (4) వనితాబంధు (5) మనయామోజా (6) సన్మార్గ అనునవి ఈమె రచించిన గ్రంథములు.

బ్రిజ్‌కుమారి :

ఈమె పతిభక్తికి అధిక ప్రాధాన్యము నిచ్చును, స్త్రీ ధర్మములను గూర్చి విపులీకరించుచును 'సతీవిలాస'మను గ్రంథమును బ్రిజ్ భాషయందు రచించినది.

ఈ విధముగ హిందీ సాహిత్యమునందు అధికలు కాకపోయినను తమ కవకాశము లభింప సాహిత్యమునకు సేవచేయుటకు స్త్రీలు వెనుదీయక కావ్యసంపుటములందు తమ పేర్లను శాశ్వతపరచినవారు.

# కవయిత్రుల అనుక్రమణిక

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| vii | 14 | అభ్యర్దించిన | అభ్యర్థించిన |
| ,, | 15 | స్వార్దోపభోగ | స్వార్థోపభోగ |
| ix | 14 | నంధ్ర సాహితీ | నాంధ్ర సాహితీ |
| xi | 6 | సామర్ద్యము | సామర్థ్యము |
| ,, | 12 | సాబితా | సాబితా |
| xii | 29 | కవితాహృత | కవితామృత |
| xiii | 24 | అమృత కౌర్ | అమృత ప్రీతమ్ |
| 8 | 10 | దీర్ఘతమస్సు | దీర్ఘతముడు |
| 9 | 16 | నీ శుభాశంస | మీ శుభాశంస |
| ,, | 18 | నీవు | మీరు |
| ,, | ,, | చేయుదువుగాక. | చేయుదురుగాక. |
| 15 | 18 | కవయిత్రులు | కవయిత్రుల |
| 19 | 28 | త్రాటె | త్రాటె |
| 21 | 11 | మారిల | మారుల |
| 24 | 13 | రచయత | రచయిత |
| 29 | 14 | తెల్లవారు | తెల్లవాఱు |
| 34 | 19 | మటి చెట్టు | మట్టి చెట్టు |
| 49 | 3 | కడ కంథురాళై | కడ కంధురాళై |
| 50 | 7 | నిత్య గానమును | నిత్య గానమును |
| 51 | 10 | శ్రీనాధ | శ్రీనాథ |
| 55 | 17 | తవిరాకు | తలిరాకు |
| 57 | 3 | రాముడు | రాము |
| ,, | 20 | ప్రాతము | పాత్రము |
| ,, | 22 | నిష్టాతుడును | నిష్ణాతుడును |
| 64 | 20 | ప్రతిగ్రర్దన | ప్రతిగర్జిన |
| 65 | 8 | రఘునాధనాయక | రఘునాథనాయక |
| 70 | 27 | చెసెనేమో | చేసెనేమో |
| 71 | 18 | చుందును | చుండును |
| ,, | 24 | అల్లిందుకొన్నను నీ | అల్లిందు కందుకొని నీ |
| 72 | 6 | సొమ్మియ్యు వచ్చు | సొమ్ములియ్య వచ్చు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 89 | 18 | రుచిమద్గ్రంధములను | దుచిమద్గ్రంథములను |
| ,, | 19 | సుప్రపిద్ధ | సుప్రసిద్ధ |
| ,, | 21 | పాకృత | ప్రాకృత |
| 91 | 17 | దుర్గ్రిహమగు | దుర్గ్రాహ్యమగు |
| ,, | ,, | సుగ్రహ | సుగ్రాహ్య |
| ,, | 19 | జేర్చి | జేర్చు |
| 109 | 13 | అవియంతయు | అది అంతయు |
| ,, | 15 | మార్కండే | మార్కండ |
| ,, | 22 | తమ | తన |
| 111 | 9 | ప్రాంతముల | శతాబ్దాల ప్రాంతముల |
| 113 | 2 | మాడలాపంజి | మాదలాపంజి |
| ,, | 3 | ఒకఱు దేశములోవి | ఒడిశా దేశములోని |
| ,, | 6 | మాడలాపంజి | మాదలాపంజి |
| ,, | 7 | మాడలాపంజి | మాదలాపంజి |
| 115 | 24 | అఉటంతి | ఆటంతి |
| 116 | 11 | గాంధ | గ్రంథ |
| 117 | 20 | దరష | వరష |
| ,, | 24 | ఋక్షే | ఋక్షే |
| 119 | 21 | ధాటరాజు | థాటరాజు |
| ,, | 26 | ,, | ,, |
| 120 | 17 | ధాట | థాట |
| 121 | 12 | ధాటరాజు | థాటరాజు |
| 122 | 8 | ధిలె హాయిధాంతి సాట | థిలె హాయిథాంతి పాట |
| ,, | 28 | సోయి | పోయి |
| 123 | 8 | బహాళ | చహాళ |
| ,, | 12 | జవు తికదె బే | జవుతిక దెబ |
| ,, | 19 | హాయిచి | హాయిఛి |
| ,, | 20 | జ్వవిచా | జ్వలిబా |
| ,, | 22 | పుష్ట | పుష్ప |
| ,, | 23 | నియోగి | వియోగి |
| ,, | 24 | నామ | కామ |
| ,, | 24 | సర ఛేదిణ | శరె ఛేదిణ |
| 123 | 25 | కరుఛ బిసి | కలుఛంతి బిసి |

